# ద్విపదవాఙ్మయము



గ్రంథకర్త:
జి. నాగయ్య, ఎం. ఏ., పి. హెచ్. డి.,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము
తిరుపతి.



1967.

 వెల: 15-00.

కన్నతల్లి
పూజ్యశ్రీ నారమాంబకు
భక్తితో సమర్పితము

# పరిచయము.

తెలుగు ద్విపద రచనలను గురించిన ప్రత్యేక విమర్శ గ్రంథము ఇంతవరకు ఏదియు వెలువడలేదు. ఇదియే మొదటిది. ఛందస్సును బట్టి ద్విపద రచనలను ఒక ప్రక్రియగ, ఒక వర్గముగ గుర్తించుట సమంజసము కాదేమో అను సంశయాస్పదులు కొందరుండవచ్చును. వారికి సమాధానము-సహేతుకమైన సమాధానము-ఈ గ్రంథమందలి ఉపక్రమణికలో చూడవచ్చు. ద్విపద, దేశిచ్ఛందస్సు ప్రాచీన కాలమునుండి ఆంధ్రకవి పండితులు మార్గకవితామోహపాశబద్ధులే. ద్విపద కవితయెడ వారు ప్రదర్శించిన నిరసనభావమునకు ఆధారాలు లేకపోలేదు. గీర్వాణమునకు కొంతదూరముగ తెలుగుభాషా సాహిత్యములకు సొంతగద్దెను ప్రతిష్ఠింపచేయ ప్రయత్నించిన వాడు మహాకవి పాల్కురికి సోమనాథుడు. దూరదృష్టిగల ప్రజ్ఞాశాలి; జాత్యభిమాని; దేశకవితోద్యమకారుడు. ద్విపద 'ఐహికాముష్మికహేతువ'ని ఎలుగెత్తిచాటి ద్విపద మహాకావ్యములను రచించిన చరితార్థుడు. ఆతరువాత ప్రతిశతాబ్దమందును కొద్దిగనో గొప్పగనో ద్విపద రచనలు వెలయుటకు పాల్కురికి సోమన కారణమనిన అతిశయోక్తికాదు. మొదట ద్విపదను ఈసడించిన పాపమును పరిహరించు కొనుటకు కాబోలు కవి సార్వభౌముడయిన శ్రీనాథుడంతటివాడు చరమదశయందు ద్విపదను చేపట్టినాడు. సోమన నాటినుండియు నేటివరకు తెలు

వడిన ద్విపదరచనలమీద బహురీతుల దృష్టిని ప్రసరింపజేసి సమగ్రపరిశీలన, పరిశోధన గావించి ఈ గ్రంథమును లోకాని కందించిన డా॥ నాగయ్యగారు మిక్కిలి అభినందనీయుడు.

కావ్యవిమర్శయందు ఊకదంపుడు లేక సూటిగా, సహేతుకముగ కొంతవరకు ముక్తసరిగా చక్కని రచన చేయగల యువకరచయితలు మనదేశమున ఎక్కువలేరు. అట్టినేర్పు ఈ గ్రంథరచయితలో గలదని ఇందులో ఏకొన్ని పుటలు చదివినను స్పష్టమగును. విషయగౌరవమేగాక ఈ గ్రంథరచనలో గల ప్రత్యేకత అట్టిది. డా॥ నాగయ్యగారి సాహిత్య కృషిని ఆంధ్రలోకమభినందించి ఆదరించి ప్రోత్సహిస్తుందని నాఆశ.

(సం.) జి. యన్. రెడ్డి,
ఆంధ్రశాఖాధ్యక్షులు,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము.

తిరుపతి
6—5—67.

# నమస్క్రియ.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు Ph.D. పట్టము పడయుటకై నేను సమర్పించిన సిద్ధాంత వ్యాసమే ఈ గ్రంథము.

భారతము, పల్నాటివీరచరిత్ర మున్నగు ద్విపదగ్రంథములను పరిష్కరించి విపుల పీఠికలు వెలయించి తమ ద్విపద కవితాభిమానమును పండితలోకమునకు చాటిన ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు నన్ను ద్విపద వాఙ్మయ పరిశీలన చేయుమనుటయే గాక తనఆధ్వర్యమున పరిశోధన విద్యార్థిగా నన్ను నియమించుకొన నంగీకరించుట నాఅదృష్టమని భావింతును. పరిశోధన కాలము (జనవరి 1962 నుండి జనవరి 1965 వరకు) నందు నా పరిశ్రమయెడ ఆదరాభిమానములనుచూపి, కొన్ని అమూల్యములగు సలహాలను, సూచనలను తెలిపి నా పరిశోధన నిర్విఘ్నముగా కొనసాగుటకుకారకులైన ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారికి నా కృతజ్ఞతా పూర్వక నమోవాకములు.

నన్నీ అమూల్య విషయముపై పరిశోధనమొనర్ప ప్రోత్సహించి, సర్వ విషయములందును నాకు తెలియని రహస్యములు, నూతనాంశములు పెక్కింటినియెఱింగించిమదభివృద్ధికి మార్గదర్శకులైన మద్గురువర్యులు, శ్రీవేంకటేశ్వరవిశ్వవిద్యాలయాంధ్రభాషాచార్యులు నైన ఆచార్య జి. ఎన్. రెడ్డి M.A.M.Lit, P.H.D. గారికి నాహృదయపూర్వకకృతజ్ఞతానమస్కారములు.

ఈ గ్రంథమును ప్రకటించుకొనుట కనుమతించిన శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయాధికారులకు నా కృతజ్ఞత.

ఈ గ్రంథమును ముద్రించియిచ్చిన మాలికో ప్రింటర్సు వారికి నా అభినందనములు.

— జి. నాగయ్య.

# విషయసూచిక.

# ఉపయుక్త గ్రంథములు.

## (Bibliography)

ఈ రచనయందు 245 ద్విపదగ్రంథములు పరిశీలింపబడినవి. అందు ముద్రితములుసుమారు 60; అలభ్యములు 33. మిగిలనవి అముద్రితములు. ఈఅముద్రిత ద్విపదగ్రంథములలోకొన్ని మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందలివి. ప్రసిద్ధముకాని అముద్రిత ద్విపద గ్రంథములను గురించిన పరిశీలనకు మద్రాసుప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారశాఖవారును, తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీశాఖవారును, ప్రత్యేకముగా తయారుచేయించిన వివరణపట్టికలు (Descriptive Catalogues)ను, గోలకొండ కవుల సంచికాదులును ఆధారము.


1. అసంతామాత్యుడు-ఛందోదర్పణము, వావిళ్లప్రచురణ.
2. అప్పకవి-అప్పకవీయము, వావిళ్లప్రచురణ.
3. ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలు.
4. ఆంధ్రసాహిత్యపరిషత్తు-రజతోత్సవ సంపుటములు
5. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటములు.
6. ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారము-అకారాద్య ముద్రిత గ్రంథసూచికలు (1920)
7. కవిత్రయము-ఆంధ్రమహాభారతము-వావిళ్లప్రచురణ
8. కాళిదాసు-విక్రమోర్వశీయము.
9. జోగారావు, యస్వీ-తెలుగు యక్షగాన వాఙ్మయ చరిత్ర, ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణ (1961)
10. తమ్మయ్య-సారంగు-వైజయంతీ విలాసము, వావిళ్లప్రచురణ
11. తమ్మయ్య-బండారు, పాలకురికి సోమనాథకవి.
12. తిమ్మరాజు-సిద్ధిరాజు, పరమయోగివిలాసము.

13. తెలుగు భాషాసమితి-విజ్ఞానసర్వస్వము-3వ సంపుటము, తెలుగు సంస్కృతి.
14. తె.భా.వి. 7వ సంపుటము, దర్శనములు-మతములు.
15. నన్నెచోడుడు-కుమారసంభవము, వావిళ్లప్రచురణ.
16. నరసింహము, కె. వి. ఆర్. దాక్షిణాంధ్రయుగ వాఙ్మయ చరిత్ర-ప్రథమభాగము.
17. పెద్దన-విస్సకోట, కావ్యాలంకారచూడామణి వేదమువారి ప్రచురణ.
18. పోతన-బమ్మెర-భాగవతము, రామా ప్రచురణ.
19. ప్రతాపరెడ్డి-సురవరము, ఆంధ్రుల సాంఘిక చరిత్ర.
20. ప్రతాపరెడ్డి-సురవరము, (సంపాదకుడు) గోలుకొండ కవుల సంచిక.
21. ప్రభాకరశాస్త్రి - వేటూరి సింహావలోకనము (సాహిత్య వ్యాసముల సంపుటి).
22. ప్రభాకరశాస్త్రి వేటూరి. తెలుగు మెఱుగులు
23. బసవప్ప—పిడుపర్తి, ప్రభులింగలీల.
24. మల్లన—చదలువాడ, విప్రనారాయణచరిత్ర.
25. మల్లికార్జునరావు-పందిరి. (సంపాదకుడు)కిన్నెరసంపుటములు
26. రజనీకాంతరావు—బాలాంత్రపు, ఆంధ్రవాగ్గేయకార చరిత్రము.
27. రామకృష్ణయ్య—కె. దక్షిణదేశభాషా సారస్వతములు-దేశి
28. రామకృష్ణశాస్త్రి—శిష్టా, వీరశైవాంధ్రవాఙ్మయము.
29. ,, ,, తెలుగు సాహిత్యచరిత్ర (Vol. I)
30. రామచంద్ర—తిరుమల (సంపాదకుడు) పరిశోధన సంచికలు.

31. రామయ్యపంతులు_జయంతి, ఆధునికాంధ్రవాఙ్మయవికాస వైఖరి.
32. రామరాజు_బి. తెలుగు జానపదగేయ సాహిత్యము,
33. రామలింగారెడ్డి-కట్టమంచి, కవిత్వతత్త్వ విచారము.
34. రేచన-కవిజనాశ్రయము. ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణ
35. లక్ష్మీకాంతమ-పింగళి, గౌతమవ్యాసములు.
36. లక్ష్మీరంజనం_ఖండవల్లి & బాలేందుశేఖరం-ఆంధ్రుల చరిత్ర_సంస్కృతి.
37. వల్లభామాత్యుడు_వినుకొండ. క్రీడాభిరామము, వావిళ్ల ప్రచురణ.
38. వాచస్పత్య నిఘంటువు-5వ భాగము.
39. వీరభద్రరావు-చిలుకూరి, ఆంధ్రులచరిత్ర 1,2,3. భాగములు
40. వెంకటరత్నం_తెలికిచెర్ల (సంపాదకుడు) వ్యాససంగ్రహము (గిడుగువారి షష్టిపూర్తి ప్రచురణ.)
41. వెంకటరావు_నిడదవోలు, ఉదాహరణ వాఙ్మయచరిత్ర.
42. వెంకటరావు-నిడదవోలు, తెలుగు కవులచరిత్ర,
43. వేంకటకవి-చేమకూర, విజయవిలాసము వావిళ్లప్రచురణ.
44. వేంకటకవి_చేమకూర, సారంగధర చరిత్ర, ,,
45. వేంకటరమణయ్య_నేలటూరి. డా॥ దాక్షిణాత్య ఆంధ్ర సాహిత్యము.
46. వేంకటరమణయ్య_బులుసు, ఆంధ్రకవి సప్తశతి.
47. శంకరకవి_హరిశ్చంద్రోపాఖ్యానము;
48 శంభుప్రసాద్-శివలెంక, (సంపాదకుడు)-భారతిసంపుటములు
49. శేషయ్య-చాగంటి; ఆంధ్రకవితరంగిణి(1-13సంపుటములు)
50. సంపత్కుమారాచార్య-కోవెల; తెలుగు ఛందోవికాసము,

51. సీతాపతి_జి. వి. తెలుగులో ఛందోరీతులు.

52. సుబ్బారావు-వంగూరి, తెలుగు సాహిత్య చరిత్ర.

53. సూర్యనారాయణశాస్త్రి-సన్నిధానం, (వివరణకర్త) కావ్యాలంకార సంగ్రహము.

54. సోమనాథుడు- పిడుపర్తి, బసవపురాణము వావిళ్లప్రచురణ

55. A. Descriptive catalogue of the Telugu Manuscripts in the Government oriental Manuscripts Library, Madras, Vol IV.

56. Annals of oriental Research university of Madras Vol.V. Part I; Vol.IX(1951-52); Vol. X. (1952-53) Vol. XII (1954-55).

57. Gumnere, F. B. The popular Ballad.

58. Hudson. W. H. An introduction to the study of Literature

59. Somasekhara Sarma. M. - History of the Reddy kinkdoms.

60. Triennial catalogue of Telugu Manuscripts, Vol.IV Part 3; (1919-22)

మిగిలిన బహుగ్రంథము లాయా స్థలములయందే పేర్కొన బడినవి.

# ప్రధాన సంకేత వివరణము

1. అ. గ్రం. సూ. = అకారాద్యముద్రిత గ్రంథసూచిక.
2. అధ్యా = అధ్యాయము.
3. అము. = అముద్రితము.
4. అల = అలభ్యము.
5. అష్ట. క, = అష్టమహిషీ కల్యాణము
6. ఆం. సా. చ. = ఆంధ్రుల సాంఘిక చరిత్ర
7. ఆ. = ఆశ్వాసము,
8. ఆ. వా. సూ. = ఆంధ్రవాఙ్మయ సూచిక.
9. ఆం. సా. ప. = ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.
10. కాం. = కాండము.
11. చూ. = చూడుడు.
12, డా. = డాక్టరు.
13. తంజా. = తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ.
14. ద్వి. పం. = ద్విపదపంక్తులు.
15. ద్వి. బా. భా. = ద్విపద బాలభాగవతము.
16. పం. చ. = పండితారాధ్య చరిత్ర.
17. ప. = పద్యము.
18. ప. ప్ర = పర్వత ప్రకరణము.
19॥ ప. యో. వి. = పరమయోగివిలాసము.
20. పు. = పుట.
21. పూ. భా, = పూర్వభాగము
22. ప్రా. భా. = ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము, మద్రాసు.
23. బ. పు. = బసవపురాణము.
24. రం. రా. – రంగనాథరామాయణము.
25. వ. రా. = వరదరాజరామాయణము.
26. సమ, = సమగ్రము.

# మొదటి ప్రకరణము

## ఉపక్రమణిక

ఏ భాష యందైనను కవితాపరిణామమున గేయమే ప్రథమ దశ. అట్టి గేయరూపమైన కవిత ఆడుచు పాడుచు ఆనందింప దగిన 'ఆట-పాట' (Ballad-dance) గ ఆరంభమై యుండును. ప్రారంభ దశయందు 'ఆట-పాట' రూపమగు గేయకవిత వ్యక్తి నాశ్రయించియో లేక బృందము నాశ్రయించియో వెలసియుండును. కాలక్రమమున పలువురి కాలక్షేపమునకో, ఆనందమునకో కథాగేయములును, నాగరికతాభివృద్ధితోపాటు పద్య గద్యాది రచనలును, పరిణమించియుండును. నేటి ప్రపంచమున అనాగరికులనబడు నే ఆటవిక జాతికైనను వాగ్రూపమగు భాష ఉన్నది. అట్టివారి భాషలో లిపి లేక పోయినను వారికానందోత్సాహములను కలుగజేయు గేయ రచనలు కలవు. నాగరికతాభివృద్ధితో లిపిని పొందిన భాషలలో పద్య గద్యాది వివిధ రచనాప్రక్రియలు క్రమముగా పరిణమించి యున్నవి. ప్రాథమిక గేయమునందే కవిత్వ బీజము లుండును. కావున ఏ భాషా సాహిత్య మందయినను మొట్టమొదట గేయమును, ఆ పిదప పద్యరచనయు, అటుపిమ్మట గద్యమును పరిణమించుట సహజమైయున్నది.

ప్రాక్తన మానవునిలో పుట్టిన 'ఆట - పాట' రూపమగు గేయమున ప్రధానాంశములు మూడు: అభినయము, గీతి, శబ్దము. గీతి, అభినయాంశములకు ప్రాధాన్యమీయక శబ్దార్థమునకు ప్రాధాన్యమిచ్చిన రచన పద్యకవిత్వము. 'గీతికి అప్రత్యక్ష సంబంధము మాత్రమేకాక ప్రత్యక్షాధికారమే యొసగిన కవిత్వము పదకవిత్వము''[1] అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు పదకవిత్వమును నిర్వచించి, పదకవిత్వమును రెండు విధములుగ-(1) గేయశాఖ, (2) పదశాఖ-అని విభజించి యున్నారు. గేయశాఖలో అర్థమునాశ్రయించిన కవిత్వాంశముకంటె గీతినాశ్రయించిన గానాంశమునకే ఎక్కువ ప్రాధాన్యము. పదశాఖయందు గీతిని అంగీకరించినను శబ్దార్థముల నాశ్రయించిన కవిత్వాంశమునకే ఎక్కువ ప్రాధాన్యము.

పద శాఖలో (1) శుద్ధ దేశిశాఖ, (2) దేశి శాఖ అని రెండు భేదములున్నట్లు ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు విభజించి యున్నారు.[2] శుద్ధదేశిశాఖలోని పదములు సామాన్య ప్రజలలో, ప్రజల కొరకే పుట్టి, వారి ఆదరాభిమానములతో తరించి తర్వాతి తరముల వారిని తరింపజేయు ప్రజాకవిత్వమనదగినవి. తెలుగులోని బాలనాగమ్మకథ, లక్ష్మమ్మకథ, కామమ్మకథ, అంకమ్మకథ, చిన్నమ్మకథ, బొబ్బిలికథ, ఆరుమరాటీల కథ, కాపుకథ, బంగారుతిమ్మరాజుకథ, కుమారరాముని కథ, దేశింగురాజు కథ - ఇత్యాదులు ఈ శాఖలోనివి. ఇవి ప్రౌఢ సాహిత్య రచనలుగ గణింప వీలులేనివి.

పాడదగిన పదకవిత్వమయినను, పఠన యోగ్యమయిన

1. చూ॥ గౌతమ వ్యాసములు - పుట 112.

2. చూ॥ గౌతమ వ్యాసములు - పుట 113.

పద్యకవిత్వముతో సమాన మనదగు సారస్వత ప్రతిష్ఠను పొందినట్టిది దేశిశాఖ. తెలుగున ఈ దేశిశాఖ దేశీయమైన శుద్ధ పదకవిత్వమునకు, సాంస్కృతికమైన ప్రౌఢసాహిత్యమునకు సామరస్యము కల్గించి, ఉభయతారకముగ వాఙ్మయపథమున వెలసినది. ఈ వాఙ్మయశాఖ నిసర్గ మాధుర్యముతోడి శిల్పమునకు, నిరాడంబరత్వముతోడి విజ్ఞానవికాసమునకు, సౌలభ్య సహితమైన శైలీవైశిష్ట్యమునకు కూడలి అయినది. ద్విపద కావ్యములు, రగడలు, ఉదాహరణములు, గద్యలు, శతకములు, యక్షగానములు, దండకములు - మున్నగు తెలుగుసాహిత్య ప్రక్రియలు ఈ దేశిశాఖలో చేరదగినవి.

తెలుగుసాహిత్యమున 'మార్గ', 'దేశి' అని మరొక కవితా భేదము కూడ ప్రాచీన కాలముననే యూహింపబడినది. సంస్కృతమున నృత్య, సంగీతాది కళలకు సంబంధించిన ఈ భేదమును తెలుగుకవిత్వ విషయమున మొట్టమొదట అన్వయింప యత్నించినవాడు నన్నెచోడుడు (1130-50 A. D.). అతడు కుమార సంభవ పీఠికలో

> "మును మార్గ కవిత లోకం
> బున వెలయఁగ దేశి కవితఁ బుట్టించి తెనుం
> గున నిలిపి రంధ్ర విషయం
> బునఁ జనఁ జాళుక్య రాజు మొదలుగఁ బలువుర్"

—1 వ ఆశ్వా. ప. 23 (వావిళ్ళ ప్రతి—1953 సం).

అని చాళుక్యరాజుల ప్రశంస చేసి యున్నాడు. సంస్కృతకవిత 'మార్గ' మని, దేశిభాషలలోని కవిత 'దేశి' అని కొందరు అభిప్రాయ పడిరి. కాని 'దేశి', 'మార్గ' కవిత్వముల నిర్ణయము భాషాభేదము నాశ్రయించినది కాదు. ఇతివృత్తము, భాష,

ఛందస్సు — మొదలగువాని విషయములో సంస్కృతసాహిత్య లక్షణ ప్రభావమునకు విధేయమయిన దంతయు 'మార్గ' మని, తద్భిన్నమైన దంతయు 'దేశి' అని కొందరు వ్యాఖ్యానించిరి. కాని ఇతివృత్త విషయమున తెలుగు రచనలు అనేకములు సంస్కృత పురాణముల ననుసరించినట్టివే. కావున ఇవి ఇతివృత్తములను బట్టి మార్గ కవిత్వమునకు చెందినవని చెప్పవలసి యుండును. 'మార్గ', 'దేశి' భేదము కేవలము ఒక లక్షణ భేదముచే భిన్నమనదగినది కాదు. ఇతివృత్తము, భాష, ఛందోలక్షణములనే గాక 'మార్గ', 'దేశి' భేదము రచయిత దృక్పథమును, అతడుద్దేశించిన పాఠకలోకమును, జాతీయ జీవితవిలక్షణములను కూడ ఆశ్రయించియుండును. సంస్కృత భాషాసాహిత్యలక్షణ ప్రభావము భాసింపజేయుచు, ఉభయభాషాపండితుల కుద్దేశింపబడి వారి ఆదరాభిమానములను అనివార్యముగ నపేక్షించునట్టి ప్రౌఢ కవిత 'మార్గ' కవిత యనియు, ప్రత్యక్ష సంస్కృత ప్రభావమును ప్రతిబింబింపజేయక భాష, ఛందస్సు, కథావస్తువులయందు దేశి లక్షణములను ప్రధానముగా ఆరోపించుకొని దేశీయ ప్రజాజీవితమునకు సన్నిహితముగ జన సామాన్యమున వ్యాప్తికొరకు ఉద్దేశింపబడిన ప్రజాకవిత 'దేశి' కవిత అనియు స్థూలముగా నిర్వచింపవచ్చును. 'దేశి' కవితకు చెందిన ప్రక్రియలు, రచనలు కొన్ని 'మార్గ' లక్షణములవైపు అధికముగా మ్రొగ్గి పండితప్రీతిపాత్రములయినవియు కలవు. తెలుగులో వెలసిన ద్విపద కవితాశాఖ అట్టిది.

దేశి కవితాశాఖ లన్నింటిలో గుణమును, పరిమాణమును, ప్రయోజనమును, పండిత లోకాదరణమును బట్టి అగ్రగణ్యమయినది ద్విపద కవితాశాఖ. తెలుగు సాహిత్యము ద్విపద

రచనతో ప్రారంభము కానప్పటికిని ద్విపదయే తెలుగుకవితకు బీజము. ఇతర దేశీయచ్ఛందో భేదములలో పెక్కింటికి ద్విపదయే మూలమగుచున్నది. ద్విపద యొక్క పుట్టుక గేయకవితాదశయందే జరిగినది. సంస్కృతమున అనుష్టుప్ వృత్తమువలె ఆంధ్రభాషయందు ద్విపదయే ప్రాథమిక ఛందస్సు. ప్రాచీనమైన ఈ తెలుగు ద్విపదచ్ఛందస్సులో తెలుగు కావ్యరచన క్రీ. శ. 12 శతాబ్దమునుండి జరిగినది. తెలుగు సాహిత్య చరిత్రను పరిశీలించిన తెలుగున వెలసిన ద్విపద కవితాశాఖ గుణమునుబట్టి కాని, పరిమాణమును బట్టి కాని, రచయితలను బట్టి కాని, వైశిష్ట్యమును బట్టి కాని ఘనమైనదని చెప్పక తప్పదు.

క్రీ. శ. 12 శతాబ్దము నుండి నేటి వరకును అవిచ్ఛిన్నముగ తెలుగున ద్విపద రచనలు ప్రతి శతాబ్దములోను వెలయింప బడుచునే యున్నవి. తెలుగు వాఙ్మయమున 245 ద్విపద గ్రంథములు రచింప బడినట్లు తెలియుచున్నది. (చూ॥ అనుబంధము). ముద్రితములు, అముద్రితములు, లభ్యములు, అలభ్యములు అయిన ద్విపద రచనలన్నియు లెక్క పెట్టగా తెలియ వచ్చిన సంఖ్య యిది.

తెలుగులోని ద్విపద శాఖ విపులమైనదే గాక ఇతర శాఖలతో పోల్చి చూచిన బహువిధముల విశిష్టమైనది. ద్విపద రచనలను ఒక రాశిగా భావించి వివిధ దృక్పథములతో పరిశీలించిన వాని ప్రాధాన్యము బహు ముఖమైనదని స్పష్టమగును.

(1) క్రీ. శ. 12 శతాబ్దమున వీరశైవమతవిజృంభణ కాలమునందు తెలుగులో మహాకావ్యము లనిపించుకొనదగిన ద్విపదకావ్యములు పుట్టి వృద్ధిపొందినవి. ద్విపద కావ్యములను చేపట్టుట వలన పాల్కురికి సోమనాథుడు (1160–1240 A.D.)

ఆశించిన ప్రయోజనము వీరశైవమతవ్యాప్తి. గేయమును, పాఠ్యమును నయిన ద్విపదకవిత జనసామాన్యమున మతప్రచారము చేయుటకు మిక్కిలి ప్రయోజనకారి యైనది. గోన బుద్ధారెడ్డి, తాళ్ళపాక చిన్నన్న, కట్టా వరదరాజు—మున్నగు వారు వైష్ణవ మతాభిమానముతో ద్విపదను స్వీకరించినవారు. తెలుగు దేశమున శైవమత వ్యాప్తి, వైష్ణవమత వ్యాప్తి, అద్వైత మత వ్యాప్తి— వీని ననుసరించియే ద్విపదవాఙ్మయము అభివృద్ధి గాంచినది. కనుక మత పరిశీలన దృష్టితో కూడ ద్విపదకవితా శాఖకు తెలుగువాఙ్మయమున ప్రాముఖ్యమున్నది.

(2) దేశి జాతికి చెందిన ద్విపద 'పాటల వాఙ్మయ' మగుటయు, శైవేతర కవులు ప్రారంభమున దాని నభిమానింపక పోవుటయు—మున్నగు కారణములుగ ద్విపద ఆంధ్రవిద్వాంసుల నిరాదరణమునకు పాత్రమైనది. కాని ద్విపద కవితాశాఖ సరసులైన విద్వత్కవులకు కూడ ప్రీతిపాత్రము కాదగినట్టిదే. పాల్కురికి సోమనాథుడు, గోన బుద్ధారెడ్డి, మడికి సింగన, గౌరన, దోనూరి కోనేరునాథుడు, తాళ్ళపాక చిన్నన్న, కట్టా వరదరాజు—మున్నగు పండితకవు లెందరో ద్విపద కావ్యములను సర్వాంగసుందరముగ, భావాశ్రయము రసాశ్రయమునైన ప్రౌఢితో చంపూ కావ్యములకు దీటుగ రచించినారు. ద్విపద కావ్యములు ఈసడింప దగినవి కావని ఈ మహాకవులు నిరూపించినారు. పండితపామరసాహిత్యములకు ఒక విధమగు సామరస్యమును సంఘటించినట్టి ద్విపద కవితాశాఖకు ఆంధ్రకవిత్వ పరిణామచరిత్ర దృష్టితో చూచిన ఎంతేని ప్రాధాన్యము కలదు.

(3) ఆంధ్ర సాహిత్యము అనువాదముతో పుట్టి అనువాద రచనతోనే ప్రాచీన కాలమున అభివృద్ధి పొందినదనిన అతిశ

యోక్తి కాదు. సంస్కృతగ్రంథములనాంధ్రీకరించుకొనుట సహజముగా భావింప బడినదే. తెలుగుగ్రంథము సంస్కృతీకరింపబడుట అనిన ఒక మహావిచిత్రము. తెలుగు గ్రంథము సంస్కృతీకరింపబడుట తెలుగు సాహిత్యమునకు, తెలుగు జాతికి గర్వకారణమని భావించినచో అట్టి గర్వకారణమును మొట్ట మొదట కల్గించినవి ద్విపద కావ్యములే. పాల్కురికి సోమనాథ కృతములగు బసవపురాణ పండితారాధ్యచరిత్రలు సంస్కృత కన్నడాది భాషలకు అనువదితము లయిన మొదటి తెలుగు రచనలు. ఇటీవల తెలుగు రామాయణము లన్నిటిలో రంగనాథరామాయణమునే హిందీభాషలోనికి అనువదించుకొన నిర్ణయించుటయు తెలుగు ద్విపద ప్రాముఖ్యమును ఒక విధముగ గుర్తించుటయే. పచ్చకప్పూరపు తిరువేంగళనాథ కృతమగు చొక్కనాథచరిత్రము కూడ సంస్కృతీకరింపబడి యున్నది.

(4) ద్విపదకావ్యరచనకు మార్గదర్శకులు శైవులయినను తర్వాత అది శైవేతరకవుల చేతులలోనే యెక్కువ అభివృద్ధి గాంచినది. ద్విపద కావ్యకర్తలు కవిలోకమున ఒక వర్గమునకు చెందినట్లు చాటుకొనిన రచయితలు కారు. ప్రౌఢములగు పద్యకావ్యములను రచించిన శ్రీనాథుడు, మడికి సింగన, దోనూరి కోనేరునాథ కవి, రఘునాథనాయకుడు, కట్టా వరదరాజు, తేకుమళ్ల రంగశాయి—మున్నగు కవులు పెక్కుమంది ద్విపద కావ్యములను కూడ రచించియున్నారు. చంపూకావ్యకర్తలు, ద్విపద కావ్యకర్తలు అయిన ఇట్టి కవులను సాహిత్య విమర్శక దృష్టితో పరిశీలించి వారి ఆత్మీయత, కవితా దృక్పథము, వారిపై ప్రసరించిన సాంఘికాది ప్రభావములు మున్నగునవి తెలిసికొనుటకు ద్విపదకావ్య పరిశీలన తోడ్పడును.

(5) బసవపురాణము, పండితారాధ్య చరిత్ర, రంగనాథ రామాయణము, హరిశ్చంద్రోపాఖ్యానము, పరమయోగివిలాసము, కృష్ణార్జున సంవాదము — మున్నగు ప్రసిద్ధ ద్విపదకావ్యములను తర్వాతి కవులు పద్య కావ్యములుగ పరివర్తనము కావించి వాని ప్రచారమునకు తోడ్పడినారు. తెలుగుకవులలో భాషాంతరీకరణము, ఏకకథా వస్తువరణము సర్వసాధారణమగు విషయమే. ద్విపదకావ్యములను పద్యకావ్యములుగ పరివర్తనము చేసికొని యుండుట తెలుగుసాహిత్యమున ఒక విశిష్ట విధానమునే గాక ద్విపద కావ్యముల ఔన్నత్యమును కొంత వరకు చాటుచున్నది. కాబట్టి తెలుగుసాహిత్య సంప్రదాయముల కొన్నిటిని తెలిసికొనుటకు ఈ దృష్టితో ద్విపదకావ్యములను పరిశీలించుట అవసరము.

(6) పండితలోకము ప్రసిద్ధి బడసి, పద్యకావ్యములు — భారత భాగవతాదులు — కొన్ని ద్విపదలోనికి పరివర్తనములై యున్నవి. ఈ పరివర్తనముల మూలమున ద్విపదపద్యకావ్యములను తులనాత్మక దృష్టితో పరిశీలించి అట్టి పరివర్తనములకు హేతువులను ఆయా గ్రంథములందలి సారస్యమును, ఆయా కవుల కవితా గుణోత్కర్షలను తెలిసికొనుటకును ద్విపద రచనలు ఉపకరించుచున్నవి.

(7) ద్విపదకావ్యము లందలి ఇతివృత్తములలో రామాయణ, భారత, భాగవత సంబంధములు, ఇతర పౌరాణికేతివృత్తగాథలు, మాహాత్మ్య గ్రంథములు, కావ్యప్రబంధములు, కల్యాణాత్మకములు, వ్రతమాహాత్మ్యములు, భక్తి ప్రబోధకములు. తాత్త్వికములు, చారిత్రకములు, చిత్రాఖ్యానములు, వంశకీర్తనములు — మున్నగు పలు తరగతులకు చెందిన వెన్నియో కలవు.

ఇంతటి వస్తువైవిధ్యమును ప్రదర్శించిన ద్విపద కవితాశాఖ తెలుగున గల ఇతర సాహిత్య ప్రక్రియలకు తక్కువగాని ప్రాధాన్యమును వహించి యున్నది. వస్తువైవిధ్యము విశేషముగా గల ద్విపద కావ్యములు రసవిషయిక వైశిష్ట్యమును గూడ కల్గినవి, ద్విపద కావ్యములలో వీర, కరుణ, అద్భుతాది రసప్రధానములు పెక్కు కలవు. ఆంధ్ర వాఙ్మయ కవిత్వ పరిణామ స్వరూపమును దాని వైవిధ్యమును తెలిసికొనుటకు ద్విపద రచనల సమగ్ర పరిశీలన అతి ముఖ్యము.

(8) వ్యాకరణముల అడుగుజాడలను మాత్రమే ఆశ్రయింపక, పదప్రయోగము నెడను, ఛందోవిషయము నందును పాల్కురికి సోమనాథుడు మున్నగు ద్విపదకవులు సంపూర్ణ స్వాతంత్ర్యమును వహించిరి. ద్విపదరచన సర్వ సామాన్యమై, ప్రసన్నమై, సులభమగు శైలితో, 'జానుతెనుఁగు' కూర్పుతో నొప్పినది. 'జానుతెనుఁగు' అను భాషా విధానమునకు ఎక్కువ వ్యాప్తి ద్విపద కావ్యములలోనే. కనుక తెలుగులోని అపూర్వములగు భాషారీతులు, పదప్రయోగ వైశిష్ట్యములు, ఛందస్సంప్రదాయములు— ద్విపద కవితాశాఖ పరిశీలనము వలన తెలియ గలవు.

(9) ద్విపద ఆంధ్రవాఙ్మయమునకు ప్రత్యేక వ్యక్తిత్వము నొనగూర్చిన జాతీయ వాఙ్మయశాఖ. జనసామాన్యమునకు ప్రీతిపాత్రమగుటచే ద్విపదకవితాశాఖయందు జాతీయత, దేశభక్తిని ప్రదర్శించు సంఘటనలు, సాంఘిక జీవితమును వర్ణించు సన్నివేశములు, సంఘసంస్కరణాది సమస్యలు— మున్నగునవి ప్రాధాన్యము వహించి యున్నవి. తెలుగు జాతీయజీవితమును, సాంఘికాచార వ్యవహారాదులను ప్రతిబింబితముచేయుటలో పద్యకావ్య

ములకన్న ద్విపద కావ్యములదే పైచేయి. ఆంధ్రుల సాంఘిక జీవితచరిత్రను తెలిసికొనుటకు ద్విపదకావ్యముల పరిశీలన అనివార్యము.

(10) తెలుగున ఇంతటివ్యాప్తిని, వైశిష్ట్యమును, ప్రాముఖ్యమును పొందిన ఈ ద్విపద రచనల పుట్టుక, పరిణామాభివృద్ధులను, వాని గుణాధిక్య వైశిష్ట్యాదులను గురించిన సమగ్ర పరిశీలన గాని, పరిశోధన గాని యింతవరకు జరగలేదు. ద్విపద సాహిత్య ప్రక్రియను గురించిన విమర్శక గ్రంథమొక్కటి కూడ ఇంతవరకు వెలువడలేదు. ప్రసిద్ధులగు ముగ్గురు నలుగురు ద్విపద కవులను గురించిమాత్రము సాహిత్య పత్రికలందు కొన్ని వ్యాసములు ప్రకటితములయినవి. అవియు విపులము లయినవి కావు. ఈకారణముచేతనే ద్విపదకవితాశాఖను ప్రత్యేకముగాగ్రహించి, అభిమానించి, పూర్వ విమర్శకుల సద్విమర్శలను పాటించి ఆంధ్ర వాఙ్మయమున ద్విపద శాఖకు గల ప్రత్యేక ప్రాముఖ్యములను వివరించుటయే ఈ పరిశోధనయందలి ప్రయత్నము.

ద్విపద వాఙ్మయమును గురించిన ఈ పరిశోధనయందు ఈ క్రింది విధానము పాటింపబడినది.

రెండవ ప్రకరణమున – ద్విపదచ్ఛందస్సుయొక్క పుట్టు పూర్వోత్తరములను, దానిస్వరూపమును, ప్రత్యేకతను, సంస్కృతాది ఇతర భారతీయ భాషలలో ద్విపద లనదగు ఛందోరీతులతో తులనాత్మక పరిశీలనమును వివరింపబడినది. ఇతరములగు తెలుగు దేశిచ్ఛందోరీతులకు ద్విపదకు గల సంబంధము కూడ పరిశీలింపబడినది.

మూడవ ప్రకరణమున – చారిత్రక దృష్టితో ద్విపదకావ్య రచనల పరిణామము వివరింపబడినది. ద్విపద – ఆదరము లేకుం

డుటకు గల హేతువులు కూడ చర్చింపబడినవి. కవి కాలాదులనే గాక ద్విపద రచనలలో ప్రతిపాదితమైన వస్తు తత్త్వమును పురస్కరించుకొని ద్విపద రచనా పరిణామమును నాల్గు ఘట్టములుగ విభజింపబడినది. ఈ ప్రకరణమున ఆయా శతాబ్దమందలి మత సాంఘిక పరిస్థితులకు ద్విపద కావ్యాభివృద్ధికి గల సంబంధము కూడ వివరింపబడినది.

నాల్గవ ప్రకరణమున – అనేకములగు ద్విపద రచనలు కథావస్తువును, రచనా రీతిని, కవి దృక్పథమును ప్రధానసూత్రములుగ గ్రహించి పది తరగతులుగ వర్గీకరింపబడినవి. ఈవర్గీకరణమున కవుల కాలమునకు ప్రాధాన్య మీయ లేదు. ఆయా వర్గములకు చెందిన ద్విపద రచనలను పరిశీలించుటలో చారిత్రకాంశములను పరిహరించి – ఇవి పూర్వప్రకరణములలో చెప్పబడినవి కాబట్టి – కథావస్తుపోషణమును, అనువాదగ్రంథములలో అమూలకాంశ వివరణములును, అతి ప్రసిద్ధము కాని ద్విపదలరచనలోని కొన్ని సుగుణములును ప్రధానముగ తెల్పబడినవి.

ఐదవ ప్రకరణమున – ప్రసిద్ధులగు ద్విపద కవుల కవిత్వవిశేషములు, కావ్యవిమర్శకదృష్టితో ఉచితోదాహరణములతో వివరింపబడినవి. కథా వస్తువుకు సంబంధించిన ప్రశంస ఈ ప్రకరణమున పరిహరించి – ఈ అంశము పూర్వ ప్రకరణమున తెల్పబడినది కనుక – పాత్ర పోషణ శైలి ఇత్యాది కావ్య కళాంశములలో ద్విపద రచనలయొక్క ప్రత్యేకత యెట్టిదో వివరింపబడినది.

ఆరవ ప్రకరణమున – పద్యకావ్యములుగ పరివర్తితములయిన ద్విపద రచనల ప్రశంస కలదు. అట్టి ద్విపద రచనలను

పద్యకావ్య పుత్రికలతో పోల్చి పద్య కవితలోను, ద్విపద కవిత లోను గల సాదృశ్య భేదములు వివరింపబడినవి.

ఏడవ ప్రకరణమున – ద్విపద కావ్యములలో ప్రతిబింబిత మైన సాంఘికజీవిత విశేషములు, ఆచార వ్యవహారాదులు సోదాహరణముగ తెల్పబడినవి. సమకాలపు పద్యకావ్యములలో కానరాని సాంఘిక జీవిత విశేషములే ఆయా ద్విపదగ్రంథముల నుండి గ్రహించి చర్చింపబడినవి.

ఎనిమిదవ ప్రకరణము: సింహావలోకనము.



# రెండవ ప్రకరణము

## ద్విపదచ్ఛందోవిశేషములు

### ఛందస్సు:

ద్విపదచ్ఛందో విశేషములను చర్చించుటకు పూర్వము ఛందస్స్వరూపము, వాని ప్రయోజనమును గూర్చి పరిశీలింతము.

ఛందశ్శబ్దము యొక్క రూప నిష్పత్తిని గూర్చి వివిధాభిప్రాయములు కలవు.

(1) 'ఛద్' (= ఛేదించు) అను ధాతువుతో 'ఛంద' శ్శబ్దము సంబంధము కలదిగా యాస్కుడు నిర్వచించినాడు. 'ఛందాంసి ఛాదనాత్'.

(2) 'చది' (= ఆహ్లాదము) ధాతువు తొలి 'చ' కారమునకు 'చన్దే రాదే శ్చ ఛః'[1] అను ఉణాది సూత్రము వలన 'ఛ' కారమును సాధించుకొని 'ఛంద' శ్శబ్దమేర్పడినదని ఒక అభిప్రాయము.

(3) 'ఛందస్' అను సంస్కృత పదమునకును 'స్కాందో' (Scando) అను లాటిన్ పదమునకును సంబంధము కలదని

---

1. చూ॥ వైయాకరణ సిద్ధాంత కౌముది (ఉణాదులు) - పుట 314 నిర్ణయ సాగర ప్రెస్. 9 వ ముద్రణము, 1924.

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి అభిప్రాయము.[2] 'స్కాందో' అనగా ఛేదించుట; విభజించుట — అని అర్థము.

కవులు పాటలలోను, కావ్యములలోను లయకును, శ్రుతికిని అనుకూలముగా రచించిన రచనలను తరువాతి లాక్షణికులు పరిశీలించి వాని నడక ఈ రీతిగా నున్నదని నిరూపించుటకు ఛేదించి కొన్ని సూత్రములను రచింతురు. అట్టి సూత్రముల సముదాయమునకు ఛందశ్శాస్త్రమని పేరు. 'స్కాందో' అను లాటిన్ పదము 'ఛందస్' అను దానికి వర్ణసామ్యము కూడ కలదు కదా!

(4) 'ఛంద్' (= సంతసిల్లు, సంతసింపజేయు) అను ధాతువుతో ఛందశ్శబ్దము సంబంధము కలదు. ఛందశ్శబ్దమునకు పైని పేర్కొనిన వివిధరూప నిష్పత్తులకంటె నిదియే సమంజసమైనది. డాక్టరు గిడుగు వేంకట సీతాపతిగారి అభిప్రాయమును నిదియే.[3]

## ఛందస్సు - కవిత్వము:

కళాత్మక ప్రయోజనమును సాధించు భాష సామాన్య భాషకంటె కొంత విశిష్టముగా నుండును. కావ్య భాషా వైశిష్ట్యమునకు హేతువు కవియొక్క భావోద్వేగ తీవ్రత. సముత్తేజిత భావములు, భవ్యావేశములు లయాన్వితమగు ఛందోబద్ధమైన భాషలో వెలువడుట సహజము.

---

2. 'మాత్రాచ్ఛందస్సులు' — చిలుకూరి నారాయణ రావుగారు. వ్యాస సంగ్రహము — సంపాదకుడు: తెలికిచెర్ల వెంకటరత్నం.
3. 'తెలుగులో ఛందోరీతులు' — పుట 2, డా॥ గిడుగు వేంకట సీతాపతి. విశాలా పబ్లికేషన్సు, ఖైరతాబాద్, హైదరాబాద్ - 4 తొలి ముద్రణ 1961.

"Ever since man has been man," says Mill, "all deep and sustained feeling has tended to express itself in rhythmical language, and the deeper the feeling the more characteristic and decided the rhythm." [4]

వాల్మీకిశోకభావమేకదాశ్లోకముగాపరిణమించినది. కనుక భావనాత్మకమగుకవిత్వమున భాష తాళలయాశ్రితమై, ఛందోనియమములతో నొప్పియుండుట సహజముగా నేర్పడు లక్షణము.

భరతుడును "ఛందో హీనో న శబ్దో స్తి నచ్ఛంద శ్శబ్ద వర్జితమ్"[5] అని ఛందస్సునకు, శబ్దమునకు అవినాభావ సంబంధమును చాటియున్నాడు.

"గీతి గతమైన యే లయ నిబద్ధత కలదో అదియే పద్య గతమైన ఛందస్సు"[6] ని ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు వ్రాసిరి. అన్యత్రవ్యాప్తమైన శబ్దమునందు అవ్యక్తముగానున్న లయను, కావ్యమునందు ఛందస్సు వ్యక్తము చేయును.

శ్రుతి, లయ, తాళ,గుణములు ఛందోమూలములు. లయ సహజసిద్ధమైనది. తాళము కళాధర్మముగా లయనుండివర్ధిల్లినది. తాళమునకు మొదటి మెట్టు లయ. ఆక్స్‌ఫర్డ్ నిఘంటువున (Oxford Dictionary) 'Rhythm' (లయ) అనుమాటకు

"Rhythm = Metrical effect produced in verse, Prose, music or motion by the relations in quality, stress, time or energy between the syllables, words, notes or movements that succeed each other" అని అభివివరణము కలదు.

---

4. చూ॥ పుట 72. "An introduction to the study of literature — W. H. Hudson.
5. నాట్య శాస్త్రము-15 అధ్యా. శ్లో॥ 21-40; కాశీ ముద్రణము.
6. గౌతమ వ్యాసములు - పుట 112.

ఏకప్రమాణము గల మాత్రల నడక లయ. అది త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతులలో నుండును. వీనిలో సంకీర్ణ మనునది అంతగా ప్రచారమందు లేదు. ఈ లయ చదువరులను తన వెంట నీడ్చుకొనిపోవుచు అలౌకికముగా కావ్య రసము ననుభవించుట కెంతో సహాయపడును.

పద్యములోని లయకును గద్యములోని లయకును భేదమిది యని M. Albert Thibaudet ఈ క్రిందివిధముగా తెల్పియున్నాడు.

"In prose each phrase creates for itself the law of its rhythm, whilst in verse each phrase creates for itself a personal reason for submitting to a law which already existed".

కవిత్వ ప్రయోజనమగు రసస్ఫూర్తికి ఛందస్సు చక్కని సాధనము. కవిత్వమున మాటల పొందికచేత వస్తు ప్రత్యక్షీకరణము సుసాధ్యమగును. చక్షురింద్రియ గోచరమగు వస్తువు కన్న, చిత్రితమైన వస్తువును దర్శించినపుడు, మానవునకు విశిష్టమగు అనుభూతికల్గును. చిత్రితమైన వస్తువును చక్షురింద్రియము చేత దర్శించినపుడు పొందు అనుభూతికంటె భాషా పదజాలము చేత సాధింపబడిన భావచిత్రణమును తన మనోనేత్రము చేత దర్శించినపుడు అత్యధికానుభూతిని మానవుడు పొందును. అట్టి భావచిత్రణమునకు సహజముగానుపకరించి సహృదయునియందు త్వరితగతిని రసోత్పత్తిని కల్గించుటకు సాధనము ఛందస్సు.

"Merely to arrange words in a definitely rhythmical order is to endow them, as by some secret magic, with a new and subtle emotional power — to touch them with a peculiar suggestiveness which in

themselves, simply as words conveying such and such meaning, they do not possess." [7]

నియత విచ్ఛేదాదికము కలదగుటచేత ఛందోబద్ధమైన రచన వచనముకంటెను స్మరణమునకు అధిక సహకారి; ధారణకును సౌలభ్యమగును. ఈ కారణముచేతనే శాస్త్రగ్రంథములను కూడ మన పూర్వులు ఛందోబద్ధ మొనరించినారని చెప్పవచ్చును. ఈ నియత విచ్ఛేదాదిక పరిశీలనమంతయు శాస్త్రమునకు సంబంధించిన ప్రక్రియా విశేషము. ఛందోబద్ధ రచన వలన కలుగు అనుభూతి కళాతత్త్వమునకు సంబంధించినది. కనుక ఛందస్సును శాస్త్రదృష్టితోను, కళాతత్త్వదృష్టితోను పరిశీలింపవచ్చును.

భావమును సూక్తప్రాయముగను, సార్వజనీనముగను వ్యక్తపరచుటకు ఛందస్సు ముఖ్యమగును. భావ వ్యక్తీకరణమునకు ఛందస్సు ఒక సౌందర్యమును కూడ ఆపాదించును.

కవిత్వ నిర్వచనములో ఛందోలక్షణమును త్రోసిపుచ్చుటకు వీలులేదు. భారతీయాలంకారికుల "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం" అను కావ్య నిర్వచనములోని "రమణీయార్థము" శబ్దరామణీయకతచే సుసాధ్యమగునని భావము. శబ్దరామణీయకత యతి, ప్రాస ఛందోనియమము చేతనే నిర్ణీతమగుచున్నది. పాశ్చాత్య సాహిత్య విమర్శకులు కూడ కవిత్వనిర్వచన విషయమున ఛందస్సుయొక్క ప్రాధాన్యమును గుర్తించియే యున్నారు.

"Poetry is metrical composition" [8]
—SAMUEL JOHNSON.

---

7. An introduction to the study of Literature,
W. H. HUDSON (P. 74).

8. See P. 64. An introduction to the study of Literature
W. H. HUDSON

"Poetry is the art of producing pleasure by the just expression of imaginative thought and feeling in metrical language" [9]

—Prof. COURTHOPE.

ఛందోబద్ధమగు రచన యంతయు కవిత్వము కాదను విమర్శకాభిప్రాయము లేక పోలేదు. పావులూరి మల్లన గణిత శాస్త్రము, జోతిశ్శాస్త్ర గ్రంథములు— ఇత్యాదులుకొన్ని ఛందో నియమములతో నొప్పినను వానిని కవిత్వమన లేము కదా! వచన రూపమున నున్న ఒక కథను ఛందోబద్ధముగ "గురువు లఘువు చేసి కుంచించి కుంచించి లఘువు గురువు చేసి లాగి లాగి" రచించినంత మాత్రముననది కవిత్వమనిపించుకొనదు. పాశ్చాత్య విమర్శకులలో Coleridge "Poetry of the highest kind may exist without metre" [10] అని చాటి యున్నాడు.

ఛందో నియమవిసర్జనము వలనను కవిత్వమని చెప్ప దగిన రచనలు కలవు. తెలుగులో సింహాగిరి నరహరి వచనములు, పెదతిరుమలయ్య వచనములు— ఇత్యాదు లట్టివి. ప్రాచీన భారతీ యాలంకారికుల దృష్టిలో గద్యరచన కూడ కవిత్వమే. "గద్యం కవీనాం నికషంవద న్తి" అని నానుడి. కాదంబరి మున్నగు గద్య కావ్యములందు రసస్ఫూర్తి కలుగుచున్నను ఛందస్సులేని వెలితి ఆ గద్యకావ్యముల కుండనే యున్నది.

కనుక, ఛందస్సు కవిత్వములకు అవినాభావ సంబంధ మున్నది. ఛందోనియమసహితమగు భాష శక్తివంతమును, సుందరవంతమును, శ్రావ్యము నయియుండుట తటస్థించును.

---

9. See P. 65. An introduction to the study of Literature.
W. H. HUDSON

10. Biographia Literaria — Chapter 14.

కవిత్వమునకు రసభావములు మాత్రమే ప్రధానములు కాక వానితో శ్రుతిరంజకత్వమునకు ఛందస్సు కూడ నావశ్యకమే. లయాన్వితముగానున్న పద్యమును గాని, గద్యమునుగాని చదువు చున్నపుడు మనః శ్రవణేంద్రియములు రెండును సుఖించుచున్నవి. కనుకనే "ఛందమన్నిటిలో నవశ్యంబు కాదె" అని అప్పకవి చాటియుండుట.

## ద్విపదచ్ఛందస్సు :

స్వరము యొక్క ఉదాత్త, అనుదాత్త, స్వరిత భేదము లను బట్టియు, అక్షర సంఖ్యనుబట్టియు, వైదికభాషలందలి పద్య పాదము లేర్పడినవి. ఇంగ్లీషులో ఊతను (Accent) బట్టి పద్య ములు నడచును. సంస్కృతములో పద్యపాదములోనుండు అక్షర గణసంఖ్యనుబట్టి పద్యము నడచును. దానిలో హ్రస్వదీర్ఘ నియమ ముండును. ప్రాకృత భాషలలో పాదములలోని మాత్రాసంఖ్యను బట్టి ఆ యా పద్యము లేర్పడి యున్నవి. ద్రావిడ భాషలలో మాత్రాగణములను బట్టి పద్యపాదములు కలుగును. హ్రస్వ దీర్ఘ నియమము అన్ని పాదములందును ఒకే రీతిగా నుండవలె నను నియమము ద్రావిడభాషలలో లేదు.

గణముల కూడికచే పద్యపాదములుత్పన్నమగును. గణ ములు గురులఘుసంయోగముచేత నేర్పడునవి. తెలుగులోని పద్యములను, అక్షరగణనిబద్ధములయిన వానిని వృత్తములనియు, మాత్రాగుణ నిబద్ధములయిన వానిని జాతులనియు, జాతులలో ప్రాసనియమము లేనివి ఉపజాతులనియు లాక్షణికులు వర్గీకరించి యున్నారు.[11]

---

11. చూ॥ అప్పకవీయము - 4 వ. ఆశ్వా. పుట 262, ప. 447 వావిళ్ల ప్రతి. ఆరవ ముద్రణము 1962.

తెలుగులోని పద్యములు

- వృత్తములు
- జాతులు
  - జాతులు
    - కందములు
    - ఉత్సాహము
    - తరువోజ
    - అక్కరలు
    - ద్విపద
    - త్రిపద
    - చతుష్పద
    - పంచపద
    - షట్పద
    - రగడలు
    - కళికోత్కళికలు
  - ఉపజాతులు
    - సీసములు
    - గీతములు
    - ఆటవెలది

ఛందోవేత్తల భావమునను సరించి ద్విపదజాతి పద్యముల లోని యొక భేదమని తెలియుచున్నది. జాతులు మాత్రాగణములచే నేర్పడు చున్నవి.

## మాత్రాగణములు :

మాత్రాగణములలో మాత్రాసంఖ్యయే ప్రధానము కాని గురులఘువర్ణక్రమము ముఖ్యముకాదు. సంస్కృతములోని మాత్రా గణములకు తెలుగులోని మాత్రా గణములకు భేద మున్నది. మాత్రాసంఖ్య నియతముగానున్నను గురులఘువుల సంఖ్య నియతముగా లేని పాదములు గల పద్యములు మాత్రా చ్ఛందస్సులని సంస్కృత లాక్షణిక మతము. తెలుగులోని సూర్య, ఇంద్ర, చంద్ర- గణములలో మాత్రా సంఖ్యానియమము లేదు. ఇవి వరుసగా రెండు, మూడు, నాలుగు గురువులను పెట్టి ప్రస్త రింపగా వరుసగా నాలుగు సూర్యగణములు, ఎనిమిది ఇంద్రగణ ములు, పదునారు చంద్రగణములు నేర్పడును. ప్రస్తారము చేయు నపుడు లఘువుతో మొదలగు గణముల మొదట అదనముగా ఒక లఘువును చేర్చవలెను. ఈ విషయము కవిజనాశ్రయమున నిట్లు తెలుపబడినది.

> " వినుత ద్విత్రిచతుర్గురు
> జనిత గుణంబులు రవీంద్ర చంద్రాఖ్యములై
> చను నక్కర జాతుల కె
> ల్లను, నాదిమ (లఘువు) మొదల లఘు విడవలయున్ "

— జాత్యధికారము. ప.24. (ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రతి).

| రెండు గురువులతో ప్రస్తరించిన | మూడు గురువులచే ప్రస్తరించిన | నాలుగు గురువులు పెట్టి ప్రస్తరించిన |
|---|---|---|
| U U | U U U | U U U U |
| I I U | I I U U | I I U U U |
| U I | U I U | U I U U |
| I I I | I I I U | I I I U U |
| | U U I | U U I U |
| | I I U I | I I U I U |
| | U I I | U I I U |
| | I I I I | I I I I U |
| | | U U U I |
| | | U I U I |
| | | I I U U I |
| | | I I I U I |
| | | U U I I |
| | | I I U I I |
| | | I U I I |
| | | I I I I I |
| = 4 గణములు | = 8 గణములు | = 16 గణములు |

పైని పేర్కొనిన దానినిబట్టి కవిజనాశ్రయకర్త మతమున సూర్యగణములు నాలుగు, ఇంద్రగణములు ఎనిమిది, చంద్రగణములు పదునారు అని తెలియుచున్నది. సూర్యేంద్ర చంద్ర గణముల విషయమున కావ్యాలంకార చూడామణికర్తయగు విన్నకోట పెద్దన (14 శతాబ్దాంత్యము) కూడ కవిజనాశ్రయ కారునే అనుసరించెను.[12]

12. చూ॥ కావ్యాలంకార చూడామణి, 8 ఉల్లాసము - ప. 51. వేదమువారి ప్రతి.

ఇక అనంతాదుల మతమున గూడ నీగణ నిర్మాణమిట్లే. కాని ప్రతి వర్గమునందును మొదటి రెండేసి గణములను-అనగా, సూర్యగణములనుండి 'గగ' 'స' - గణములను, ఇంద్రగణముల నుండి 'మ' 'సగ' గణములను, చంద్రగణములనుండి 'మగ', 'సగగ' _ గణములను_తొలగించగా వరుసగా మిగిలిన రెండు-ఆరు_పదునాలుగు గణములుగల వర్గములకే సూర్య, ఇంద్ర, చంద్రగణములని అనంతుని ఈక్రింది పద్యమునుబట్టి స్పష్టముగా తెలియుచున్నది.

"గల నగణము లినుఁ; డింద్రుడు
నలనగ సల భరత లింక నగగ నహ సలా
భల భ గురు మలఘు సవ సహ
తల రల సవ నలల రగురు తగ లిందుఁడజా"

—ఛందోదర్పణము 1వ ఆశ్వా. ప. 19.

కనుక సూర్యేంద్ర చంద్ర గణముల విషయమున కవిజనాశ్రయ కర్త, కావ్యాలంకారచూడామణికర్తల మతమునకును అనంతాదుల మతమునకును భేదము కలదనుట స్పష్టము. ఈ విషయమునే శ్రీ 'సంపత్కుమార' గారు 'ద్విపద గణములు'[13] అను వ్యాసమునందు వివరించి యున్నారు.

"ఇంద్ర గణములు మూఁడిన గణం బొకటి
చంద్రాస్య ద్విపదకుఁ జనుఁ జెప్పరేచ"[14]

అని కవిజనాశ్రయమున ద్విపదకు లక్షణము చెప్పబడినది. కవిజనాశ్రయము లభించిన తెలుగు ఛందో గ్రంథములలో మొదటిది. పాదమునందు మూడు ఇంద్రగణములు, ఒక సూర్యగణము

13. భారతి - జూన్, 1963.

14. జాత్యధికారము - పుట 74.

వరుసగా నుండుట ద్విపదలో ప్రతిపాదముయొక్క లక్షణము. ఈ ద్విపద లక్షణ విషయమున తెలుగు లాక్షణికులలో అభిప్రాయ భేదము లేదు.

దేశీయ పద్యములను (జాతులు; ఉపజాతులు) కవిజనాశ్రయ కర్త అక్కరజాతి పద్యములనియు, తదితర పద్యములనియు రెండు భాగములుగ విభజించినట్లు కన్పించును. కవిజనాశ్రయ కర్త మతమున అతడు పేర్కొనిన సూర్యేంద్ర చంద్రగణములు అక్కరజాతి పద్యములందు ఉపయోగింపవలసియుండును. ఈ విషయమే "అక్కర జాతులకెల్లను"-అక్కర జాతికి చెందిన పద్యములన్నిట – అని కవిజనాశ్రయమున చెప్పబడినది. అక్కరలు, ద్విపద, త్రిపద, షట్పదిఅనునవి అక్కరజాతికి చెందిన పద్యములు. అక్కర జాతేతర పద్యములందు మాత్రము 'నల నామక గణములు – అనగా నల, నగ, సల, భ, ర, త గణములు; 'నహములు' – అనగా గలము, నగణములను కవిజనాశ్రయకర్త పేర్కొనినాడు. ఈ సూర్యేంద్రగణములను దేశీయపద్యములందన్నిటను ప్రయోగింపవచ్చునని అనంతాదులు నుడివిరి. ప్రస్తుతము సూర్యేంద్రచంద్ర గణవిషయమున అనంతాదులమతమే వ్యవహారమందున్నది. కవిజనాశ్రయకర్త, విన్నకోటపెద్దనలమతమున మ - సగ - (ఇంద్ర), గగ - స (సూర్య) గణములను ద్విపదలో నుపయోగించుట తప్పుకాదు.

పాల్కురికిసోమనాథుడు, తన ద్విపదలలో

"పాయకశ్రుతి 'రసాన్భక్తస్య జిహ్వే
శ్రే" యనియేప్రొద్దుమ్రోఁయుఁ గావునను" 15

15. బసవ పురాణము, 5 వ ఆశ్వా - పుట 19. ("పాయక శ్రుతి రసాన్భక్త జిహ్వేంచవే" ఇత్యాదిగ చేయు సవరణలు సరికావు)

అనుచోట 'గగ' ము సూర్యగణముగాను, "అంధక కరిదైత్య వ్యాఘ్ర లాలాజ"[16] అనుచోట సగురువు నింద్రగణముగాను వాడినాడు. అనంతాదులు చెప్పిన సూర్యేంద్రగణములనుబట్టి చూచినచో పైని పేర్కొనిన సోమనాథుని ద్విపదలు లాక్షణిక ములు కాకపోవును. గగ - స గణములు సూర్యగణములుగాను, మ - స గురువు – గణములు ఇంద్రగణములుగాను అక్కరజాతి పద్యములలో వాడవచ్చునని కవిజనాశ్రయ, కావ్యాలంకార చూడామణికర్తలిరువురును నంగీకరించుటచే పైని ద్విపదలు లాక్షణికసమ్మతములేనని చెప్పవచ్చును.

మగణము (UUU), స గురువు (IIUU) ఇంద్రగణములు గాను, గగము (UU), సగణము (IIU) సూర్యగణములుగాను వాడుకలోనికి వచ్చుటకుగల కారణమును శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగా రిట్లూహించిరి.[17] సంస్కృతములో ఏపాద మున కాపాదమువిరుగును గనుక, పాదాంతములో లఘువుండి నను అది గురువుగానే నుచ్చరింపబడును గనుక, పాదాంతములో గురువుండవలసినచోట లఘువుండినను ఇబ్బంది లేదు. తెలుగులో కూడ ప్రాచీనకాలమున అట్టిసంప్రదాయమే యుండినట్లు కన్పిం చును. తాళపత్రప్రతులలేఖకులు పాదాంతములలోను, పద్యాం తములోను లఘువులను తరచుగ దీర్ఘములుగ వ్రాయుట, లఘువు లను దీర్ఘములుగ చేసిచదువుచుండుట మనము గమనింపవచ్చును. అట్లుచేసినను ఛందస్సులనడక కుంటుబడినట్లు మనకుఅనిపించదు.

(ఉదా:- విశ్వదాభిరామ వినుర వేమా.)

---

16. బసవ పురాణము, 6 వ ఆశ్వా - పుట 483 ("అంధకసింధుర వ్యాఘ్రలాలాజ" అని శ్రీ బండారు తమ్మయ్యగారి పరిష్కరణము.)

17. ద్విపద గణములు - భారతి (లేఖలు) జూలై, 1963.

ఈ దృష్టితో చూచిన అనంతాదు లంగీకరించిన సూర్య గణములలో హగణము (UI) చివరిలఘువు దీర్ఘముతీసి చదివిన గగము (UU) అగును. రెండవ సూర్యగణమయిన నగణము (III) చివరి లఘువును సాగదీసిన సగణము (IIU) అగును. ఇట్లే ఇంద్రగణములలో తగణము (UUI) చివరి లఘువుమీద దీర్ఘముతీసిన మగణము (UUU), సలము (IIUI) చివరిలఘువు పొడిగించిన స గురువు (IIUU) అగును. ఇంద్రసూర్య గణము లలో చివరలఘువున్నవానిలో ఆ లఘువును గురువుగా చేసిన ఇంద్ర, సూర్యగణములు కాకుండపోవునవి ఈ నాలుగుతప్ప మరొకటి కనిపించదు. కనుక సూర్యేంద్రగణముల విషయమున అర్వాచీనులగు అనంతాదులమతము కంటె ప్రాచీనులైన కవి జనాశ్రయ, కావ్యాలంకారచూడామణికర్తలమతమే గ్రాహ్యము.

సూర్యేంద్రచంద్రగణములని చెప్పుటవలన కొన్ని దేశీయ రచనలు మాత్రమే లక్షణవంతములయి అనేకములు అనాదృతములగుచున్నవి. సూర్యేంద్రచంద్రగణము లని చెప్పక గణ గతమాత్రాసంఖ్యనుదాహరించి చెప్పినచో లక్షణమింతకంటె విపులముగానుండును. ఇట్లు మాత్రాసంఖ్యనుబట్టి చూచినచో తెలుగులో అనేక దేశీయరచనలన్నియును త్ర్యస్ర (3 మాత్రలు), చతురస్ర (4 మాత్రలు), ఖండ (5 మాత్రలు), మిశ్ర (7మాత్రలు) సంకీర్ణ (9 మాత్రలు)—గతులలో నడచుచున్నట్లు తెలియును.

మాత్రాసంఖ్యను బట్టి చూచినచో ద్విపద పాదములో చతుర్మాత్రాగణములు గాని, పంచమాత్రాగణములు గాని, లేక వీని కలగలుపుగాని యుండు మూడు గణములును, అంత్య మున త్రిమాత్రా గణమొకటియు నుండును. అనగా ద్విపద పాదము నాల్గు గణముల మొత్తము పదునెనిమిది మాత్రలకు

మించకయు, పదునైదుమాత్రలకు తక్కువగాకయు నుండును.

## ద్విపద - దేశీయత.

ద్విపదయందు రెండు పాదములుండును. పాదసంఖ్యను బట్టియే దానికి 'ద్విపద' యని పేరు కల్గినది. ద్విపద లక్షణమును తెల్పినలాక్షణికుడు కవిజనాశ్రయకర్త తర్వాత విన్నకోట పెద్దనయే. అతడుతన కావ్యాలంకారచూడామణియందు 'ద్విపద' కు బదులుగా 'ద్విపది' అని వాడినాడు.

> "శక్రత్రయంబును సవిత్రుండుఁ బాద
> విక్రీడితులు మృదు ద్విపదికి నెపుడు
> వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని".



—అష్టమోల్లాసము. ప. 61.

'ద్విపది' అని ప్రయోగించిన వారిలో మొదటివాడును, ఆఖరివాడును నితడే. తెలుగులో ద్విపద కావ్యోత్పత్తికి కారణభూతుడైన పాల్కురికి సోమనాథుడు, తన పండితారాధ్య చరిత్ర అవతారికలో,

> "...............ఆదిప్రాస నియతి
> దప్పకుండగ ద్విపదలురచియింతు".

నని 'ద్విపద'ను మార్పరాని యతిస్థానమున ప్రయోగించినాడు. 'ద్విపద' అను పదమే సాహిత్య ప్రపంచమున రూఢికెక్కినది.

సంస్కృతమున వేదవాఙ్మయములో రెండుపాదములుగల ద్విపదా విరాట్, ద్విపదాజగతీ - మున్నగు ఛందస్సులును, మూడు పాదములుగల గాయత్రీచ్ఛందమును కనిపించును.

లౌకిక వాఙ్మయమున సర్వపద్యములకును నాల్గు పాదములుండుట నియతమయిన లక్షణము. కాని దేశీయచ్ఛందస్సులకు నాల్గు పాదములుండుట నియతము కాదు. ద్విపద (2 పాదములు), త్రిపద (3 పాదములు), చౌపద (4 పాదములు), షట్పది (6 పాదములు)_ మొదలగు దేశీయచ్ఛందస్సులు పాదసంఖ్యను బట్టియే యేర్పడినవి. ఈ ఛందస్సులకున్న పేర్లనుబట్టి దేశీయచ్ఛందస్సులకు పాదనియతి లేదని చెప్పవచ్చును. నాల్గు పాదములకన్న అధికముగానున్న పద్యమును 'మాలిక' యను పదము చేర్చి పేర్కొనుట కలదు. ద్విపద, రగడ_లందు అధికపాదములున్నను ద్విపదమాలిక, రగడమాలిక అని పేర్కొనరు. వానిని కేవలము ద్విపద, రగడలనియే పేర్కొందురు. ద్విపదలో రెండు పాదములు మొదలుకొని యెన్నిపాదములయినను సరిసంఖ్యలో నుండును.

ద్విపద దేశీయమైన ఛందస్సని స్పష్టముగా తెలియుచున్నను, డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు ద్విపద దేశిత్వమును శంకించుచు నిట్లు వ్రాసియున్నారు.

"మనవారనుకొనునట్లు ద్విపద దేశిచ్ఛందముగాదు. అది ప్రాకృతమునుండి యెరవు తెచ్చుకొన్నది. ద్విపదికయే మన ద్విపదయైనది." 18 ఈ అభిప్రాయము సమంజసమైనది కాదు. సంగీత రత్నాకరమున శుద్ధ ద్విపదికకు చెప్పబడినలక్షణమిది:—

"పాదేషః పంచభాగోన్తేజాస్తః షష్ఠద్వితీయకౌ
చతుర్భిరీదృశైః పాదైః శుద్ధా ద్విపదికోచ్యతే" 19

18. దాక్షిణాత్యాంధ్రసాహిత్యము - యక్షగానము, 5 వ ప్రకరణము పుట 87.

19. సంగీత రత్నాకరము_4 వ అధ్యా. 114 సూ. ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళి.

శుద్ధ ద్విపదికకు నాల్గు పాదములుండును. ప్రతిపాదమునందును మొదట 6 మాత్రల గణము, ('భగ' లేక 'మ'–గణములు) 5 భగణములు, అంతమందు గురువు, నడుమ రెండవ, ఆరవ గణములు జగణములు కల్గియుండును. అనగా శుద్ధద్విపదిక ప్రతి పాదమునందు:

(1) (2) (3) (4) (5) (6) (7) (8) (9)

6 మాత్రల గణము, జ, భ, భ, భ, జ, భ, భ, గ గణములు కలవు.

శుద్ధ ద్విపదిక యొక్క పాదమున చాల గణములుండుటయు, అందును జగణమునకు ప్రసక్తియుండుటయు, అంత్యమున గురు వుండుటయు–కారణములుగ తెలుగుద్విపదకు దీనికి చాలభేదము కలదు. నాల్గు పాదములు గల ద్విపదిక నుండి రెండు పాదములు గల ద్విపద పుట్టిన దనుట ఛందస్సంప్రదాయ విరుద్ధము.

తెలుగున రెండు పాదములుగల ఛందస్సులనుండి నాలుగు పాదములుగల ఛందస్సు లేర్పడినవికాని, నాల్గుపాదములుగల ఛందస్సునుండి రెండు పాదములుగల ఛందస్సు లేర్పడలేదు. ఈ పద్ధతి రగడలందు స్పష్టముగా గమనింపవచ్చును. పాదమునకు త్రిమాత్రాగణములు నాలుగు కల్గిన హయప్రచార రగడను రెట్టించినచో తురగవల్గనరగడయగు చున్నది. ఇట్లే ప్రతి పాదమునందును రెండు యగణములుండిన 'విచిత్రవృత్తము' ను రెట్టించిన 'భుజంగప్రయాత' మగును. పాదమునందు రెండు సగణములుండిన 'వసుధ'–వృత్తమును రెట్టించినచో 'తోటక' వృత్తమగుచున్నది. దీనిని బట్టి నాల్గు పాదములుగల 'ద్విపదిక' నుండి రెండు పాదములు గల 'ద్విపద' పుట్టినదను నేలటూరి వారి వాదము పరాస్తమగు చున్నది.

జంభలా; జంభలికః

శుద్ధద్విపదిక 'జంభలా' నామకమగు నొకగీతి భేదముగా భరతుడు చెప్పినట్లు వాచస్పత్యనిఘంటువునందు[20] కలదు. "శుద్ధ ద్విపదికా గీతిర్జంభలే త్యభిధీయతే"—భరతః.

విక్రమోర్వశీయమున 'ద్విపదిక' అను గీతివిశేషము పేర్కొనబడినది. అందు ద్విపదికకు లక్ష్యము లేదు కాని 'జంభలిక' యను గీతమునకు ఈ క్రింది లక్ష్యము కలదు.

(ప్రాకృతము).

" సహ అరి దుఖ్ఖాలిద్ద అం
సరవర అమ్మి సిణిద్ధ అం
అరవిల వాహ జలోల్ల అం
తమ్మ ఇహంసీ జు అల అం "[21]

ఈ 'జంభలిక' యు, భరతునిచే పేర్కొనబడిన శుద్ధ ద్విపదిక రూపాంతరమగు 'జంభలా'-ఒకటే అయినచో అప్పుడు 'జంభలిక' శుద్ధద్విపదిక యగును. పై ఉదాహరణమును బట్టి చూచినచో శుద్ధద్విపదికగా ననుమానింపదగినజంభలిక ప్రతిపాదమునందు 13 మాత్రలుండునని తెలియుచున్నది. తెలుగు ద్విపద పాదపరిమితి పదునైదు మొదలు పదునెనిమిది మాత్రలవరకు నుండుటచే జంభలిక, ద్విపదయు నొకటి కాదనుట స్పష్టము. ఇట్లే సంస్కృత ప్రాకృతములందు ద్విపదలనబడు వానిలక్షణములు యథాతథముగ తెలుగు ద్విపద లక్షణమునకు సరిపోవని నిరూపింపవచ్చును,

20. చూ॥ 5 వ భాగము - పుట 3821.
Chowkamba Sanskrit Series, Vol. 5.
21. విక్రమోర్వశీయము, 4 వ అంకము - పుట 153.

## ద్విపది:

"గుర్వంతం ద్విపదీభవతి" (వాచస్పత్యనిఘంటువు) అనుటచే 'ద్విపద గుర్వంతము. కాని తెలుగు 'ద్విపద' లఘ్వంతమైనది. జనాశ్రయి చ్ఛందస్సూత్రములందు 'ద్విపది' లక్ష్యములు కలవు. ఆ లక్ష్యములను పరిశీలించినచో 'ద్విపది' పాదమునకు ముప్పదింటికి మించిన మాత్రాసంఖ్య కన్పడును.

ఉదా:- "కరుణాకరనిష్కరుణేన వాయునా రిపువారణదానగంధినా" తెలుగు ద్విపదపాదము పదునెనిమిది మాత్రలకు మించియుండదు. కనుక 'ద్విపది', తెలుగు ద్విపదలకు లక్షణసామ్యము యథాతథముగ లేదు.

## ద్విపదగ:

మానసోల్లాసమునందలి 'ద్విపదగ' లక్షణ మీ క్రిందిది.

"త్రయోగణా గురుశ్చాంతే ప్రథ మేథ తృతీయకా †
ద్వితీయేచ తురీయేచ ద్వౌగణౌ ద్వౌగురూ తథా
జగణోనాత్ర కర్తవ్యో భాగాంతేయమకం భవేత్
ఇతి ద్విపదగంనామా తస్యోదాహృతి రుచ్యతే"

'ద్విపదగ' కు గల నాల్గు పాదములలో 1-3 పాదములందు మూడు గణములు ఒక గురువును, 2-4 పాదములందు రెండు గణములు రెండు గురువులును కల్గియుండుట లక్షణము. 1-2 పాదముల కొకేలక్షణముకల్గిన లఘ్వంతమగు తెలుగు ద్విపదకిది భిన్నమైనది.

## ద్రోధకము:

సంగీతరత్నాకర వ్యాఖ్యాన (కళానిధి) కర్తయగు కల్లి

† చూ॥ పుట 290-291.

నాథుడు 'ద్విపథకము' నే 'దోధక' మని పేర్కొనెను. ఈ 'దోధకము' నే తెలుగులాక్షణికులు త్రిష్టుప్ ఛందోవృత్తముగా పరిగణించి యున్నారు. 'దోధకము' నకు కల్లినాథుడు చెప్పిన లక్షణమిదీ:—

"ద్విపదం దోధక మితి పర్యాయ శబ్దౌ,
తేన దోధక లక్షణమేవ ద్విపద లక్షణం వేది తవ్యమ్
దోధక లక్షణంతు భాభగాగితి"

—సంగీత రత్నాకర వ్యాఖ్యానము.

'దోధక' పాదమునందు మూడు భగణములు రెండు గురువు లుండును. ఈ దోధక లక్షణము తెలుగుద్విపద లక్షణమునకు కొంత సన్నిహితముగానున్నది. దోధక పాదమునందలి చివరి గురువును లఘువుగా చేసినచో నది ద్విపద పాదమగును. కాని 'దోధక' మున 'భ' గణప్రయోగము విహితము. ద్విపద యందది ఐచ్ఛికము.

## ద్వి ప దీ ఖం డ ము:

రత్నావళి[22] యందు ప్రాకృతమున 'ద్విపదీఖండము' నకు ఈ క్రింది లక్ష్యము కలదు.

(ప్రాకృతము)

"కుసుమా ఉహాసి అదూ అ ఓ
ము ఉలా ఇద బహు చూద ఓ
సిధిలి అమాణగ్గహాణ ఓ
వా అ ఇదాహిణ పవణ ఓ"

—ప్రథమాంకము. ప. 14.

22. Sri Balamanorama Series - No. 22, Madras 1935.

ద్విపదీఖండ పాదమునకు 13 మాత్రలు కలవని పై రత్నావళి లక్ష్యమువలన తెలియుచున్నది. తెలుగు ద్విపదపాదమునకు కనీసము 15 మాత్రలైనను నుండవలెను కదా!

దోహా:

"సంస్కృతే యే ద్విపదగాః
ప్రాకృతే దోహాకోచ్యతే"

—సంగీతచూడామణి (జగదేకః)

సంస్కృతమునందు 'ద్విపదగ' అనునదియే ప్రాకృతమున 'దోహా' అని చెప్పబడుచున్నది. కాని లక్షణ విషయమున రెంటికిని భేదము కలదు. "దోహాయందు నాల్గు పాదములలో మొత్తము 48 మాత్రలుండును. ఏ పాదములోను జగణముండ కూడదు" అని కోల్‌బ్రూకు (P. 413) చెప్పినట్లు కిట్టల్ కన్నడ చ్ఛందోంబుధియందు కలదు.

దోహా పాదములందు మాత్రలసంఖ్య ఈక్రిందివిధముగనుండును.

1—3 పాదములలో—6 + 4 + 3 = 13 మాత్రలు.

2—4 పాదములలో—6 + 4 + 1 = 11 మాత్రలు.

ఇది తెలుగు ద్విపదపాదములందలి మాత్రలసంఖ్యకు భిన్నమైనది.

రెండు పాదములకు లక్షణసామ్యము కల్గినవన్నియు ద్విపద లను భావముతో పైనిపేర్కొనబడిన సంస్కృత ప్రాకృత ద్విపద భేదములన్నియు ద్విపదలే కావచ్చును. కాని తెలుగు ద్విపదలక్షణము వానికి విలక్షణమైనది. తెలుగుద్విపద దేశిచ్ఛందము. సంస్కృత ప్రాకృత ద్విపద భేదములతో దానికి జన్య జనక భావసంబంధము లేదను సత్యము పై దృష్టాంతములవలన

తెలియుచున్నది. కావుననే ద్విపదను జాతిచ్ఛందముగ తెలుగు లాక్షణికులు పరిగణించి యుండుట.

ద్విపద తెలుగు దేశిచ్ఛందస్సు :

కన్నడచ్ఛందములోని ద్విపదలకును తెలుగు ద్విపదలకును జన్యజనక సంబంధమున్నదా? అనిపరిశీలింతము. 'దువయి', 'దువవిగ', 'దువది'-మొదలగు పేర్లతో కన్నడచ్ఛందమున ద్విపదలు కలవు. [23] 'ద్విపద' భవము 'దువయి' అని కిట్టల్ దొరగారు వ్రాసినారు. కన్నడములోని 'దువయి' అను ఛందస్సులోని రెండు పాదములలోను ఒక్కొక్క పాదములో వరుసగా 6 మాత్రల గణము + 5 కందపద్య గణములు = 26 మాత్రలుండును. కందపద్య గణముల - అనగా చతుర్మాత్రాగణముల- తర్వాత ఒక గురువు చేర్చవలెననియు, మొత్తము 28 మాత్రలనియు 'దువయి' లక్షణమునకు పాఠాంతర మున్నది. దీనిని బట్టి 'దువయి' పాదమునందు 26 లేక 28 మాత్రలుండును. 'దువయి' పద్యలక్షణము ప్రాకృతములోని 'దో అ ఇ' అను పద్యలక్షణమునకు సరిపోవునని డా॥ చిలుకూరి నారాయణరావు గారు తెల్పి యున్నారు. [24] 'దో అ ఇ' ప్రాకృత పద్యము

మాత్రాప్రసారము :-

6 + 4 + 4 + 4 + 4 + 6 = 28 మాత్రలు.

కన్నడ 'దువయి' లక్షణము తెలుగు ద్విపద లక్షణము

23. చూ॥ కన్నడ ఛందోంబుధి IV, 293 - 295.

24. మాత్రాచ్ఛందస్సులు - డా॥ చిలుకూరి నారాయణరావు, వ్యాస సంగ్రహము.

నకు భిన్నమైనది. ఇట్లే దువవిగ, దువది మొదలగు కన్నడద్విప దలకును తెలుగుద్విపదతో జన్యజనక సంబంధము లేదని నిరూ పింప వచ్చును.

తెలుగు ద్విపదతో తమిళములోని 'Ahavalpa' సంబం ధము కల్గియున్నదని శ్రీ కో. రాడ రామకృష్ణయ్య గారిట్లు వ్రాసిరి.

"Dwipada may be said to be related to the Ahavalpa type of metrical composition in Tamil. This Ahavalpa of Tamil consists of lines of 4 feet of two syllables each. These syllables are either ner or nirai and when combined correspond to the Surya and Indra ganas of Telugu prosody"[25].

ఇట్లు సంస్కృత ప్రాకృత ద్విపద భేదములు మాత్రమే గాక కన్నడ, తమిళచ్ఛందములోని ద్విపదలనదగినవి కూడ ఏ విధముగను తెలుగుద్విపదతో జన్యజనకభావ సంబంధమును బొందియుండ లేదు. తెలుగు ద్విపద తెలుగువారిదే; తెలుగు భాషలో పుట్టినదే; తెలుగుజాతికి సహజమైనదే; - అనుటలో సందేహము లేదు.

## ద్విపద : ప్రాచీనత:

ద్విపదచ్ఛందస్సును పాల్కురికి సోమనాథుడు సృష్టించె నని శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు 'సోమన సృష్టించిన ఛందస్సు'[26] అను వ్యాసమునందు వ్రాసిరి. తెలుగు ద్విపదను ప్రప్రథమముగా కావ్యరచనలో నుపయోగించినవాడు సోమ

25. See - Telugu Literature outside the Telugu Country Annals of Oriental Research - Telugu, Vol. V, Part I.

26. చూ॥ పరిశోధన సంచికలు 9, 10. సం॥ 1955.

నాథుడే. సోమనాథు డుపయోగించుటవలననే ద్విపదయొక్క స్వరూపము సుస్పష్టమయినది. కాని ద్విపద సోమనాథునికి చాలపూర్వకాలమునుండియే తెలుగునకలదని నిరూపింపవచ్చును.

తెలుగున ద్విపద యెప్పుడు ప్రారంభమయినదో ఖచ్చితముగా నిర్ణయించి చెప్పలేము గాని దీని పుట్టుక అతి ప్రాచీన కాలమందే తెలుగు జానపదుల గేయములలో కల్గియుండును. పద్యరచనకు పూర్వపు తెలుగు వాఙ్మయమంతయు గేయరూపమున నున్నదనుట విమర్శకుల అభిప్రాయము. తెలుగులో శిష్ట సాహిత్యము పుట్టుటకు పూర్వము వెలసిన గేయరూపమగు పాటలు, పదముల లక్షణ స్వరూపములను తెలుపుట కష్టము. కాని అట్టి గేయరూపసాహిత్యము అతి ప్రాచీన కాలమందే వ్యాప్తిలో నుండియుండుననుటలో అభిప్రాయ భేదము లేదు. అనియత కర్తృకము, అనియమవంతము–నను లక్షణములు జానపద గేయములందు సర్వత్ర అభివ్యాప్తమయినట్టివే. కాలనిర్ణయము చేయబడలేకపోవుటయుకూడ జానపదగేయములయొక్క లక్షణములలో ప్రధానమైనది. అయినను అవి శ్రుతి, లయ, తాళ సహితమైన ఛందోలక్షణములతో నొప్పియుండుట సహజము.

భరతుని నాట్యశాస్త్రములోను, మతంగుని బృహద్దేశి యందును, పార్శ్వదేవుని సంగీత రత్నాకరము నందును దేశి గేయము లసంఖ్యాకముగా పేర్కొనబడినవి. భరతుని కాలము క్రీస్తుశకమునకు పూర్వమే యని నిశ్చయింపబడినది. భరతుడు తన నాట్యశాస్త్రమునందు 'శీర్షక' మను దేశీయచ్ఛందస్సును పేర్కొనినాడు. ఈ 'శీర్షక' మే తరువాత సీసపద్యముగా మారి యుండునని పలువురు అభిప్రాయపడిరి. ఈ సందర్భమున శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి ఈ వాక్యములు గ్రహింపదగినవి.

"దక్షిణదేశ భాషాసంప్రదాయ సిద్ధములగు ప్రాచీనగేయరచనలనేకములు మాత్రాచ్ఛందస్సులుగా సంస్కృత ప్రాకృత లాక్షణికులచే గ్రహింపబడినట్లగపడుచున్నది". [27] దీనినిబట్టి భరతుని కాలమునాటికే దేశీయచ్ఛందములు వ్యాప్తిలోనున్నట్లు తెలియుచున్నది. కనుక తెలుగుచ్ఛందస్సుయొక్క ప్రాచీనత క్రీస్తుశకమునకుముందే ప్రారంభమైనదని చెప్పవచ్చును. తెలుగువారి చరిత్రతోపాటే తెలుగుచ్ఛందస్సుకూడ ప్రారంభమైనదని చెప్పుటలో అసమంజసము లేదు.

ఏ వాఙ్మయములోనయినను ముందు గేయములు, తర్వాత పద్యములు, ఆ పిమ్మటనే గద్యమును ఆవిర్భవించును. నన్నయ (1054A.D.)కు ముందు చాలకాలమునుండి తెలుగున గేయములు ప్రజలనోళ్లలో వెలసియేయుండును. నన్నెచోడుడు(1130-50A.D.) 'ఊయెల పాట' లను, 'గాడుగీతము' లను, 'అంకమాలిక'లను రాగయుక్త గేయములను, అభినయముతో కూడిన 'ఆలతుల'ను కుమారసంభవమున పేర్కొనినాడు. పాల్కురికి సోమనాథుడును తన పండితారాధ్యచరిత్రమున పలువిధములగు పదములను, గీతములను ఈ క్రింది విధముగ పేర్కొనినాడు.

> "పదములుఁ దుమ్మెద పదముల్ ప్రభాత †
> పదములుఁ బర్వత పదము లానంద
> పదములు శంకర పదముల్ నివాళి
> పదములు వాలేశు పదములు గొబ్బి
> పదములు వెన్నెల పదములు సంజ
> వర్ణన మతి గణ వర్ణన పదము"

---

27. దక్షిణదేశ భాషా సారస్వతములు - దేశి, పుట 207.

† వాద ప్రకరణము - పుట 513.

"ఆనంద గీతంబు లర్థిఁ బాడుచు శి ‡
వానంద లీలల నలరి యాడుచును
శంకర గీతముల్ సరస బాడుచును"

"సకల పురాతన చారుగీతములు
ప్రకటించి పాడెడువార కొందఱ"

రనియు సోమనాథుడు చెప్పినాడు. సోమనాథుడు పేర్కొనిన తుమ్మెదపదములు, శంకరపదములు, నివాళిపదములు, ప్రభాత పదములు- మొదలగునవి అర్వాచీనకాలమునందును జానపదులలో చాల వ్యాప్తిచెంది యున్నవి. శంకరపదములు ఈశ్వరునిగూర్చి నవి. నివాళిపదములు మంగళహారతులు కావచ్చును. ప్రభాతపద ములు మేల్కొలుపుపాటలు కావచ్చును. సోమనాథుని కాలమున నుండిన ఈ పదములు, గీతములవంటివి అంతకు చాలకాలమునకు ముందే వ్యాప్తిలోనుండి యుండుననియు, అవి అర్వాచీనకాలము నందలి పదములు, గీతములవంటివే అని ఊహించుటలో అసమం జసము లేదు. ఈ పదములు, గీతములు పండితుల వినోదము కొఱకు గాక సామాన్యజనుల వినోదముకొఱకును, ప్రబోధమున కును వెలసియుండుటచే నన్నయకు పూర్వము అవి గ్రంథస్థము కాలేదని చెప్పవచ్చును. ఇట్లు తెలుగున నన్నయకు అతిప్రాచీన కాలమునందే గ్రంథస్థముకాని పదవాఙ్మయము చాల నుండి యుండును. కొంత సంస్కృతి వృద్ధిపొందిన తర్వాతనే పాడుకొను టకే గాక పఠించుటకు తగినట్టి రచనలు కావించుప్రయత్నముల ఫలితముగనే తెలుగులో పద్యములేర్పడినవి. క్రీ. శ. 9వ శతా బ్దపు తెలుగు శాసనములలో పద్యములు కన్పించుచున్నవి. పద కవిత్వము నిసర్గమధురమును, నిరాడంబరమునయి జనసామాన్య

‡ మహిమ ప్రకరణము - పుట 176.

మున చోటుచేసికొని సజీవమైయుండును. ఛందోవ్యాకరణాది నియమములతో, శైలీప్రౌఢితోనొప్పి ప్రౌఢసాహిత్యమను పేర విద్వల్లోకమున స్థిరప్రతిష్ఠ సంపాదించినది పద్యకవిత.

నేడు ఆంధ్రలోకము నాల్కలపై నాట్యమాడుచుండు పాటలు, పదములు మున్నగు దేశీయ రచనలు నూటికి తొంబది పాళ్ళు ద్విపదలును, తద్భేదములునై యున్నవి. లాలిపాట, జోలపాట, దంపుడుపాట, విసురురాతి పాట, ఉయ్యాలపాట, తుమ్మెదపదములు, చందమామ పదములు, ఆనందగీతములు— మున్నగు పాటలు, పదములన్నియు కాలిక మాత్రాసంఖ్యనుబట్టి చూచినచో చాలవరకు 'ఖండగతి'(5 మాత్రల ఆవృత్తి) లో నడచునట్టివి. వానిలోకొన్ని 'చతురస్రగతి' (4మాత్రల ఆవృత్తి) లో నడచునట్టివికూడ కలవు. ద్విపదలో 5 మాత్రల ఆవృత్తులు, 4 మాత్రల ఆవృత్తులును కలవుకదా! ఇట్లు మాత్రాసంఖ్యనుబట్టి చూచినచో అనేకములగు దేశీయపదములు ద్విపదలో నంతర్భూతములగునట్టివే. పాడదగిన పదకవిత్వలక్షణము కొంత, పఠనయోగ్యమగు పద్యకవిత్వ లక్షణముకొంత సంతరించుకొని గేయమును, పాఠ్యమును నైనది ద్విపద. పదపద్యములకు నడిమివాటుగా నడచునట్టిది ద్విపద అనవచ్చును. ద్విపదయందు రెండు పాదములుండుటయు, అవియు నాల్గు గణములు మాత్రమే గల చిన్న పాదములగుటయు, అట్టి ద్విపదలు వరుసగా నెన్నైనను వ్రాయుటకు వీలగుటయు, దీనికి గానయోగ్యత యుండుటయు కూడ దీనియొక్క ప్రాచీనతను సమర్థించుచున్నవి.

పాల్కురికి సోమనాథుడు "కరమర్థి నూరూరసిరియాళు చరిత పాటలుగా గట్టి పాడెడివారు" అని పాటల కథలనుకూడ సూచించినాడు. మాతపురాణము, మాహురమ్మకథ, అంకమ్మ

కథ, కాటమరాజుకథ, కాకతమ్మకథ, గౌతమ పురాణము, పరశురామాయణము— మొదలగు కథాగేయములు చాలవరకు 'కిటతకిట' అను 5 మాత్రల ఆవృతముల పదములతో, జంపె వరుసలతో పాడబడుచు నేటికిని ప్రచారములో నున్నవి. ఈ కథాగేయములు చాలవరకు ద్విపదవికార రచనలే. పలువురి యానందమున కుద్దేశింపబడిన ఈ కథాగేయముల వంటివి పాల్కురికి సోమనాథునికి ముందు కూడ జనసామాన్యమున వ్యాప్తిలో నుండియుండును.

## ద్విపద తెలుగుఛందస్సునకు ప్రాతిపదిక:

ద్విపదగతిరగడ:- క్రీ. శ. 5, 6 శతాబ్ది ప్రాంతముననే ఆళ్వారులు, నాయనారులు భక్తి ప్రబోధ గీతములను పాడి యున్నారు.[28] తెలుగునకూడ అట్టి గేయములు ఆ కాలముననే వేనవేలు పుట్టియుండును. క్రీ. శ. 6వ శతాబ్దమునాటిదగు పొట్ల దుర్తి-మాలెపాడు శాసనము ఇప్పటికి దొరకిన శాసనములలో పూర్తి తెలుగుభాషగల మొదటి శాసనము. ఈశాసనము పైకి వచనమువలె కన్పించినను దీనిలోని—

"అణపోతులు రేవణకాణ పుద్దణకాలు
ఇచ్చిన పన్నస పెన్పాజె ఇకారేణికిన్"

—అను రెండు పంక్తులలో 'ద్విరదగతిరగడ' లక్షణము కొంత వరకు గర్భితమై యున్నదని శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

28. చూ॥ ఆంధ్రభాష - దక్షిణాపథ సంస్కృతి - పుట 43, కోరాడ రామకృష్ణయ్య, పరిశోధన - ఏప్రిల్, 1954.

గారు తెల్పిరి.[29] కాని ఈ శాసనమంతయు గేయపద్ధతిని రచింపబడినదని శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావుగారు నిరూపించినారు.[30] దీనిని బట్టి క్రీ. శ. 6వ శతాబ్దమున గేయములలో శాసనములను రచించుచుండెడివారని నూహింపవచ్చును. క్రీ. శ. 6వ శతాబ్దముననే ద్విరదగతిరగడ శాసనములందుపయోగింపబడుటచే దానిని అతి ప్రాచీనమైన దేశిచ్ఛందస్సుగా పరిగణింపవచ్చును. అయిదేసిమాత్రలుగల నాల్గు గణములు ఒక్కొక్క పాదమున నున్నచో నది ద్విరదగతి రగడ యగును.

"కర మొప్పఁ బంచలఘుగణ చతుష్టయముచే
విరమంబు రెంటిపై ద్విరదగతి పేరిచే"

—అప్పకవీయము 4వ ఆశ్వా. ప. 484.

ద్విపదలోని చివరిగణమునకు రెండుమాత్రల నధికముగా చేర్చినచో, అనగా చివరి సూర్యగణమును పంచమాత్రాగణముగ చేసినచో ద్విరదగతిరగడ యేర్పడును. లేక ద్విరదగతి రగడలోని చివరి రెండుమాత్రలను తగ్గించినచో ద్విపద యేర్పడు ననియు చెప్ప వచ్చును. ద్విరదగతిరగడయందు కేవలము పంచమాత్రాగణములేయుండును. కాని ద్విపదయందు పంచమాత్రాగణములతోపాటు చతుర్మాత్రా గణములు, త్రిమాత్రా గణము కూడ నుండవచ్చును కదా! అనగా ద్విపదయొక్క లక్షణము ద్విరదగతిరగడలక్షణముకంటె విస్తృతము. విస్తృత లక్షణముగల ఛందోరీతులనుండి సంకుచితలక్షణములుగల ఛందోరీతు లేర్పడుట ఛందఃపరిణామమునసహజము. కావున ద్విరదగతిరగడ

29. చూ॥ పరిశోధన_సంచిక 1, 1954.
30. మొదటి గేయశాసనము_పరిశోధన, సంపుటి 1, సంచిక 4, 1954

నుండి ద్విపద సంభవించిన దనుటకన్న ద్విపదనుండియే ద్విరద గతి రగడ రూపొందినదనుట సమంజసమును, శాస్త్రీయమును. కనుక, ద్విరదగతిరగడ ద్విపదయొక్క భేదమే. ఇట్లే కేవల చతుర్మాత్రా గణములతో నొప్పు మధురగతి రగడకూడ ద్విపద భేదమేయని నిరూపింపవచ్చును.

క్రీ. శ. 6వ శతాబ్దపు శాసనములో ద్విరదగతి రగడ యున్నదని నిరూపించినపుడు దానికి మూలమైన ద్విపద అంతకు పూర్వమే వెలసియుండవలెను కదా!

## తరువోజ

ఆంధ్రకవితా పరిణామమును గూర్చి వ్రాయుచు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు "తెలుగు కవిత యేకపదమై, ద్విపదమై, త్రిపదమై, చతుష్పదమై, పరిణతిఁజెందినట్లు కాన వచ్చుచున్నది" అని వ్రాసిరి.[31] కవితాపరిణామ మార్గమున ఈఅభిప్రాయము సమంజసమే. కాని తెలుగులో నుపలబ్ధము లగు పద్యశాసనములలో మొదటిదగు అద్దంకి శాసనములో (848-892 A.D.) నాల్గు పాదములుగల తరువోజ పద్యము కలదు.

"పట్టంబు గట్టిన ప్రథమంబు నేడు
 బలగర్వమొప్పఁగ బైలేచి సేన
పట్టంబు గట్టించి ప్రభుఁ బండరంగుఁ
 బంచిన సామంత పదువతో బోయ
కొట్టములు పండ్రెండు గొని వేఁగి నాటి
 గొఱల్చియ త్రిభువనాంకుశ బాణ నిల్చి
కట్టెపు దుర్గంబు కడు బయల్సేసి
 కందుకూర్బెజవాడ గావించె మెచ్చి"

31. చూ॥ ఉదాహరణము వాఙ్మయ చరిత్ర - పుట 3.

ఈ పద్యశాసనమును బట్టి తరువోజ తెలుగుచ్ఛందస్సులో ప్రాచీనమయినదని కొందరు అభిప్రాయపడి యున్నారు. "ద్విపదలు తరువోజనుండియో లేక కన్నడ త్రిపది నుండియో వచ్చియుండును."[32] కాని రెండు ద్విపద పాదములు రెట్టించుటచే తరువోజ పద్యపాదములేర్పడి యుండినట్లు స్పష్టముగా గుర్తింప వచ్చును. పైని పేర్కొనిన తరువోజ పాదమును నాల్గేసి గణములుగల రెండు భాగములుగాను నేర్పాటు చేయవచ్చును. పూర్వభాగములో 3 ఇంద్రగణములు, 1 సూర్యగణము కలవు. ఉత్తర భాగములో కూడ అట్లే. వరుసగా 3 ఇంద్రగణములు 1 సూర్యగణము ద్విపద పాదమందుండును కదా! కనుక ద్విపద యొక్క రెండుపాదములు ఒక పాదముగా నేర్పడుటచే తరువోజ పద్యపాద మేర్పడినది. ఒక పద్యముయొక్క రెండుపాదములకు సంబంధించిన లక్షణరూపము మరొక విధమగు పద్యమున ఏక పాద లక్షణముగా నేర్పడుట సంస్కృతాంధ్ర ఛందస్సులందు సామాన్యమయిన విషయమే. ద్విపదయందు రెండు పాదములుండుటయు, నవియు నాల్గు గణములుమాత్రమే గల చిన్నపాదములగుటయు చూడ ద్విపద నాల్గుపాదములుగల తరువోజ కంటెను ప్రాచీనమైనదని చెప్పవచ్చును.

కావున క్రీ. శ. 9వ శతాబ్దమున తరువోజ శాసనములందుపయుక్తమగుటచే దానికిమూలమగు ద్విపద అంతకు పూర్వమే వ్యాప్తియందుండిన దనుట స్పష్టము.

"తలకొని తగఁ బ్రాలు దంపెడిచోటఁ
దరుణులచే సొంపు దనరుఁ దర్వోజ"[33]

32. చూ॥ తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట 42.
33. అష్టమోల్లాసము - ప. 50.

అని కావ్యాలంకార చూడామణియందు తరువోజ స్త్రీలు పనులు చేసికొను సందర్భమున శ్రమాపనోదనముకొరకు పాడు నొక పాటగా తెల్పబడినది. స్త్రీలపాటలలో అనేకము ద్విపదయొక్క భిన్న భిన్న స్వరూపములుగనే యున్నవి. కనుక ద్విపద, తద్భేద మైన తరువోజయు ప్రాచీనకాలమునుండియు జనసామాన్యమున అత్యధిక ప్రచారము నొందియుండును.

రెండు పాదములుగల ద్విపద నొకదానితో నొకటి కలిపిన నది తరువోజ పాదమగునని పైని నిరూపింపబడినది కదా! ఆతరువోజయే తర్వాత సీస, మధ్యాక్కరల రూపమును దాల్చిన దనియు నిరూపింపవచ్చును.

## సీసము :

కందుకూరు శాసనము (క్రీ. శ. 9వ శతాబ్ది) నందును, ధర్మవరముశాసనము(892A.D.) నందును సీసపద్యము గోచరించుచున్నది. ద్విపద తరువోజగా పరిణమించిన తర్వాత నది సీసపద్యముగా పరిణమించినది. తరువోజపాదములోగల ఆరు ఇంద్రగణముల మధ్యనొక సూర్యగణమును, చివర మరొక సూర్యగణమును కలదు. తరువోజ పాద మధ్యమందుండు సూర్యగణమును పాదాంతమునకు తోసినచో నేర్పడురూపము సీసపద్య పాద లక్షణము. సీసపద్యపాదమునకు వరుసగా 6 ఇంద్రగణములు, 2 సూర్యగణము లుండును.

ఒక ద్విపద పాదమును రెట్టించుటచే తరువోజ పాదలక్షణ మేర్పడినదనియు, తరువోజపాదములోని మధ్య సూర్యగణమును చివరచేర్చుటవలన సీసపద్యపాద మేర్పడుననియు గ్రహించితిమి. ఇట్లు ద్విపద సీసములకు పరోక్షసంబంధమును స్థాపింపవచ్చును.

ద్విపదకు సీసపద్యమునకు ప్రత్యక్షసంబంధముకలదనియు ఈక్రింది విధముగ చెప్పవచ్చును. సీసపద్యపాదములోని మొదటి నాలుగు ఇంద్రగణములను ఒక భాగముగాను, మిగిలిన రెండు ఇంద్రగణములును, రెండు సూర్యగణములను చేర్చి మరొక భాగముగాను విభజింపవచ్చును. ద్విపదయొక్క మొదటిపాదాంతమందలి సూర్యగణమును ఇంద్రగణముగాను, రెండవ ద్విపదపాదము చివరి ఇంద్రగణము సూర్యగణముగాను మార్చి కూర్చుటవలన సీసపద్యపాద మేర్పడుచున్నది. కావున ద్విపదకు, సీసమునకు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని పొత్తుకలదని స్పష్టమగుచున్నది. మరియు స్త్రీల పాటలలోను, పదములలోను, సీసమందలి పాదములలోని మొదటి ఖండముతో ఒక ద్విపదపాదము చేర్చిన కూర్పు తరచుగా కనబడుచుండును.

ఉదా:-"కవితారసపు జల్లు - ఖడ్గాల గలు గల్లు
కరణాలకే జెల్లు ఓ కూనలమ్మ!
కాపువాడే రెడ్డి గరికపోచే గడ్డి
కానపంటే గుడ్డి ఓ కూనలమ్మ!"

ఈ కూనలమ్మ పదములోని మొదటిపాదము సీసపద్యపాదములోని ప్రథమభాగము వలె నాల్గు ఇంద్రగణములు కల్గియున్నది. ద్వితీయపాదము ద్విపద లక్షణముతో నొప్పినది. సీసపద్యపాద ప్రథమ భాగమునందు కంటె ద్విపదపాదములో నొకమాత్ర తక్కువగా నున్నది. ఇదికూడ కడపటి గణమునందుండుటచే సీస, ద్విపద పాదములు రెండును గుర్తింప వీలులేనంతగ ఒకేరీతిగనే కనిపించుచున్నవి.

34. చూ॥ 'తెలుగులోని దేశితనము' - వేటూరి ప్రభాకరశాస్త్రి, సింహావలోకనము.

## మధ్యాక్కర:

మధ్యాక్కర కూడ ద్విపదభేదమే. యుద్ధమల్లుని బెజవాడ శాసనము (9వ శతాబ్ది) నందు మధ్యాక్కర పద్యము కలదు. అక్కరలలో మధ్యాక్కరకు మాత్రమే తెలుగులో విపులప్రచారము కలదు. మధురాక్కరను ఒక్కసారిమాత్రమే నన్నయ తన భారతమునందు ప్రయోగించినాడు. కన్నడమునందు అన్ని విధములైన అక్కరలు ఉపయోగింప బడినవి. అక్కరలలో మధ్యాక్కరకు మాత్రమే ప్రయోగముండుటకు ద్విపదతో దీనికి సంబంధము హెచ్చుగానుండుటయే కారణమని శ్రీ కోవెల సంపత్కుమారాచార్య గారు అభిప్రాయపడిరి.[35] రెండు ద్విపద పాదములలోను ఒక్కొక్క దానిలో నొక్కొక్క ఇంద్రగణమును తగ్గించి రెండు పాదముల నొకపాదముగా నేర్పరచినచో మధ్యాక్కర పద్యపాదమనును. మధ్యాక్కర పాదమందు వరుసగా రెండింద్రగణములు, ఒక సూర్యగణము, మరల రెండింద్రగణములు, ఒక సూర్యగణము మొత్తము ఆరుగణములు.

శాసనమునందలి మధ్యాక్కరలోయతిస్థానము 5వ గణము ప్రథమాక్షరము.

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| స్వస్తిన్ప | పాంపశా | త్యంత | వత్సల | సత్యత్రి | నేత్ర |

ద్విపదయందువలె పైనిపేర్కొనిన మధ్యాక్కర యందు కూడ పాదమందలి చివరిఇంద్రగణముయొక్క ఆద్యక్షరమే యతి స్థానమగుచున్నది. నన్నయ భారతమునందలి మధ్యాక్కరలందు కూడ ఈవిధముగనే యతిస్థానము పాటింపబడినది.

---

35. చూ॥ తెలుగుచ్ఛందోవికాసము - పుట 37.

"భూపాల నీకుని కొక్కమలియందు బుట్టిన సుతుడు." 36

కాని కవిజనాశ్రయకర్త మధ్యాక్కర యొక్క నాల్గవ గణాద్యక్షరమును యతిస్థానముగా చెప్పినాడు.

"సురరాజు సురరాజుఁ గూడి - సూర్యులో నొడఁబడి మరియు
గరమొప్ప నిప్పాట నాలు - గణములు మధ్యాక్కరంబు." 37

కవిజనాశ్రయకారు ననుసరించియే ఎఱ్ఱాప్రగడ తన భారతారణ్య పర్వశేషమునందు నన్నయకు భిన్నముగా మధ్యాక్కరను నడిమికి సరిగా విరిచి రచించినట్లు తోచును.

"అసదృశ తేజుడు బ్రాహ్మ-ణానీక సహితుడైకడగి." 38

తరువాతి తెలుగు లాక్షణికులందరును మధ్యాక్కర యతిస్థాన విషయమున కవిజనాశ్రయకారునే అనుసరించినారు. సీసము, ద్విపద, తరువోజ మొదలగువానియందు పాదమధ్యమున యతిస్థానమున్నది. మధ్యాక్కర లక్షణముగల స్త్రీల పాటలయందును నీవిధముగనే పాదమధ్యమున — అనగా, మూడవగణము తర్వాతనే యతి యున్నది.

"అంతట రాములవారూ - అంగన సీతను గూడీ
సంతసమందుచు వేగా - స్వపురమునకు చనుదెంచీ
తమ్ములతోడను గలసీ - నెమ్మది రాజ్యము లేలే
ధర్మములో ప్రజలెల్లా - తామరతంపరలైరీ." 39

ఇందులోని సూర్యగణమునకు పూర్వోత్తరగణములతో సమాన

36. భారతము - ఆదిపర్వము, 4వ ఆశ్వా. ప. 17 - వావిళ్ళవారిప్రతి
37. కవిజనాశ్రయము - జాత్యధికారము. పుట. 72.
38. అరణ్యపర్వము - 4వ ఆశ్వా. ప. 310.
39. చూ॥ సింహావలోకనము - వేటూరి ప్రభాకర శాస్త్రి.

మగు రీతిగా అధికముగా నొక మాత్ర చేర్చి పాటగా పాడుచుం డుట గమనింపవచ్చును. ద్విపదలోవలె మధ్యాక్కర పాదమం దును సమవిభాజ్యగణము లున్నవి.

ఇట్లు ద్విపద ద్విరదగతిరగడ, తరువోజ, సీస, మధ్యా క్కరాది తెలుగు దేశిచ్ఛందస్సులకు ప్రాతిపదికయనుట స్పష్టము. త్రిపదియు, షట్పదియు కూడ ద్విపదభేదములే. మూడు ద్విపద పాదములు కలిసినచో ఒక త్రిపద ఏర్పడుచున్నది. కాని గణ ముల కూర్పులో కొద్ది మార్పు కన్పట్టును. మూడు ద్విపద పాద ములలోని మొదటి పాదముయొక్క చివరిసూర్యగణమును ఇంద్ర గణముగా మార్చుటయు, తరువాతి రెండు పాదములందును, పాదములో నొక్కొక్క ఇంద్రగణమును తగ్గించుటయు చేసినచో త్రిపదయగును. త్రిపదయందలి గణము లివి:

ఇంద్రగణము + ఇంద్రగణము + ఇంద్రగణము + ఇంద్రగణము

ఇంద్రగణము + ఇంద్రగణము + సూర్యగణము.

ఇంద్రగణము + ఇంద్రగణము + సూర్యగణము.

ద్విపద భేదమైన సీసపాదముయొక్క చివరి రెండు సూర్య గణములు ఒక చంద్ర గణమగునట్లుగా నుపయోగించినచో 'షట్పది' యొక్క సగమగు చున్నది. ఈవిధముగ రెండు సీస పాదములు కలిసినచో 'షట్పది' యగుచున్నది.

ఇట్లు అనేక తెలుగు దేశిచ్ఛందోలక్షణములకు ద్విపద చాలవరకు మూలమగుచున్నది. రగడలు తప్ప ఇంతటి బహు ఛందస్సులకు మూలమయిన పద్యము తెలుగున మరొకటి లేదు.

## ప్రాచీన లక్షణగ్రంథములలో ద్విపద :

తెలుగులో ప్రాచీనమును, బహుదేశీయచ్ఛందస్సులకు మూలము నయిన ద్విపదను లభ్యమగు లక్షణగ్రంథములలో మొట్టమొదటిదగు కవిజనాశ్రయము యొక్క కర్త గుర్తించి లక్షణము చెప్పియున్నాడు. కవిజనాశ్రయ గ్రంథకర్తృత్వము వివాదాస్పదమైనది. కాని గ్రంథములోని పెక్కు ఆధారములను [40] బట్టి కవిజనాశ్రయకర్త మల్లియ రేచనయే యని నిశ్చయింపవచ్చును. కవిజనాశ్రయ మెప్పుడు రచింపబడినదను విషయము కూడ వివాదాస్పదముగనే యున్నది. రేచన కాలమును గూర్చి చర్చించుచు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు "నన్నయకు పూర్వపుఛందస్సు" [41] అను వ్యాసము నందిట్లువ్రాసిరి.

---

40. కృత్యాదిలో :-

"అనవద్య కావ్యలక్షణ - మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు
మల్లియరేచన సుకవి కవిజనాశ్రయమను ఛందముఁ దెనుఁగు
బాస నరుదుగఁ జేసెన్."

గ్రంథాంత పద్యములో :-

"జయదేవాదిచ్ఛందో నయమున సంక్షేపరూపునం జెలువుగ
మల్లియరేచన సుకవిజనాశ్రయుఁడీ ఛందంబుఁ జెప్పె జనులకుఁ
దెలియన్."

గ్రంథాంత గద్యము :-

"ఇది వాగీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన 'కవిజనాశ్రయ' శ్రావకాభరణాంక విరచితంబైన 'కవిజనాశ్రయచ్ఛందం' బునందు దోషాధికారము."

41. చూ॥ సింహావలోకనము.

"ద్రావిడభాషలో 'యాప్పిరంగలమ్' అను ఛందో గ్రంథము పదునొకొండవ శతాబ్దిని కలదు. అందు సంస్కృత కర్ణాటాంధ్రచ్ఛందస్సుల ప్రస్తావనమున్నది. 'వాంచియార్ శెయిదవడఘుఛందవుం' అని యున్నది. అనగా 'వాంచియ' రచించిన తెలుగుఛందమును చూచి తానాగ్రంథమును రచించి నట్లు గ్రంథకర్త చెప్పుకొనుటలో కలదు. ప్రాచీన ప్రతుల లిపి రీతిని పరిశీలించువారు 'వాంచియార్' అనుపదము 'రేచియార్' గానుండ దగుననిరి. 'రేచియార్' అని యగునేని యాగ్రంథము రేచియ (రేచన) రచించిన కవిజనాశ్రయమగును..........."

దీనినిబట్టి కవిజనాశ్రయము పదునొకొండవ శతాబ్దికి పూర్వపుదగుచున్నది. కాని 'వాంచియార్' ను రేచనయని చెప్పుటకు తగిన ఆధారములు లేవు. కవిజనాశ్రయకర్తయగు రేచన క్రీ. శ. 12 వ శతాబ్దమువాడు. అనగా పాల్కురికి సోమనాథునికి రేచన దాదాపు సమకాలికుడో, యించుక పూర్వుడోయై యుండునని చెప్పవచ్చును. సోమనాథునికి చాల పూర్వమే కవిజనాశ్రయము ప్రాచుర్యమును ప్రామాణ్యాపత్తిని కల్గియుండినచో అతడు తన ద్విపదకావ్యములందు ద్విపదలక్షణ మును గూర్చి విపులముగా పేర్కొని యుండడు. కనుకనే అతడు "అనియత గణైః", "ప్రాసోవా", "యతిర్వా"–ఇత్యాదిగ వ్రాసినాడు. కాని అవి యేలక్షణగ్రంథములోనివో అతడు చెప్పలేదు. దీనిని బట్టి సోమనాథునికి పూర్వమే ద్విపదకు లక్షణ మున్నట్లును రూఢిగా తెలియుచున్నది. లక్ష్య లక్షణములలో లక్ష్యములే ప్రథమములనియు, పిమ్మటివి లక్షణములనియు, లక్షణములందు కంటె లక్ష్యములపైనే ప్రామాణ్య మెక్కువనియు పలువురంగీకరింతురు.

ఇట్లు ద్విపద సోమనాథునికి పూర్వమే లక్షణవంతమైనది. కవిజనాశ్రయము (1100 A.D.) లోని ద్విపదలక్షణమును బట్టి ద్విపద ఆకాలమునాటికే కావ్యములలోనికెక్కినదనియు గ్రహింపవచ్చును. కాని తెలుగులోని తక్కిన లక్షణకర్తలకు పాల్కురికి సోమనాథుని ద్విపదయే ముఖ్యముగా నాధారము.

మంజరీద్విపద - గేయలక్షణము :

ద్విపదకు లక్షణమును చెప్పిన రేచన మంజరీద్విపదను పేర్కొనలేదు. కావ్యాలంకారచూడామణి యందు విన్నకోట పెద్దన "వలదు ప్రాసంబంద్రు వరుస మంజరికి" అని మంజరిని ద్విపద భేదముగా సూచించినాడు. అనంతుడు మంజరి లక్షణము నిట్లు పేర్కొనెను-

"శ్రీమందిరాకార జితదైత్యధీరుఁ
గీర్తించుచోఁ బుణ్య వర్తనుండనుచు
యతిమాఱు ప్రాసమిట్లచ్చోట నిడక
సరసిజనాభాయ సముదగ్రసాహ
సాయనమోయంచు శబ్దమొక్కటియు
రెండుపాదముల నీక్రియఁ బంచియిడక
వెలయుప్రాసము లేని ద్విపదయై బరఁగ."

—ఛందోదర్పణము - 3 వ ఆశ్వా. ప. 49.

మంజరీద్విపదకు ప్రాసనియతి యుండదనియు, ఏ పాదమునకా పాదము తెగినట్లుండవలెననియు, ఇది ద్విపదభేదమనియు అనంతుని అభిప్రాయము. గేయములందు లయానుసారియైన మాత్రా సంఖ్యామాత్రమే నియతముకాని ప్రాసాదులన్నియు ఐచ్ఛికములే.

ప్రాసనియతి లేకుండుటవలన మంజరీద్విపద పద్యలక్షణముకంటె గేయలక్షణమునకు సన్నిహితమగు చున్నది. ప్రాసనియతి లేని ద్విపదయే మంజరి కదా! రెండు పాదములుగల పద్యమునకే ద్విపదయను పేరు సార్థకమగును. కాని, ఏకపాదముగల పంక్తికి 'ద్విపద' అనుపదము చెల్లదు. అయినను ఆఒక్క-పాదలక్షణమును, ద్విపదలక్షణమే కనుక, ఈ మంజరినికూడ మంజరీద్విపద అని, ద్విపదమంజరి అని లాక్షణికులు పేర్కొనిరి.

గేయ వాఙ్మయమున బహుళప్రచారము నొందియుండిన ద్విపదకు పాల్కురికి సోమనాథుడు కొంత పద్యత్వమునుకల్పించి, దానిని కావ్యరచనకు ప్రథమముగా నుపయోగించినాడు.

ద్విపదకు ప్రాసను నియతముగా చేసినవాడు పాల్కురికి సోమనాథుడు. ఈ ప్రాసనియతివలన ద్విపదకుకొంత పద్యత్వము చేకూరినది.

ప్రాసయతి:

ప్రాసనియతియుండు జాతులకు ప్రాసయతి నిషేధమైనను, సోమనాథుడు—

"ప్రాసమైనను యతిపై వడియైన
దేసిగా నిలిపి యాది ప్రాసనియతిఁ
దప్పకుండఁగ ద్విపదలు రచియింతు." [42]

—అని ద్విపదలందు 'ప్రాసయతి' ని అంగీకరించినాడు. నిజమునకు ప్రాసనియతి సోమనాథుని తర్వాత కొన్ని ద్విపదకావ్యములందు వ్యవహృతమైనను లాక్షణికము మాత్రము కాదు.

42. పండితారాధ్య చరిత్ర - అవతారిక, పుట, 18.

"యతులలోపలఁ బ్రాస యతిదక్క సకల
యతులు చెల్లును ప్రయోగాను సారమున."[43]

—అని తాళ్ళపాక చిన్నన్న ద్విపదలో ప్రాసయతికూడదని చెప్పి నాడు. కాని, ప్రాసనియతి గల 'లయహారి', 'లయవిభాతి', 'లయగ్రాహి', 'త్రిభంగి'-మున్నగు వృత్తములందు లయ ప్రాధాన్యముకొరకు కాబోలు 'ప్రాసయతి' ఉపయోగింపబడినది. జనవ్యవహారమందున్న ద్విపదస్వరూపములోని గేయములందును 'ప్రాసయతి' ఉపయోగమును మనము గమనింపవచ్చును.

"అమ్మణి కన్నుల్లు-తమ్మిపువ్వుల్లు
తమ్మిపూవులలోని-కమ్మదేసెల్లు."

—సెలయేరు నుండి.

ఇట్లే,

"అత్తలేనికోడ-లుత్తమురాలు"
"ఇల్లు కట్టిచూడు పెళ్లి చేసిచూడు"
"ఇదుగో పులి అంటే అదుగో తోక"

—మున్నగు సామెతలందును 'ప్రాసయతి' ఉపయోగము గోచ రించు చున్నది. కాని ఈ గేయములందు 'ప్రాసయతి' నియతము కాదు; ఐచ్ఛికము మాత్రమే.

గేయరూపముననున్న ద్విపదలో గోచరించు 'ప్రాసయతి' ని సోమనాథుడు యథాతథముగ స్వీకరించినాడు. ద్విపదయొక్క ప్రథమ స్వరూపమును గుర్తించకనో, గుర్తించినను ఉపేక్షిం చియో లాక్షణికులు ద్విపద, మంజరీద్విపదలందును ప్రాసయతిని నిషేధించినారు.

---

43. అష్టమహిషీ కల్యాణము-అవతారిక, పుట. 6.

యతి, మరియు ప్రాసయతియొక్క ఉపయోగము 'ఉప జాతు' లందు మాత్రమే యుండును. జాతులలో కేవలము యతిమాత్రమే కలదు. సోమనాథుడు ద్విపదలో జాత్యుపజాతుల రెండింటి లక్షణములను కూర్చినట్లు వ్యక్తమగును.

ద్విపదలో ప్రాసయతిని సోమనాథుడు కొంత ప్రత్యేకత పాటించుటకే యుపయోగించినాడని చెప్పు సందర్భమున శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు "సోమనసృష్టించిన ఛందస్సు" అను వ్యాసమందు వ్రాసిన ఈక్రింది వాక్యములు గుర్తింపదగినవి.

"ద్విపద కవితకుసంబంధించిన గేయరచనయే కావున, ప్రాసయతి పాటించిన తాళలయానుగుణ్యముగనుండి శ్రవణపేయముగ నుండును.

"నిక్కమెట్లన విను మొక్కవిన్నపము
ముక్కంటి నీకునే దక్కిన బంట."

పుట. 138.

పై ద్విపదలో ప్రాసయతి యుండగానే తాళముపడుటకు వీలుగ నుండును. "నిక్కమెట్లన విను – నే విన్నవింతు" అని యతియుండిన తాళగతికనుకూలముగానుండదు. ప్రాసయతియెట్లు తాళగతి కనుకూలముగనుండునో సంగీత సాహిత్య కళా సార్వభౌముడగు భట్టుమూర్తి వసుచరిత్రమున సీసపద్యములలో చూపియే యున్నాడు.

1. ఒక చాయ ననపాయ పిక గేయ
2. లలనా జనాపాంగ వలనా వసదనంగ.

పైవాని యందలి ప్రాసయతులు తాళానుగతి కొరకే ప్రయుక్తములైనవి."

ద్విపదలలో నేతాళమునకు నెక్కువ ప్రాధాన్యము అని చెప్పుట కష్టము. ద్విపద నడకను, తీరును బట్టి అందలి అక్షర ప్రమాణములను, యతిప్రాసలను పరిశీలించి, ముఖ్యములగు తాళములలో నే దానియందు ప్రయుక్తమగునో తెలిసికొనవలెను. ఖండజాతి ఏకతాళమును, జంపెతాళమును (2 దెబ్బలు), చతురస్రజాతి ఏకతాళమును — ద్విపదలలో గుర్తింపవచ్చును.

పాల్కురికి సోమనాథుడు ద్విపదలలో ప్రాసయతిని చాల తక్కువగనే వాడినాడు. అతడు ప్రాసయతినివాడిన సందర్భములివి:

(1) అనుప్రాసావేశము వచ్చినపుడు :

ఉదా:- (వృత్త్యనుప్రాస)

వర భుక్తి చిరముక్తి - కరభక్తి రతులు
నరచర్మ ధరకర్మ - హర ధర్మవరులు
గృతకృత్య హితభృత్య - భృతసత్యరతులు
వ్రతధామ భృతసీమ - జితకామ ముఖులు
హరతంత్ర గురుమంత్ర పరతంత్ర చరులు.”

—పండితారాధ్య చరిత్ర - పుట. 9.

‘ప్రాసయతి’ ని శబ్దాలంకారభాగముగనే సోమనాథుడు ప్రయోగించినాడు.

(2) సంస్కృత వాక్యముల కనుకరణము చేయునపుడు:

ఉదా:- “వాయంగఁ ‘బ్రమథేశ్వరాయ నమో న
మో’ యని, ‘భృంగీశ్వరాయ నమో న
మో’ యని, ‘నందినాథాయ నమో న
మో’ యని, ‘బసవేశ్వరాయ నమో న
మో’ యని వెండి ‘శివాయ నమో న
మో’ యని”

—వాదప్రకరణము - పుట. 676.

"'ఇంద్రాయ' యనియు 'నుపేంద్రాయ' యనియు,"

—వాదప్రకరణము - పుట. 541.

ద్విపదలో ప్రాసయతిని వాడినందులకు పాల్కురికి సోమనాథుని సమర్థించుచు మఱి బసవపురాణ కర్తయగు బచ్చు సిద్ధకవి తానుగూడ ద్విపదలో ప్రాసయతిని ప్రయోగింతునని నిట్లు చెప్పినాడు.

"ఇలఁ బాలకురికి సోమేశుండు మున్న
తొలఁగక ప్రాసయతుల్ ద్విపదలను
లలి రచించుట యది లక్ష్యంబుగాను
నెలమి రేఫఱకారములు శివకావ్య
ములయందుఁ జెల్లుఁ దప్పులుగావు గాన
ఆ పాల్కురికి సోము ననుమతి నేను
దీపిత ప్రాసయతిచ్ఛంద సరణి
నా మహాగురుదేవు ననుమతి యట్ల
శ్రీమెఱయంగ రచించితి నిట్లు" 44

—దీనిని బట్టి శివకవుల మతమున ప్రాసయతిని ద్విపదలో ప్రయోగించుట సమర్థనీయమనుట తెలియును.

## ద్విపదపాద సంక్రమణము:

ద్విపద పాదములు దేని కవి ప్రత్యేకముగా నుండవలెననియు, ఒక పాదములోని తుది పదము రెండవ పాదములోనికి చొచ్చుకొని పోరాదనియు తాళ్ళపాక చిన్నన్న ఈ క్రింది విధముగ తెల్పినాడు.

44. మఱిబసవపురాణము - అవతారిక, డి. నెం 978. ప్రా.భా., మద్రాసు.

"ద్విపదకు ద్విపదకుఁ దెగఁ జెప్పవలయు" 45
"ద్విపదతో ద్విపద సంధిల నేకళబ్ద
మపుడు రెంటను గూర్ప నది యయుక్తంబు" 46

ఈ లక్షణము చిన్నన్నకుపూర్వము లాక్షణికు లెవ్వరును సూచింప లేదు. పాల్కురికి సోమనాథుని వదలినచో దాదాపన్ని లక్ష్య గ్రంథములలోను ఈ పద్ధతి పాటింపబడినది.

కాని ద్విపదకు పద్యత్వమును కల్పింపదలచిన సోమ నాథుడుఒక్క ద్విపదలో రెండుపాదముల సంయోగము, భిన్న ద్విపద సంయోగము — ఈ రెండింటిని కూడ పాటించి ద్విపద లను రచించినాడు.

ఉదా:– "దాన 'ప్సాతంభక్షిత' మనం 'బ్రియంబ
కేన భక్షిత' మనంగ్రియఁ బ్రసాదంబ
నంగ 'నక్నీయా' త్త్వనఁగఁ దత్ప్రసాద
మంగీకరింపంగ నర్హమైయుండు"

—దీక్షాప్రకరణము – పుట. 95.

పండితారాధ్య చరిత్రమున ఇట్టివి కోకొల్లలు.

సంస్కృత వాక్యానుకరణ నిర్బంధము, వేదవేదాంతిహాస వివిధాగమ పురాణవిహిత సూక్తములను ప్రమాణ వాక్యము లుగా ద్విపదలలో చేర్చుట – అను విషయములే సోమనాథుని యిట్టి ద్విపదపాద సంక్రమణమునకు ముఖ్యకారణమని తోచును. ఈ సందర్భమున సోమనాథుని ఈ క్రింది వాక్యములు గమనింప దగినవిగా యున్నవి.

---

45. అష్టమహిషీ కల్యాణము – అవతారిక, పుట 6.
46. అష్టమహిషీ కల్యాణము – అవతారిక, పుట 7.

"సంధిపూర్వాపర సంఘటనముల
బంధుర ఛందో నిబద్ధముల్గాఁగ
వేదసూత్రములకు వెరవైన మాట
లాదటఁ గల్పింతు నవి జల్లియనక
వలనెఱింగియు వేదవాక్యంబు ద్విపద
కొలఁదిన పలుకుటకును మదిమెచ్చి" 47

"అవికల వేద వేదాంతేతిహాస
వివిధాగమ పురాణ విహిత సూక్తముల
నిదమిత్థమనుచోట నివియ ప్రామాణ్య
పదములుగాఁగ ద్విపదలు సంధింతు" 48

బసవ పురాణములోని ద్విపదలలో మొదటి పాదములోని తుదిపదము రెండవ పాదములోనికి సంక్రమించుటనునది చాల కొద్దిచోట్లమాత్రమే జరిగినది. కాని పండితారాధ్య చరిత్రలో సోమనాథుడు ద్విపద ననేక విధముల నడిపించినాడు.

గణవిభజన చేసికొనినచో నది ద్విపదయనితోచును కాని సర్వసాధారణముగా పండితారాధ్యచరిత్రను చదువునపుడు మనకు ఛందస్సుపై గురుతుండదు.

ఏక ద్విపదలో నిట్టి సంక్రమణము కొంతవరకు నంగీకరింపవచ్చును. కాని భిన్న ద్విపదాసమ్మేళ రచన సాధువుకాదు. కాని మహాపండిత కవియగు పాల్కురికి సోమనాథుని కవితా ప్రవాహమున నిట్టి రచనయు ఆనందమును చేకూర్చుచునే యున్నది. విషయము వివరించునపుడును, భావమునుద్బోధింపజేయుటకును, సోమనాథుడు ద్విపదతో ద్విపద సంధింపజేసి దానికి వృత్తరచనతో సమాన ప్రతిపత్తిని చేకూర్చినాడు.

47. పండితారాధ్య చరిత్ర - అవతారిక, పుట 20.
48. పండితారాధ్య చరిత్ర - అవతారిక, పుట 21.

ఈ ప్రకరణమున తెలిసికొనిన ప్రధానాంశములివి :

తెలుగుద్విపదకు సంస్కృత, ప్రాకృత, కన్నడ, తమిళ చ్ఛందస్సులందు ద్విపదగా ననుమానింపదగిన వానితో జన్యజనక సంబంధము లేదని గ్రహించితిమి. అది తెలుగుదేశిచ్ఛందస్సని, 'తెలుగువారి సొంత యాస్తి' అని నిరూపించితిమి. ద్విపద ప్రాచీనమైన ఛందస్సనియు, దేశీయచ్ఛందస్సులగు ద్విరదగతి రగడ, తరువోజ, సీస, మధ్యాక్కర, త్రిపద, షట్పది- ఇత్యాదులకు మూలభూతమైనదనియు తెలిసికొంటిమి. సంస్కారశూన్యమై పండితామోదమును బడయక, ప్రాచీనకాలమునుండి గేయ వాఙ్మయమున బహుళ ప్రచారము నొందియుండు ద్విపదను పాల్కురికి సోమనాథుడు చేపట్టి కొంత పద్యత్వమును కల్పించి దానిని కావ్యరచనకు ప్రథమముగా నుపయోగించినవిధానమును చర్చించితిమి. మూడవ ప్రకరణమున ద్విపద వాఙ్మయ పరిణామమును పరిశీలింతము.



# మూడవ ప్రకరణము

## ద్విపద వాఙ్మయ పరిణామము:

భారతీయసారస్వతమున మాత్రమేగాక ప్రపంచమున ఏసారస్వతచరిత్రను పరిశీలించినను ప్రారంభదశయందు మతమే ప్రాముఖ్యమునుబొందియుండునట్లు తెలియుచున్నది. తెలుగులో కూడ ప్రారంభదశయందు సారస్వతముమీద మతప్రభావము లేకపోలేదు. తెలుగులో 'మార్గ', 'దేశి' – సారస్వతముల వికాసములకు తోడ్పడినవానిలో మతమే ప్రధానమైనదని చెప్ప వచ్చును.

జైనబౌద్ధమతములు తెలుగుదేశమున ముమ్మరముగా వ్యాపించియుండినకాలమున తెలుగున గ్రంథ రచన జరిగినదని నిర్ణయించుటకు ప్రత్యక్షప్రమాణములేమియు లేవు. క్రీ. శ. 7 వ శతాబ్దిలో కుమారిలభట్టు కర్మమార్గప్రధానముగను, 9 వ శతాబ్దిలో శంకరాచార్యులు జగన్మిథ్యావాదముతో కూడుకొనిన అద్వైతముతోడి జ్ఞానమార్గముగను కావించిన ప్రచారమువలన జైనబౌద్ధమతములు తెలుగుదేశమున క్షీణించుటయు, వైదిక మతమునకనువగు వాతావరణమేర్పడుటయు జరిగినది. పూర్వ చాళుక్యరాజగు రాజరాజనరేంద్రుడు (1019–1061 A. D.) వైదికధర్మనిష్ఠానిరతుడై, వర్ణాశ్రమధర్మ పునఃప్రతిష్ఠాపనకు

పూనుకొనెను. అతడు అభిమానించిన విషయములలో ముఖ్య మైనవి రెండు. (1) వైదికమతోద్ధరణము, (2) ఆంధ్రభాషా సాహిత్యపోషణ. తన ఆస్థానములోని కవిపండితులసహాయమున వైదిక మతౌత్కృష్ట్యమును, ఆర్షవిజ్ఞానమును సామాన్య తెలుగు ప్రజానీకమునకు సన్నిహితముచేయ సంకల్పించినవాడు రాజరాజ నరేంద్రుడు. అతని ఆదేశమున నన్నయ పంచమవేదమగు భారతమును ఆంధ్రీకరింప నారంభించెను. నన్నయభారతము గద్య పద్య సమ్మిశ్రితమగు చంపూకావ్యపద్ధతిలో రచితమైనది. భారతాంధ్రీకరణముతో 'మార్గ' పద్ధతికి చెందినదనబడు అపూర్వమైన సాహిత్యసృష్టి తెలుగులో జరిగినది.

"The translation (of Mahabharata) was undoubtedly the outcome or the Brahmanical reaction that set in the wake of the extermination and extinction of Buddhism and Jainism in the Telugu Country." [1]

భారతానువాదకారణముగ తెలుగుసాహిత్యమున నన్నయ 'మార్గ' కవితాసంప్రదాయమునకు ప్రథమాచార్యు డగుచున్నాడు. నన్నయ రాజరాజనరేంద్రుల వైదికమతాభి మానమే తెలుగున 'మార్గ' సంప్రదాయసంబంధియగు సాహిత్య సృష్టికి హేతువైనదనుటలో విప్రతిపత్తి లేదు.

నన్నయభారతరచన ఏకారణముచేతనో అరణ్యపర్వ మధ్యమునందే ఆగిపోయినది. ఆ తర్వాత అనగా క్రీ. శ. 11వ శతాబ్దపు కడపటిభాగమునుండి 12 వ శతాబ్దాంత్యమువరకు ఆంధ్రదేశము రాజకీయకల్లోలములకును, మతవిషయిక సంక్షో భమునకు నిలయమైనది. రాజరాజనరేంద్రుని అనంతరము

1. "Mahabharata" - Annals of the B. O. R. I., Vol. XXII, 1941.

తెలుగుకవిత నిరాలంబయు, నిరాశ్రయు నయినది. రాజరాజ కుమారుడగు కులోత్తుంగచోళుని కాలమున ఆంధ్రదేశమునకు సామంతస్థితి యేర్పడుటయు తెలుగుదేశము వెలనాడు, పల్నాడు, పాకనాడు, కమ్మనాడు- మొదలగు మండలములుగ బహుధా విభక్తమగుటయు జరిగినది. అప్పటికి బ్రాహ్మణ మతములో శైవ వైష్ణవమత శాఖలు వెలువడి పరస్పర వైషమ్యమునకు పాల్పడినవి. ఆంధ్రదేశచరిత్రలో రాజరాజనరేంద్రుని మరణమునకు కాకతీయ సామ్రాజ్యస్థాపనకు గల నడిమికాలమును మాండలికయుగమందురు. ఈ కాలమున మండలాధిపతులలో శైవ వైష్ణవమత వైషమ్యములు పెరిగి మతరాజకీయ సంక్షుభితవాతావరణమునకు దారితీసినది. దాని రూపమే క్రీ. శ. 1181-82 మధ్యకాలమునజరిగిన పల్నాటియుద్ధము. రాజాదరణతో సృష్టికి వచ్చిన తెలుగుసాహిత్యమునకు ఈ మాండలికయుగమున రాజాదరణలేకపోవుటచే భారతానువాద సంపూర్ణ ప్రయత్నముగాని, వైదికమత సంబంధియగు కావ్యసృష్టిగాని జరుగలేదు. ఈ కాలమునకు చెందినవి శైవమతప్రధానములగు నన్నెచోడుని కుమారసంభవమును, పండితారాధ్యుని శివతత్త్వసారమును. నన్నెచోడుని కుమారసంభవములో మొట్టమొదటిసారిగా 'దేశి', 'మార్గ' 'జానుతెనుగు', 'వస్తుకవిత'_ అను కవితాసంప్రదాయములు ప్రస్తావింప బడియున్నవి. వీని స్వరూపలక్షణములెట్టివో కుమారసంభవమును బట్టి నిర్దుష్టముగా నిర్ణయింప సాధ్యము కాదు. కాని కుమారసంభవరచనతో తెలుగుసాహిత్యచరిత్రమున శైవ మతప్రధానమును, శైవమత ప్రచారకమును అగు రచనలు వెలువడినవి, ఈ శైవవాఙ్మయమున నన్నయ 'మార్గ' కవితకు భిన్నముగ 'దేశి' సంప్రదాయమునకు ప్రాధాన్యము సిద్ధించినది.

నన్నయ రాజరాజనరేంద్రుల వైదిక మతాభిమానము తెలుగున మార్గకవితావిర్భావమునకు కారణమైనట్లే దేశికవితాసంప్రదాయ సృష్టికి పాల్కురికి సోమనాథాది శివకవుల శైవమతాభిమానమే హేతువయినది.

శైవమతానుయాయులలో పాశుపతులు, కాపాలికులు, కాలాముఖులు, గోరక్షనాథులు, రాసేశ్వరులు—మున్నగు తెగలు తర్వాత ఏర్పడినవి. తెలుగు దేశమున కాలముఖ, పాశుపతశైవ సంప్రదాయములు వ్యాపించిన కాలముననే ద్రవిడ దేశమున శివభక్తులనేకు లుదయించి, భక్తిప్రధానమైన శైవ మతమును వ్యాపింపజేసిరి. వీరికి తమిళభాషలో నయనారు లనిపేరు. క్రీ. శ. 11, 12 శతాబ్దముల నాటికి అరువత్తుమూవుర శివభక్తుల కథలు తమిళదేశమున ప్రచారములోనికి వచ్చినవి. "ఈ శైవభక్తుల గాథలు దేశములో వ్యాపించి ప్రజాహృదయమున అపూర్వోత్సాహమును రేకెత్తించి భక్తిప్రధానమైన శైవముమీద జన సామాన్యమునకు గాఢవిశ్వాసమును, అభిమానమును కలిగించి భక్తి ఉద్యమమునకు గట్టి పునాదులు వేసినవి."[2]

భక్తిమార్గముగైకొన్న శైవము ఆవేశపూరితమై వీరశైవ మయినది. ఈవీరశైవమును కర్ణాటదేశమున పునరుద్ధరణ చేసిన వాడు బసవేశ్వరుడు. బసవేశ్వరుడు క్రీ. శ. 1162 ప్రాంతమున చాళుక్య సామ్రాజ్యమునేలిన బిజ్జలుని మంత్రి; దండనాయకుడు. నందీశ్వరుని అవతారమని వీరశైవులచేవిశ్వసింపబడినవాడు. బస వేశ్వరుని ప్రాపున వృద్ధిచెందిన వీరశైవమతము దేశమునుఱ్ఱూత

2. చూ॥ 'మతసంప్రదాయములు' - విజ్ఞాన సర్వస్వము. తెలుగు సంస్కృతి, 3 వ సంపుటము, పుట 557.

లూగించినది. వీరశైవమతోద్ధతికి నితరమతములు తలయెత్తలేక పోయినవి. బసవన జంగమసంప్రదాయము జనసామాన్యమును బాగుగానాకర్షించినది. అనేకములగు శైవశాఖలలో వీరశైవ సంప్రదాయమే కన్నడాంధ్ర సారస్వతక్షేత్రములలో నూతనములును, అపూర్వములును అగు దేశివాఙ్మయశాఖల సృష్టికి కారణభూతమైనది.

వర్ణాశ్రమభేదరహితము, భక్తిప్రధానము, ఆవేశపూరితము—మున్నగునవి వీరశైవమతములోని లక్షణములు. వీరశైవము రేవణారాధ్యుడు. మరుళారాధ్యుడు, పండితారాధ్యుడు, ఏకోరామారాధ్యుడు, విశ్వారాధ్యుడు—అను అయిదుగురు మహాప్రవక్తల ద్వారమున ప్రచారముసాగినదని చెప్పుదురు. వీరిలో పండితారాధ్యుడు వీరశైవములోని నొక అవాంతరశాఖయైన ఆరాధ్య సంప్రదాయమును స్థాపించినవాడు.

ఒకవైపు కర్ణాటకదేశమున బసవనమతము విజృంభించుచుండ మరొకవైపు తమిళదేశమున రామానుజ (1017-1137 A. D.) మతము ప్రజలలో వ్యాపించుచుండెను. రామానుజాచార్యు డవతరించువరకును వైష్ణవమతము కర్మప్రధానమగు వైదిక మతమునుగాని, వైరాగ్యప్రధానమగు శైవమతమునుగాని మించి విశేషవ్యాప్తి చెందియుండలేదు. రామానుజుడు భక్తిమార్గమును విష్ణుపరముగ ప్రతిపాదించి విశిష్టాద్వైతమతమును ప్రచారము చేసెను. బసవేశ్వరుడు భక్తిమార్గమును శివపరముగా ప్రతిపాదించి వీరశైవ మతోద్ధరణము గావించినాడు. బసవేశ్వరుని వీరశైవ భక్తిమార్గమునకు పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు మున్నగువారు వేదప్రామాణ్యాపత్తిని చేకూర్చినారు.

తెలుగుదేశము ద్రవిడ కర్ణాట దేశములకు నడిమిదగుటచే ద్రవిడకర్ణాటములందు ప్రచారమందుండిన వైష్ణవ శైవమతముల ప్రభావమచ్చుట తప్పనిసరియైనది.

వైష్ణవముకన్న బసవనమతమే తెలుగుదేశమున మొట్ట మొదట ఎక్కువగా వ్యాప్తిచెందినది. దానికికారణము తెలుగు దేశమున నంతకు పూర్వమే ప్రముఖులైన శైవమతానుయా యులు వెలసియుండుటయే. తెలుగుదేశమున (1) శ్రీపతి పండి తుడు (క్రీ. శ. 11–12 శతాబ్దులు) (2) శివలెంకమంచన పండి తుడు (1025 A. D.)- (3) మల్లికార్జున పండితారాధ్యుడు (1100-1180 A. D.)- అను శైవాచార్యులచే సవైదికమగు పండితసంప్రదాయము లేక ఆరాధ్యసంప్రదాయము ప్రవర్తితమై యుండెను. ఈ శైవాచార్యులనే 'పండితత్రయము' అని వ్యవ హరింతురు. పండితత్రయము "బ్రాహ్మణేతరోపజ్ఞమైన ద్రావి డాగమ శైవభక్తిసంప్రదాయమును వేదవిహితమైన ఆగమ సంప్రదాయముగ మార్చి శివుడే పరమదైవమని, శైవులు కాని వారు భవులని వాదించి శివపారమ్యమును బోధించి శివధర్మ మును ప్రచారము కావించిరి."[3] శ్రీపతిపండితుడు బ్రహ్మసూత్ర ములకు శివపరముగ 'శ్రీకరభాష్యము'ను వ్యాఖ్యానమునురచిం చెను. మల్లికార్జునపండితుడు సంస్కృతమున రుద్రమహిమ, పంచ గద్యలు, అష్టకములు అను గ్రంథములను, తెలుగున శివతత్త్వ సారము, పర్వతవర్ణన, శ్రీగిరి మల్లికార్జునశతకము — అను గ్రంథ ములను, కన్నడమున బసవగీతలు, ప్రభులింగస్తోత్రము అను గ్రంథములను రచించెను. "శ్రీపతిపండితుడు బ్రహ్మవాదులను,

3. చూ॥ 'మతసంప్రదాయములు' - తెలుగు సంస్కృతి, 3వ సంపుటము, పుట 558.

శివలెంక మంచన పండితుడు విష్ణువాదులను, మల్లికార్జున పండితుడు శివుడు కేవలము సంహారకర్తయను పాశుపత శైవవాదులను ఖండించి శివభక్తిని, శివుని సర్వోత్కృష్టతను ప్రదర్శించిరి.[4]

శైవమతము తెలుగుదేశమున వ్యాప్తిచెందుచుండు ఈ సమయముననే పాల్కురికి సోమనాథుడుద్భవించి వీరశైవమతమును బహుముఖముల తన కవిత మూలమున ప్రచారము చేసి దాని వ్యాప్తికి దోహదము చేసెను. పాల్కురికి సోమనాథుడు బసవన, పండిత సంప్రదాయముల రెండింటిని ఆంధ్రదేశమున ప్రజాసామాన్యమున వ్యాప్తిగావించుటకు పూనుకొనెను. మత ప్రచారము సామాన్య ప్రజానీకములో విరివిగా సాగవలెనన్న వారికర్థమగు భాషలో బోధింపవలెను. కనుకనే సోమనాథుడు నన్నయ అవలంభించిన 'సంస్కృత సమాస భూయిష్ఠరచన' 'సర్వసామాన్యము' కాదని భావించి శైవమతప్రచారముకొరకు దేశీయమైన భాషాచ్ఛందోరీతులను చేపట్టెను.

బహుభాషా కోవిదుడగు సోమనాథుడు సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో వీరశైవమతబోధక గ్రంథములను రచించి యున్నాడు. బసవరగళె, సద్గురురగళె, చెన్నబసవస్తోత్రదరగళె-అను వానిని కన్నడభాషలోనే రచించినాడు. కన్నడ వచనములను బోలిన అక్షరాంక గద్య, నమస్కార గద్య, పంచప్రకార గద్య – మున్నగు గద్యలను తెలుగున రచించెను. ఇవియే గాక కన్నడదేశమున ప్రచారములోలేని తెలుగుదేశమున మాత్రమే నిలిచియున్నట్టి దేశీయ రచనారీతులగు ద్విపద, ఉదాహరణ, సీసములను సోమనాథుడు రచించినాడు. బసవోదాహరణమును

4. చూ॥ 'పండిత త్రయము' – తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ సంపుటము, పుట 912, ని॥ వేంకటరావు.

తెలుగులోనే గాక సంస్కృతమందును రచించినాడు. సోమనాథుడు కన్నడాంధ్రరచనలందే గాక తన సంస్కృతరచనలందును దేశిలక్షణములకే ప్రాధాన్యమిచ్చి రచించినాడు. దేశిచ్ఛందస్సులలో ద్విపదయొక్క ప్రత్యేకతను, జాతీయతను, నైసర్గికమును గుర్తించి సోమనాథుడు తన ప్రధాన గ్రంథములగు బసవపురాణ, పండితారాధ్యచరిత్రలను ద్విపదలోనే రచించినాడు. సోమనాథుడు తన రచనలలో జనసామాన్య వ్యవహారములోని దేశీయపదజాలములను, నానుడులను విరివిగా గ్రహించినాడు. "పండిత కవులచే అనాదరింపబడి పామర కవులపాలై, ప్రౌఢ సారస్వతమున స్థానములభింపక భారతాదుల ధాటికి తాళలేక తూలిపోవుచున్న ద్విపద పేరిటి గేయకవిత్వమునకు సారస్వత ప్రతిష్ఠ సంపాదించిపెట్టిన పరమోపకారి సోమనాథుడు. కవిత్వమున ఈయన ఎంత ప్రజ్ఞాశాలియో, పాండిత్యమునను అంత ఉద్దండుడు. వీరశైవ మతమునకు ఈయనయే విజ్ఞాన పీఠము (The brain of the Veerasaiva cult)"[5].

పాల్కురికి సోమనాథునికి ముందు తెలుగులో ద్విపద కావ్యములు లేవు. ద్విపదకావ్య కర్తలలో అతడే ప్రథముడు. "పద్యకావ్యపథము తీర్చుటలో నన్నయమెట్లుప్రథమాచార్యుడో ద్విపదకావ్యపథమునుతీర్చుటలో సోమనాథుడట్టియాచార్యుడు"[6] అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు వ్రాసిరి. మార్గకవితా సంప్రదాయానుసారియై పద్యకావ్య పథమును తీర్చి నన్నయ పండితకవి యైనాడు. దేశికవితా సంప్రదాయాభిమానియై ద్విపద కావ్యపథమును తీర్చి సోమనాథుడు ప్రజాకవి యయ్యెను.

5. చూ॥ గౌతమ వ్యాసములు - పుటలు 11 - 12.
6. చూ॥ గౌతమ వ్యాసములు - పుట 114.

పాల్కురికి సోమనాథుడు తెలుగులో సృష్టించిన దేశీయ రచనావైఖరులు నాడు పండితాదరమునుబడయకున్నను ప్రజాభిరుచిని మాత్రము చూరగొనినవి.

సోమనాథుని ద్విపదకావ్యములు వీరశైవ మతప్రచారమున కేర్పడినను, కావ్యత్వసంశోభితములు కూడ నగుటచే నవి భవికవులనబడు శైవేతరులకు కూడ ప్రశంసాపాత్రములయినవి. సోమనాథుని తర్వాత వీరశైవము దాదాపు అంతరించినది. కాని అతడు స్థాపించిన ద్విపదకవితాశాఖ మాత్రము నశింపలేదు. దాని విచ్ఛిత్తిని ఉద్దేశించిన ఉద్యమమేదియును పుట్టలేదు. పైగా, ద్విపదరచనలోని సార్వజనీనతను, సహజమాధుర్య సంపదను, సౌలభ్యమును గ్రహించి సోమనాథుని వెనుక శివకవులు, భవికవులు అనేకులు ద్విపదకావ్యరచనను చేపట్టినారు. వారిలో రామాయణ, భారత, భాగవతాది గ్రంథకర్తలైన మహాకవులును కలరు. ఆ నాటినుండి నేటివరకు ద్విపద రచన అవిచ్ఛిన్నముగనే కొనసాగుచున్నది.

## ద్విపద అనాదరణీయమైన దనుట:

ద్విపదకవిత పట్ల పాల్కురికి సోమనాథుని కాలమునుండియు కవి పండితులలో నిరసనభావము వెలసియుండినట్లు కొన్ని నిదర్శనములు లేకపోలేదు.

తనతొలి ద్విపదకావ్యమగు బసవపురాణ రచనానంతరము ఓరుగల్లు పండితులు "పాలకురికి సోమపతితుఁడీనడుమను బెనఁచె మధ్యవళ్లుపెట్టి ద్విపద యప్రమాణమిది యనాద్యంబు పద"[7] మని ద్విపదకవితను తూలనాడినట్లును తర్వాత పాల్కురికి సోమ

7. పద్య బసవపురాణము, ప. 28 - పిడుపర్తి సోమనాథుడు, వావిళ్ళ ప్రతి

నాథుడు వారితో వాదించి తన ద్విపదరచనను సమర్థించుకొన్న ట్లును నొక ఐతిహ్యముకలదు. ఈ ఐతిహ్యమువలన ద్విపద సర్వ పండితాదరణీయముగా సోమనాథుని కాలమున నుండలేదనియు తెలియుచున్నది. కావుననే సోమనాథుడు పండితారాధ్య చరిత్ర పీఠికలో-

"ఒప్పదు ద్విపదగావ్యోక్తి నావలవ
దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు
నట్టులుఁగాక కావ్యప్రౌఢి పేర్మి
నెట్టన రచియింప నేర్చినజాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదయు సమము భావింప" 8

-అని విమర్శకలోకమునకు ఒక 'సంజాయిషీ' చెప్పుకొని తన రెండవ ద్విపదకావ్యమును రచించియుండుట. మరియు,

"........ఐహికాముష్మిక ద్వి
పద హేతువగుట ద్విపదనాఁగఁబరగు" 9

అని పండితులు సయితము మురిసిపోవునట్లుగ ద్విపద నిర్వచన గావించినాడు.

కవిసార్వభౌముడగు శ్రీనాథుడు (1375-1455 A. D.) పల్నాటి వీరచరిత్రలోని కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము-

8. పండితారాధ్య చరిత్ర - పుట 18.

9. పండితారాధ్య చరిత్ర - పీఠిక, పుట 22.

అను భాగములను మంజరీ ద్విపదలోను, కాటమరాజు కథను ద్విపదలోను రచించియుండినను, ద్విపదను తూలనాడి నట్లొక చాటూక్తి కలదు.

"ముది విటులు విధవ లంజలు
పద కవితలు మారుబాస బాపనవారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిర వీరవరులు కడిదిపురమునన్" 10

ఈ చాటూక్తి శ్రీనాథుని దనుటలో ఎంత సత్యమున్నదో తెలియదు. కాని ద్విపద పట్ల ప్రాచీనకాలమునుండియు పండిత లోకమున అనాదరణముండిన దనుటకిది ఒక సాక్ష్యమగుచున్నది.

వేణుగోపాల శతక కారుడు కూడ ద్విపదకావ్యములను,

"అల తాళ్ళపాక చిన్నన్న రోమములైన
తంబుర దండెకు తంతులౌను"

అనియు,

"ద్విపద కావ్యంబు ముదిలంజ దిడ్డిగంత
యియ్య నేరని రండ నాగ్గేకరాశి"

అనియు మొరటుగా నిందించినట్లు తెలియుచున్నది.

తెలుగులో ఒకవైపు ద్విపదరచనలు ప్రతి శతాబ్దమందును రచింపబడుచుండినను మరొకవైపు ద్విపద దూషణయు నుండినట్లు తెలియుచున్నది. భారతదేశమున ఇతర భాషలలో పదకవిత అధిక గౌరవప్రచారములకు నోచుకొనినది. వంగభాషయందు పదకర్తల కవితయే ప్రముఖమైనది. హిందీ భాషలో సూరపదావళికి, కబీరు భజనకీర్తనలకు, అధిక ప్రచారమున్నది. సంస్కృతమున గూడ గీతగోవిందమునకు, కృష్ణలీలాతరంగిణి—

10. చూ॥ చాటుపద్య మణిమంజరి - శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

మొదలగు వానికి గౌరవము కలదు. తెలుగుభాషలోతప్ప ఇతర భారతీయభాషలలో పదకవితను నిందించినవారు అరుదు.

తెలుగు ద్విపద కవిత్వము నెడ ప్రాచీనకాలమునుండియు చూపబడిన అనాదరమునకు హేతువు లేవి?

ఈప్రశ్నకుసమాధానముగా కొన్ని కారణములు ఊహింపబడినవి. ఒకటి:- ద్విపదకవులకు రాజాశ్రయము లేదనుట. రాజులైన గోనబుద్ధభూపతి, రఘునాథనాయకుడు, విజయరాఘవనాయకుడు, కట్టా వరదరాజు - మున్నగువారు ద్విపదకావ్యములను స్వయముగా రచించియుండగా ద్విపదకు రాజాదరణ లేదనుట సహేతుకమైన వాదముకాదు. రెండవది :- ద్విపదకావ్యమంతట ఒకేవిధమగు ఛందస్సుండుటవలన చదువరులకు, శ్రోతలకు రోకటిపాటవలె విసుగుకలిగించును గాన అనాదరణీయమైనదనుట. వాల్మీకి రామాయణము, వ్యాసభారతము - దాదాపు అనుష్టుప్ ఛందస్సునందే వ్రాయబడినవి. సర్గాంతము లందు మాత్రము భిన్నవృత్తము లుపయోగింపబడినవి. కాళిదాసుని మేఘసందేశము, మిల్టన్ (Milton) మహాశయుని 'Paradise Lost', తమిళకావ్యములగు 'శిలప్పదికారము' (Silappathikaram) 'మణిమేఖలై' (Manimekalai) -మున్నగునవి కూడ ఒకేఛందస్సులో రచింపబడి విశ్వజనీనత, సార్వకాలీనతనుబొంది యున్నవి కదా! "పద్యకావ్యములందు బహువిధ పద్యముల గలుపుట దోషమను భావ మరిస్టాటిల్ (Aristotle) అను గ్రీకు విద్వాంసుడుగూడ నీ క్రిందివాక్యములలోఁ గనఁబఱచియున్నాడు.
"Still more absurd would it be to mix different metres as was done by charnon......" [11].

11. పల్నాటి వీరచరిత్ర - ప్రథమ భూమిక (పుట 71) అక్కిరాజు ఉమాకాంతము.

మూడవది:- ద్విపద వాఙ్మయము పాటల వాఙ్మయమనియు, ద్విపద ఉదాత్త ప్రౌఢ కావ్యోపకరణ సాధనమగు ఛందము కాదనియు, ప్రాచీన పండితులు నిరసించియుందురనుట. అక్షర చ్ఛందస్సులకన్న మాత్రాచ్ఛందస్సులకు గానయోగ్యత అధికముగా నుండును. కాని అంతమాత్రమున అక్షరచ్ఛందస్సులలో గల పఠనయోగ్యత వీనిలో లేదని అర్థము కాదు. ద్విపద "పాఠ్యే గేయే చ మధురమ్" అయినది. ఒక కావ్యమునందు కవితాప్రౌఢి ఆ కవియొక్క ప్రతిభాపాండిత్యముల నాశ్రయించి సిద్ధించునుగాని అతడు చేపట్టిన ఛందమును బట్టికాదు. "క్రియా సిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే" అను సంస్కృతోక్తి ప్రకారము సమర్థులగు మహానుభావులకు కార్యసిద్ధి తమ సత్త్వమునుబట్టి యుండునేగాని ఉపకరణము, సాధనములను బట్టి యుండదు. "కావ్యగౌరవమును పోషించునది దోషరాహిత్యమును గుణసాహిత్యమును గాని ఛందః ప్రయాసాతిశయము కాదు."12 మహాకవియగువాడు తన ప్రతిభావిశేషముచే ఏ ఛందమునైనను అందముగా సర్వజనానందముగ ఉదాత్త ప్రౌఢ కావ్యోపయోగ్యముగ నిర్వహింపగలడు. కావున ఈ మూడవ వాదమును సోపపత్తికమైనది కాదు.

మరి ప్రాచీనులు కొందరు ద్విపదను నిరసించుటకు హేతువులు లేకపోలేదు. ఆదికవి యనదగు నన్నయ, అతని తర్వాత నన్నెచోడుడును గద్యపద్యసమ్మిశ్రితమగు చంపూ కావ్య పద్ధతిని పాటించి రచించిరి. ఈ చంపూ సంప్రదాయమును అంతకు పూర్వము కన్నడవాఙ్మయమునను ప్రచారము పొందినది. అసలీ చంపూ సంప్రదాయము దక్షిణదేశీయ భాషా సారస్వతముల

---

12. బసవ పురాణ పీఠిక - వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

సంపర్కము వలననే సంస్కృతమునను ఏర్పడినదని కొందరి అభిప్రాయము. ఈ సంప్రదాయమును అభిమానించిన ప్రాచీన తెలుగుకవులు కొందరు ద్విపదను చేపట్టకపోవుటయు, నిందించుటయు జరిగినది. మరియు ద్విపదనుచేపట్టిన మొదటి కవి వీరశైవ మతప్రచారకుడగు పాల్కురికి సోమనాథుడగుటచే తర్వాతి శైవేతర కవులు అతని భాషాసారస్వత ఛ్ఛందస్సంప్రదాయములను ఈసడించుట జరిగినది. కాని పాల్కురికి సోమనాథుని ద్విపదరచనలు, "అభివినుతానందితోక్తి పటు గద్యపద్య ప్రబంధసామ్యముగ కావ్యకళాప్రౌఢి" తో నొప్పినవిగాన తర్వాత శైవేతర కవులుకూడ ద్విపదలో గద్యపద్యోదాత్తకృతుల సమముగా కావ్యసృష్టి చేయసాగిరి. మొత్తము మీద ప్రాచీన కాలములో యధాలాపముగాజరిగిన ద్విపదసంబంధమగు నిరసనవలన ద్విపద కావ్యపరిణామాభివృద్ధికి ఎట్టినష్టము కలుగలేదని చెప్పవచ్చును. సంఖ్యనుబట్టి చూచిన 245 ద్విపదకావ్యములు తెలుగుసాహిత్యమున వెలసియుండుట ఇందులకు నిదర్శనము.

## ద్విపదకావ్య పరిణామము - వివిధఘట్టములు:

తెలుగు సాహిత్యములో ద్విపద ప్రక్రియకు సంబంధించిన కావ్యపరిణామచరిత్రను నాలుగు ఘట్టములుగ విభజింపవచ్చును. ద్విపదకర్తలకాలము, వారిమతాభిమానమును, కావ్యదృష్టిని ఆధారముగా చేసికొని చేయబడిన విభజన ఇది.

## ప్రథమఘట్టము (1160-1500 A.D.)

పాల్కురికి సోమనాథుని కాలమునుండి తాళ్లపాక అన్నమాచార్యులవరకు గల నడిమి కాలమున వెలువడిన 24 ద్విపద

కావ్యములలో ఏ రెండు మూడు తప్ప మిగిలినవన్నియు శైవ మతప్రబోధకములును శైవమహిమ ప్రతిపాదకమును నగునట్టివే. రంగనాథ రామాయణకర్త వంటి ఒకరిద్దరు తప్ప మిగిలిన ద్విపద రచయితలందరును శైవులే. కావున ద్విపదకావ్యములయొక్క ప్రథమ ఘట్టమును శైవద్విపద కవుల యుగమనినను అసమంజసము కాదు.

## ద్వితీయఘట్టము (1500–1600 A.D.)

క్రీ. శ. 16 శతాబ్దపు ద్విపద కవులలో తాళ్లపాక కవులు ముఖ్యులు. వీరు వైష్ణవులు. వీరిలో చిన్నన్న ద్విపద లక్షణవిషయమునను, మతవిషయమునను పాల్కురికి సోమనాథునికి భిన్నుడు. ఇతని ప్రభావము ఆ శతాబ్దాంత్యమువరకు వెలసిన ద్విపద కవులమీద గోచరించుచున్నదీ. మరియు ఈ శతాబ్దమున వెలసిన గ్రంథములన్నియు చాలవరకు విష్ణుభక్తి సంబంధములే. శైవమతప్రతిపాదకములగు ద్విపదగ్రంథములేవియు లేవు. కావున ద్విపదకావ్య చరిత్ర దృష్ట్యా ఈ ఘట్టము వైష్ణవ ద్విపద కవులయుగము అనవచ్చును.

## తృతీయ ఘట్టము (1600–1875 A.D.)

క్రీ. శ. 17, 18, 19 శతాబ్దముల మధ్యకాలమువరకు వెలువడిన ద్విపదకావ్యములలో విష్ణుకథా సంబంధములును, శైవకథా సంబంధములును, తదితరములును గలవు. కాని ఈకాలపు ద్విపదకవులలో మతదృష్టికన్న కావ్యదృష్టియే ఎక్కువ. మరియు పద్యకావ్యములకు ద్విపదీకరణము కావ్యత్వదృష్టితో జరిగినది. కావున ఈ ఘట్టమున వెలసిన ద్విపదరచనలను కావ్యద్విపద రచనలనుట యుక్తముగానుండును. ఈ కావ్యద్విపద రచనలలో

తంజావూరు, మధుర మొదలగు దాక్షిణాత్య ప్రాంతములలో వెలసిన వానిని దాక్షిణాత్య ద్విపద రచనలనియు వేరుచేసి పరిశీలింపవచ్చును.

## చతుర్థ ఘట్టము (1875—)

ఆంధ్రసాహిత్యచరిత్రయందుకందుకూరి వీరేశలింగముతో నూతనశక మారంభమగుచున్నది. బహుగ్రంథకర్తయగు వీరేశలింగముపంతులు ద్విపదకృతులనుకూడ రచించినాడు. ఆధునిక యుగపు రచయితలందును, రచనలందును పాశ్చాత్య భాషా సాహిత్యప్రభావమును గోచరించును. కందుకూరి వీరేశలింగము కాలమునుండి యిప్పటివరకు వెలువడిన ద్విపద కావ్యములను అధునిక ద్విపదరచనలని పేర్కొని పరిశీలించుట యుక్తము.

పై విభజన దృష్ట్యా తెలుగుద్విపద కావ్యపరిణామ చరిత్రను విపులముగా ఇక పరిశీలింతము.

## ప్రథమ ఘట్టము (1160–1500 A.D.) - శైవద్విపద రచనలు:

ద్విపద రచనాస్థాపకుడగు సోమనాథునితో ద్విపద కావ్య పరిణామ చరిత్రలోని ప్రథమఘట్టము ప్రారంభమగును. సోమనాథుడు ద్విపదయందు వ్రాసిన అతి ప్రసిద్ధ గ్రంథములు రెండు. (1) బసవపురాణము (2) పండితారాధ్యచరిత్ర. ఇవి అనువాదములు కావు; స్వతంత్రరచనలు. బసవపురాణమునందు వీరశైవ మతోద్ధారకుడగు బసవన చరిత్రము వర్ణింపబడినది. వీరశైవము వ్యాపించిన ద్రవిడ కర్ణాట దేశములందును వీరశైవులచే నిది పవిత్రగ్రంథముగా పరిగణింపబడినది. తెలుగున నితర భాషల లోనికి పరివర్తనముచెందిన కృతులలో బసవపురాణమే మొదటిది. ద్విపద బసవ పురాణమును యథామూలముగ మొదట

క్రీ. శ. 1369 లో భీమకవి కన్నడమున భామినీ షట్పదీ కావ్యముగా రచించెను. శంకరారాధ్యులు 'బసవేశ విజయ' మను పేర ద్విపద బసవపురాణమును సంస్కృతీకరించెను. సింగిరాజు (1500 A. D.) 'మహాబసవరాజచరిత' మనుపేర దీనికి కన్నడానువాదమును గావించినాడు. పిడుపర్తి సోమన, మహాదేవకవి ద్విపద బసవ పురాణమును పద్యీకరించినారు. షడక్షర కవి (1655 A. D.) 'బసవరాజవిజయము' లేక 'వృషభేంద్రవిజయము' అను చంపూకావ్యముగ రచించెను. బసవపురాణము తమిళములో పద్యకృతిగా పరివర్తితమైనది.[13]

పండితారాధ్య చరిత్రకుకూడ గురురాజకవి (1430 A.D) సంస్కృతానువాదమును, నీలకంఠాచార్యుని (1485 A. D.) 'ఆరాధ్యచరిత్ర' మనుపేరితో కర్ణాటానువాదమును వెలసినవి. సోమనాథుని ద్విపదగ్రంథములకు ద్రవిడ కర్ణాటములందే గాక సంస్కృతమున కూడ పరివర్తనములుండుటచే ఆ గ్రంథముల యొక్క వ్యాప్తిని, గౌరవమును నిరూపించుచున్నవి.

సోమనాథుని ద్విపదగ్రంథముగా చెప్పబడు 'మల్లమదేవి పురాణము' ఇంతవరకును బయటపడలేదు. ఇందలి ఐతిహ్యమును తండ్రియగు శ్రీ నిడుదవోలు సోమసుందరం పంతులు గారి వలన శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు విన్నారట. వారివలన శ్రీ బండారు తమ్మయ్యగారు విని తన 'పాలకురికి సోమనాథకవి' (పుట. 162.) అను గ్రంథమున అందలి కథనుగూర్చి వ్రాసినారు.

ద్విపదలో రచింపబడిన 'సోమనాథ స్తవము' 'భక్త స్తవము' అను రెండు లఘుకృతులు కలవు. ఈ రెండును శ్రీ ముదిగొండ

13. చూ॥ 'బసవపురాణము - తమిళ పరివర్తనము' వ్యాసము పరిశోధన, సంచిక 7 - శ్రీమతి ఆదిలక్ష్మి.

శంకరారాధ్యులవారిచే పరిష్కృతమైన 'మోక్షోపాయ' మను గ్రంథమున ముద్రితములైనవి. ఏలూరు వాస్తవ్యులు శ్రీ కొండ గుంటూరు నాగభూషణము ప్రకటించిన యొక మిశ్రగ్రంథము నందలి 'సోమనాథ స్తవము' చివర 'ఇది పాల్కురికి సోమేశ్వర విరచితము' అనికూడ ముద్రింపబడినదని శ్రీ బండారు తమ్మయ్య గారు తెల్పిరి.[14]

సోమనాథ స్తవము లిఖితప్రతి-సంఖ్య నెం. 2272, మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందు కలదు. ఇందు గ్రంథ కర్తపేరు కానరాదు. "పాల్కురికి సోమనాథుడు సోమనాథ స్తవ, భక్తస్తవములను భక్తపఠనార్థము సులభశైలిలో లఘు ద్విపదకృతులుగ ప్రారంభములో అనుభవసారముతర్వాత రచించి యుండు"[15] నని శ్రీబండారు తమ్మయ్యగారు అభిప్రాయపడిరి.

సోమనాథుని తర్వాత గోనబుద్ధభూపతి (1240 A. D.) రంగనాథ రామాయణమును ద్విపదలో రచించెను. పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యములందలి బ్రాహ్మణనింద, అన్యమత దూషణము, స్వమతోత్కర్ష మొదలగు వానిని పరిహరించుట వలన రంగనాథరామాయణము సోమనాథుని ద్విపదకావ్యముల కంటె శీఘ్రకాలమున జనసామాన్యమున వ్యాప్తి చెందినది. శైవమతావేశులగు లాక్షణికులు తెలుగున లేరు. కావున లాక్ష ణికులు పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యములకన్నను సర్వ జనాదరణ పాత్రమై, భాషావిషయమున నన్నయమార్గము ననుస రించినట్టి రంగనాథరామాయణమునే ప్రామాణికముగ పరిగ

14. చూ॥ ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక-పుట 101, సంపుటము 21 సంచిక 3.

15. చూ॥ 'పాలకురికి సోమనాథకవి' - పుట 156

ణించినారు. తర్వాతి ద్విపదకవుల రచనలమీద రంగనాథ రామాయణ ప్రభావము ఎక్కువగా గోచరించుచున్నది.

ఇట్లు ద్విపదకావ్య ప్రక్రియ వీరశైవ మతప్రచారార్థము జన్మించినను, రంగనాథ రామాయణము మూలమున సార్వజనీనతను, బహుళప్రచారమును బొందినది. "ద్విపద కవిత్వమునకు పాల్కురికి సోమనాథుడు ప్రథమాచార్యుడైన గోన బుద్ధారెడ్డి ద్వితీయాచార్యుడు. ఈ సోమన బుద్ధన లిర్వురును ద్విపదకావ్య సృష్టిస్థితులకు కారకులు"[16] అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు నుడివిరి.

గోన బుద్ధారెడ్డి కోరికపై అతని కుమారులగు కాచభూపతి, విఠలనాథుడు అను సోదరజంటకవులు రంగనాథోత్తర రామాయణ భాగమును ద్విపదలోనే పూర్తిగావించిరి.

క్రీ. శ. 13వ శతాబ్దమునాటికి వీరశైవ మత విజృంభణమువలన నామ మాత్రావశిష్టమైయుండిన అద్వైతమత పునః ప్రతిష్ఠాపనకు ఆంధ్రదేశమున కృషిచేసినకర్త మహాకవి తిక్కన సోమయాజి. తిక్కన, 'శాంతిదూత' వలె వ్యవహరించి, శివ కేశవులకు భేదములేదని చాటి, భారతస్థమగు నార్ష విజ్ఞానమును వ్యాపింపజేసినాడు. నన్నయకర్మమార్గప్రతిపాదకమైన వైదికమతమును పోషించుటకు భారతమును తెనిగించెను. కాని తిక్కన ఆనాడు ప్రజోపద్రవకరమైన వీరశైవ, వీరవైష్ణవముల పోరాటమును అణచివేసి అద్వైతమత ప్రతిష్ఠాపనచేయుటకు భారతాను వాదమును చేపట్టెను. కనుకనే నన్నయ "తే వేదత్రయ మూర్తయః" అని త్రిమూర్తిస్తోత్రముచేయగా తిక్కన హరి హరాద్వైత ప్రతిపాదకమైన పరతత్త్వస్తుతిని చేసినాడు. తిక్కన

16. 'ద్విపద భారత' పీఠిక - గౌతమ వ్యాసములు, పుట 115.

నన్నయ 'మార్గ' పద్ధతిని బోక 'దేశి' తెలుగు భాషలోనే భారతగ్రంథరచనచేసి ఆంధ్రావళికి శివకవులకంటెను సన్నిహితుడైనాడు. సారస్వత విషయమున తిక్కన మార్గ, దేశి పద్ధతులను సమన్వయింపజేసెను. తిక్కన ప్రభావము సాహిత్యమున రెండు మూడు శతాబ్దముల పర్యంతము పడినది. కనుక మతసాంఘిక సారస్వత రంగములలో పాల్కురికి సోమనాథుడు సాగించిన ఉద్యమమునకు తిక్కన అద్వైతముతో ఆఘాత మేర్పడినది.

క్రీ, శ. 14 శతాబ్దిలో శైవ వైష్ణవమత విషయికములగు వైషమ్యములు చాలవరకు తొలగినవి. ఈ కాలమున కేవలము మతప్రచారమునకు ద్విపదలురచించుపద్ధతి తగ్గినది, ప్రౌఢకవియగు మడికి సింగన (1375-1435 A. D.) 'భాగవత దశమ స్కంధ, మును ద్విపదలో రచించెను. సరళమైన జాతీయగీతమగు ద్విపదలో రచించిననే తన కావ్యము బహుళ జనాదరణ పాత్రమగునని మడికి సింగన తలంచియుండును.

ఈ కాలమున ద్విపద శాస్త్రగ్రంథమునకుకూడ నుపయోగింప బడినది. గణపనారాధ్యుడు (1323-45A D.) 'స్వరశాస్త్ర' మనెడి చిన్న ద్విపదగ్రంథమును రచించెను. ఇది యోగశాస్త్రగ్రంథము. తెలుగులో శాస్త్రమను పేరుతో వెలసిన ద్విపద కావ్యములలో నిదియే మొదటిది,

శ్రీనాథుడు (1380-1460 A. D.) కొండవీటి నేలిన పెదకోమటి వేమారెడ్డి (1402-1420 A. D.) ఆస్థానకవి; విద్యాధికారి. అతడు కవిసార్వభౌమ బిరుదాంకితుడు. " ఈక్షోణిని నినుబోలు సత్కవులు లేరీనాటి కాలమ్మునన్ " అని శ్లాఘింపబడినవాడు. శ్రీనాథుడు అఖండ పాండితీ సంపన్నుడు; ప్రౌఢసాహిత్య నిర్మాత. అతడు పాల్కురికి సోమనాథుని ద్విపదపండితారాధ్య

చరిత్రను పద్యప్రబంధముగ (ఇది అలభ్యము) వ్రాయుటవలన సోమనాథుని ద్విపదకవిత్వమునెడ అతనికిగల గౌరవభావము వ్యక్తమగుచున్నది.

శ్రీనాథుడు "శాశ్వతంబైనట్టి సద్గ్రంథ" మను నమ్మకముతో "జనులెల్లభక్తిచే జదువుటకొరకు" పల్నాటివీరచరిత్రలోని కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము—అను భాగములను మంజరీ ద్విపదలో రచించినాడు. పల్నాటి వీరచరిత్రముచే శ్రీనాథుడు అచ్చముగా ప్రజాకవియైనాడు. ప్రజలతో గొంతుకలిపి తెలుగు జాతిపౌరుషమును కీర్తించినాడు. అతడు ద్విపదను చారిత్రకమును, రాజకీయమును, వీరరసోదంచితమునునగు కథావస్తువునకుపయోగించి చారిత్రకద్విపదకావ్యమును రచించుట ఎన్నదగినవిశేషము. కాబట్టి శ్రీనాథుడు, సోమనాథుడు రంగనాథరామాయణ కర్తల కంటెను ప్రజలకు మిక్కిలిసన్నిహితముగాపోగల్గినాడు. పల్నాటి వీరచరిత్ర అనువాదముకాదు. స్వతంత్రరచనయే. "దేశికవితా శబ్దమును అన్నిట సార్థకముచేసిన కావ్యములలో పల్నాటివీరచరిత్రయేమొదటిది, మేటి"[17] అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు తెల్పిరి. పల్నాటివీరచరిత్రను ప్రజలు వీరగాథగా వీధులందు పాడుకొనుచుండెడివారని క్రీడాభిరామము నందలి ఈ క్రింది పద్యములను బట్టి తెలియును.

"ద్రుతతాళంబున వీరగుంభితక ధుం ధుం ధుం కిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడె నొ
క్కత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్.

---

17. చూ॥ పల్నాటి వీరచరిత్ర - పీఠిక, పుట 26, విశాలాంధ్ర ప్రచురణ 1961.

ఘర్జించి యరసి జంఘాకాంట యుగళంబు వీరసంబెట
కోలఁ బ్రేయు నొకఁడు

...............................................................................

పడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు" [18]

జానపదుల కుత్సాహోద్వేగములను గొల్పునట్టి 'కాటమ రాజుకథ' ను గూడ శ్రీనాథుడు ద్విపదలో రచించినట్లు గుఱ్ఱము కొండ భక్తవత్సలకవి పద్యకాటమరాజుకథ అవతారికనుబట్టి తెలియుచున్నది. కాని శ్రీనాథుని ద్విపద కాటమరాజుకథ అలభ్యము.

కవిరాజుగా వెలసిన శ్రీనాథుడు ద్విపదకావ్య రచనతో ప్రజాకవి యైనాడు.

కాసె సర్వప్పకవి (1400 A. D.) 'సిద్ధేశ్వరచరిత్ర' అను చారిత్రక గ్రంథమును ద్విపదలో చెప్పినాడు. ఇందు 3 ఆశ్వాసములు ద్విపదలోను తక్కినభాగము వచనములోను కలదు. చరిత్ర ప్రసిద్ధులైన రాజుల కథనమును ద్విపద కావ్యమునందు కూర్చినవారిలో సర్వప్పయే మొదటివాడు. సర్వప్పకవి 'సిద్ధేశ్వరచరిత్రము' ఏకామ్రనాథుని (1369 A. D.) వచన ప్రతాపచరిత్ర ననుసరించినది. ప్రతాపచరిత్రనే 'సోమదేవరాజీయ' మను పేరుతో చంపూకావ్యముగ కూచిమంచి జగ్గకవి(1720 A.D) రచించినాడు.

శివయోగసారమను పద్యగ్రంథమును రచించిన కొలని గణపతిదేవుడు (1400 A. D.) శైవవేదాంతబోధకమగు 'మనోబోధ' ను మంజరీద్విపదలో రచించెను.

ముస్లిం దండయాత్రలకు తర్వాతకూడ క్రీ. శ. 15 వ శతాబ్దమున తెలుగుదేశమున శైవసంప్రదాయములు వర్ధిల్లినవి.

---

18. క్రీడాభిరామము - ప. 116; 117.

"The popular saivism seems, however, to have been encumbered by a number of religious practices and beliefs; gathered around it during its contact with other schools of saivism, namely, the yogi saiva cult of the Natha siddhas, and the sakta tantric cult which flourished in this period (circa 1325 A. D. to circa 1448 A. D.) and had their own respective follwing. These two cults also left an indelible impress both on the Telugu literature and on the religious life of the people"[19]

శివయోగ విద్యాధికులైన నవనాథుల ప్రభావము, మహిమలను జనసామాన్యములో మిక్కిలి వ్యాప్తిచేయవలెనను ఉద్దేశ్యముతో శ్రీశైలజంగమ మఠాధీశ్వరుడగు శాంతభిక్షావృత్తి రాయని ప్రేరణమువలన గౌరన (1345-1445 A. D.) నవనాథ చరిత్ర అను ద్విపదకావ్యమును రచించెను. గౌరన నవనాథ చరిత్రలో శివకథనే కావ్యేతివృత్తముగా స్వీకరించి శైవసంప్రదాయాభిజ్ఞతను, ఆధ్యాత్మికవిషయ పరిజ్ఞానమును వ్యాప్తినొందించినాడు. కాని గౌరనమాత్రము వీరశైవ సంప్రదాయములోనివాడు కాడు. నవనాథచరిత్రయందు శ్రీమహావిష్ణువు మాహాత్మ్యముకూడ ప్రశంసింపబడినది.

గౌరన రెండవ ద్విపదకృతి హరిశ్చంద్రోపాఖ్యానము. హరిశ్చంద్రోపాఖ్యానమును తెలుగులో మొట్టమొదట రచించినవాడు గౌరనయే. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము ఆధారముగా రచింపబడిన ఇతర పద్యహరిశ్చంద్రోపాఖ్యానాదులేవియు దీనినిఁ బోలవు. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమునకే సర్వజనాదరణ ప్రాప్తియు, బహుళప్రచారమును కలవు. గౌరనకవిత సలక్షణమై

19. History of the Reddi Kingdoms. Ch. III, Page 307.

జాతీయమై, మనోహరమగు ప్రౌఢరస భావములతో హృదయం గమమైనది. గౌరన ద్విపదకవితారీతులు తర్వాతి ద్విపదకవులకే కాదు పద్యప్రబంధకవులకును మార్గదర్శకమైనవి. ద్విపదకావ్య ప్రవర్తకత్వమున ప్రథమాచార్యుడు కాకపోయినను గౌరన ద్విపదవాఙ్మయచరిత్రమున అద్వితీయస్థాన మాక్రమించినవాడు. గౌరన ద్విపదరచనతో ద్విపదకు పద్యప్రబంధములతో సమాన మగు స్థాయి యేర్పడినది.

నాదిండ్ల ఉమాపతి (1460 A. D.) 'మాయాచిదానంద మంజరి' అను వేదాంతసంబంధమగు మంజరీ ద్విపదకావ్యమును రచించెను.

పాల్కురికి సోమనాథుని తర్వాతి కాలమున తెలుగుదేశ మున వీరశైవమునకు వ్యాప్తిత్వరితముగా తగ్గినది. క్రీ. శ. 15వ శతాబ్దంత్యమున పాల్కురికి సోమనాథుని ప్రశిష్యులనబడు పిడు పర్తి కవులు ద్విపదను సాధనముగాగ్రహించి శైవమత ప్రచార మునకు పూనుకొనిరి. పిడుపర్తి కవులలో ముఖ్యుడగు బసవన (1475_1500 A. D.) 'పిళ్ళనైనారు కథ' 'బ్రహ్మోత్తర ఖం డము', 'దీక్షాబోధ'-అను ద్విపదగ్రంథములను రచించెను. వీనిలో 'వీరశైవదీక్షాబోధ' ము మాత్రమే లభ్యమై ప్రచార ములోనున్నది. ఆకాలపు వీరశైవమత సిద్ధాంతములు, ఆచార ములను తెల్పుగ్రంథములలో నిది ప్రధానమైనది. వీరశైవ దీక్షా బోధను 'కెరయపద్మరసు' (1165 A. D.) అను కన్నడ కవి మొదట సంస్కృతములోను, అటు పిమ్మట కన్నడములో రగ డలుగాను రచించెను. పిడుపర్తి బసవన కన్నడదీక్షాబోధననుస రించియే తద్విపదకావ్యమును రచించినాడు. కన్నడగ్రంథముల నుండి ద్విపదీకరింపబడిన వానిలో దీక్షాబోధయే మొదటిది.

పిడుపర్తి బసవనకుమారుడగు సోమన (1500–1525 A.D) కన్నడములో 'చామరసు' (1425 A. D.) అను కవి రచించిన 'ప్రభులింగలీల'ను ద్విపదీకరించెను. ప్రభులింగలీల అల్లమప్రభు చరిత్ర. ఇది వీరశైవ వాఙ్మయమున బసవపురాణమువలె పవిత్రమును ముఖ్యమునైయున్నది. పిడుపర్తిసోమన ద్విపదప్రభులింగలీలలను అతని సోదరుడగు పారనార్యుని పుత్రుడగు బసవప్ప (1525–1550 A. D.) యను నతడు పద్యరూపమున గూర్చెను. పాల్కురికి సోమనాథుని ద్విపద బసవపురాణమును పండితలోకమున కూడ ప్రచారముచేయు తలంపుతో పిడుపర్తి సోమన దానిని పద్యప్రబంధముగా 'మక్కికి మక్కి'గాననువదించినాడు.

క్రీ. శ, 15వ శతాబ్దంత్యమున నుండిన పోశెట్టి లింగన 'నవచోళచరిత్ర' మను 5 ఆశ్వాసముల ద్విపదకావ్యమును వ్రాసెను. లింగకవి వీరశైవుడు. నవచోళులు గొప్ప శివభక్తులుగా వీరశైవకావ్యములందు స్తుతింపబడినారు. నవచోళ చక్రవర్తులలో కరికాలచోడుడు చారిత్రకముగ ప్రసిద్ధుడు. నవచోళచరిత్ర శైవమతపరముగ, విజ్ఞానశాస్త్ర విషయమూలముగనే గాక కావ్యశిల్ప నిర్మాణమునందును అద్వితీయమైన గ్రంథము.

పోశెట్టి లింగకవి 'మలహణ చరిత్రము', 'శంకరదాసమయ్య చరిత్రము', 'వీరసంగయ్యదేవ చరిత్రము', 'శిష్యప్రబోధము'-అను ద్విపదగ్రంథములనుకూడ రచించినట్లు తెలియుచున్నది. ఈ గ్రంథములేవియు ఇప్పుడు కానరావు.

క్రీ. శ. 15 శతాబ్దిలో ఉత్తరార్థముననుండిన ప్రోలుగంటి చెన్నశౌరి 'నృసింహపురాణమును' ద్విపదలో రచించినట్లు హరిభట్టు పద్యనృసింహపురాణావతారికనుబట్టి తెలియుచున్నది. ద్విపద నృసింహపురాణము అలభ్యము.

ద్వితీయ ఘట్టము (1500-1600 A.D.) వైష్ణవ ద్విపదరచనలు.

ద్విపద వాఙ్మయ పరిణామచరిత్రలో ద్వితీయ ఘట్టము తాళ్ళపాక కవులతో ప్రారంభమగును. తెలుగుసాహిత్యసృష్టిలో చెప్పుకోదగిన రచనారీతులను వెలయించిన వారు పాల్కురికి సోమనాథాదిశివకవులు. వారిరచనారీతులను గ్రహించి ఎక్కువగా వ్యాప్తిగావించిన భవికవులలో తాళ్ళపాకవారే ముఖ్యులు.

క్రీ. శ. 16 శతాబ్దమున విజయనగర రాజుల కాలమున వైష్ణవమతమునకు ఎక్కువగా దోహదము కలిగినది. ఈకాలము నందలి వైష్ణవ వాఙ్మయములో భక్తికి విశేషప్రాముఖ్యమీయ బడినది. శివతత్త్వసారము, బసవపురాణము, పండితారాధ్య చరిత్ర—మున్నగుశివకవుల గ్రంథములలో భక్తిప్రసక్తియున్నను వానిలో మతప్రచారధోరణియే అధికము.

వైష్ణవమున ఆళ్వారులు భక్తిసాహిత్యమునకును, ఆచార్యులు వేదాంతము, విజ్ఞానములకును ప్రాతినిధ్యము వహింతురు. తెలుగుదేశమున బహుధాభక్తివాఙ్మయప్రవర్తకులయిన వైష్ణవ కుటుంబములవారిలో తాళ్ళపాకవారు ప్రసిద్ధులు. వారిదెక్కువగా మధురభక్తి సంప్రదాయము.

తాళ్లపాక కవులలో ప్రథముడును, ప్రసిద్ధుడును నగు వాడు అన్నమాచార్యుడు (1408–1507 A. D.). అతడు శ్రీ వేంకటేశ్వరస్వామి నందకాంశమున నవతరించెనని ప్రఖ్యాతి కలదు. "ద్రవిడ కర్ణాటాంధ్ర భాషలలోనెల్లఁ బ్రాచీనములైన సంకీర్తనము లన్నమాచార్యులవే. సంకీర్తన శాస్త్రమును గల్పించినవాడు నన్నమాచార్యుడే. కనుకనే ఇతనికిఁ 'బదకవితా పితామహుఁడ'ని, 'సంకీర్తనాచార్యుడ'ని, 'హరికీర్తనాచార్యు డ'ని బిరుదులు కలిగెను. కన్నడమునఁ బురందరదాసులవారును,

ప్రాకృతమున వెంకటమఖియు నీయనకుఁ దర్వాతనే సంకీర్తనములను గీతములను రచించిరి." [20] అని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసియున్నారు. అన్నమాచార్యుడు యోగ వైరాగ్య శృంగార మార్గములలో 32000 సంకీర్తనములను చెప్పినాడు.

అన్నమాచార్యుడు రామాయణమును "ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున నవముగా" [21] రచించెనట. ఈ ద్విపద రామాయణము అలభ్యము. అన్నమాచార్యుడు రచించిన 'శృంగారమంజరి' అను లఘుకృతి మంజరీ ద్విపదచ్ఛందోరూపము. ఇది భక్తిసూనృతముగ, భావప్రధానముగా నడచిన రచన.

భక్తిప్రధానములగు సంకీర్తనములను శివకవులు ఏ కారణముచేతనో రచింపలేదు. అట్లే కన్నడమున, బసవనాదులు 'వచనము' లను రచించినను తెలుగు శివకవులు అట్టి 'వచన' రచనను చేపట్టలేదు. కాని వైష్ణవుడగు కృష్ణమాచార్యుడే (13 శతాబ్ది) తెలుగులో ప్రథమ వచనకావ్యకర్త. అతని వచనములకు 'సింహగిరి నరహరివచనము' లనిపేరు. అవి 'చూర్ణిక' లనెడి వచన భేదములని తాళ్లపాక అన్నమాచార్యుడు పేర్కొనినాడు. "ప్రాతవగు కృష్ణమాచార్యుని సంకీర్తనములు తాళగంధి వచనములేగాని పల్లవిచరణములుగల పదకవితా రచనలుకావు. అట్టి తాళగంధి వచన రచనలను పెదతిరుమలాచార్యుడు గూడ వైరాగ్యవచన రచనమాలికాగీతములని పేర్వెట్టి రచించినాడు. అవి వేంకటేశ్వర వచనములను పేరున ప్రకటింపబడినవి." [22]

---

20. చూ॥ అన్నమాచార్య చరిత్ర, పీఠిక - పుట 76, తిరుపతి దేవస్థానం ప్రచురణ.

21. చూ॥ అన్నమాచార్య చరిత్ర - పుట 47, తాళ్ళపాక చిన్నన్న.

22. చూ॥ అన్నమాచార్యచరిత్ర, పీఠిక - పుట 76, వేటూరిప్రభాకరశాస్త్రి

అనేక దేశిరచనా ప్రక్రియలకు శివకవులు, ముఖ్యముగా పాల్కురికి సోమనాథుడు మార్గదర్శకుడైనను, వచనసంకీర్తన ములకుమాత్రము వైష్ణవులగు కృష్ణమాచార్యులును, తాళ్లపాక కవులును కారణభూతులని తెలియుచున్నది.

అన్నమాచార్యుని ప్రథమపత్నియగు తిమ్మక్క 'సుభద్రా కల్యాణము' అను గ్రంథమును మంజరీ ద్విపదలో, స్త్రీజనోప యుక్తముగ, శృంగారరసోపేతముగ రచించెను. మనకు తెలిసి నంతవరకు ఆంధ్రవాఙ్మయ చరిత్రలో తాళ్లపాక తిమ్మక్కయే తొలి తెలుగు కవయిత్రి. సుభద్రా కల్యాణము ఆకారమున చిన్నదైనను గుణమునందు గొప్పది. ఇందలిపలుకుబడులు కొన్ని కొన్ని చేమకూర వేంకటకవి విజయవిలాసమునందు చేరినవి.

తాళ్లపాక అన్నమాచార్యుని కుమారుడగు పెదతిరుమ లయ్య (1460-1547 A. D.) కు 'శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనా చార్య' అని, 'శ్రీ రామానుజ సిద్ధాంతస్థాపనాచార్య' అని, 'వేదాంతాచార్య' అని, 'కవితార్కిక కేసరి' అని 'శరణా గత వజ్రపంజర' అని బిరుదములు కలవు. పెదతిరుమలయ్యా పద కవితకు పేరొందినవాడు. 'పన్నగ పెదతిరుమలయ్యా పదముల కెఱుగున్'' అని చాటూక్తి కలదు. పెదతిరుమలయ్య 'ఆంధ్ర హరివంశము' అను ద్విపదకృతిని 'చక్రవాళమంజరి' అను లఘుకృతిని రచించెను. వీనిలో 'ఆంధ్రహరివంశము' అలభ్యము. 'చక్రవాళమంజరి' లోని ప్రతి పాదమును ముక్తపదగ్రస్తాలం కారముతో నడచును.

పెదతిరుమలయ్య కుమారుడగు చినతిరువేంగళనాథుడు లేక చిన్నన్న (1498-1561 A. D.) తన గ్రంథములన్నిటిని ద్విపదలోనే రచించెను. అష్టమహిషీకల్యాణము, (1545 A. D.)

పరమయోగివిలాసము (1546 A. D.), ఉషాకల్యాణము (1547-A. D.). అన్నమాచార్యచరిత్ర—ఇవి చిన్నన్న రచించిన ద్విపద కావ్యములు. చిన్నన్న ద్విపదకావ్యములన్నియు వైష్ణవమత ప్రతి పాదకముగా రచింపబడినవే. అష్టమహిషీకల్యాణము శ్రీకృష్ణుడు రుక్మిణి, సత్యభామాది అష్టభార్యలను వివాహమాడు కథలు చెప్పు 5 ఆశ్వాసముల ద్విపదకావ్యము. పరమయోగివిలాసము విష్ణుభక్తులైన పన్నిద్దరాళ్వారుల చరిత్రము. యామునాచార్య, రామానుజాచార్యాది వైష్ణవప్రవక్తల చరిత్రలు కూడ నిందు కలవు. ఉషాకల్యాణము హరివంశములోని ఉషానిరుద్ధుల పరి ణయగాథ. అన్నమాచార్య చరిత్ర తన తాతయగు అన్నమా చార్యుని జీవితచరిత్రను తెల్పు గ్రంథము.

ద్విపదసాహిత్య పరిణామ చరిత్రయందును, ద్విపదలక్షణ స్వరూప నిర్ణయవిషయమునను, చిన్నన్నకు విశిష్టస్థానము కలదు. చిన్నన్న అంతటి ద్విపదాభిమాని పాల్కురికి సోమనాథుని తర్వాత తెలుగున మరొకడు లేడనుట అతిశయోక్తి కాదు. ఇతర ఛందముల జోలికి పోక కేవలము ద్విపదలోనే తన గ్రంథము లన్నిటిని రచించిన ద్విపద పక్షపాతి చిన్నన్న. "చిన్నన్న ద్విపద కెఱుఁగును" అని చాటూక్తి కలదు. చిన్నన్న తన తొలి ద్విపద కావ్యమగు అష్టమహిషీ కల్యాణమున ద్విపదకు లక్షణమును స్పష్టముగా పేర్కొనినాడు. చిన్నన్న నిర్ణయించిన ఈ ద్విపద లక్షణము సోమనాథుడు స్థాపించిన ద్విపద లక్షణమునకు భిన్న మైనది.

"వాసవుల్మువ్వురు వనజాప్తుడొకఁడు
భాసిల్లు నదియొక్క పదము శ్రీకాంత
క్రమమున నీ నాల్గు గణములు నడచుఁ
గ్రమదూరముగఁ బ్రయోగము సేయరాదు

ఆ పాదమునకు మూఁడవ గణంబాది
దీపించు యతి యంబుధి ప్రియ తనయ
యుపమింప నవి ప్రాసయుతములై రెండు
ద్విపదనా విలసిల్లి వికచాబ్జపాణి
ద్విపదకు ద్విపదకుఁ దెగఁజెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితర భాషలను
యతుల లోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులు చెల్లును బ్రయోగానుసారమున
ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద
మపుడు రెంటను కూర్ప నది యయుక్తంబు...... ”

— అష్టమహిషీ కల్యాణము - అవతారిక - ద్వి. పం. 130 - 160.

తెలుగు లాక్షణికులెవ్వరును చిన్నన్నవలె ద్విపదకు సమగ్రమగు నిర్వచనమును చేయ లేదు. (1) ‘‘ద్విపదతో ద్విపద సంధిల్లకూడదు. (2) ద్విపద ఏపాదమున కాపాదము విడివడియుండవలెను. (3) ద్విపదలో ప్రాసయతినిషేధము’’-అను మూడునియమములతో చిన్నన్న,

“ దినములోనను నేయి ద్విపద లింపొంద
వినుత వర్ణనలతోడ విరచించువాడఁ
గవి శిరఃకంప యోగ్య ప్రతి ద్విపద
నవబిరుదాంకుండ ”[28]

నని తెల్పినాడు. శివకవులు ముఖ్యముగా సోమనాథుడు ప్రచారము గావించిన ద్విపదలను చేపట్టినను, భవికవుల ద్విపదరచనలు విశిష్టముగా నుండవలెనను భావముతో కాబోలు చిన్నన్న పైని పేర్కొనిన నియమముల నేర్పరచుకొనెను. ఇవితర్వాతికాలమున లాక్షణికులకును, ద్విపదకావ్యరచయితలకును ఆదరణపాత్రము లైనవి. ద్విపద శివకవులలో పాల్కురికి సోమనాథునికెట్టిస్థానము కలదో శైవేతర ద్విపదకవులలో చిన్నన్న కట్టి స్థానముకలదు.

28. అష్టమహిషీ కల్యాణము - అవతారిక, పుట 6.

ఇట్లు తాళ్లపాక కవులు వైష్ణవమత ప్రతిపాదకములగు రామాయణ, భాగవత, హరివంశకథలను బహుళముగా ద్విపద రూపమున అనువదించియుండుటకు వారి వైష్ణవమతాభిమానమే ముఖ్యకారణము. తాళ్లపాక కవుల ద్విపదసాహిత్య ప్రభావము వారి సమకాలిక కవులందు మిక్కుటముగా ప్రసరించినది.

ద్విపద విషయమున చిన్నన్న తెల్పిన లక్షణముల ననుస రించి క్రీ. శ. 16 శతాబ్దమునందలి కొందరు కవులు తమ ద్విపద కావ్యములను రచించిరి. "సాళ్వతిమ్మ దండనాయకుని సంతత కృపామహిమ వినుతికెక్కిన కొండవీటిదుర్గము నేలిన' వాడగు నాదిండ్ల గోపనమంత్రి (1520 A. D.) 'కృష్ణార్జున సంవాదము' ను ద్విపదలో రచించినాడు. అతడు ప్రబోధచంద్రోదయమునకు సంస్కృత వ్యాఖ్యను వ్రాసినాడు. 'విలసిత సాహిత్య విశ్రాంతి మంతుడు' ను, అష్టభాషాకవిత్వ ప్రచండుడు' ను, 'కవిసార్వ భౌమ' బిరుదాంకితుడును, ఆరవీటివంశ రాజగు తిరుమలరాజున కాస్థానకవియు నగు దోనూరు కోనేరు నాథుడు (1547 A. D.) 'బాలభాగవతము' ను తొలుత చంపూకావ్యముగ రచించి, నది పలువురచే ప్రశంసింపబడి ప్రఖ్యాతినొందిన తర్వాతనే ద్విపదచ్ఛందోరూపమున వ్రాసినాడు. ద్విపద బాలభాగవతము అలంకార సమన్వితమై, ప్రౌఢప్రబంధ లక్షణములతో నొప్పినట్టి రచన. ఈ కాలముననే ముకుందయోగి (1560 A. D.) 'శ్రీరంగ మాహాత్మ్యము', చదలువాడమల్లన (1580 A. D.) 'రుక్మాంగద చరిత్ర', ఘట్టుప్రభువు (శేషకవి-16 శతాబ్ది) 'సత్యభామ విజ యము'-మున్నగునవి వైష్ణవమత ప్రతిపాదకముగ ద్విపదలో రచింపబడినవి. వీనిలో 'రుక్మాంగదచరిత్ర', 'సత్యభామవిజ యము' అలభ్యములు. భద్రకవి లింగన (1530-42 A. D.)

ద్విపదరచనలివి: (1) సానందచరిత్రము (3 ఆశ్వా.), (2) దేవాంగ పురాణము (7 ఆశ్వా.). సానందుడను ఋషి శివ పంచాక్షరీ ప్రభావమున యమలోకవాసులకు నరకబాధను తప్పించిన విషయము సానందచరిత్రలోకలదు. దేవాంగపురాణము వంశకీర్తనా రూపమగు ద్విపదకావ్యము. అందు మనుమహర్షి ఈశ్వరునకు దేవాంగ ఋషిగా జన్మించి పెక్కు అవతారములెత్తిన విషయము కలదు.

క్రీ. శ. 16 శతాబ్ది ఉత్తరార్ధమందుండిన 'బాలసరస్వతి' బిరుదాంకితుడగు చల్లగురవయ్య అను కవి 'యాజ్ఞవల్క్య విజయ' మను 6 కాండలుగల ద్విపదకావ్యమునురచించెను. యోగానందావధూతస్వామి (16 శతాబ్ది) అద్వైతపరమగు 'ఆత్మైక బోధ' మను ద్విపదగ్రంథమును, శైవవేదాంతబోధకమగు 'గురుశిష్య సంవాద' మను మంజరీద్విపద గ్రంథమును రచించెను.

క్రీ.శ. 16 శతాబ్దము కృష్ణదేవరాయల(1509-1530A.D) యుగమున ప్రాముఖ్యము నొందినది 'ప్రబంధ' వాఙ్మయశాఖ. ప్రబంధ కవిత సంస్కృత కావ్యములకు భిన్నమై, దేశీయ పద్ధతిలో స్వతంత్రముగా వెలసిన నూతన కావ్యసృష్టి. ద్విపదకావ్యములు ప్రౌఢములుకావని తలంచికాబోలు ఈ యుగమునందు పెక్కుమంది ప్రబంధకర్తలు ద్విపదకావ్యములలో ముఖ్యమగు వానిని ప్రబంధీకరించి ఆ కథను నవీన మార్గ కవితామండలమునకు (Neo-classical field) గొనిపోవలెనని యత్నించిరి. కొంచెమించుమించు ఒకే కాలము (1550-1600 A. D.) నందుండు శంకరకవి, శరభకవి, మల్లారెడ్డి మొదలగువారు గౌరన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానమును ప్రబంధీకరించిరి. వీరొకరి నొకరు తెలియకుండగనే రచించియుండవచ్చును. లేక ఒకరి

కొకరు పోటీగానైనను ఇట్లు ఒకేకథను రచించియుండవచ్చును. ఇట్లే చిన్నన్న (1545 A. D.) ద్విపద పరమయోగి విలాసమును (8 ఆశ్వా.) సిద్ధిరాజు తిమ్మభూపతి (1564 A. D.) 5 ఆశ్వాసములలో ప్రబంధీకరించినాడు.

మొత్తముమీద ఈ కాలమునందలి అభిరుచులు, అప్పటి కవులు ప్రబంధ కవిత్వముపై దృష్టినిడి రచించుటచే ద్విపద కావ్యముల వ్యాప్తి కొంతవరకు మరుగున పడినది. ఈ కాలమునందలి పైనిపేర్కొనిన ద్విపద కావ్యములైనను జనసామాన్యమునసే బహుళప్రచారమునందినవి.

## తృతీయఘట్టము (1600-1875 A.D.) కావ్యద్విపద రచనలు.

కృష్ణదేవరాయల మరణానంతరము దేశకాల పరిస్థితులు విషమదశకు వచ్చినను, ఆంధ్రవాఙ్మయము నభివృద్ధిమాత్రము తగ్గలేదు. దీనికి ప్రధాన కారణము సర్వత్ర వెల్లివిరిసిన తెలుగు భాషానురక్తియే. దేశాధిపతులు, పాళెగాండ్రు, ధనికులు, వర్తకులు, విద్యాధికులు- మొదలగువారందరును తెలుగు భాషాపోషణకుఁ దలకొనిరి.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము తెలుగుసాహిత్యము తెలుగుదేశమునసేగాక దక్షిణదేశపు నాయక రాజ్యములగు తంజావూరు, మధుర, పుదుక్కోట-మున్నగుచోట్ల వ్యాప్తి గాంచినది. కాని తంజావూరు, మధుర నాయకరాజ్యముల స్థాపన కాలముకంటె ముందుగ దక్షిణదేశమున ద్విపదకావ్యరచన జరిగినది. విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన అచ్యుత దేవరాయల (1529-1542 A. D.) ఏలుబడిక్రింద మధురప్రాంత దేశమును పాలించిన గోళ్ళ బసవనాయకుని (1530-40 A. D.)

పుత్రులు పెదరామప్ప, చినరామప్పలు ఆంధ్ర సాహిత్యమును ద్రావిడదేశమున నెలకొల్పినవారిలో ముఖ్యులు. చినరామప్ప తన యన్నయగు పెదరామప్ప పేర 'చొక్కనాథ చరిత్ర' మను ద్విపదకావ్యమును పచ్చకప్పూరపు తిరువేంగళకవిచే చెప్పించెను. పెదరామప్ప నాయకుడు (1531–1539 A.D.) అచ్యుత రాయలపక్షమున రామనాథపురము జిల్లా, తిరువత్తూరు తాలూకాలోని శివపురి ప్రాంతమును పాలించుచుండెను. అతడు మధుర చొక్కనాథస్వామి భక్తుడు. కనుకనే చొక్కనాథుని లీలలను వర్ణించు 'చొక్కనాథచరిత్రము' ను చెప్పించుకొనెను. "ఆంధ్ర వాఙ్మయమును తమిళదేశమున ప్రథమమున ప్రవేశపెట్టినవారు తంజావూరు, మధుర నాయకులు కారనియు, ఆ కీర్తి గోల్లవారికి చెందవలసియున్న" దనియు డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు వ్రాసిరి. దీనిని బట్టి చొక్కనాథచరిత్ర తమిళదేశమున రచింపబడిన ప్రథమాంధ్ర ద్విపదకావ్యమగును.

రఘునాథనాయకుడు (1614-1633 A. D.) సంగీత సాహిత్య సమరాంగణ సార్వభౌముడగు కృష్ణదేవరాయలతో సర్వ విధముల పోల్పదగినవాడు. తెలుగుకావ్య రచనావిషయమున కృష్ణదేవరాయలకంటెను ఇతనిలో గల సుగుణవిశేషము ద్విపదాభిమానము. రఘునాథ నాయకుని ద్విపదకృతులు రెండు. (1)అచ్యుతాభ్యుదయము(, అలభ్యము) (2) నలచరిత్ర. నలచరిత్ర ద్విపదగ్రంథము మహాభారతమందలినలచరిత్రకథననుసరించినది. తెలుగులోని ద్విపద నలచరిత్ర లన్నియు దీనితర్వాత వెలసినవే.

రఘునాథనాయకుని కుమారుడగు విజయరాఘవనాయకునికి (1633–1673 A. D.) కూడ ద్విపదయందభిమానము హెచ్చు. అతని ద్విపదకృతులు ఈ నాలుగు–

(1) పాదుకా సహస్రము
(2) మోహినీవిలాసము } ఈమూడును అలభ్యములు.
(3) మంజరీద్విపద

(4) రఘునాథ నాయకాభ్యుదయము. విజయ రాఘవుని తండ్రియగు రఘునాథనాయకుడే ఇందలి నాయకుడు. ఈ గ్రంథమున ఆకాలమునాటి నాయకరాజులచరిత్ర, దినచర్య, ఆస్థానవైభవము, అంతఃపుర విశేషములు మొదలగు అనేక విషయములు కలవు. విజయరాఘవుడు దీనిని మొదట ద్విపదగా రచించి పిమ్మట యక్షగానముగా పరివర్తింపజేసెను.

ఈ ఘట్టముననే తెలుగులో మొట్టమొదటిసారిగా 'అభ్యుదయకావ్యములు' ద్విపదచ్ఛందోరూపమున రచింపబడినవి.

పాల్కురికి సోమనాథుని కాలమునుండి నాయకరాజుల కాలమువరకు పరిణమించిన ద్విపద కావ్యములలో కేవలము ద్విపద ద్విపదరచనలందే వాడబడినది. చంపూకావ్యములలో ద్విపదగాని, ద్విపదకావ్యములలో మరియే యితర ఛందముగాని మిశ్రితము గాలేదు. యక్షగానములలో ఇతర దేశిచ్ఛందస్సులతోపాటు ద్విపద నొకఛందోభేదముగ విరివిగ నుపయోగింపబడి యుండుట ఒక అపూర్వ విశేషము. యక్షగానములందు ద్విపద ప్రసక్తినిగూర్చి డా॥ యస్వీజోగారావుగారు తన 'ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర'[24] యందిట్లు వ్రాసిరి.

"బహుయక్షగానములందు గ్రంథాంతమున కవి గద్యకు బదులు ద్విపదయే యుక్తమైనది. అందు కృతిసమర్పణము కవి విషయము నుండును. కొన్నిట గ్రంథారంభమునఁ గథాసంగ్రహాది విషయ కథనముకొఱకు నుపయుక్తమైనది. ద్విపదగ్రంథము

24. పుట 257, ఆంధ్ర విశ్వకళాపరిషత్ప్రకాశితము, 1961.

నడుమఁ బలుతావులఁ గథాకథనము, వర్ణన, పాత్రప్రవేశము (సంధిద్విపద – పాత్రప్రశంస, తెరద్విపద – పాత్రస్వీయోదంతో ద్ఘాటనము), పాత్రల సంభాషణ మొదలగు ననేక సందర్భము లందుఁ బ్రయుక్తమైనది. అదికాక ద్విపదరూపాంతరములెన్నియో యక్షగానములందుఁ బ్రయుక్తములైనవి.''

విజయరాఘవునితో తంజావూరు నాయకరాజ్యము సమసి పోయినది. మొదట నది మధుర నాయకులకు కైవసమైనది. కాని అటుపిమ్మట స్వల్పకాలముననే శహాజీ పుత్రుడు ఏకోజీ I (1676 - 1683 A. D.) వారిని జయించి మహారాష్ట్ర ప్రభుత్వ మును నెలకొల్పెను. అంతట ఆంధ్రుల అధికారమచట మాసి పోయినది. కాని ఆంధ్ర సాహిత్యమునకాదరణ మునుపటివలెనే సాగినది. తమ మాతృభాష మహారాష్ట్ర మయినను, తాము పాలించిన దేశము తమిళ దేశమైనను మహారాష్ట్ర రాజులు సంస్కృతాంధ్రములలో స్వయముగా గ్రంథములనురచించినారు. నాయకరాజులవలెనే వారు కవి పండితగాయకాదులను పోషించిరి.

తంజావూరునేలిన మహారాష్ట్ర ప్రభులలో నొకడగు భోసల ఏకోజీ II (1736 - 1737 A. D) రామాయణమును యథావాల్మీకముగ, సంగ్రహముగ ద్విపదలో రచించి తన తండ్రియగు తులజాజీ (1728 - 1736 A. D.) కి అంకితమిచ్చెను. ఏకోజీ II "సరస సాహిత్య లక్షణ చక్రవర్తి".

క్రీ. శ. 17, 18 శతాబ్దులందు దక్షిణదేశమునందు వెల సిన ప్రసిద్ధ ద్విపదకావ్యములివి.

(1) బాలరామాయణము – ఇది అలభ్యము. మధుర నాయకరాజుల కాలమున నుండిన గణవరపు వేంకటకవి (1670 A. D.) దీనిని రచించెను.

(2) రుక్మాంగద చరిత్ర – గ్రంథకర్త దర్భా వేంకట గిరి కవి. ఇతనికి విచిత్రరాయవతంసు డనికూడ పేరు కలదు.

(3) శివజ్ఞానమంజరి } ఈ రెండు వేదాంతద్విపద
(4) అనుభవదర్పణము } గ్రంథములను పరమానంద తీర్థయోగి (1600 A. D.) రచించెను.

దాక్షిణాత్యాంధ్ర యుగమున తమిళదేశమున వెలువడిన ద్విపదగ్రంథముల సంఖ్య (11) యితర సాహిత్య ప్రక్రియలతో పోల్చిన చాల తక్కువ. కాని ఈయుగమునకు సమకాలముననే ఆంధ్రదేశమున అనేక ద్విపదకావ్యరచనలు వెలువడినవి. అట్టి వానిని ఈక్రింద పరిశీలింతము.

ఈ ఘట్టముననే పద్య ప్రబంధములలో ఉద్గ్రంథము లనబడు పురాణేతిహాసముల ద్విపదీకరణము జరిగినది. భారతము లోని పరమార్థమును జనసామాన్యమునకు తెలుపవలెనను ఉద్దే శ్యముతోడనే కవిత్రయ భారతమును బట్టేపాటి తిమ్మయ (1550 - 1600 A. D.) ఆతుకూరి సోమన (1600 - 1650 A. D.) బాలసరస్వతి అను మరొక కవిత్రయము ద్విపదలో వెలయించెను. తిమ్మయ ఆదిపర్వము మొదలు ద్రోణపర్వాంతము వరకు గల ఏడు పర్వములలో నొక్క సభాపర్వము తప్ప తక్కిన ఆరింటిని నిర్వహించెను. బాలసరస్వతి ఒక్క సభాపర్వమును మాత్రమే రచించెను. ఇతడు వైయాకరణ బాలసరస్వతికాడు. వేరొకడు. 'అసమసాహిత్య విద్యాచతుర్ముఖు'డట. ఇతడు తిమ్మయకు మిత్రుడో, శిష్యుడో, శిష్యప్రాయుడో యైయుండును. ఇక ద్విపద భారతకవులలో మూడవవాడగుసోమన కర్ణపర్వము మొదలు స్వ ర్గారోహణ పర్వము వరకు మొత్తము పదునొకండు పర్వములను రచించినాడు. తిమ్మయ సంగ్రహముగా, ఉపఖ్యానరహితముగా

5 ఆశ్వాసములలో రచించిన అరణ్యపర్వమును సోమన, ఉపాఖ్యాన సహితముగ సర్వాంగ సుందరముగ 7 ఆశ్వాసములలో తిమ్మయ పేరనే వినిర్మించినాడు. ద్విపద భారత కర్తలలో తిమ్మయ రచన మేల్తరమైనది.

తృతీయ ఘట్టములో వెలసిన ద్విపద కావ్యములన్నిటి కంటె ప్రశస్తరచన కలది కట్టా వరదరాజ రామాయణము. వరదరాజు (1630 A.D.) రాజ కవి. వైష్ణవమతాభిమాని. శ్రీ వేంకటేశ్వర భక్తుడు. అతడు కడప మండలమునకు చెందిన వాడని, క్రీ. శ. 1618 మొదలు 1630 వరకును విజయనగర సామ్రాజ్యమునుపాలించిన రామదేవరాయలకు పెదతల్లి కుమారుడనియు, సమకాలికుడనియు డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు తెల్పియున్నారు.[25] యథావాల్మీకముగా రచితమైన వరదరాజ రామాయణము రామాయణ ద్విపదలకంటె పెద్దది; సరళమును, జాతీయమును నగు రచనకలది.

రత్నాకరము గోపాల కవి (1575-1650 A. D.) భారతాంతర్గతమగు 'సౌగంధిక ప్రసవాపహరణము' ను, భాగవత దశమస్కంధములోని పూర్వభాగమును ద్విపదలో రచించినాడు. ఇవి కావ్యకళాదృష్టితో ప్రబంధోచితవర్ణనలతో నొప్పియున్నవి.

నెల్లూరుమండలమువాడగు తేకుమళ్ల రంగశాయి (1790 A. D.) భాగవతములోని మొదటి నాల్గుస్కంధములనుమాత్రము పోతన పద్యభాగవతమునుండి ద్విపదకు అవతరింపజేసెను. పుష్పగిరి తిమ్మన రంగశాయికి సహస్రోత.

---

25. "17వ శతాబ్దినాటి ఆంధ్రవాఙ్మయవిశేషాలు" అనుబంధము 1 — భారతి, సంపుటము 23, సంచిక 2 - 1946 సం॥

క్రీ. శ. 17, 18 శతాబ్దులలో వైష్ణవమత బోధకములగు ద్విపద గ్రంథములనేకము రచింపబడినవి. వానిలో కాంద్రవేటి రామానుజాచార్యుల (1600) 'తిరువాయి మొళి' (అలభ్యము) కాళాధర కవి (1600) 'జాంబవతీ కల్యాణము' (అలభ్యము), పోలుమంచి బసవన (1600 A. D.) 'మైరావణ చరిత్ర' లేక 'హనుమద్విజయము', రేటూరి భావయామాత్యుని (1600 A.D.) 'ఆదిలక్ష్మీవిలాసము', చక్రపురి రాఘవాచార్యుని (1620 A.D.) 'విష్ణుభక్త చరిత్రము', శేషము చెన్నుభట్టారకుని (1690 A.D.) 'శశిరేఖా పరిణయము', శ్రీపెట్లూరి వేంకటార్యుని(17 శతాబ్ది) 'శ్రీనివాసవిలాససేవధి', వేల్పుకొండసింగరాచార్యుని(1700A.D.) 'అర్చిరాదిప్రబంధము', అచ్చి రామానుజా చార్యుల (1700) 'తత్త్వార్థ దర్పణము', శేషదాసు తిరువేంగళాచార్యుని (1700 A. D.) 'ఆత్మానందరసమంజరి', కంకంటి నరసింహకవి (1670 A. D.) 'విష్ణుమాయావిలాసము', దమ్మారావుపేట చౌడ రాఘవ రెడ్డి (1780 A.D.) 'రామాయణము', గోవర్ధనము అనంత కవి (1794 A.D.) 'మువ్వార్తవైభవము'- మొదలగు ద్విపదరచనలు ముఖ్యముగా పేర్కొనదగినవి.

ఈ ఘట్టమున శైవమత సంబంధములగు ద్విపద కృతులలో ముఖ్యముగా పేర్కొనదగినవి ఈ క్రిందివి.

(1) గౌడపురాణము— దీనిని మల్లికార్జున సిద్ధయోగి (1700 A.D) 3 ఆశ్వాసములలో రచించెను.

(2) మల్లారిచరిత్ర — స్కాందపురాణాంతర్గతమగు కర్ణకులీనుల చరిత్ర. గ్రంథకర్త మరింగంటివెంకటార్యుడు (1700A. D.)

(3) యోగీశ్వరవిలాసము —కర్త. సిద్ధేంద్రయోగి (1750 A. D.) ఇందు వీరశైవమత సిద్ధాంతములు వివరింపబడినవి.

(4) మఱిబసవపురాణము — ప్రఖ్యాత బసవేశ్వరుని వలెనే వీర శైవ మతప్రచార మొనర్చిన మరొక బసవనిచరిత్ర. దీనిని 7 ఆశ్వాసముల ద్విపదగ్రంథముగ బచ్చుసిద్ధకవి రచించెను.

(5) విభూతి రుద్రాక్ష మాహాత్మ్యము — బ్రహ్మోత్తర ఖండమున గల విభూతి, రుద్రాక్షమాహాత్మ్యములను కొలకటూరి వీరన లేక పోచిరాజు వీరన (1775–1800 A D.) ద్విపద రూపమున నాంధ్రీకరించెను,

(6) సురాభాండేశ్వరము — స్కాంద పురాణాంతర్గతమగు కాశీ ఖండములోని సురాభాండేశ్వర కథకు ద్విపద రూపమగు తెలుగుసేత. గ్రంథకర్త పులిగడ్డ నారన.

(7) నింబజామాహాత్మ్యము లేక ఏకవీరా మాహాత్మ్యము. కృతి కర్త బడగలపాటి నరసకవి (1740 A.D.)

(8) బసవవిజయము— నల్లనగండ్ల నాగనారాధ్యుడు (1750A D.) 3 ఆశ్వాసముల ద్విపదగ్రంథముగా రచించెను.

(9) కొలనిపాక మాహాత్మ్యము
(10) సిరియాళ చరిత్ర
(11) భల్లాణ చరిత్ర
(12) గంగావివాహము.
} ఈద్విపద కృతులను రచించినవాడు చిత్తారు గంగాధర కవి (1823 A. D.)

ఇంకను ఈ ఘట్టమున శైవమత సంబంధములగు ద్విపద కావ్యములు కొన్ని కలవు.

తృతీయ ఘట్టమున వైష్ణవ శైవ మతేతర ద్విపద గ్రంథములును వెలసినవి. మఱింగంటి సింగరాచార్యుని (1600 A D.) 'ధనాభిరామము', 'ప్రేమాభిరామము'ను, అప్పకవి(1656A D.) సాధ్వీజనధర్మము'ను, ముమ్మడి మల్లనాచార్యుని (1650A. D.)

తత్త్వచంద్రోదయమును— మున్నగునవి ఈ ఘట్టమున వెలసిన అలభ్యములగు ద్విపదగ్రంథములు.

కర్పూరము కృష్ణమాచార్యులు (1650 A. D.) 'భగవద్గీత'ను ద్విపదలో రచించెను. కవిసార్వభౌముడగు కూచిమంచి తిమ్మకవి (1684—1757 A. D.) సారంగధరచరిత్రను ద్విపదలో రచించినాడు. అతనిసోదరుడగు కూచిమంచి జగ్గకవి (1700A.D.) 'రాధాకృష్ణ చరిత్రము'ను ద్విపదలో రచించినాడు.

క్రీ. శ. 1775—1875 కాలము ఆంధ్రవాఙ్మయ చరిత్రయందు క్షీణయుగమని వాఙ్మయ చరిత్రకారుల మతము. ఈ యుగమున అనుకరణ సాహిత్యమే గాని స్వతంత్ర కావ్యములు గాని, స్వతంత్రభావములు గాని వెలువడలేదని విమర్శకుల అభిప్రాయము.

క్రీ. శ. 19 శతాబ్దమున వేదాంతవిషయములు, యోగశాస్త్రాదిగహనవిషయములు, పామరజనులకుకూడ తేటతెల్లము చేయు తలంపుతో సులభశైలిలో ద్విపద గ్రంథములు రచింపబడినవి. మంగమాంబ రచితనుగు 134 ద్విపదలుగల 'కృష్ణమంజరి' ఇటీవలనే దొరికినది. మంగమాంబ కుమార్తెయగు వెంగమాంబకు (1840 A. D.) తెలుగు కవయిత్రులలో విశిష్టస్థానము కలదు. వెంగమాంబకూడ 137 ద్విపదలుగల 'కృష్ణమంజరి' ని ద్విపదలో రచించినది. వెంగమాంబ రచించిన వేదాంత ద్విపద కృతులివి— వాసిష్ఠ రామాయణము, రాజయోగసారము. ఈ గ్రంథములు ముద్రితములై ప్రచారమునందున్నవి. తరిగొండ వెంగమాంబ భాగవతము 12 స్కంధములను కూడ ద్విపదలో రచించెను. అందు 6 కాండలు మాత్రమే లభ్యమగుచున్నవి.

ఈ ఘట్టమున చారిత్రకములగు కథలు, నీతికథలు, వినో

దము కల్గించు కథలు, సాహస కథలు, పతివ్రతకథలు - మొదలగునవి ద్విపదచ్ఛందోరూపమున రచింపబడినవి. ఈ కథా వాఙ్మయ ద్విపద కవులలో పెక్కుమందినిగూర్చి మనకు తెలియ రాకున్నను వారి రచనలుమాత్రము జనరంజకప్రియములై నేటికిని నిలిచినవి.

గంగుల పినయల్లయ (17 శతాబ్ది) 'కాటమరాజుకథ'ను మంజరీద్విపదలో 'శ్రీనాథు వచనపద్ధతిని' రచించినాడు. వెన్నెకంటి ఒరంగల్లు చంద్రశేఖరకవి (1700 A.D.) 'హరిశ్చంద్ర చరిత్ర' పిల్లలమఱ్ఱి బంగారురంగప్ప (1770 A.D.) 'బేతాళ చరిత్ర', కొండయ కవి 'విక్రమార్కుని కథలు', మరింగంటి వేంకటనరసింహాచార్యుల (1800 A. D.) 'శ్రీకృష్ణతులాభారము' (అలభ్యము)- పురుషోత్తమదాసు (1875 A. D.) 'ధర్మాంగద చరిత్ర', బుచ్చన్నపంతులు (1875 A. D.) 'సానందచరిత్ర' -మున్నగునవి 18, 19 శతాబ్దములందు ముఖ్యముగా పేర్కొనదగిన ద్విపద రచనలు.

ఈ కాలమునుండి సాంఘికాభిరుచులు భిన్నములగుటచే కాబోలు తెలుగులో చంపూకావ్యములతో పాటు ద్విపదకావ్యములపై ఆసక్తి కూడ సన్నగిల్లినది. అయినను ద్విపద కావ్య రచన కొనసాగుచునేయున్నది కాని ఆగిపోలేదు.

## చతుర్థఘట్టము (1875- ) ఆధునిక ద్విపదరచనలు.

తెలుగు సాహిత్యచరిత్రలో క్రీ.శ. 1875 నుండి ఆధునిక యుగము ప్రారంభమగును. ఈయుగమున వచనము, నాటకము, భావకవిత్వము— అను మూడు సాహిత్య ప్రక్రియలు బహుళ వ్యాప్తికి వచ్చినవి. నవీన లక్షణములుగల సాహిత్యము వ్యాప్తికి వచ్చినను ఈ యుగమున ప్రాచీన లక్షణములుగల సాహిత్యము

కొంత జరుగక పోలేదు. వచనమువలె సులభతరమగు సాహిత్య ప్రక్రియ యని భావించి కాబోలు ఆధునిక యుగమున పెక్కుమంది కవులు ద్విపదకావ్యములను, ద్విపదఖండికలనురచించినారు.

వీరేశలింగము పంతులు (1848–1919 A. D.) స్త్రీజనోపయుక్తముగా 'సత్యాద్రౌపదీసంవాదము' ను లఘుద్విపద కృతిని, 'మాతృపూజ', 'పితృపూజ'– అను ద్విపదఖండికలను వ్రాసినాడు. వావిలకొలను సుబ్బారావు (1863–1938 A. D.) 'భగవద్గీత' ను, పూండ్ల వేంకటరమణయ్య (1900 A. D.) 'మనుచరిత్ర' ను, శేషమాంబ (1900 A. D.) 'బ్రహ్మైక్యబోధ' ను, తురగా పురుషోత్తమ శర్మ (1900 A. D.) 'కృష్ణకథామృతము' ను, కారాణవైరాగ్యరావు (1900 A. D.) 'పతివ్రతాచరిత్రము' ను, వెంపల శాంతాబాయమ్మ (1900 A. D.) 'సక్కుబాయమ్మగారి చరిత్ర' ను, కె. శివకృష్ణదాసు (1900 A. D.) 'మార్కండేయ చరిత్ర' ను, గార్లదిన్నె సుబ్బారావు (1910 A. D.) 'ఉత్తర హరిశ్చంద్రీయము' ను, మామిడన్న సుభద్రమ్మ (1910 A. D.) 'అధ్యాత్మరామాయణము' ను, వేంకట పార్వతీశ్వరకవులు 'రత్నహారము' ను, పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు 'మేఘదూతము' ను, ఎల్లమరాజు నారాయణభట్టు 'సేవాంజలి' ని, వాకాటి పెంచలరెడ్డి 'ప్రహ్లాదచరిత్ర' ను, కేశవతీర్థస్వామి 'శ్రీరామచరితమానసము' (తులసీదాసురామాయణమునకు ద్విపదానుకృతి) ను, పుట్టపర్తి నారాయణాచార్యులు 'పండరీ భాగవతము' ను– మున్నగువారు అద్యతన కాలమునందు ద్విపదకావ్యములను రచించిరి. ఇవిగాక ఇంకను ఎన్నో ద్విపదఖండికలును ఈ కాలమున వెలువడినవి. ఈ కాలమునందలి గేయకవిత్వమునందు ద్విపదచ్ఛందోరూపమగుఛాయలుఎక్కువగా గోచరించుచున్నవి.

ఈ ప్రకరణమున ద్విపదరచనావిర్భావమునకు వీరశైవ మతమెట్లు ప్రధాన కారణమైనదో తెలిసికొంటిమి. శివకవులు ప్రవేశపెట్టిన భాషాసాహిత్యరీతులకు తర్వాతి కాలమున పండిత లోకమున ఎక్కువ వ్యాప్తికలుగ లేదు. కాని ద్విపదప్రక్రియను మాత్రము శైవేతర కవులును ఆదరించిరనియు ప్రాచీన పండిత విమర్శకులు కొందరు ద్విపదను నిరసించినను మొత్తముమీద ద్విపదరచన ప్రతి శతాబ్దమునందును కొనసాగుచునే యున్న దనియు నిరూపించితిమి. అవ్యవహితముగ పరిణామాభివృద్ధిని పొందిన ద్విపదవాఙ్మయమును ప్రధానమగు నాల్గు ఘట్టములుగ విభజించుకొంటిమి. ఈవిభజనమునకు (1) ద్విపదకవులకాలమును (2) వారి దృక్పథమును (3) దేశకాల సాంఘిక పరిస్థితులను (4) రచనారీతులను ముఖ్యసూత్రములుగ పాటించితిమి. తెలుగు వాఙ్మయమున కవికాలాదులు తెలిసిన ద్విపదగ్రంథము లన్నిటిని- లభ్యములు, అలభ్యములు, ముద్రితములు, అముద్రితములు ఈ ప్రకరణమున పేర్కొంటిమి. ఇక నాల్గవప్రకరణమున ద్విపద కావ్యముల వర్గీకరణమును, వాని విమర్శయు ముఖ్యవిషయము.



# నాల్గవ ప్రకరణము

## ద్విపదకావ్యముల వర్గీకరణ

కాలక్రమ పద్ధతిని, రచయితల దృక్పథమును, దేశకాల సాంఘిక పరిస్థితుల ప్రభావమును దృష్టియందుంచుకొని ద్విపద వాఙ్మయ పరిణామమును నాల్గు ఘట్టములుగా విభజించుకొని మూడవ ప్రకరణమున పరిశీలించితిమి. కాలక్రమదృష్టితో గాక కథావస్తు తత్త్వమును, రచనావిధానమును, కావ్యప్రయోజనమును ప్రధానముగా పురస్కరించుకొని పరిశీలించిన తెలుగున పద్యకావ్య వాఙ్మయమున ఎంతటి వైవిధ్యము కలదో ద్విపద కావ్యవాఙ్మయమునను అంతటి వైవిధ్యమున్నది. ఇది ఎన్నదగిన ముఖ్యవిశేషము. ఈదృష్టితో ద్విపదశాఖలో చేరిన గ్రంథరాశిని ఈ క్రింది పది తరగతులుగ విభజింప వచ్చును.

(1) పౌరాణికములు. (2) వంశకీర్తనలు.
(3) కావ్యప్రబంధములు. (4) కల్యాణాత్మకములు.
(5) క్షేత్రమాహాత్మ్యములు. (6) వ్రతమాహాత్మ్యములు.
(7) భక్తిప్రబోధకములు. (8) తాత్త్వికములు.
(9) చారిత్రకములు. (10) చిత్రాఖ్యానములు.

ద్విపదప్రక్రియా వైవిధ్యము యొక్క తత్త్వమును, వైశిష్ట్యమును సమగ్రముగ నెరుంగుటకుపై విభజన చాల నుపకరించును.

## 1. పౌరాణికములు:

'పురా + అనక్తి' = ప్రాచీన విషయములను పెంపొందించునది 'పురాణము' అని బ్రహ్మాండపురాణమునందు నిర్వచింపబడినది. "పురాఽపినవమ్ పురాణమ్" - అనగా పూర్వచరిత్రలను తెల్పునదయ్యును క్రొత్తదిగానుండునది పురాణమను నిర్వచన మొకటి పండితలోకమున కలదు.

పురాణములు వేదపురుషుని ఆత్మ అని చెప్పబడుచున్నవి.

"అలౌకికములును అద్భుతములును అయిన భగవల్లీలా కథనములతో నిండినది పురాణము"[1] వేదములందంతగా లేని అవతారముల ప్రసక్తి, భగవన్మహిమలు, భగవదారాధనము, పురాణములందు స్పష్టముగా కన్పించు ముఖ్య విషయములు. సంస్కృతమున అష్టాదశ పురాణములు కలవు. ఇవి గాక ఆయా ప్రాంతీయ భాషలలో కొన్ని పురాణములునుకలవు. మతదృష్టితో పురాణములు విష్ణుపురాణములని, శివపురాణములని వ్యవహరింపబడుచున్నవి. పురాణములందలి కథావస్తువెల్లను ఉపాఖ్యానముల కూర్పు. అవి అన్నియు ఏదైన ఒక ధర్మమునుగాని, ఒక తత్త్వమునుగాని, ఒక సత్యమునుగాని, ఒక నీతినిగాని బోధింపవచ్చును. లేక ఒక్కొక్క ఉపాఖ్యాన మొక్కొక్క విశిష్టప్రయోజనమును ప్రతిపాదింపవచ్చును. పురాణములందలి ఉపాఖ్యానములు స్థూలముగానో, సూక్ష్మముగానో లోకవృత్తమును ప్రదర్శించుచుండును, పురాణములందు కవికి కావ్యకళకు సంబంధించిన రసపాత్ర పోషణాదులందు దృష్టి తక్కువ. కథాకథనమునం దెక్కువ.

1. చూ॥ 'నా రేడియో ప్రసంగాలు' పుట 133.

వ్యుత్పత్తిని బట్టి పరిశీలించిన 'ఇతిహాస' 'పురాణ' శబ్దములు రెండును కొంచెమించుమించుగా సమానార్థకములే. "ఒక కాలమున ఒక రాజవంశమునకో, ఒక జాతికో సంబంధించిన చారిత్రకాంశము గలది ఇతిహాసము." ఇతిహాసము కథాప్రధానము. పురాణము సర్గప్రతి సర్గాది పంచలక్షణోపేతము. కాని క్రమముగా పురాణములందును వర్ణనలు, కథలును ప్రవేశించినవి. ఇతిహాస, పురాణముల రెంటికిని కూడ పురాణమనియే నేడు రూఢిలో నున్నది. ఇతిహాసమున పురాణములందు వలె ధర్మ ప్రసంగములు, శాస్త్రమీమాంసలు, సృష్టిరహస్యములు, నీతి బోధలు కూడ వెల్లివిరియుచుండును. ఇవి విజ్ఞానదాయకములు.

తెలుగువారికి పురాణప్రీతి మెండు. పురాణ పఠన శ్రవణమువలన ఇహపర శ్రేయము కల్గునని ఒక విశ్వాసము. ద్విపదలోని పౌరాణిక రచనలను నాల్గురకములుగ వర్గీకరింపవచ్చును.

(1) ద్విపదశైవపురాణములు. (2) ద్విపదరామాయణములు
(3) ద్విపద భాగవతములు. (4) ద్విపదభారతములు.

## 1. ద్విపద శైవ పురాణములు:

ద్విపదశైవ పురాణములలో చేర్చదగినవి:

1. బసవపురాణము (ముద్రితము) } పాల్కురికి సోమనాథుడు
2. మల్లమదేవిపురాణము (అలభ్యము) } (1160-1240 A. D.)
3. పండితారాధ్యచరిత్ర (ముద్రితము) }
4. నవనాథచరిత్ర (ముద్రితము) - గౌరన (1345-1445 A. D.)
5. ప్రభులింగలీల (పూర్వభాగముమాత్రమే ముద్రితము)
— పిడుపర్తి సోమనాథుడు (1500–1525 A. D.)

6. మఱిబసవపురాణము (అముద్రితము)

— బచ్చు సిద్ధకవి (17 శతాబ్ది)

7. గౌడపురాణము (అముద్రితము)

—మల్లికార్జున సిద్ధయోగి (1700 A. D.)

8. బసవవిజయము(అముద్రితము)—నల్లనగండ్ల నాగనారాధ్యుడు

9. బ్రహ్మోత్తరఖండము (అలభ్యము)

—పిడుపర్తి బసవన (1475—1500 A. D.)

10. మార్కండేయ పురాణము (అముద్రితము)

పర్వతమంత్రి లింగన.

11. మార్కండేయ చరిత్ర (అముద్రితము)

— కె. శివకృష్ణదాసు (1900 A. D.)

12. శివరహస్య ఖండము (అము[illegible]ము)- వింటి ఔబళకవి.

13. శంకర సంహిత (అముద్రితము [illegible]వి పేరు తెలియదు.

వీనిలో మొదటి ఎనిమిది స్వతంత్ర రచన లనదగినవి. చివరి అయిదును అనువాద గ్రంథములు. ఇవి పంచలక్షణలక్షిత ములు కాకపోయినను పురాణధర్మమును కల్గియున్నవి. ఇందు శివాంశ సంభూతులగువారి మాహాత్మ్యాదులు వర్ణితమగుటచే వీనిని శైవపురాణములని పేర్కొందము.

బసవన, పండితారాధ్యుడు— వీరు పురాణపురుషులుకారు; చారిత్రక పురుషులే. కాని బసవనను నందీశ్వరుని అవతారమని వీరశైవులు విశ్వసింతురు. ఇక పండితారాధ్యుడు ప్రమథుల అవ తారమట. శివునితో సమానమగు శక్తి కలవాడట.

బసవనచరిత్రకు పవిత్రతను, ప్రాచీనతను ఆపాదించుటకు దానిని పురాణప్రబంధముల స్థాయినిచేర్చుటకు పాల్కురికి సోమ నాథుడు దానికి 'పురాణ' మని పేరిడియుండును.

బసవపురాణము నందు ప్రతిపాదింపబడిన వీరశైవము శ్రుతిస్మృతి మూలకమే అని అందుస్పష్టముగా పేర్కొనబడినది.

"ఉరవడి చేసి భక్త్యుద్రేకములమ
బరమార్థ మెడలంగఁ బలికెనావలదు
ఇది శ్రుతిస్మృతి మూలమే కాని యొండు
పదక వాదంబని భావింప జనదు."

— బసవపురాణము. 1 ఆశ్వా. పుట. 47.

"అకలంక లింగ రహస్య సిద్ధాంత
సకల వేద పురాణ సమ్మతంబైన
యాతత సకల పురాతన భక్త
గీతార్థ సమితియే మాతృక గాక"

— బసవపురాణము 1 ఆశ్వా. పుట 47.

బసవన చరిత్రను వర్ణింతునని సోమనాథుడు బసవపురాణావతారికలో తెల్పినాడు. వీరశైవము వేదార్థ ప్రతిపాదకమను విషయము పండితారాధ్య చరిత్రయందు సప్రమాణముగా నిరూపింపబడినది.

బసవపురాణములోని ప్రధానేతివృత్తమగు బసవన చరిత్రతో ప్రసక్తానుప్రసక్తములుగ ద్రవిడాంధ్ర కర్ణాటక మహారాష్ట్ర దేశములకు సంబంధించిన వారును, బసవనకు సమకాలికులును, పూర్వులును నగు శివభక్తుల చరిత్రలనేకము ఉపాఖ్యానములుగ జోడింపబడి గూర్పబడినవి. పండితారాధ్యచరిత్ర, నవనాథచరిత్ర, ప్రభులింగలీల, మఱిబసవపురాణము మొదలగు ద్విపద శైవ పురాణములందును ఈ ఉపాఖ్యానముల కూర్పు కలదు. వీనియందు కూడ శివాంశ సంభూతులగు మహాపురుషుల మాహాత్మ్యాదికములు అలౌకికముగ వర్ణింపబడుటచే వీనినిగూడ 'పురాణము' లని పేర్కొన వచ్చును.

## 1. బసవపురాణము:

పాల్కురికి సోమనాథుని రచితమగు బసవపురాణము (1192 A. D.) 7 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. సి. పి. బ్రౌను (Brown) దొరగారి లెక్క ప్రకారము ఇందు 6288 ద్విపదలు కలవు. బసవపురాణ కథాశ్రోత గొబ్బూరి సంగనామాత్యుడు.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణమునకు కథాసామగ్రిని కథాకోవిదులగు వృద్ధులనుండి, బసవన చెప్పినపాటలు, పదములు మొదలగు దేశీయ గేయరచనలనుండి, ఇతర శైవ గ్రంథములనుండి గ్రహించినట్లు తెలియుచున్నది.

"వరకథా సూత్రంబు వెర వెఱింగించి
చరితార్థుఁ జేయరే కరుణతో ననుచు"

— బసవపురాణము. 1 ఆశ్వా. పుట. 5.

"చెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ
దప్పకుండఁగను యథాశక్తిఁ జేసి"

అనుటచే బసవపురాణ చరిత్ర సోమనాథుని కపరిచితమనుట తెలియును.

"ఆతత సకల పురాతన భక్త
గీతార్థ సమితియే మాతృక గాఁగఁ
బూరితంబైయొప్పు పూసల లోన
దారంబు క్రియఁ బురాతన భక్త వితతి
చరితల లోపల సంధిల్ల బసవ
చరిత మే వర్ణింతు సత్కృతి యనగ"

— 1 ఆశ్వా. పుట 9.

అని సోమనాథుడు చెప్పినాడు.

బసవపురాణములోని భక్తుల కథలను విషయమును బట్టి మూడు విధములుగ[2] విభజింపవచ్చును. 1. మహిమాన్వితుల కథలు. 2. ముగ్ధభక్తుల కథలు. 3. వీరశైవమత సిద్ధాంత ప్రతిపాదకములగు కథలు.

1. మహిమాన్వితుల కథలు:

ఇవి సుమారు 36 కథలు కలవు. కూడలి సంగమేశ్వరుని బోధల వలనను, అల్లమ ప్రభువను శైవాచార్యుని వరముల వలనను, శివభక్తిచేతను బసవన మహిమాన్వితుడై అనేకాద్భుత కార్యములను ప్రదర్శించెను. బసవన మహిమచే వంగకాయలు లింగకాయలుగా మారినవి. (చూ; 2వ ఆశ్వా. పుట 96.) ఈ సందర్భమున బల్లేశు మల్లయ్య మహిమచే కుంచము శివలింగముగా మారుట (2వ ఆశ్వా. పుట 97.) కాటకోట డను గొల్లని మహిమచే ఏటవెంద్రుక లింగముగామారుట (2 ఆశ్వా. పుట 98.) బసవన మహిమచే జొన్నలుముత్యములగుట 2వ ఆశ్వా. పుట 100) మొఱటద వంకయ్య మహిమచే కొఱఱ ప్రియం కురితమై గొడ్డుటావునందు పాలనుబడయుట (2 ఆశ్వా. పు. 100) మున్నగు కథలు భక్తులచే స్మరింపబడును.

బసవన తన్ను స్మరించినంతనే గొల్లతె చల్లకడవ పడిపోకుండ పట్టుకొని సాయపడెను. (2 ఆశ్వా. పు. 107.) ఈసందర్భమున చిట్టంబలాధీశుడు తిరుచిట్టంబలుని చేతిలోని పువ్వులను పడిపోకుండ పట్టుకొనిన కథను (2 ఆశ్వా. పు. 109.) బసవడు నందీశ్వరుని అవతారమని నిరూపించు సిద్ధరామయ్య కథను (2 ఆశ్వా. పు. 111.) గొల్లతె వినిపించును.

2, చూ॥ 'బసవపురాణ కావ్యభాషా ఛ్ఛందో విశేషములు'- వంతరాం రామకృష్ణరావు. ఆంధ్రపత్రిక శోభకృతు ఉగాదిసంచిక 1963-64

బసవపురాణమున శివభక్తులమహిమ శివునికన్న ఘనతరమైనదిగ నిరూపింపబడినది. కలకేత బ్రహ్మయ్య చేపట్టిన పండ్లు పసిడిగా మారినవి (5 ఆ. పు. 347.) అతని మహిమచే తంగేడు పువ్వులు ధనముగా మారెను. కిన్నర బ్రహ్మయ్య అను శివభక్తుడు 'త్రిపురాంతకా' అనిపిలువగనే శివుడు 'ఓ' యని సమాధానమిచ్చెనట. అతడు శివునిచే సాక్ష్యమును చెప్పించినాడు. (చూ॥ 5 ఆ. పు. 342.) ముసిడిచౌడయ్య 'శరణార్థి' అని పలుకగనే మరణించినతపస్వి జీవించును. చౌడయ్య మరణించిన స్త్రీని మరల బ్రతికించెను. అన్యదర్శనులు తెచ్చిన కృత్రిమ శవమును అతడు జీవాంగునిగా జేయును (చూ॥ 5 ఆ. పు. 368.) సురియ చౌడయ్య (చూ॥ 5 ఆ. పు. 384) తన చేతి అన్నపు ముద్దలను శివుడారగించునట్లు చేసినాడు. ఏకాంతరామయ్య (చూ॥ 6 ఆ. పు. 399.) బసవన మున్నగు భక్తులు చూచుచుండ తన తల నరకుకొని మరల బడయును. ఏకాంతరామయ్య జైనులను వాదమున నోడించి శైవమతమును స్థాపించెను. ఈ సందర్భమున ఇరుత్తాండి, (చూ॥ 6 ఆ, పు, 408), పిళ్లనైనారు (చూ॥ 6 ఆ॥ పు. 409,), నిడుమారడు (చూ॥ 6 ఆ. పు. 418), నమినంది (చూ॥ 6ఆ. పు. 420.) సాంఖ్యతొండడు (చూ॥ 6 ఆ. పు. 422 గోవూరి బ్రహ్మయ్య (6 ఆ. పు. 425.) తేడరదాసయ్య (చూ॥ 6 ఆ. పు. 426.), హిరియ నాచయ్య (చూ॥ 6 ఆ. పు. 440) సోమన్న (6 ఆ. పు, 442.), వైజకవ్వ (6 ఆ. పు. 444.), -అనువారి మహిమలు స్మరింపబడినవి. షోడ్డలదేవు బాచయ్య (6 ఆ. పు. 455.) మహిమవలన సౌరాష్ట్రనాథుడే వచ్చి అతని ముందు ప్రతిష్ఠుడై పూజలనొందెను. మోళిగ మారయ్య (చూ॥ 5 ఆ. పు. 354) మహిమచే కట్టెలు బంగారు నక్కలయినవి. మడి

వాలు మాచయ్య అను చాకలి వీరశైవ భక్తుడు తాను చంపిన మనుజుని, ఏనుగును మరల బ్రతికించెను. (చూ! 4 ఆ. పు 232)

## 2. ముగ్ధభక్తుల కథలు:

బసవన చెన్నబసవనితో ముగ్ధసంగయ్యను గూర్చి చెప్పు మాటలలో ముగ్ధభక్తి ఇట్లు ప్రశంసింపబడినది.

"ఇట్టి నెట్టన భక్తి యిట్టి ముగ్ధత్వ
మిట్టి మాహాత్మ్యంబు నెందును కలదె?
నిక్క మీశ్వరుఁ గాని నిజమెఱుంగమిని
ముక్కంటి భక్తులు ముగ్ధులు గారె?"

— బసవపురాణము. 3 వ ఆశ్వా. పుట. 144

మిండ జంగములు వేశ్యాగారమును ప్రవేశించుటజూచి ముగ్ధసంగయ్య అదియును ఒక లింగార్చన అనుకొని తానును అందుకు పోవుదునని బసవనతో పల్కును. బసవన అతనిని పరిచారకులచే నొక వేశ్యగృహమునకు పంపును. ముగ్ధసంగయ్య అచటికిపోయి, సజ్జపట్టుచూచి లింగార్చనచేయు సదనమనుకొని, కంబలిపైకూర్చుండి శివసమారాధనకుపక్రమించును. వేశ్య వేషాలంకరణను గాంచి "ఇట్టి లాంఛనమున కెవ్వరాచార్యులు" అని సంగయ్య ప్రశ్నించును. ఆమెతో కలసి శివపూజ చేయుచు రాత్రియంతయు గడపి బసవనకడకు ఉదయమునవచ్చి అచ్చటి వేశ్యాజనమును వర్ణించి "చెలువల మహిమంబు శివుఁడె యెఱుంగు ననుచుఁ దత్సతుల లాంఛనములు నచట, తన మిండతనమును దప్పక" చెప్పును. ముగ్ధసంగయ్య మౌగ్ధ్యము బుష్యశృంగుని మౌగ్ధ్యముకంటె ఎన్నోరెట్లు హెచ్చుగా కన్పడును.

అరణ్యములో స్త్రీపురుష భేదము తెలియని ఋష్యశృంగుని మౌగ్ధ్యము వింత కాదు. విండజంగముల నిలయమగు కల్యాణకటకములో నివసించు సంగయ్య మౌగ్ధ్యమపూర్వమైనది. ఈ కథా సందర్భమున రుద్రపశుపతి (చూ॥3 ఆ. పు. 145), నక్కనైనారు (3 ఆ. పు. 149), బెజ్జమహాదేవి (3 ఆ. పు. 151), గొడగూచి (3 ఆ. పు. 160), దీపద కళియారు (3 ఆ. పు. 166), నాట్యనమిత్తండి (3 ఆ పు 174), ఉడుమూరి కన్నప్ప (3 ఆ పు 180), కళియంబనయనారు (3 ఆ పు 205) మున్నగు ముగ్ధభక్తుల కథలు తెలుపబడినవి.

శివుడు విషముతినెనుగదా యని దుఃఖించి అతని విషము గ్రక్కుమని వేడిన రుద్రపశుపతి ముగ్ధభక్తి, శివుని చేపాలు త్రావించి అతనిలో లయమైన గొడగూచి బాలభక్తి, శివుని తల్లిప్రేమతో లాలించిన బెజ్జమహాదేవి మాతృభక్తి- మున్నగునవి బహుధా ప్రశంసింప దగినవి. ఉడుమూరు కన్నప్ప ముగ్ధభక్తులకు ఆదర్శ పురుషుడు; తలమానికము. కవియొక పాత్రముఖమున,

"ఇట్టి ముగ్ధత్వంబు నిట్టి వీరత్వ
మిట్టి మహత్త్వంబు నెందును గలదె"

—3వ ఆశ్వా. పుట 198.

అని పల్కించి కన్నప్ప ముగ్ధవీరుడని వ్యంగ్యముగా సూచించినాడు. ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యములోని కన్నప్ప కథకిదియే మూలము.

ముగ్ధభక్తులు వీరమహేశ్వర వ్రతపారీణులై యున్నను అధికముగా అమాయకులు, నిరాడంబరులు, స్నిగ్ధప్రవృత్తులు కలవారు. వారు పారవశ్యముతో కూడిన భక్తిభావముకల్గినవారు.

### 3. వీరశైవమత ప్రతిపాదకములగు కథలు:

బసవనప్రచారముచేసిన శైవమతములో భక్తియే ప్రధానము. అందు జాతి, మత, లింగ వివక్షతలు లేవు. వేదోక్త కర్మల నిరసనము, శివోత్కర్ష, భక్తిచే భగవంతుని పలికించుట వీరశైవమత లక్షణములు. గురు లింగ, జంగమ ప్రసాదపాదోదకములు విభూతి రుద్రాక్షాది రుద్రచిహ్నాలు. ఈ మతములో అవినాభావ సంబంధము కలవి. సంగమేశ్వరుడు బసవనకు ప్రత్యక్షమై బోధించిన ధర్మములు (చూ॥ 1 ఆ. పు. 56) ఈ మత సంప్రదాయములను తెలియజేయును.

బసవన బ్రాహ్మణ కులమునందు జన్మించినను ఉపనయనమును నిరాకరించి వీరశైవ దీక్షను బూనును. ఇది కర్మమార్గ నిరసనమును తెలియజేయును.

బిజ్జలుడు మడివాలు మాచయ్యను 'చాకలి' అని తేలికగా మాటాడినపుడు బసవన,

"కులజుండు నతడె యకులజుండు నతఁడె
కులము లేకయు నన్ని కులములు నతఁడె
యానీలగళు నపరావతారంబు
గాన యాతఁడు సర్వగతుఁ డెట్టులనిన"

—బసవపురాణము. 4వ ఆశ్వా. పుట. 237.

అని అన్నికులములు అతడేనని చెప్పి తుదకు "ఏకార్ణవంబైన యెడ నజాచ్యులఁ జేకొన కుదికెడు చాకియు నతఁడ" (చూ॥ 4 ఆ. పు. 239) అని తెల్పెను.

"గురు కర స్పర్శచేఁ గుల మొక్కటౌట
యరిదియే యట్ల యత్యంజుఁడు నగ్రజుడు"-

అని తెల్పు సందర్భమున శివనాగుమయ్య (7 ఆ. పు. 491), కల్లిదేవయ్య (7 ఆ. పు. 496), బిబ్బబాచయ్య (7 ఆ. పు. 504) మాదర దూడయ్య (7 ఆ. పు 514), బానసభీమయ్య (7 ఆ. పు 516), శ్వపచయ్య (7 ఆ. పు. 516), ఉద్భటుడు (7 ఆ. పు. 517), కక్కయ్య (7 ఆ. పు. 521), భోగయ్య (7 ఆ. పు. 523), గుడ్డవ్వ (7 ఆ. పు. 528)- అను మాలవారి కథలు తెలుపబడినవి. ఈ కథలలో మహిమ అంతర్భూతముగానున్నది.

వీరశైవమున కష్టార్జితమగు ధనమునకే విలువ యెక్కువ. ప్రతి శివభక్తుడును ఏదో ఒక కాయకవ్రతమును గైకొనును. మడివాలు మాచయ్య శివభక్తుల బట్టలుదుకుటను వృత్తిగా గైకొనినాడు. శంకరదాసయ్య బొంతలు కుట్టి జీవించువాడు. శంకర దాసయ్య,

"బొంతకు గంతకుఁ బ్రోవిడిపోవు
నంతకు విక్రయం బార్చి తెప్పించి
యక్కజం బందఁ గాయకలబ్ధి నిత్య
మొక్కవు దఱుగవు నేను మానికలు
జంగమ కోట్లకు సముచితార్చనలు"

-4 ఆశ్వా. పు. 258.

భంగిగా "జరుపుచుండగా" శివుడు ప్రత్యక్షమై వరము వేడుమనగా,

"కర్తల కర్త మత్కర్తవై నీవు
వర్తింప నింకొండు వరమేలవేఁడ
కడుఁగాక యేమియు నడుగమిసిగ్గు
పడియెద నడిగెదఁ బగలింటి యట్ల
రాత్రియు నూఁది దారంబుఁ గ్రువ్వంగ
నేత్రములను దృష్టిస్ఫూర్తి నెక్కొల్పు"-

—4 ఆ. పు. 260—261.

మని కోరినాడు. దీనిని బట్టి శివభక్తుల వృత్తిగౌరవము సువ్యక్తమగుచున్నది.

వీరశైవమున భక్తులకు అహంకారము కూడదు. 'విను మహంకారించినను భక్తియగునె'' (4 ఆ. పు. 257) అని మడివాలు మాచయ్య బసవని మందలించుచు చెప్పెను. అందుకు దృష్టాంతముగ ఈసందర్భమున శంకరదాసి కథ (4 ఆ. పు. 257) జగదేకమల్లునికథ (4 ఆ. పు. 262), సిరియాలునికథ (4 ఆ. పు. 267), నిమ్మవ్వకథ (4 ఆ. పు. 276), నరసింగ నయనారుని కథ (4 ఆ. పు. 281—83), కొట్టరువు చోడనికథ (4 ఆ. పు. 283-84), హలాయుధునికథ (4 ఆ. పు. 284—87), మిండనైనారు కథ (4 ఆ. పు. 297—98), ఒడయనంబికథ (4 ఆ. పు. 298-308) బాణునికథ (4 ఆ. పు. 308—309), పిట్టవ్వకథ (4 ఆ. పు. 309) కలికామదేవునికథ (4 ఆ. పు. 310—12), ఏణుమూర్తినయనారు కథ (4 ఆ. పు. 312—14), కడమల నంబి కథ (4 ఆ పు. 314), గుగ్గులు కళయారుకథ (4 ఆ. పు. 314-15), అరివాళు నయనారి కథ (4 ఆ. పు. 316), అడిభర్తునికథ (4 ఆ. పు. 317-18), ఏణాదినాథునికథ (4 ఆ. పు. 318—19), చేదివల్లభునికథ(4 ఆ. పు. 319-20), కరయూరి చోడనికథ (4 ఆ. పు. 320—21,

కళియంబనయనారుకథ (4 ఆ. పు. 321), ఇరువదాండారికథ (4 ఆ. పు. 322), దంగుళి మారయ్యకథ (4 ఆ. పు 321–23), గణపాలునికథ (4 ఆ. పు 323–25), కుమ్మరగుండయ్య కథ(4 ఆ. పు 325), పూసలనయనారుకథ (4 ఆ పు 326–27)-ఇత్యాది కథలెన్నియో తెలుపబడినవి. ఇందలి 'సిరియాలునికథ' ను శ్రీనాథుడు హరవిలాసమున 'చిరుతొండనంబికథ' అను పేరున రచించెను.

వీరశైవమున భక్తులకు తామసగుణముండరాదు. ఎట్టి కుమార్గమైనను శివభక్తుల విషయమున నది సన్మార్గమే. కన్నద బ్రహ్మయ్య రాజనగరికి కన్నము వేయుటకురమ్మనగా, 'ప్రత్యుత్తరంబీని బాసగావున'' (5 ఆ. పు 363) బసవడతని అనుసరించెను.

"తానీశ్వరార్థము న్నలఁ పునఁ జేసి
ధర 'నధర్మో ధర్మ తాం వ్రజే' త్తనఁగ
హరుని వాక్యము గాన యట్టిద పదము"

—5వ ఆశ్వా. పు. 366.

అని బసవడతని చౌర్యమును సమర్థించుచు బిజ్జలునితో చెప్పినాడు.

'వీరశైవులకు అన్యదైవతప్రసక్తి ఎంతమాత్రము కూడదు.' అని చెప్పు సందర్భమున పోడ్డల దేవు బాచయ్యకథ (6 ఆ. పు. 455), అరియమకథ (6 ఆ. పు. 463), వీరశంకరునికథ (6 ఆ. పు. 466). శివలెంక మంచయ్యకథ (6 ఆ. పు. 467)- మున్నగు కథలు చెప్పబడినవి.

వీరశైవులు భవిజనులను దూషించి గర్హించిరి. ఏలేశ్వరు కేతయ్యకథ (7 ఆ. పు, 563) నవరద నాచయ్యకథ (7 ఆ. పు. 568)—మున్నగు వానియందు భవిజన నింద చేయబడినది. ఏలే

శ్వరు కేతయ్య ఎట్టి వీరశైవుడో పాల్కురికి సోమనాథుడు కూడ అట్టి వీరశైవుడే.

వీరశైవులైన స్త్రీలు తమ భర్తలొక వేళ భవులయినచో వారిని వదలివేయదగునని చెప్పబడినది. దీనినిబట్టి వీరశైవులెంత భవిపరాఙ్ముఖులో వ్యక్తమగును. జైనుడగు బల్లహభూపాలుని పత్ని సుగ్గలదేవి తేడర దాచయ్య అను వీరశైవుని తీసికొని రాగా, రాజు

"సతికొక్క గతియును బతికొక్క గతియు
నతివ! యేలోకంబు నందైనఁ గలదె."

బ, పు. 6 వ ఆశ్వా. పుట 427

అనును. ఆమె,

"పురుషునకు సతికిఁ దెరువొకండైన
గురు శిష్యులకు వేఱె తెరువులు గలవె
..............................
విడువుము నన్ను నే మృడుఁ గానియొల్ల"

— బ. పు. 6 వఆశ్వా. పుట. 427.

అని పల్కి తేడర దాసయ్యచే జైనుల నోడింపజేయును.

"పురుషుడు శివభక్తి విరహితుఁడేనిఁ
బురుషుని మీఱుట దరుణికిఁ బథము"

—బ. పు. 6 వ పుట. 449.

అని వైజకవ్వకథలో ఘంటాపథముగా చెప్పబడినది.

వీరశైవులు లింగపసాయిత శస్త్రములనుఁ బూని శివద్రోహులను, జైనులను చంపుట కలదు. ఇది చాల ఘోరకార్యమైనను వీరశైవ ప్రభావమును వ్యక్తముచేయును. జగదేవుడు వీరతాంబూలమును గొని బిజ్జలుని సంహరించి ఆత్మహత్యను చేసికొనుట, నాచి దేవయ్య జైనులను సంహరించుట — వీరశైవ దీక్షాప్రభావమును విశదము చేయును.

బసవపురాణము రుద్రాది మహాపురాతన కథావ్యాప్తమైనది, మహాపురుషుడగు బసవన మాహాత్మ్య ప్రతిపాదకమైనది. బసవన చరిత్రతో పైనిపేర్కొనిన అనేకోపాఖ్యానములు కూర్పబడినవి. "లోకహితార్థముగా నానేర్చుకొలది వర్ణింతు" నని సోమనాథుడు బసవపురాణావతారికలో తెల్పినాడు. బసవపురాణమునందు శైవమహిమ, మతప్రచారధోరణి అధికము. బసవన చరిత్ర చారిత్రకమైనను పై కారణములచే బసవపురాణము పురాణమనక తప్పదు.

## 2. మల్లమదేవి పురాణము:

పాల్కురికి సోమనాథుడు 'మల్లమదేవి పురాణము' అను నాలుగాశ్వాసముల ద్విపదగ్రంథమును రచించినట్లు తెలియుచున్నది. దీని తాళపత్రప్రతియొకటి నందికొట్కూరులోసుబ్బయ్య యను నొక లింగాయతుని యింట తాను స్వయముగా చూచితి నని శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'నాకర్నూలు మండల సంచారము' — 'సారస్వత సర్వస్వము' — అనువ్యాసమున వ్రాసియున్నారు. వారిదృష్టిలో పడిన ద్విపద మల్లమదేవి పురాణము లోకమున కింకను అదృష్టమే.

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి వలన యిందలి ఐతిహ్యమును బండారు తమ్మయ్యగారు విని తన 'పాలకురికి సోమనాథ కవి' (పుట 162) అను గ్రంథమున మల్లమదేవి పురాణకథను గూర్చి వ్రాసినారు. మల్లమదేవి శ్రీశైలప్రాంతమున నివసించుచుండిన మహాభక్తురాలు. అలభ్యమగుటచే మల్లమదేవి పురాణమును గూర్చిన వివరము లేవియు తెలియరావు. గ్రంథనామమును బట్టి దీనిని గూడ పురాణముగనే గ్రహింపవచ్చును.

### 3. పండితారాధ్య చరిత్ర:

పండితారాధ్య చరిత్ర (1230) కూడ పురాణమనదగిన రచనయే. పండితారాధ్యుడు శైవపండితత్రయములో ప్రసిద్ధుడు. శివాంశసంభూతుడగు పండితారాధ్యుని జీవితచరిత్ర వర్ణితమగుటచే పండితారాధ్య చరిత్ర పురాణగౌరవమునుబొందినది. బసవపురాణ చతుర్వేదసారములందు వర్ణింపగా మిగిలినపురాతన శైవభక్తుల చరిత్రములను పెక్కింటిని సోమనాథుడు పండితారాధ్యచరిత్రమునందు చేర్చి కూర్చినాడు.

"పరిశిష్ట పరిమిత ప్రాక్తన భక్త
చరితంబు లితిహాస సంగతి నొలయ
సంధింపు పండిత చరితంబునందు"

– పం. చ. పుట 12.

అని భక్తులతని నాజ్ఞాపించిరి. ఇందలి ఉపాఖ్యానములన్ని పండితారాధ్యుని చరిత్రమునకు, శైవ మాహాత్మ్య ప్రతిపాదనమునకు అంగములై వరలుచు తత్పురాణ గౌరవమును పరిపోషించుచున్నవి.

పండితారాధ్య చరిత్రయందు పంచప్రకరణములు కలవు.

| | | | |
|---|---|---|---|
| (1) | దీక్షాప్రకరణము | – 2000 | ద్విపదలు |
| (2) | పురాతన ప్రకరణము | – 2720 | ,, |
| (3) | వాదప్రకరణము | – 2020 | ,, |
| (4) | మహిమప్రకరణము | – 2120 | ,, |
| (5) | పర్వతప్రకరణము | – 3050 | ,, |

మొత్తము= 11910 ద్విపదలు.

దీక్షాప్రకరణములో మల్లికార్జున పండితారాధ్యుని పూజాదికము వర్ణింపబడినది. దీక్షితుడగు భక్తుడు చేయవలసిన లింగార్చనాది విధులను, తన్మాహాత్మ్యములు ఇందు వివరింపబడినవి. వీరశైవమున గురు, లింగ, జంగమములు ప్రధానాంగములు. గురువులలో దీక్షనొసంగు గురువు తండ్రితో సమానుడు. లింగము విగ్రహమాత్రమో, శివుని చిహ్నము మాత్రమో కాక శివస్వరూపమే యని యీ మతానుయాయులు భావింతురు. లింగము నుండి విడివడుట ఆధ్యాత్మిక మృతితో సమానము. వీరశైవమున మతప్రచారమొనర్చుచు నూరూరు తిరుగు శివభక్తునకు 'జంగమ' మని పేరు. కాని నేడిది ఒక శాఖా సాంకేతికమైనది. వీరశైవమున ఈ గురు, లింగ, జంగముల కభేదము చెప్పబడినది.

వీరశైవమున ప్రసాద పాదోదకములు ప్రధానములు. శివునకు గాని, శివభక్తులకు గాని అర్పించిన ఆహార విశేషము ప్రసాదమనబడును. పాదోదకమనగా గురు, జంగముల పాదములు కడిగిన నీరు. ఈ ప్రసాద పాదోదకములు భక్తుల మనమును, దేహమును పరిశుద్ధమొనర్చునని వీరశైవుల విశ్వాసము.

గురు, లింగ, జంగమ, విభూతి, రుద్రాక్షధారణ, ప్రసాద, పాదోదక మాహాత్మ్యములను తెలుపు ఘంటాకర్ణునికథ (పుట 101) భీతునికథ (పుట 103), దూర్వాసునికథ (పుట 106), సుకేశి కథ (పుట 107), సూరసానికథ (పుట 114), సామవేదికథ (పుట 133), తిరునాళ్లప్పోవకథ (పుట 145) - మొదలగునవి వేదాగమ సూక్తుల ప్రమాణములతో, వివిధ శైవపురాణేతిహాస ముల ననుసరించి ఈ దీక్షాప్రకరణమున వర్ణింపబడినవి.

## పురాతన ప్రకరణము:

వెల్లగొండ మహాదేవయ్య అను శివభక్తుడు శివార్చనోప కరణములగు పుష్పములను ప్రమాదవశమున తాకుటచే ఆ అప రాధమునకు గాను తన పాదముల రెండింటిని నరకు కొనెను. అతని భక్తి పెంపున కాశ్చర్యపడి పండితారాధ్యుడు తన మహి మచే తిరిగి అతని పాదములు మొలిపింపజేసెను. ఈసందర్భమున పండితారాధ్యునివలె శివభక్తి మహిమలను చేసిచూపిన మహి మాన్వితులగు పురాతన భక్తులగు కళియంబ (పుట 276), పిళ్లనయనారు (పుట 290), వెలమడు (పుట 292), వాగీశనైనారు (పుట 293), రసరయ్య (పుట 295), గురుభక్తయ్య (పుట 314) శ్వేతుడు (పుట 352), మలహాణుడు (పుట 358), కుమారపాల ఘూర్జరుడు (పుట 367), ఓహిళుడు (పుట 371), సకలేశ్వరమాది రాజయ్య (పుట 446), కదిరె రేమయ్య (పుట 467), చేటల వేమయ్య (పుట 475) - చరిత్రములు భక్తులచే స్మరింపబడినవి. ఈ కథలలో కొన్ని బసవపురాణములోకూడ సూచింపబడినవి.

## వాదప్రకరణము:

పండితారాధ్యుని జీవిత చరిత్ర బసవపురాణమునందు బసవని జనన, బాల్యమువలె వర్ణింపలేదు. పండితుని జీవితమంతయు పరమత నిరసనమునందును, స్వీయమత స్థాపనమునందును హెచ్చింపబడినది.

బసవని వీరభక్తి మహిమలు, మానవాతీత కార్యములాతనిపై పామరజన సామాన్యమునకు విశ్వాసమును, భక్తిని కలిగించినవి. కాని పండితులంత సులభముగా నమ్మువారు కాదు. వారికి శాస్త్రప్రమాణములు ముఖ్యము. కనుక బసవనకు భిన్నమైన సంప్రదాయమును పండితుడు గ్రహింపవలసి యుండును. మాట మాటకు ప్రశ్నించు వేదతార్కికపండితుల నతడు జయింపవలసి వచ్చినది. పండితుడు వాదప్రకరణమున వేదవాద, కర్మవాద, కాలవాద. వేదాంతమత, సాంఖ్య, యోగ, చార్వాక, పాంచరాత్ర, బౌద్ధ, జైన-వాదములను సోపపత్తికముగా ఖండించినాడు. షట్త్రింశ తత్త్వ నిర్ణయమును, శివోత్కర్షను శ్రుతి స్మృతి పురాణేతిహాస ప్రామాణ్యములతో ప్రతిపాదించినాడు. అద్వైతపరముగ కానవచ్చెడి వేదవాక్యములకు ద్వైతపరముగ అర్థము చెప్పినాడు.

## (4) మహిమప్రకరణము:

ఇందు పండితారాధ్యుని మహిమలు వర్ణింపబడినవి. వెలనాటి చోడుని ఆస్థానమున పండితుడు తన కన్నుల రెంటిని రెండు మార్లు నూడబెరికికొని మరల మహిమచే పడయును. మూడవ సారి చోడుడే కింకరులచే అతని కన్నులను పెరికించి 'జిల్లపాల'ను

పోయించెనట. పండితుడు, వెలనాటిచోళ వంశక్షయమగునట్లు శపించి, సహస్రగణమాలికను చెప్పి తన రెండు కన్నులను మాత్రమే గాక ఊర్ధ్వనేత్రమునుగూడ బడసినాడు. ఈ సందర్భమున విష్ణ్వాది భక్తులు, ఇరిత్తాండి, సుందరనంబెన్న — మున్నగువారు నేత్రములను బడసిన కథలు తెల్పబడినవి. అటుపిమ్మట పండితుడు బసవనను చూచుటకు బయలుదేరుటయు, మార్గమధ్యమున బసవన లింగైక్యము చెందెనను వార్తవిని అతనిగూర్చి ప్రలాపించుటయు, శ్రీ పర్వత ప్రయాణమును సంకల్పించుటయు అను కథాంశము లీప్రకరణములో కలవు.

## పర్వత ప్రకరణము :

పర్వతప్రకరణము ఒక స్థలపురాణమువలె గోచరించును. ఇందు శ్రీశైలపర్వతముయొక్క మహావైభవము వర్ణింపబడినది.

పండితుడు వృద్ధాప్యమున శ్రీశైల పర్వత మెక్కలేక, శిష్యుడగు దోనమయ్యకు శ్రీశైల మాహాత్మ్యమును చెప్పి, అచట శివరాత్రి వ్రతమును చెల్లించి రమ్మనుటయు, దోనమయ్యయు అదే ప్రకారము చేయుటను తెల్పబడినది. ఈ సందర్భమున శ్రీశైలక్షేత్ర, తీర్థ, స్థలమాహాత్మ్యములు, శివరాత్రి ఉత్సవము, పర్వతమున కరుగు పరిషత్కోటివర్ణనయు, నానా దేశీయ సంఖ్యా కథనములును, దేశభాషాస్తుతులును, సంగీతనాట్యశాస్త్ర ప్రసంగమును, మరియు అనేకములగు మానవజీవిత సంబంధ విషయములు విపులముగా, అనుభవపూర్వకముగా, విమర్శనాయుతముగ ప్రసక్తములై యున్నవి. విషయవిస్తరముగనే గాక కవితాప్రకర్ష యందును ఈప్రకరణము తదితరములకంటె మిన్నయైనది.

వేదాగమ ప్రామాణ్య వాక్యములతో, పురాణేతిహాసములందలి అర్థములను ఉపాఖ్యానముల మూలమున మిత్రునివలె వివరించుటచే పండితారాధ్య చరిత్రను కూడ పురాణముగనే పేర్కొనవచ్చును.

## (4) నవనాథచరిత్ర:

గౌరన (1345_1445 A.D.) రచితమగు నవనాథచరిత్ర 5 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. ఇది గౌరన శైవసంప్రదాయాభిజ్ఞతకును, ఆధ్యాత్మిక విషయపరిజ్ఞానమునకును నిదానము.

రాజయోగ మార్గమున సిద్ధిపొందిన తొమ్మిదిమంది శివయోగుల కథలు నవనాథచరిత్రమందు వర్ణింపబడినవి. నవనాథులు_ (1) మీన (మత్స్య) నాథుడు (2) చౌరంగి (సారంగధరుడు) (3) గోరక్షుడు (4) మేఘనాథుడు (5) విరూపాక్షుడు (6) నాగార్జునుడు (7) ఖణికుడు (8) వ్యాళిసిద్ధుడు (9) గోరక్కడు. వీరందరును, సిద్ధత్వమునుబడిసి శైవయోగమునుస్వీకరించినవారే.

నవనాథులలో మీననాథుడు అపార మహిమాన్వితుడు. ఇతడు శివపార్వతుల తనయుడట. అవిరళయోగ విద్యాధికుడగు నితడు తక్కిన శివయోగులందరికి మార్గదర్శకుడును, ఆరాధ్య దైవమును. నవనాథ చరిత్రయందంతటను ఇతనిగూర్చిన కథయే వ్యాప్తి చెందియున్నది. శైవయోగులలో గోరక్షుడితని ముఖ్య శిష్యుడు. ఈ గోరక్షుడే సిద్ధగురువు.

ఆంధ్రదేశమున జనసామాన్యమున మిక్కిలి వ్యాప్తిలో నుండు సారంగధరుని గూర్చిన కథ నవనాథచరిత్ర మొదటి రెండాశ్వాసములలో ఒక ప్రత్యేక కావ్యమువలె రసాధిక్యతతో వర్ణింపబడినది. సారంగధరునికథ ఇందు మాళవదేశమున జరిగి

నట్లు తెల్పబడినది. ఖండితాంగుడైనసారంగధరుడు చౌరంగియను పేర సిద్ధుడయ్యెననువిషయము నవనాథచరిత్రనుండియే పలువురు తెలుగుకవులు గ్రహించి ప్రత్యేకకావ్యములుగ రచించినారు.

తృతీయాశ్వాసములోని 'వంచక పురోహితునికథ' నీతి బోధకమై ప్రసన్నమగు హాస్యరసమును పరిపోషించును. కపోత వృత్తాంతము అద్భుత రసావిష్కరణమైనది. నీతిబోధకములగు కథలిందు కల్గుటచే నవనాథచరిత్రను పురాణముగనే పేర్కొన వచ్చును.

చతుర్థాశ్వాసమున మీననాథుని పరకాయ ప్రవేశ వృత్తాంతము కలదు. ఇది యోగమార్గమునుండి భోగమార్గము నకు దిగజారుట వంటిది.

పంచమాశ్వాసమున మీననాథుడు తన శిష్యులగు సిద్ధ నాథులను శైవమతవ్యాప్తికై నానాదేశములకుపంపుటను తెలుప బడినది. నాగార్జునుడు ఆంధ్రదేశమున సంచరించినట్లు,

> "మళయాళ బర్బర మగధాంధ్ర పాండ్య
> చోళభూములు చనఁ జొచ్చెవిజ్ఞాన
> శీల నాగార్జున సిద్ధుఁ డింపార." [3]

అను ద్విపదపంక్తులనుబట్టి తెలియుచున్నది. నాగార్జునసిద్ధుడు వివిధౌషధములను, మణిమంత్రములను, యోగాదుల మర్మము లను, అణిమాది సిద్ధులను, రసవాదసార శాస్త్రములను, తన శిష్యులకు తెల్పి ఆంధ్రదేశమున శైవశక్తిని ప్రచారముచేసినాడు. నాగార్జున శిష్యుడగు ఆత్రేయుడు శ్రీశైల నగరమును హాటక మయముగా చేయ తలపెట్టెను. వయఃస్తంభవాదము దుర్లభ

3. చూ॥ నవనాథచరిత్ర. 5వ ఆశ్వాసము - పుట 211.

మను పలుకులన్నిటిని పూర్వపక్షము చేసి, మూలికలను శోధించి తన ప్రయత్నమున ఫలసిద్ధిని బొందినాడు. తుదకు విష్ణుచక్రమున కాహుతియై విఫలుడైనాడు. లోకరక్షణార్థమై విష్ణువు శైవనాథుల రసవాదాది కృత్యములను ప్రతిఘటించినట్లు ఈ గ్రంథమున తెలుపబడినది. నాగార్జునుని చరిత్రను, రసయోగ శాలను వివరించు నవనాథచరిత్రలోనిఘట్టములు తెలుగుసాహిత్య సంస్కృతీ ప్రియులకు అభిమాన పాత్రములును, అమూల్యములు ననుటలో సందేహము లేదు.

ఇట్లు నవనాథచరిత్ర వస్తువిస్తృతి, కథాకథన కౌశలము, అద్భుతావహములగు సిద్ధమంత్ర తంత్రములు, యోగాభ్యాస ప్రదర్శనమును కల్గిన గ్రంథమగుటచే దీనిని పురాణముగనే పరిగణింప వచ్చును.

(5) బ్రహ్మోత్తర ఖండము:

ఇది స్కాందపురాణాంతర్గతమగు బ్రహ్మోత్తర ఖండమూలము ననుసరించిన ద్విపదగ్రంథము. దీనిని పిడుపర్తి బసవన (1475-1500 A. D.) రచించినట్లు పద్య బసవపురాణావతారికను బట్టి తెలియుచున్నది. కాని గ్రంథము అలభ్యము.

మట్టరాజు వేంకటకృష్ణకవి, పట్టమట్ట సోమనాథ కవి, ప్రాతకోట పుల్లయకవి, శ్రీధరమల్లెకవి— మొదలగువారు బ్రహ్మోత్తర ఖండమును చంపూకావ్యములుగా నాంధ్రీకరించిరి. వీరందరును పిడుపర్తి బసవనకు తర్వాతి వారే.

(6) ప్రభులింగ లీల:

వీరశైవవాఙ్మయమునందు ప్రభులింగలీల బసవపురాణము వలె పవిత్రమై ప్రాముఖ్యమును-బడసినది. కన్నడమున 'చాము

రస' ను కవి (15 శతాబ్ది) 1011 పదములుగా, భామినీ షట్పద ములో రచించిన ప్రభులింగలీల ననుసరించియే పిడుపర్తి సోమ నాథుడు (1500–1525 A. D.) ద్విపదలో అనువదించినాడు. ద్విపద ప్రభులింగలీలయందు 5 ఆశ్వాసములు గలవు. ఒక్కొక్క ఆశ్వాసములో 5 గతులు కలవు.

ప్రథమాశ్వాసము:— 1. లింగాష్టకము 2. కైలాసగతి 3. మాయోత్పత్తిగతి 4. మాయావిలాసగతి 5. మాయా విరహగతి.

ద్వితీయాశ్వాసము:— 6. విమలమాయా ప్రసంగగతి 7. మాయాప్రభువు సంవాదగతి 8. బసవయ్యగతి 9. అక్కమహా దేవిగతి 10. అక్కమహాదేవి వైరాగ్యగతి.

తృతీయాశ్వాసము:— 11. గొగ్గయకథ 12. ముక్తాయి కథ 13. సిద్ధరామయ్యకథ 14. ప్రభువు కల్యాణపురమునకు వచ్చుట 15. మునులు శంకరమాహాత్మ్యమును తెలుపుట.

చతుర్థాశ్వాసము:— 16. ఇష్టలింగయ్యగతి 17. జ్ఞానోప దేశగతి 18. ప్రాణలింగైక్యగతి 19. గోరక్షునిగతి 20. మునుల కుపదేశగతి.

పంచమాశ్వాసము:— 21. శూన్యసింహాసనగతి 22. బస వడు ప్రభువునెదుర్కొనుగతి 23. బసవన ప్రభువునకాహారమిచ్చు గతి 24. తత్త్వోపదేశగతి 25. ప్రభువుమహిమను పరమేశ్వరుడు పార్వతి కుపదేశమిచ్చుగతి.

ద్విపద ప్రభులింగలీల పూర్వభాగము మాత్రమే ముద్రిత మైనది[4]. ఈ ముద్రితప్రతిలో 16 గతులు మాత్రమే గలవు.

---

4. జగపతి ముద్రాక్షరశాల - పెద్దాపురం. 1920. (గుజలీప్రతి).

ప్రభులింగలీలయందు ప్రధానముగ అల్లమ ప్రభుమాహాత్మ్యలీలలు వర్ణింపబడినవి. అల్లమప్రభువు వీరశైవమతోద్ధారకుడగు బసవనకాలమునాటి ప్రసిద్ధశైవమహిమాన్వితుడు; నిర్వికారనిర్గుణమూర్తి. అతడు సాక్షాత్తు ఈశ్వరుని అవతారమే అని వీరశైవుల విశ్వాసము. అల్లమప్రభు లీలలతోపాటు ఇందు ఇతర శైవభక్తుల కథలుకూడ ప్రసక్తముగ వర్ణింపబడినవి.

కథాంశము:— అల్లమప్రభువు మాహాత్మ్యమును శివుని వలన విని పార్వతి అతని నెట్లయినను వంచింతునని పంతమాడును. పార్వతియొక్క తామసభక్తికళ భూలోకమున 'మాయ' అను పేర జన్మించినది. మాయ, విటవేషమున తిరుగుచుండిన అల్లమ ప్రభువును గాంచి మోహించును. మాయ అతనిని మద్దెలకాడని, విటుడనియే భావించినది. అల్లమప్రభువు మాయకు లోబడక ప్రతిమాయచేసి ఆమెను భ్రాంతిగొల్పెను. మాయ, ప్రభువును బలవంతపెట్టగా అతడదృశ్యుడయ్యెను. మాయ విఫలయత్నమును తలపోసి పార్వతి దుఃఖించినది. తుదకు శివుని సలహాప్రకారము పార్వతి సాత్త్విక నిర్మల కళను సృజించి భూలోకమునకుపంపును. ఆ కళాంశమే 'అక్కమహాదేవి' అను పేరుతో జన్మించి అల్లమ ప్రభువును భక్తివైరాగ్యములతో సేవించి తనకు వశ్యునిగ చేసికొనినది. అక్కమహాదేవికి సహాయముగా భూలోకమున బసవన మున్నగు శివగణములు పలుచోట్ల జన్మించిరి.

ప్రభులింగలీలలో కథాకథనదృష్టియేప్రధానము. సాక్షాత్తు శివుని అవతారమేనని వీరశైవులు విశ్వసించు అల్లమప్రభు మాహాత్మ్యమిందు ప్రతిపాదింపబడుటచేనిది పురాణమగుచున్నది. ఇతర శైవభక్తుల కథలు కూడ యిందుకూర్పబడి ప్రధాన కథకు పరిపోషకములుగ నున్నవి.

## మఱిబసవపురాణము :

మఱిబసవపురాణకర్త బచ్చు సిద్ధకవి. (17 శతాబ్ది). అతడు చరలింగమర్దల పర్వతాచార్యుని శిష్యుడు. సిరిపురి వీరసింగయ్యా యితనికి దీక్షాగురువు. చిక్కవీరాచార్యుడు తనకు వినిపించినరీతిని గ్రంథములోని కథను వ్రాసినానని బచ్చుసిద్ధకవి తెల్పినాడు. సిద్ధకవి తన 'మఱిబసవపురాణము'నకు 'సంగయ' అనునతని కథాశ్రోతగా నిలిపినాడు.

మఱిబసవపురాణము 5 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. దీని వ్రాతప్రతి (డి. నెం. 978) మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు కలదు.

మఱి బసవన జీవిత చరిత్ర ఈగ్రంథమునందు ప్రధానేతి వృత్తము. ప్రఖ్యాత బసవేశ్వరుడుగాక మరియొక బసవేశ్వరుని చరిత్ర వర్ణింపబడుటచే దీనికి మఱిబసవ పురాణమని పేరుకల్గిన దని కొందరు చెప్పుదురు. బసవచరిత్రమున వర్ణింపబడని ఇతర కథలిందు కూర్పబడుటచే మఱిబసవపురాణమనబడినదని మరి కొందరు తలంతురు. "కన్నడవాఙ్మయములో 'మల (లె) బసవ పురాణ' మనుగ్రంథమును, 'మలెయబసవరాజ' అనువ్యక్తి పేరును కనబడు చున్నది. 'మలెయబసవన'యే తెలుగులో 'మఱిబసవడు' గా మారియుండును.[5] 'మఱిబసవేశ శ్రీమన్మహా మూర్తి' అని కవి గ్రంథములో నొకచోట సంబోధించియుండుట వలన బసవనాముడే మరియొకడున్నాడని మనమూహింపవచ్చును.

మఱిబసవనయందు అల్లమప్రభుని విరక్తియు, ప్రఖ్యాత బసవేశ్వరుని భక్తిభావమును ఏకమై అతనిని దివ్యపురుషునిగా నొనర్చినవి. మఱిబసవన చరిత్రతోపాటు ఇందు, ద్వితీయాశ్వాస

5. చూ॥ వీరశైవాంధ్రవాఙ్మయము. పుట 186 - శిష్టారామకృష్ణశాస్త్రి

మున-జోగిదేవయ, నగెమారి తద్దెన, వెంకబొమ్మయ, ఘణిహారి బ్రహ్మయ్య, సవరదచిక్క-దేవుడు, అంబిగ చౌడయ్య, కల్లవల యంబి, కలియంకదేవుడు, హాౘడద మారయ్య, మసణద మారయ్య, జిక్కి-య బ్రహ్మయ్య, చిగురు చందయ్య, బొత్తాం దేవి, శివ్వాదేవి, దవళద పార్వతమ్మ, చిక్కలి ముగ్దాయి, మొదలగు వీరశైవభక్తుల కథలును, చతుర్థాశ్వాసమున-పోచల దేవి, మాచలదేవి, కాచలదేవి, బిజ్జలదేవి, శంకిదేవయ్య, శివదేవుడు, దేవలాంబిక, రాజనబ్రహ్మయ్య, గంగామహాదేవి, మొక్కళ రామయ్య, విమలదేవయ్య, భాషియ యల్లమయ్య, దెమరసయ్య, నెమ్మియ సంగయ్య, నాటకేశ్వర బ్రహ్మయ్య, లొక్కియ నిజగుణదేవర-మున్నగు శైవభక్తుల కథలును వివరింపబడినవి, ఈ ఉపాఖ్యానములందు వీరశైవ మతప్రబోధ నలే ముఖ్యాంశము. ఈ శివభక్తుల కథలు సోమనాథుని ద్విపద బసవపురాణమునందు కానరావు. మఱిబసవపురాణమునందు శివ భక్తుల కథలనేకము ప్రధానకథకు కూర్పబడి యుండుటచే దీనికి ఇతివృత్త విషయమునను పురాణసామ్యము కలదు.

బచ్చుసిద్ధకవి, పాల్కురికి సోమనాథుని యెడ గురుభావ ముంచి సంస్మరణరూపమగు భక్తిని ప్రకటించినాడు.

"కొలది మీరిన పాలకురికి సోమేశు
సలలిత శ్రీపాద జలజముల్ దలచి
........................
అనువొంద మఱి బసవయ్య సుచరిత
తెలుగున ద్విపదగాఁ దెల్లమిఁ బఱతు"

అనిసిద్ధకవి గ్రంథారంభమున తెల్పినాడు. అతడు పాల్కురికి

**సోమనాథుని ద్విపదలలోని ఛందోవ్యాకరణ భాషావిశేషములను సమర్థించినాడు. (చూ॥ ద్వితీయ ప్రకరణము పుట 56.)**

**బచ్చుసిద్ధకవి ద్విపద రచన పాల్కురికి సోమనాథుని ద్విపద బసవపురాణ రచన ననుసరించినది. ఈ క్రింది ద్విపదలను పరిశీలింపుడు.**

"బాపురే! బసవ! సద్భక్త సంత్రాణ!
బాపురే! బసవ! సద్భక్తి ధురీణ!
................................ ...............................
..................................................................
..................................................................
'బసవా' యనగ విన్నఁ బానలాండేల?
పసులకు నైనను బ్రబలదే భక్తి?
'బసవా' యనగ విన్నఁ బానలాండేల?
పసిబాలురకు నైన నెసఁగదే భక్తి
'బసవా' యనగ విన్నఁ బానలాండేల?
యసమాత్మునకు నైన నలరదే భక్తి
'బసవా' యనెడి భక్తిపరులఁ జూచినను
నెసఁగు పక్షులకైన నింపదే భక్తి
'బసవా' యనెడు భక్తిపరుల చేరువను
మసలు జంతువులకు నెసఁగదే భక్తి
'బసవా' యనినఁజాలుఁ బానలాండేల?
యసలార విషమైన నమృతంబుగాదె?
'బసవా' యనినఁజాలుఁ బానలాండేల?
పసిగమైఁ గులిశంబు గుసుమంబుగాదె?
'బసవా' యనినఁ జాలుఁ బానలాండేల?
వసుధ శత్రులు మిత్ర వర్గంబుగారె?
'బసవా' యనినఁజాలుఁ బానలాండేల?
వెసగాలు శార్చిచ్చు వెన్నెల గాదె?

**బసవపురాణము – ద్వితీయాశ్వాసము. పుటలు. 87-88.**

మఱిబసవపురాణములోని ఈక్రింది ద్విపదలలోని భావావేశము పై సోమనాథుని బసవపురాణ ద్విపదల కనుకరణ సృష్టి మాత్రమే.

బాపురే బసవయ్య బసవాంశజుండ
బాపురే బసవయ్య ప్రవిమలభక్త
బాపురే బసవయ్య ప్రఖ్యాత చరిత
యేపుతో నీమహిమెఱింగి నుతింప
ప్రాపుగా నితరుల కేపారవశమె
మరిబసవా యని మదిబతించినను
దురిత వర్గంబులు దూరమై చనును
మరిబసవాయని మదిబతించినను
విరస వృశ్చికఫణి విషమైన జనదె
మరిబసవాయని మదిబతించినను
కరికరి భూతదుగ్రహ భిత జనదె
మరిబసవాయని మదిబతించినను
పరగ తస్కరరాజ భయ నాస్తిగాదె
మరిబసవాయని మదిబతించినను
దురదుర దారిద్ర దుఃఖంబు చనదె
మరిబసవాయని మదిబతించినను
తరుచైన రుజముల తాపంబు చనదె
మరిబసవా యని మదిబతించినను
కరణేంద్రియంబులు కడకేంగు గాదె
మరిబసవా యని మదిబతించినను
వరపుంసు నోదటి యాత్రాలును జూడదె
మరిబసవా యని మది బతించినను
వరచిత్రగుప్తుల వ్రాల్రెచ్చెడు గాదె ॥మరి॥
గురుతైన ధరకృతాంతకు గెల్చు గాదె ॥మరి॥
పరికింప గోర్కెలు ఫలియించుగాదె ॥మరి॥

మతిబసవపురాణము—5 వ ఆశ్వాసము.

ఒకానొక ఆడది చేసిన రట్టడితనమును మఱిబసవపురాణ కర్త యెంత సహజముగా వర్ణించినాడో చూడుడు.

"మనమునం గోపంబు మగియునుంబొదల
కొట్టుచు పడుచుల దిట్టుచు జనుల
చిట్టన చేటతో చేట వైచుచును
పట్టి కుండతో కుండ లటిటు గొట్టి
రట్టడి మాటల రంతు సేయుచును
తిట్టిన పురుషుని తిరుగ దిట్టుచును
కొట్టిన పెనిమిటి గొట్ట బోవుచును
పట్టి తెచ్చిన ప్రవి భ్రాతి జేయుచును
తొక్కడు తొక్కడు తొక్క డిట్లనుచు
యెక్కడి సనివచ్చెని గురువనుచు
చక్కగా శెంతచె సగమైతి ననుచు
రక్కసి క్రమమున రట్టు చేయంగ"

ద్వితీయాశ్వాసము. (డి. నెం. 978 ప్రా. భా. మద్రాసు).

ఇట్టి స్వాభావిక వర్ణనలు పాల్కురికి సోమనాథుని ద్విపద బసవ పురాణమునందు కోకొల్లలు.

## బసవవిజయము:

ఇది పాల్కురికి సోమనాథుని ద్విపద బసవపురాణము ననుసరించిన 3 ఆశ్వాసముల ద్విపద గ్రంథము.[6] దీనిని నల్లన గండ్ల నాగనారాధ్యుడు రచించెను. ఈ కవినిగూర్చిన వివరము లేవియు తెలియరావు.

తుమ్మలపల్లి నాగభూషణకవి కూడ 3 ఆశ్వాసముల పద్య కావ్యముగ బసవ విజయమును రచించినాడు.[7] తుమ్మలపల్లి

6. అముద్రితము. ఆర్. నెం, 566. ప్రా. భా.
7. అముద్రితము. నెం. 2138. ప్రా. భా.

నాగభూషణకవి, నల్లనగండ్ల నాగనారాధ్యుడు—వీరిలో నెవరు ముందుగా బసవ విజయమును రచించినారో తెలిసికొనుటకు ప్రత్యక్షాధారము లేమియు లేవు.

పాల్కురికి సోమనాథునిగూర్చి చెప్పుటలో ఈ రెండు గ్రంథములును ఏకామ్రనాథుని ప్రతాప చరిత్రననుసరించినవి. రెండు గ్రంథములందును కథను ప్రతాపరుద్ర మహారాజునకు నాతని మంత్రియగు శివదేవయ్య చెప్పినట్లు కలదు.

"ఇజ్జగంబున వృషభేంద్రుని మహిమ
సెన్న నెవ్వరి వశంబే నేర్చు భంగి
పన్నుగా నెన్నెద బసవవిజయంబు"

అని కవి గ్రంథారంభమున తెల్పినాడు. బసవవిజయము ప్రథమాశ్వాసమున, ఓరుగంటిలో పాల్కురికి సోమనాథుడు బ్రాహ్మణులను వాదమున నోడించుటను తెలుపఁబడినది. బసవన, చెన్నబసవనల పుట్టుక ఇత్యాది కథాంశములు ఈ ఆశ్వాసమున గలవు. ద్వితీయాశ్వాసమున చిత్తరు బొమ్మలకథ, ప్రహరి సోమన్న మాహాత్మ్యము. నీళ్ళకడవలు వరదప్పిపారిన చరిత్రము, మిండజంగముకథ, ముక్కవ్యాధుల కథలు కలవు.

తృతీయాశ్వాసమున – బిజ్జలరాజు చరిత్రము, బసవన మాహాత్మ్యములు, చామంతిరాజుకథ, దరునమారయ్యకథ, చోరశంకరుడు సత్యశంకరుడై శివుని యందైక్యమగుట – ఇత్యాది అద్భుత కథలు గలవు.

ప్రధానేతివృత్తమగు బసవేశ్వరుని కథతో శివభక్తుల కథలనేకము జోడింపబడి యుండుటచే బసవ విజయమును పురాణవర్గములో చేర్చవచ్చును.

గౌడపురాణము:

గౌడపురాణమును మల్లికార్జున సిద్ధయోగి (1700) ద్విపదలో రచించెను. ఇతడు తెలంగాణాలోని కొలనుపాక నివాసి. ఈకవిని గూర్చిన విశేషములు తెలియరావు.

గౌడపురాణము మూడాశ్వాసముల ద్విపదగ్రంథము[8]. తెలంగాణాలోని కొలనుపాకలో గౌడమతస్థాపన చేసిన అంశ మిందు వర్ణింప బడినది. గౌడులు శివభక్తులు. మతసంబంధమగు గ్రంథమగుటచే దీనికి 'పురాణ'మను నామము సార్థకమగు చున్నది.

శివరహస్యఖండము:

స్కాందపురాణాంతర్గతమగు 'శంకరసంహిత' కిది ద్విపద రూపమగు తెలుగుసేత. దీనిని వింటి జౌబళకవి రచించెను. గ్రంథము అముద్రితము[9].

శివరహస్య ఖండమునందు 7 కాండలుకలవు. అవి (1) సంభవ, (2) అసుర, (3) వీర, (4) మహేంద్ర, (5) యుద్ధ, (6) దేవ, (7) ఉపదేశ – కాండలు. అందును కొన్నిటి కాద్యంత ములు లేవు. కృత్యవతరణిక కూడ లేదు. గ్రంథాంతమందు,

"స్కాందపురాణ శంకర సంహితనెడు
అందును శివరహస్యాఖ్యాన ఖండమున
దేవ కాండముఁ జెప్పె ధీయుక్తి చేత"

8. చూ॥ గోలకొండ కవుల సంచిక – పుట 405 – సంపాదకుడు సురవరం ప్రతాపరెడ్డి. గోలకొండ పత్రికా కార్యాలయము. హైదరాబాద్ – దక్కన్. 1934.

9. సంఖ్య. 1012 (డి) – అసమగ్రము. ప్రా. భా. మద్రాసు.

అనియుండుటచే ద్విపద శివరహస్యఖండమునందు ఉపదేశ కాండము వర్ణింప లేదనుట స్పష్టము. సంస్కృత శివరహస్య ఖండమునందు 40 అధ్యాయములకు మించి కలవు.

శివరహస్య ఖండమును వంకాయలపాటి వీరభద్రకవి, కోడూరు వెంకటాచలపతి, ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యుడు-అనువారు పద్యకావ్యములుగా రచించినారు. వీనిలో ముదిగొండబ్రహ్మయ లింగారాధ్యుని శివరహస్య ఖండము మాత్రము ముద్రితము.

## శంకరసంహిత:

ఈ ద్విపదగ్రంథమునకు తంజావూరి సరస్వతీ మహల్ లైబ్రరీలో నెం. 357 (అసమగ్రము) ప్రతికలదు. గ్రంథము ఆద్యంతములు లభింపమిచే కవి నామాదికములను గూర్చి తెలియ రాదు. ఆశ్వాస విభజనకూడ కానరాదు.

'శంకర సంహిత' స్కాందపురాణాంతర్గతమగు శంకర సహింతకు ద్విపదరూపమగు తెలుగుసేత.

## మార్కండేయపురాణము:

మార్కండేయముని చరిత్రమును 'మార్కండేయపురాణము' అనుపేర 8 అశ్వాసముల ద్విపదగ్రంథముగా పర్వతమంత్రి లింగన రచించినాడు. గ్రంథము అముద్రితము. (ఆర్. నెం 630 ప్రా. భా. మద్రాసు).

పర్వతమంత్రి లింగన రచితమగు 'వీరమాహేశ్వరాచార సంగ్రహము' అను ద్విపద గ్రంథము సప్తమాశ్వాసమునందు మార్కండేయముని చరిత్రము సంగ్రహముగా కలదు. దానినే లింగకవి ప్రపంచించి 8 ఆశ్వాసములుగా రచించినాడు.

### మార్కండేయచరిత్ర :

ఈ ద్విపద గ్రంథమును కె. శివకృష్ణదాసు (1900 A. D.) రచించెను. (చూ॥ ఆ. వా. సూ. పుట. 152).

మార్కండేయ పురాణము సంస్కృత మార్కండేయ పురాణము ననుసరించినది. ఇది శైవ మాహాత్మ్య ప్రబోధక మగు కథ. మార్కండేయుడు శివుని వరమువలన యముని దిక్కరించి చిరంజీవియైనకథ ఇందు వర్ణింపబడినది.

జానపదులు మార్కండేయ చరిత్రను పాటలరూపమున అత్యుత్సాహముతో పాడుచుందురు.

### (2) ద్విపదరామాయణములు :

సంస్కృతమున వాల్మీకి విరచితమగు రామాయణము సర్వాలంకార గుణశోభితమగు మహాకావ్యముగా పరిగణింపబడు చున్నను, అందు పౌరాణికము లనిపించుకోదగిన అలౌకికములును, అద్భుతావహములును నగు కథాసన్నివేశ చిత్రణములు, భగవదవతార ప్రశంసయు-మున్నగునవి గోచరించుటచే దీనినిగూడ పురాణముగనే పరిగణింతురు. వాల్మీకిరామాయణమునకుగల ద్విపదాంధ్రీకరణములను 'పౌరాణికము' లనియే భావించి ఈ క్రింది పరిశీలన గావింతము.

తెలుగునగల ద్విపద రామాయణములలో కాలక్రమము ననుసరించి యెఱుగదగినవి.

(1) రంగనాథరామాయణము - గోనబుద్ధారెడ్డి (1240 A. D.) — ముద్రితము.

(2) ఉత్తరరామాయణము (ముద్రితము) — కాచవిభుడు, విఠలనాథుడు. సోదరజంట కవులు (13 శతాబ్ది)

(3) అన్నమాచార్య రామాయణము - (15 శతాబ్ది)అలభ్యము

(4) కట్టా వరదరాజ రామాయణము (ముద్రితము)-(1630 A.D.)
(5) బాలరామాయణము (అలభ్యము) – గణవరపు వేంకటకవి (1673 A. D.)
(6) భోసల ఏకోజీరామాయణము (1735 A. D.) –అముద్రితము
(7) చేడరాఘవ రెడ్డి రామాయణము (1780A. D.)-అముద్రితము
(8) శ్రీరామచరితమానసము - కేశవతీర్థస్వామి –ముద్రితము

ఇవిగాక ఆద్యంతములు శిథిలములై, కర్తృత్వవిషయాదిక మగోచరముగను, సంశయాస్పదముగనుగల రామాయణ ద్విపద రచనా భాగములును, రామాయణ కథాప్రసక్తములగు ద్విపద గ్రంథభాగములును కూడ కొన్ని తంజావూరు, మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములందున్నవి.[10]

తెలుగు దేశమునందలి కొన్ని పుణ్యస్థలములతో ముడిపెట్ట బడి రచింపబడిన రామాయణములు కొన్ని కలవు. అట్టి వానిలో విజయరామరాజు రచితమగు 'వినుకొండ రామాయణ ద్విపద' ఒకటి. ఈ గ్రంథము అముద్రితము.[11]

తరిగొండ వెంగమాంబ (1794-1877 A. D.) 'వాసిష్ఠ రామాయణము', మామిడమ్మ సుభద్రమ్మ (1910) 'అధ్యాత్మ

---

10. (1) విభీషణ బుద్ధి – ఆర్. నెం. 356. తంజా.
(2) రామకథ – ఆర్. నెం. 335. తంజా.
(3) కపోత వాక్యము – ఆర్. నెం. 1038. ప్రా. భా. మద్రాసు.
(4) కపోత వాక్యము – ఆర్. నెం. 294. తంజా.
- Catlogue of Telugu books in Tanjore manuscripts Library - Page 117; 126,

11. Telugu Academy - అకారాద్యముద్రిత గ్రంథ సూచిక II

రామాయణము' – రామకథాపరముగ చెప్పబడు వేదాంతార్థ ప్రతిపాదక ద్విపద గ్రంథములు. వీనిని 'ద్విపదతాత్త్వికరచన' లందు చర్చింతము.

రంగనాథ రామాయణము:

తెలుగునగల రామాయణము లన్నిటిలో మొట్టమొదటిది రంగనాథ రామాయణము.(1240 A. D.)దీనికర్తృత్వము వివాదాస్పదమైనది.

గ్రంథకర్తృత్వ విషయము:

ఈ రామాయణమును గోనబుద్ధారెడ్డి రచించి తన తండ్రియగు 'విట్ఠలత్మ్నానాథు' పేర వెలయించినట్లు గ్రంథావతారికలో కలదు. భారతీయ భాషలలో రామాయణములు సాధారణముగా గ్రంథకర్తల పేరుతోనే ప్రచారము పొందియున్నవి. ఈ దృష్టితో, దీనికి 'రంగనాథ రామాయణ' మని పేరుండుటను బట్టి దీనిని రంగనాథుడను కవియే రచించియుండునని విమర్శకులు కొందరు తలంచిరి [12]. కవియశమును గోనబుద్ధారెడ్డికి సమకూర్ప దలచి, రంగనాథుడు తన రామాయణములో అతని పేరుపెట్టి యుండునని వీరు తలంతురు. కాని ఈ కాలమున రంగనాథుడనుకవి విట్ఠలత్మ్నానాథు నాస్థానముననుండినట్లు చారిత్ర కాధారములు లేవు. ఈకాలమున నుండిన చక్రపాణి రంగనయే రంగనాథుడై యుండునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రూహించిరి. [13]

12. చూ॥ రంగనాథరామాయణము - పీఠికా విమర్శ - శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ. భారతి. సంపుటము 20 సంచిక 5 పుట 393 సంవత్సరము 1943.

13. చూ॥ రంగనాథరామాయణము - సింహావలోకనము (సాహిత్య వ్యాసముల సంపుటి)

చక్రపాణి రంగన రామాయణమును రచించినట్లు నిదర్శనములు ఏమియు లేవు. సిద్ధేశ్వర చరిత్రమందలి చక్రపాణి రంగన వృత్తాంతము కేవలముకట్టుకథయే. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి ప్రకారము చక్రపాణి రంగనయే ఈ రామాయణకర్త యని భావించినచో, అప్పటికింకను రాజుగానున్న విట్ఠలనాథు పేర గాక, యువరాజగు గోనబుద్ధారెడ్డి పేర రచించుటకు హేతువేమి? ఇత్యాది సంశయములు కలుగును.

గ్రంథములో,

"ఆతత కృతి పేర నతి పుణ్యు పేర
మాతండ్రి విట్ఠల క్ష్మానాథు పేర"

అని స్పష్టముగా కలదు. ఈ పంక్తులను చక్రపాణి రంగనాథుడు వ్రాసి ఇందు చేర్చినాడని ఊహింపగలమా?

రంగనాథ రామాయణ కర్తృత్వమును గూర్చి సి. పి. బ్రౌనుదొర గారు కూడ వ్రాతప్రతులలో ఈ క్రిందివిధముగ వ్రాసినారు.

"This translation of the Ramayana is always attributed to a poet named Ranganatha; but his name is nowhere mentioned in the book; while it is asserted in each volume that the author was Buddha Raj, who wrote it at the desire of his father vittal Raj."

మరియు,

"This Ramayana is vulgarly attributed to Ranganatha; but I can not discover the reason."

రంగనాథ రామాయణ నామ సమన్వయ సిద్ధాంతమును ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారిట్లూహించిరి.[14]

14. చూ॥ రంగనాథరామాయణ పీఠిక_ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ_సం॥ 1942.

"తండ్రియగు విట్ఠలనాథుని పేర ప్రఖ్యాతము చేయుట అనగా ఆతని పేర రామాయణమును పిలుచుట........... విట్ఠలుని పూర్తిపేరు 'పాండురంగ విట్ఠలనాథు' డై యుండవచ్చును. (విట్ఠలుడనునది - పండరిపురములో వెలసిన పాండురంగవిట్ఠల నాథుని పేరు గనుక). దీనిలో ఉచ్చారణ సౌలభ్యముగల 'రంగ నాథ' యను ఏకదేశమున రామాయణ శబ్దమునకు లగించి కవి, "రంగనాథ రామాయణము" అని కర్ణపేయమైన పేరు పెట్టి యుండవచ్చును. "నామైకదేశే నామగ్రహణం" శాస్త్రసమ్మతమే కదా!"

ఇది ఊహయే కాని కవియే తండ్రిపేరును ధ్వనింపజేయు నట్లు 'రంగనాథ రామాయణ' మని పేరుపెట్టెననుటకు ప్రత్యాక్షసాక్ష్యమేదియు లేదు. కవి దానికి రామాయణమనియే పేరుపెట్టి యుండును. సాధారణముగ భారతీయ భాషలలో రామాయణములు కర్తపేరుతోనే ప్రచారముపొందుట ఒక సంప్రదాయము. ఈ సంప్రదాయము ననుసరించి రంగనాథుడను తన రెండవ పేరుతో ఈ గోనబుద్ధారెడ్డి రామాయణము ప్రచారమునకు వచ్చియుండునని ఈక్రింది విధముగ నూహింపవచ్చును.

గోనబుద్ధారెడ్డి యువరాజుగా నున్నపుడే రామాయణమును రచించినాడు. తన పట్టాభిషేకముతో రంగనాథుడను పేరు గోన బుద్ధారెడ్డికి యేర్పడియుండును. గోన బుద్ధారెడ్డి తండ్రికికూడ 'గోన గన్నారెడ్డి, విట్ఠలస్వామినాథుడు'— అని రెండు పేర్లున్నట్లు ఈ ద్విపదరామాయణములో పూర్వోత్తర భాగములందలి అవతారికలను బట్టి స్పష్టమగును. ఇట్లే గోన బుద్ధారెడ్డికి కూడ పట్టాభిషేకముతో రంగనాథుడను పేరు ఏర్పడియుండును. ఆ పేరనే రంగనాథరామాయణమని గోన బుద్ధారెడ్డి రచించిన

రామాయణము ప్రసిద్ధి పొందియుండును. కావున గోన బుద్ధారెడ్డి, రంగనాథుడు భిన్నులు కారు. గోన బుద్ధారెడ్డియే రంగనాథుడు. రంగనాథుడే గోన బుద్ధారెడ్డి అని భావించుట యుక్తమగును.

బుద్ధారెడ్డికి రంగనాథుడను పేరే చాల వ్యాప్తినందినది. పూర్వపుపేరు మరుగున పడిపోయినది.

"ఆది కవీశ్వరుఁ డైన వాల్మీకి
యాదరంబునఁ బుణ్యులందఱు మెచ్చఁ
జెప్పిన తెలుఁగున శ్రీరామచరిత
మొప్పఁ జెప్పెద"

నని గోన బుద్ధారెడ్డి గ్రంథారంభమున వాల్మీకి రామాయణ ప్రశంస చేసి "కవీంద్రులు, బుధులును మెచ్చునట్లుగ పురాణ మార్గము"న పూర్వభాగమునుఅనువదించినాడు. వాల్మీకిరామాయణ పూర్వభాగము నందు 6 కాండలు, 500 సర్గలు, 24000 శ్లోకములు గలవు. రంగనాథరామాయణ పూర్వభాగము ముద్రితప్రతి[15] లో 17290 ద్విపదలుకలవు. రంగనాథ రామాయణకర్త మూలరామాయణ ప్రతులలో దేనిననుసరించి అనువదించినాడో తెలియదు. కాని రంగనాథరామాయణమున మూలరామాయణములో లేని కథలు, కథాంశములుకొన్నికలవు. కనుక రంగనాథ రామాయణము మూల విధేయమగు అనువాదమనుట కన్న, మూలానుసరణ రచన అనుటసమంజసము.

రంగనాథరామాయణమున కనిపించు అవాల్మీకములగు

---

15. చూ॥ రాయలు అండ్ కో ప్రతి. కడప 1957. పరిష్కర్తలు:- శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ; తిరుమల వేంకటరంగాచార్యులు

కల్పనలు రామకథాప్రస్తావము గల ఇతర పురాణములలోను, తదితర రామాయణములలోను ఉండిన నుండవచ్చును. లేక అట్టి కథలు కొన్ని తెలుగు దేశముననే పుట్టి తెలుగు పద సాహిత్యమున పాటలుగ, సంకీర్తనలుగ, పదములుగ వ్యాప్తినొందియుండవచ్చును. అట్టివానినికూడ రంగనాథరామాయణకర్త గ్రహించి మూలకథకు తెలుగుతనమును, దేశీయత సొంపును కూర్చినాడు. తెలుగు రామాయణములలో మొట్ట మొదటిదగు రంగనాథ రామాయణమున కూర్చబడిన అవాల్మీక కథలు, కథాంశములు, తర్వాత తెలుగున వెలసిన రామాయణములలో — చంపూ రామాయణములలోను ద్విపదరామాయణములలోను — గోచరించును. మార్గ, దేశి, కవితా సంప్రదాయముల జోడింపు రంగనాథరామాయణములోని ప్రత్యేకత. ఇది ప్రౌఢకవితారసికులకు మాత్రమే గాక పామరజనులకు గూడ సాహిత్యానందమును సమకూర్చి పెట్టినది.

## అనువాదములో మార్పులు, కూర్పులు:

బాలకాండమున, గౌతమాశ్రమవృత్తాంతమున ఇంద్రుడు కోడియైకూసినట్లు రంగనాథ రామాయణమున కలదు. (పుట 50) ఇది వాల్మీకి రామాయణము నందు లేదు. ఇది గౌతమ మునిని అహల్యనుండి వేరుచేయుటకు చక్కని ప్రయత్నము.

అహల్య శాపవిమోచన ఘట్టమున అహల్య రాయిగా పడియుండెనను కథాంశముమూలమున లేదు. ఈ కథాసందర్భమున రంగనాథరామాయణ కర్తనే భాస్కరరామాయణ కర్త కూడ అనుసరించినాడు. ఇది శ్రీరాముని మాహాత్మ్యమును వెల్లడించు ఘట్టము.

అయోధ్యా కాండమున మందర పాపదర్శిని అని మాత్రమే మూలరామాయణమున చెప్పబడినది. "రాముడు బాల్యంబునందు దనకాలు విఱిచిన తప్పుసాధింప నిది నాకుఁదఱి"* అని మందరకు రామునిపైగల వైరమునకు కారణము రంగనాథ రామాయణమున చెప్పబడినది.

"తొల్లి కౌసల్యాతనయుచే తం దనకునైన చరణతాడన భంగంబు" **

అని భాస్కర రామాయణ కర్త రంగనాథ రామాయణ కర్త ననుసరించియే మందరకు రామునిపైగల వైరమునకు కారణము తెల్పినాడు.

అరణ్యకాండములో రంగనాథ రామాయణములోని జంబుమాలి వృత్తాంతము మూలమునందు లేదు. ఈ కథనే ఇంచుక భేదముతో భాస్కర రామాయణ కర్త గ్రహించినాడు. జంబుమాలి శూర్పణఖ పుత్రుడు. అతడు తన తండ్రిని చంపిన రావణునిపై పగతీర్చుకొనుటకు దండకారణ్యమున తపస్సుచేయుచుండెను. తల్లియగుశూర్పణఖ అతనికి అన్నాదికములను తెచ్చుచుండెడిది. జంబుమాలి వృత్తాంతమును గూర్చి 'రంగనాథ రామాయణ-పీఠిక'లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారిట్లు తెలిపిరి. "దీనియునికి ఈ రామాయణమునకు క్రొత్తవన్నెను పెట్టుచున్నది; అనతి విస్తృతిగల యీచిన్నకథ స్వయం పూర్ణమై వెలుగొందుటే గాక ప్రధాన కథకు సైతము పోషకముగా నున్నది. ఈ వృత్తాంతమే లేనిచో శూర్పణఖ ప్రవేశము సోపపత్తికమే కాదు."

* చూ॥ రంగ. రా. అయో - పుట 89

** చూ॥ భా. రా - పుట 84. పద్యము 52

అరణ్యకాండములో రాముని రక్షించుటకై లక్ష్మణుడు సీతను విడిచిపోవు సందర్భమున ఏడుగీతలను గీసి వానిని దాటిపో వలదని చేసిన నియమము మూలములో లేదు. రంగనాథ రామాయణ కర్త దీనిని జనశ్రుతినుండి గ్రహించి యుండును.

అవాల్మీకములగు కథలు, కథాంశములు రంగనాథ రామాయణమున యుద్ధకాండము నందు మిక్కుటముగా గలవు.

రావణుడు విభీషణుని సభలో తన్ని పురి నుండి వెడల గొట్టుట; శ్రీరాముడుడుత భక్తిని చూచి సంతసించుట; కైకేశీ వృత్తాంతము; కైకేశి రావణునకు హితము చెప్పుట; రాముని మహిమ చెప్పుట, జలప్రళయము తెలుపుట—రావణుడు రాముని ధనుర్విద్యాకౌశలమును గొనియాడుట; నాగపాశ బద్ధులైన రామలక్ష్మణుల కడకు నారదాగమనము; మండోదరి రాముని మాహాత్మ్యమును రావణునికి తెల్పుట;–ఇత్యాది కథాంశములు మూలరామాయణములో లేవు. ఇవి రంగనాథరామాయణమున కలవు.

రావణుని ముందు హనుమంతుడు వాలమును పెంచిన కథ వాల్మీకి రామాయణము నందు లేదు.

మూలములో అశోకవనమున సీత రావణునికి హితబోధ చేసినట్లున్నది. రంగనాథ రామాయణము నందు మండోదరి కైకసి - ఇర్వురును రావణునికి హితబోధ చేసినట్లు చెప్పబడినది. ఈ హితబోధవలన మండోదరి కైకసీల యందు రాక్షసత్వము లేదని చెప్పక చెప్పుచున్నది.

యుద్ధకాండములో రంగనాథ రామాయణము లోని సులోచన వృత్తాంతము మూలములో లేదు. సులోచన కథ ప్రక్షిప్తమని కొందరి మతము. సులోచన ఇంద్రజిత్తు భార్య.

ఆమె పతిభక్తి, రామభక్తి అప్రతిమానము. సులోచన కథా సందర్భమున 'రంగనాథ రామాయణ పీఠిక'లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారిట్లు వ్రాసిరి. "ఈ ధీరపతివ్రత యుద్ధరంగమున శత్రుమధ్యమునకు బోయి వారిని మెప్పించి రణనిహతుడైన పతికళేబరమును సహగమనార్థమై తెచ్చుకొన్నపుడు,

"ఆ యింతి తెగువకు నా యింతి తెలివి
కాయింతి సమబుద్ధి కా మహామహిమ
కాయింతి పతిభక్తి కాయింతివేగ,
కాయము దెచ్చిన క్రమశక్తియుక్తి
కేమన జాలక"

ఎందును ఆశ్చర్యమెరుగని రావణుడే మహాశ్చర్యచకితుడయ్యెను. ఈ కథను చదివిన యెల్లవారును ఆశ్చర్యచకితులే యగుదురు." ఇందలి సులోచన సాహస ప్రవర్తనమద్భుతము గల్గించును.

సులోచన వృత్తాంతము నందుగల శవాలంకారవర్ణన కావ్యౌచిత్యమునకు భంగమాపాదించినను రంగనాథ రామాయణ కర్త తనకాలమునాటి సంప్రదాయముల ననుసరించి వర్ణించినట్లు తెలియగలదు.

వాల్మీకి రామాయణ దాక్షిణాత్యప్రతులలో కాలనేమి కథ లేదు. కాని ఈ కథ వాల్మీకి రామాయణ ఇటాలియన్ ప్రతిలో కలదని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రంగనాథ రామాయణ పీఠికలో [16] తెల్పిరి. ఈ కథ ఆనంద, (సారకాండ 11వ సర్గ) ఆధ్యాత్మ రామాయణములలోనుకలదు. [17] రంగనాథ

16. చూ॥ రాయలు అండ్ కో. ప్రతి. కడప 1957.

17. చూ॥ వాల్మీకి రామాయణము_ ఆధ్యాత్మ రామాయణము_ కథా భేదములు_పారనందిసర్వేశ్వరశాస్త్రి. భారతి Vol. VI, Part I.

రామాయణములోని కాలనేమి కథ చదువరుల హృదయమున శోకవిధమగు కదలికను కల్గించును. ఇందలి రాక్షసుల మాయా చేష్టలు, ప్రతిక్రియా కల్పనా చతురత - మనకు ఆశ్చర్యమును కల్గించును. రావణుని శక్తిచే మూర్ఛపడి యుండు లక్ష్మణు డెప్పుడు పునరుజ్జీవితుడగునా యని పాఠకుడు తహతహపడు సందర్భమున ఈ అవాంతర కథ కల్పింపబడినది. "దీని వలన కలిగిన కాలయాపనము భరింపరాని యుత్కంఠను గలిగించి, దుర్భర సంశయాస్పదమైన పరిస్థితి సృష్టించినది." చివరకు శుభాంత మగుటచే రసాస్వాదన యోగ్యమగు చున్నది.

ఈకథలో మొసలిరూపునందినది ధాన్యమాలియను నొక అచ్చర లేమ. ఈమెను శాండిల్యుడను ముని కామింప, రావణుడు బలాత్కరించి ఈమె వలన అతికాయుడను పుత్రుని బడసెను. సులభకోపి యగు శాండిల్యుడు ధాన్యమాలిని తన కోరిక తీర్చ లేదని మొసలివి కమ్మని శపించెను. ఇది శాపవిమోచనమునకు పూర్వమనేక సంవత్సరముల నాడు జరిగిన కథగా కన్పించును.[18] హనుమంతుడు అశోకవనమున సీతను చూచిన నాడు, తన్ను నిష్ఠురోక్తులాడిన సీతను రావణుడు శిక్షింప దలచు చుండ, అతనితో వచ్చిన ధాన్యమాలి సీతకడ్డము వచ్చినట్లు వాల్మీకి రామాయణమున తెలుపబడినది. ఈ కాలమునకు మొసలి శాప విమోచన కాలమునకును మధ్యను చాల స్వల్పకాలమే. ఇది అసందర్భముగా నున్నదని కాబోలు రంగనాథ రామాయణ కర్త ధాన్యమాలి కాక మండోదరియే సీతపై రావణుడు కవయకుండగ అడ్డుపడినదని మార్చినాడు.

18. చూ॥ రంగనాథ రామాయణము - పీఠికావిమర్శ - పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి. భారతి. సంపుటము 21. సంచిక 6. పుట 505.

శుక్రాచార్యోపదేశముచే రావణుడు పాతాళ హోమము చేయుట - అను కథాంశము మూలమున కానరాదు. ఇది రంగనాథ రామాయణమున కలదు.

రావణ సంహార సందర్భమున బ్రహ్మాస్త్రమును ప్రయోగింపుమని మాతలి రామునికి సలహా చెప్పినట్లు మూలములోకలదు. రంగనాథ రామాయణములో రావణుని కరశిరంబులు మరల మొలచుచుండుటకై చింతించు రామునకు ఆగ్నేయాస్త్రిమును ప్రయోగించి రావణుని నాభియందున్న అమృతము నింకింపజేసి యాతని మడియింపుమని విభీషణుడుపాయము చెప్పినట్లున్నది. మూలమున ఈ అమృత ప్రస్తావమే లేదు.

రామేశ్వరమున రామలింగ ప్రతిష్ఠ రంగనాథ రామాయణమున కలదు. ఇది మూలమున లేదు.

రంగనాథ రామాయణ పూర్వభాగమును సాంద్రీసు దొరవారి యనుజ్ఞ చొప్పున పైడిపాటి కొండలయ కుమారుడగు పాపయ్య (1840) వచనములో రచించినాడు.[19]

## ఉత్తర రామాయణము:

రంగనాథోత్తర రామాయణమును గోనబుద్ధారెడ్డి కుమారులగు కాచవిభుడు, విట్ఠలనాథుడు అను సోదరజంటకవులు తండ్రియాజ్ఞను శిరసావహించి, అతని పేరనే "వాల్మీకి చెప్పిన జాడ", 'వినుత నూతన పదద్విపదరూపము'న, సలక్షణముగ, చక్కని శయ్యాసౌభాగ్యముతో, పండిత పామరజనానురంజక

---

19. చూ॥ 'తెలుగు వచన రచన' - నిడుదవోలు వేంకటరావుగారు. ఆంధ్ర పత్రిక ఖర సంవత్సరాది సంచిక 1951-52.

ముగ రచించిరి. రంగనాథోత్తరరామాయణము ముద్రితము.[20] ఇది క్రీ. శ. 1320-1325 నడుమ రచితమయ్యెనని శ్రీ చాగంటి శేషయ్యగారు తెల్పియున్నారు.[21] ఇందు సుమారు 5640 ద్విపదలు కలవు.

ద్విపద రామాయణోత్తర భాగమున సీతాపహరణమునకు ముందు రావణుడొనర్చిన అద్భుతకార్య వర్ణనమును, నిండు చూలాలగు సీతను రాముడరణ్యమునకు పంపుటయు, కుశలవ జన్మవృత్తాంతమును, రాముడు యజ్ఞమొనర్చుట, సీత భూవివరము జొచ్చుట, రామనిర్యాణము - ఇత్యాది కథాంశములు గలవు.

కాచభూపతి, విట్ఠలనాథు లను సోదరజంట కవులను గూర్చి బహుపురాణజ్ఞులనియు, బహుకళాన్వితులనియు, బహుకార్య కోవిదులనియు గ్రంథారంభమున చెప్పబడినది.

ఈ ద్విపదోత్తర రామాయణముననుసరించియే పాటూరి నరసింహకవి (1840 A. D.) వచనగ్రంథముగా రచించినాడు.

## అన్నమాచార్య రామాయణము :

తాళ్లపాక అన్నమాచార్యుడు రామాయణమును "ప్రవిమల ద్విపద ప్రబంధరూపమున నవముగా" రచించినట్లు చిన్నన్న తెల్పినాడు.[22] అన్నమాచార్యుని ద్విపదరామాయణము నేడు కానరాదు.

---

20. చూ॥ 'అముద్రితాంధ్ర గ్రంథ సర్వస్వము. 5వ గ్రంథము. సంపాదకుడు: చెలికాని లచ్చారావు. శ్రీరామవిలాస ముద్రాక్షరశాల, చిత్రాడ. 1929.

21, ఆంధ్రకవి తరంగిణి. 4వ సంపుటము - పుట 36.

22. చూ॥ అన్నమాచార్య చరిత్ర - పుట 47.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ప్రకటించిన రంగనాథ రామాయణము మొదటి అనుబంధములోని హెచ్చుగానున్న ద్విపదలు అన్నమాచార్యకృత రామాయణమునుండియే గ్రహింపబడి యుండునని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు అభిప్రాయపడిరి.[23] రంగనాథ రామాయణమున పరిశిష్టముగ నీయబడిన ద్విపదలలోని పలుకుబడి, భావసంపద, రచనారీతి, వైష్ణవభావన అవతార ప్రశంస-మున్నగు నంశములు అన్నమాచార్యుని రామాయణ సంబంధి కీర్తనము[24]లందు పుష్కలముగా నుండుటచే వీనిలో కొన్నియేని తాళ్లపాకవారి ద్విపద రామాయణములోని పంక్తులు కాగూడదు ననవచ్చునని శ్రీ వేటూరి ఆనందమూర్తి గారూహించిరి.[25]

తంజావూరు పుస్తక భాండాగారములోని 335 సంఖ్యగల 'రామకథ' అను ద్విపదభాగ మీ అన్నమాచార్యుని ద్విపద రామాయణములోనిది కాదగునని కూడ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తెల్పియున్నారు.[26] కాని ఈ 'రామకథ' యిదమిత్థముగ అన్నమాచార్యుని రామాయణ రచనాభాగమే యని చెప్పగల సాక్ష్యము లేవియు లేవు.

అన్నమాచార్య రామాయణములోని కొన్ని ద్విపదలు కట్టా వరదరాజ రామాయణము నందణగియుండుననియు భావింపవచ్చును. వరదరాజు (17 శతాబ్ది) అన్నమాచార్యుని తర్వాతి

23. చూ॥ వరదరాజరామాయణ పీఠిక -ప్రథమసంపుటము-పుట 32.
24. చూ॥ అన్నమాచార్య సంకీర్తనముల సంపుటములు 2, 8, 11.
25. చూ॥ అలభ్యమగు అన్నమాచార్య రామాయణము- భారతి. ఏప్రిల్ 1963.
26. చూ॥ వరదరాజరామాయణ పీఠిక. ప్రథమ సంపుటము. పుట 32.

వాడు. ఇరువురును కడపమండలమువారే. శ్రీ వేంకటేశ్వరుని భక్తులే. వైష్ణవమతాభిమానమున తన్మతప్రచారమునకై రామాయణ రచన కావించినవారే. కనుక వరదరాజు అన్నమాచార్యుని రచనలనెరిగి, వానిననుసరించి రచించియుండునని ఊహింపవచ్చును.

తెలుగున ద్విపదరామాయణముల విషయ మింత వేరు చేయరానివిధముగ కలసిపోవుటకు దేశమున వానికిగల్గినప్రాచుర్యమునే వెల్లడించును.

కట్టా వరదరాజ రామాయణము:

కట్టా వరదరాజు (1630 A. D.) రామాయణ పూర్వభాగము 6 కాండలను ద్విపదలో రచించినాడు. గ్రంథము ముద్రితము.[27] అతడు కడపమండలమునకు చెందినవాడు. సూర్యవంశక్షత్రియుడు. శ్రీరాముడు తన వంశమువాడగుటచే రామకథను వ్రాయుటకు తానేయోగ్యుడననియు, నది వాల్మీకి రామాయణముకంటె శ్రీరామునకు ప్రీతిపాత్రమగు ననియు వరదరాజు గ్రంథారంభమున తెలిపినాడు.

"ఇనకులంబున వేంకటేశుండు మున్ను
జనియించి తన పుణ్య చారిత్ర మెల్ల
బోయ కులంబునఁ బుట్టు వాల్మీకి
సేయ నందు ప్రమోద చిత్తుండు గాక
అర్క వంశమున నీవై జనియించి
తార్కాణ గాఁగ నే తత్కథామృతము

27. తంజావూరు సరస్వతీమహలు, గ్రంథమాల నెం. 12. 4 సంపుటములు. పరిష్కర్త: నిడుదవోలు వేంకటరావు. 1950.

రచియింపు మనియె శ్రీరామ చంద్రుననవ
నచలిత ప్రీతి గదా నిజాన్వయము
తన చరిత్రంబు కీర్తన సేయ వినుట
తనయులచేఁ గాదె తామున్ను వినియె."

—ద్విపద పంక్తులు 150-160.

వరదరాజ రామాయణము "యథావాల్మీకముగ", "రసస్థితుల్ మెఱయు" నట్లుగ రచింపబడినది. ఇందు ముద్రిత ప్రతిలో మొత్తము 23, 170 ద్విపదలు కలవు. ఈ ద్విపదలు వాల్మీకి రామాయణమునందలి 24000శ్లోకములకుఇంచుమించుసమానము.

వరదరాజ రామాయణము మూలానుసారియైనను మూలమునకు 'మక్కికిమక్కి' మాత్రముకాదు. వరదరాజు తన రామాయణములో రంగనాథ రామాయణ కర్తను గాని, భాస్కర రామాయణ కర్తను గాని పేర్కొనలేదు. కాని రంగనాథ, భాస్కర రామాయణములందలి అవాల్మీకములగు కథాంశములు కొన్ని వరదరాజరామాయణమున వర్ణింప బడినవి.

అహల్యా శాపవిమోచన ఘట్టమున అహల్య రాయిగా పడియుండెనను విషయము మూలములో లేకున్నను వరదరాజు తన రామాయణములో రంగనాథ రామాయణమును చూచి కాబోలు గ్రహించినాడు. (చూ॥ వరదరాజరామాయణము, బాలకాండము. ద్వి. పం. 3669.)

వైష్ణవమతము వ్యాపించిన వెనుక రచితమగుట చేతనో వరదరాజు వైష్ణవ ప్రపత్తి గలవాడగుటచేతనో, మూలమున లేకున్నను రంగనాథ, భాస్కర రామాయణముల ననుసరించి కాబోలు వైష్ణవ ప్రబోధమగు అంశములను వరదరాజు తన రామాయణమున చేర్చినాడు. రామలక్ష్మణులు నాగపాశబద్ధులై

యున్నపుడు వరదరాజ రామాయణమున రంగనాథ రామాయణము నందువలె నారదాగమనము లేదు. కాని ఇందు గరుత్మంతుడే రామలక్ష్మణుల దగ్గరకువచ్చి "నేను మీ బంటును, నిదెనా మనంబులో నెఱిగి వచ్చితిని" అని చెప్పి వారి బంధములనుబాపి జయముకల్గునని దీవించినట్లు కలదు.

ఇట్లే మూలమున లేకున్నను శ్రీరాముడు విభీషణునికి 'శ్రీరంగశాయి' నొసంగెనని వరదరాజు తన రామాయణమున వైష్ణవ ప్రతిపాదకమగు నంశమును చేర్చినాడు. (చూ॥ యుద్ధకాండము. పుట 539.)

వరదరాజు రాజకవి కావున పెంపుచేయవలసిన చోట్ల జాతి వార్తాచమత్కారములను, ఆనాటి రాజకీయ సాంఘికాచార పరిస్థితులను పాటించి రసవంతముగా రామాయణమును అనువదించియున్నాడు.

ద్విపదవాఙ్మయ శాఖలో గ్రంథ పరిమాణమున దీనిని మించిన గ్రంథము లేదు. యథా వాల్మీకముగ రచింపబడిన రామాయణములలో నిదియే అగ్రగణ్యమైనది.

## బాలరామాయణము:

ఈ ద్విపదగ్రంథమును గణపవరపు వేంకటకవి (1630-80 A. D.) రచించినట్లు ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసావతారికను బట్టి తెలియుచున్నది. గ్రంథము అలభ్యము. ఇందు రామాయణ కథ సంగ్రహముగా రచింపబడి యుండును.

వేంకటకవి గొప్ప లాక్షణికుడు; చిత్రకవిత్వమున మిక్కిలి సమర్థుడు; బహుగ్రంథకర్త. అతడు క్రీ.శ. 1674 సంవత్సరమున మధురను పాలించిన ముద్దళగిరి ప్రభువు నాశ్రయించి విద్యాదండకమును చెప్పినాడు. ఇతడు దాక్షిణాత్య కవి.

భోసలయేకోజీరామాయణము:

భోసల ఏకోజీ (1736 A. D.) ద్విపద రామాయణము లభ్యము. కాని అముద్రితము (ఆర్. నెం. 352. తంజా.)

ఏకోజీ తంజావూరు నేలిన భోసలవంశస్థులగు మహారాష్ట్ర రాజులలో నొకడు; రసజ్ఞుడు; నాట్యసంగీతప్రియుడు; 'సరస సాహిత్య లక్షణచక్రవర్తి'; సంస్కృతాంధ్ర భాషాపండితుడు. ఏకోజీ రామాయణము వాల్మీకి రామాయణమునకు సంగ్రహ రూపమగు ద్విపద తెలుగు సేత.

"ధరణి రామాయణోద్యాన సంచార
వర కోకిలంబైన వాల్మీకి దలచి
యతుల ప్రాసంబుల నర్థ సంగతుల
ప్రతిలేని నవరస భావముల్ దనర
నిరుప మాలంకార నియతులే......
......గా వాల్మీకి యల రామ కథను
రచియించి నట్లు సారము గాఁగ ద్విపద
రచియింప"



దలచినట్లు కవి గ్రంథావతారికలో తెలిపినాడు. ఏకోజీ రామాయణానువాదము సంగ్రహమైనను మూలవిధేయముగ నడచినది. మూలములోని పూర్వభాగమందలి 6 కాండలును సంపూర్ణముగా నిందు కలవు. రామపట్టాభిషేకముతో గ్రంథము శుభాంతమగు చున్నది. భరత సౌమిత్రులు యువరాజులై కొలువగ, రాముడు అశ్వమేధ రాజసూయాది యాగముల చేసి ప్రజలను నీతి, ధర్మము, న్యాయము తప్పక పాలించెను. ప్రజలు సుఖసంపదల తేలియాడిరని ఈ ద్విపద రామాయణ గ్రంథాంతమున కలదు.

ఏకోజీ తన తండ్రియగు తుళుజ భూపాలునకే రామాయణము నంకితము చేసెను. రచన లక్షణవంతమైనది; రసవంత

మైనది. ఏకోజీ ద్విపద రామాయణము నందలి ద్విపదలు రంగ నాథరామాయణము నందలి పరిశిష్టద్విపదలలో చేరినట్లు లేదు.

చేడ రాఘవరెడ్డి రామాయణము:

దమ్మారావుపేటనివాసియగు చేడరాఘవరెడ్డి (1780A.D) ద్విపద రామాయణము అముద్రితము. ఈ ద్విపదరామాయణ శిథిలప్రతి పరిశోధకమండలి (అనుమకొండ) లో కలదని 'గోలు కొండ కవుల సంచిక' (పుట 406) లో పేర్కొనబడినది.

శ్రీ రా మ చ రి త మా న స ము:

తులసీదాసు, హిందీభాషాంతర్గతమగు 'అవధి' లో రచించిన 'రామచరితమానస' మను రామాయణమున కిది మంజరీ ద్విపదరూపమగు తెలుగుసేత. దీనిని కేశవతీర్థస్వామి రచించెను. ఇందు అవతారిక వరకు పద్యరూపమున నున్నది. స్తోత్రములు, విశిష్టసందేశములు కీర్తనలుగ వ్రాయబడినవి. కథాభాగము నుండి అంతయు మంజరీద్విపదలో నున్నది. మూలగ్రంథములో కాండాదులలో సంస్కృత శ్లోకము లున్నట్లే కేశవతీర్థస్వామి కూడ తన అనువాదములో ప్రతివిశ్రమాది యందును కృతిభర్త యగు మట్టపల్లి నృసింహ సంబోధనము కందపద్యములలో కూర్చినాడు.

రామాయణగాథ 'పాఠ్యే గేయే చ మధుర' మ్మనియు, 'అహో గీతస్యమాధుర్యాం శ్లోకానాంచ విశేషతః'' అనియు కొనియాడ బడినది. తులసీదాసు రామాయణము ఉత్తరదేశమున పండిత పామర జనాదరణ పాత్రమైనది. ప్రపంచములోని పెక్కుభాషల లోని కనువదింపబడినది. ఇందు అడుగడుగునను రామభక్తి ద్యోతకమగుచుండును. శ్రీరామకథను శివుడు పార్వతికుపదేశించి నట్లు కలదు.

మాధుర్యగుణ సముపార్జనకు, సర్వజన గ్రాహ్యతకు, మూలగ్రంథమును యథారీతి ప్రతిబింబితము చేయుటకు కేశవతీర్థ స్వామి శ్రీరామచరిత మానసమును మంజరీద్విపదలో రచించినాడు. భావము చెడకుండ చక్కని శైలితో రసవంతమై తేలిక పదములతో నిండలి ద్విపదలు కూర్పబడినది.

### 3. ద్విపద భాగవతములు:

భాగవతము వేద, పురాణ, బ్రహ్మసూత్ర, మహాభారత ప్రతిపాదితార్థముయొక్క జీవసారము. "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి కలదు. భాగవతమునకు నాయకుడు పురాణపురుషుడగు భగవంతుడు. అనేకావతారములలో, అనేక యుగములలో, అనేక చోట్ల ప్రవర్తిల్లిన భగవంతుని లీలావిశేషాదులు భాగవతమునందు గుదిగూర్చబడినవి. భగవత్తత్త్వము భగవద్భక్తుల భక్తిమయ జీవితగాథలు, ఇతిహాసోచిత రాజవంశ చరిత్రములు, తత్త్వబోధలు — మొదలగునవి భాగవతపురాణమునందు విపులముగా వివరింపబడినవి.

తెలుగున గల ద్విపద భాగవతములలో కాలక్రమము ననుసరించి యెఱుగదగినవి ఈ క్రిందివి.

(1) భాగవత దశమస్కంధము - మడికి సింగన (1430 A. D.)

(2) బాలభాగవతము — దోనూరు కోనేరునాథుడు
(6 ఆశ్వాసములు) (1547 A. D.)

(3) భాగవత దశమస్కంధము — రత్నాకరము గోపాలకవి.
(పూర్వభాగము) (1575-1650 A. D.)

(4) భాగవతము — తేకుమళ్ల రంగశాయి
(మొదటి 4 స్కంధములు మాత్రము) (1790 A. D.)

(5) భాగవతము — తరిగొండ వెంగమాంబ (1840 A. D.)

ఇవిగాక భాగవత కథాప్రసక్తములగు ద్విపద గ్రంథములు కొన్ని కలవు. వానిని వేరొకచోట చర్చింతము.

ద్విపద భాగవత దశమస్కంధము:

మడికి సింగన (1430) పోతన (1400–1470)లు సమకాలికులయినను పోతన పద్యభాగవత రచనకుముందే మడికిసింగన ద్విపద భాగవత దశమస్కంధ రచన ద్విపదలో జరిగినది. సంస్కృతరామాయణ భాగవతానువాదములు తెలుగున మొట్టమొదట ద్విపదలో జరిగియుండుట ఒక విశేషము. మడికిసింగన ద్విపద భాగవత దశమస్కంధము ముద్రితము.[28] ఇది పూర్వోత్తర భాగములు కలది. ముద్రితప్రతిలో మూడు కాండలుకలవు. (1) మధురాకాండము. (2) కల్యాణకాండము. (3) జగదభిరక్షకాండము. గ్రంథములో అక్కడక్కడ కొన్నిభాగములు లుప్తమైపోయినవి. మడికి సింగన దశమస్కంధ కథలను సంపూర్ణముగనే రచించియుండునని ద్విపద భాగవత దశమస్కంధ పీఠికాకర్తలగు శ్రీ A. మహాదేవశాస్త్రిగారు అభిప్రాయపడిరి. కంసుని వృత్తాంతము, కృష్ణావతార ఘట్టము, నందగోపుని యింట శ్రీకృష్ణుని బాల్యక్రీడలు – మొదలగు కథాంశములు ఈ ముద్రిత ద్విపద భాగవత దశమస్కంధమున లేవు. వీనిని కవి ఒక కాండములో వర్ణించియుండును. అక్రూరుడు శ్రీకృష్ణుని స్తుతించు ఘట్టముతో మధురాకాండము ప్రారంభమయి జరాసంధుని రెండవమారు దండయాత్ర కథతో ముగియుచున్నది. శ్రీకృష్ణుని లీలామాహాత్మ్యములు, వివాహములు – కల్యాణకాండము, జగదభిరక్షకాండములందు 'సలలిత రసభావ శబ్దగుంభనల' తో కవి

28. తంజాపూరు సరస్వతీమహల్, గ్రంథమాల. నెం. 23. పరిష్కర్త. A. మహదేవ శాస్త్రి, 1950.

వర్ణించినాడు. సాల్వమథనము, దంతవక్త్రసంహారము, కుచేలో పాఖ్యానము. సుభద్రా పరిణయము—మున్నగు దశమస్కంధము లోని ఉత్తరభాగ కథలను కూడ సింగన ఇంకొక కాండలో రచించియుండును. "అని సకలజన సమ్మతంబుగా నుపక్రమించి భాగవత దశమస్కంధమును దెనుఁగున రచియించి యిచ్చి..." అని వాసిష్ఠ రామాయణావతారికలో సింగన చెప్పిన వాక్యములే పై ఊహలకు హేతువు. సింగనరచనను మరొకచోట చర్చింతము.

ద్విపద బాలభాగవతము :

దోనూరు కోనేరు నాథకవి (1547 A. D.) బాలభాగవతమును మొదట పద్యరూపమునరచించి పిమ్మటదానినే ద్విపదీకరించెను. ద్విపద బాలభాగవతము అముద్రితము. (వ్రాతప్రతి నెం. 972. ప్రా. భా. మద్రాసు).

బాలభాగవతము పోతన భాగవతమునకు (సుమారు 18000 గద్య పద్యములు ఇందు కలవు.) సంగ్రహముగు ద్విపద సేత. ఇందు 6 ఆశ్వాసములున్నవి. భాగవతము 1, 2 స్కంధ కథలను ప్రథమాశ్వాసమునను, 3, 4 స్కంధకథలను ద్వితీయాశ్వాసమునను, 5, 6, 7 స్కంధ కథలను తృతీయాశ్వాసమునను, 8, 9 స్కంధ కథలను చతుర్థాశ్వాసమునను, దశమస్కంధ కథలను పంచమాశ్వాసమునను, 11, 12 స్కంధ కథలను షష్ఠాశ్వాసమునను కోనేరునాథ కవి రచించినాడు. బాలభాగవతము నందు మహాభాగవతములోని ప్రధానములగు కొన్ని కథలు మాత్రమే గైకొనబడినవి.

బాలభాగవతము విశిష్టాద్వైత సిద్ధాంతానుగుణముగ రచింపబడినది, ధ్రువోపాఖ్యానము, నృసింహావతార ఘట్టము, పురంజనోపాఖ్యానము, దక్షాధ్వరధ్వంసము, వామనావతారము-

మున్నగు ఘట్టములందు కోనేరునాథకవి విశిష్టాద్వైత మీమాంస జ్ఞానము తేటతెల్లమగును. తత్త్వోపదేశమునందు భక్తిప్రపత్తులు లేక ముక్తి కలుగనేరదనునదియే విశిష్టాద్వైత తత్త్వ సారాంశము. కథావస్తు నిర్వహణలో బాలభాగవతమునకును పోతన భాగవతమునకును అంతగా భేదము లేదు. తత్త్వోపదేశమునందే రెండును వేరు పడుచున్నవి.

బాల భాగవతమునందు పురాణలక్షణము లెక్కువగా నున్నను దానిని 'మహాప్రబంధ' మని కవి గ్రంథావతారికలో పేర్కొనినాడు. కోనేరు నాథకవి (1547) ప్రబంధ కవితా కళ పరమోచ్చదశ నందిన కాలమువాడు. నాటి కవితాభిరుచిని బట్టియు, ప్రబంధలక్షణములు కొన్ని యిందుండుటను బట్టియు బాలభాగవతమును ప్రబంధమని కవి చెప్పుకొనియుండును.

## దశమ స్కంధము (పూర్వభాగము)

రత్నాకరము గోపాలకవి (1575–1650A. D.) రచితమగు ద్విపద భాగవత దశమస్కంధ పూర్వభాగము అముద్రితము. (ఆర్. నెం. 784. ప్రా. భా. మద్రాసు) గోపాలకవి భట్టు కులజుడు. కృష్ణమరాజు పుత్రుడు; చెన్నభట్టాచార్యుల శిష్యుడు.

ఈ గ్రంథము సంస్కృతభాగవత మూలముననుసరించినది.

"వహిఁగొన్న శ్రీ భాగవత పురాణమున
మహిమగాంచిన దశమస్కంధమందు
పూర్వభాగాశేష పుణ్య సత్కథలు
పూర్వకావ్య కవిత్వపుణ్యులౌననగ."

రచింతునని గోపాలకవి గ్రంథావతారికయందు తెల్పియున్నాడు. ఈ ద్విపద దశమస్కంధ పూర్వభాగము శ్రీకృష్ణున కంకితము.

గ్రంథారంభము నందలి మధురాపుర వర్ణనను బట్టి గోపాలకవి రచన సంస్కృత పద భూయిష్ఠమైనదనుట తెలియ గలదు.

"కలధౌత నవహేమ కవిత విశాల
నలినారి మండలోన్నత సౌధచయము
తారా పథోన్నత తపనీయ తార
సార భాసుర రత్న సౌధజాలములు
కమలా నివాస సత్కళ్యాణ విభవ
రమణీయ మందిరా రామభూములును
అరుదైన వేద శాస్త్రాది విద్యలను
పరమేష్ఠి మెచ్చని బ్రాహ్మణోత్తములు
మంత్ర తంత్రోపాయ మహిమల దేవ
మంత్రిని మెచ్చని మంత్రి పుంగవులు
.......................... ......................
మహిమల విలసిల్లు మధురాపురంబు."

భాగవతము (మొదటి 4 స్కంధములు)

తేకుమళ్ల రంగశాయి (1790 A. D.) ద్విపద భాగవతము అముద్రితము. (చూ॥ ఆర్. నెం. 765. ప్రా. భా. మద్రాసు.) గ్రంథావతారికలో రంగశాయి, పద్యభాగవత కర్తయగు పోతనను, ద్విపదరామాయణ కర్తయగు రంగనాథుని, (ఇతడు గోనబుద్ధారెడ్డియే యైయుండునని ఊహించితిమి. ద్విపద భాగవతకర్త యగుతిరుమలభట్టును (ఇతడు తిమ్మయయైయుండును) మొదలగు వారిని భక్తిపూర్వకముగా స్మరించినాడు.

"ఎనలేని వేడ్క మమ్మేల వేల్పటంచు
ననిశంబు గొలుచు విద్యానిధి పుష్ప
గిరి తిమ్మ సుకృతి యాకృతి సాహాయ్య
వరుడు"

అని రంగశాయి తన గ్రంథావతారికలో తెల్పుటచే అతనికి భాగవత రచనాసందర్భమున పుష్పగిరి తిమ్మన తోడ్పడినాడనుట స్పష్టము. పుష్పగిరి తిమ్మన (1790 A. D.) రంగశాయికి సహాధ్యాయుడుట. రంగశాయి ద్విపద భాగవతము తిరుపతి వేంకటేశ్వరున కంకితము.

ఈ ద్విపద భాగవతము విస్తృతముగా పోతన పద్య భాగవతము ననుసరించి రచింపబడినది. కాని యే కారణము చేతనో భాగవతమును రంగశాయి పూర్తి చేయలేక పోయెను. భాగవతము చతుర్థ స్కంధమునందలి పృథు చక్రవర్తి చరిత్ర వరకే ఈ ద్విపదభాగవతమునందు కలదు. తర్వాతి భాగవత కథా భాగమును రంగశాయి రచించెనో లేదో కూడ తెలియదు.

భాగవతము:

తరిగొండ వెంగమాంబ (1840 A. D.) ద్విపద భాగవతములోని కొంత భాగము 'గృహలక్ష్మి' యందు ప్రకటింపబడినది. దీని అముద్రిత శిథిల ప్రతి మొదటి 6 స్కంధములు గల నెం. 7410 (బి), 7419 కలది తిరుపతి ప్రాచ్యలిఖిత భాండాగారమునందు కలదు.

"వల నొప్ప శ్రీ భాగవతము నందొనర
నిలను షష్టస్కంధ మిరవుగా ద్విపద
గా విరచించి"

అను గ్రంథాంత ద్విపదను బట్టి వెంగమాంబ భాగవతము లోని మొదటి 6 స్కంధములను మాత్రమే రచించినదనుట తెలియును.

వెంగమాంబ భాగవతము శ్రీవిష్ణు భాగవతమునకు ద్విపద రూపమగు తెలుగుసేత. భాగవతములోని తత్త్వార్థములను పామరులకు కూడ సుబోధముచేయు తలంపుతో, తేట తెలుగు మాట

లతో, సంక్షేపముగా రచించినట్లు వెంగమాంబ భాగవతము లోని ఈ ద్విపదలను బట్టి తెలిసికొనవచ్చును.

"ఘనతరంబైన భాగవతంబునందు
మొనసిన తత్త్వార్థములను పామరులు
తెలియలేరటు గానఁ దేటగాఁ దత్త్వ
ములనెల్ల సంక్షేపముగ రచియించి
హరి పరాక్రమములు హరి విహారములు
హరి యవతారముల్ హరిమాహాత్మ్యంబు
పొలుపొంద విస్తరించి."

గ్రంథము తరిగొండలో వెలసిన శ్రీ నృసింహస్వామి కంకితము.

"నా చిన్ననాఁడు నోనామాలు నైన
నాచార్యులెవరు నాకాన తీలేదు."

అనుటచే వెంగమాంబ గురుముఖమున విద్య నభ్యసింపలేదని తెలియుచున్నది. పోతనవలె ఈమెను సహజపాండిత్యమలవడినది.

"ఫలితార్థమైన శ్రీ భాగవతంబు
నలప్రథమ స్కంధ మాది జేసికొని
క్రమముగా ద్వాదశ స్కంధముల్ వరుస
నమర నే రచియింతు నంటి నాస్వామి
యెటు కడ తేర్చునో; యాఁగ, తోయధిని
పటు శక్తితో నీదఁ బరువెత్తు కరణ
నేను భాగవతంబు నెరవేర్త ననుచుఁ
బూనిన నవ్వరే బుధులైన వారు
ఆనాడు పోతరాజాత్మ యందుండి
నానార్థ సార నిర్ణయ వాక్యములను
బలికించి నటువంటి పట్టాభిరాముఁ
డలర నామీద నేఁ డభిమాన ముంచి
చెలువొప్ప నెపుడు నా జిహ్వాయందుండి
పలికించి నటుల నే పల్కి"

నానని వెంగమాంబ గ్రంథారంభమున తెల్పినది. వెంగమాంబ మోక్షచింతన చేయునది. వేదాంత గ్రంథములను పెక్కింటిని రచించినది. ఆంధ్ర కవయిత్రులలో వెంగమాంబకు విశిష్ట స్థానమున్నది.

## (4) ద్విపద భారతములు:

కౌరవ పాండవ వంశేతివృత్త కథనముతో భారతము పదునెనిమిది పర్వముల గ్రంథవిస్తృతిని బొందినది. భారతము ఇతిహాసముగ, పురాణముగ, కావ్యముగ - ఇంకను పలువిధములుగ పండితవిమర్శకులచే పేర్కొన బడినది. భారతమునకు నాయకుడు కృష్ణుడనియో లేక ధర్మరాజనియో చెప్పకొన వచ్చును. కాని ఇందు పౌరాణికములనదగిన పెక్కు సందర్భములుండుటచే వస్త్వైక్యము కొరవడుచున్నది. భారతోపఖ్యానములు నీతిబోధకముగ, లోకవృత్తము ప్రదర్శితమగునట్లు రసవంతముగ రచింపబడినవి. భారతసంహిత ప్రతిభాన్వితులగునన్నయ,తిక్కన, ఎఱ్ఱాప్రగడ - అను కవిత్రయముచే నాంధ్రీకరింప బడినది. కవిత్రయ మహాభారతమునకు మహాకావ్యశ్రేణిలో ఉన్నత స్థానము కలదు. తెలుగు నాట దీనికి బహుళాదరణప్రాప్తి కలదు. కవిత్రయము వారి పద్యభారతమునను సరించి తెలుగులోని ద్విపదాది సాహిత్య ప్రక్రియలలో తర్వాతి కవులు వారిచిత్తవృత్తికి తోచినట్లు రచించియున్నారు.

ద్విపద భారతములు రెండు కలవు. ఒకటి లభ్యము. మరొకటి అలభ్యము.

(1) ద్విపద భారతము— గ్రంథకర్తలు—(1) బట్టేపాటి తిమ్మయ్య (18 పర్వములు) (1550–1600 A. D.)

(2) బాలసరస్వతి (1550–1600 A. D.)

(3) ఆతుకూరి సోమన (1600–1650 A. D.)

(2) ద్విపద భారతము– –లింగకవి – అలభ్యము.

కవిత్రయ భారతము ననుసరించి బట్టేపాటి తిమ్మయ (1550–1600), బాలసరస్వతి, ఆతుకూరిసోమన (1600-1650AD) యను మరొకకవిత్రయము భారతమును ద్విపదలో వెలయించిరి. ఈ ద్విపద భారతము ముద్రితము.[29] తిమ్మయ ఆదిపర్వము మొదలు ద్రోణపర్వాంతము వరకుగల ఏడు పర్వములలో ఒక్క సభాపర్వము తప్ప తక్కిన యారింటిని నిర్వహించెను. బాలసరస్వతి (ఇతడు వైయాకరణ బాలసరస్వతి కాడు) ఒక్క సభాపర్వమునుమాత్రమే రచించెను. ద్విపదభారతకవులలో మూడవ వాడగు సోమన కర్ణపర్వము మొదలు స్వర్గారోహణ పర్వము వరకు మొత్తము పదునొకండుపర్వములను రచించినాడు. అంతే గాక, తిమ్మయ సంగ్రహముగా, ఉపాఖ్యాన రహితముగ అయిదాశ్వాసములలోరచించిన అరణ్యపర్వమును సోమన ఆ పర్వము నందలి ఉపాఖ్యానముల నన్నిటినికూర్చి దానిని సర్వాంగ సుందరముగ ఏడాశ్వాసములుగ తిమ్మయ పేగనే రచించినాడు.

ద్విపదభారత జన్మస్థానము నెల్లూరు మండలము. "బాలసరస్వతి తిమ్మయ కవికి సమకాలికుడు; సోమన యర్వాచీనుడు" అనియు, తిమ్మయ కాలము 16 వ శతాబ్ది తుది భాగమో, మధ్యభాగమో కావచ్చుననియు, సోమన 17 వ శతాబ్ది పూర్వ భాగముననో మధ్యభాగముననో యుండియుండుననియు ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు 'ద్విపదభారత పీఠిక' లో ఊహించి యున్నారు.

29. చూ॥ ద్విపద భారతము – ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ. నెం. 30. పరిష్కర్త:–ఆచార్య పింగళి లక్ష్మీకాంతము, 1943.

ద్విపదభారతము కవిత్రయ భారతమునకు యథోచితాను సరణము. ద్విపద కవులలో తిమ్మయ తనకప్రస్తుతములని తోచిన కథలను, కథాంశములను నామమాత్రముగనైనను స్మరింపక వదలెను. ఉపసర్వ, శమంతక, అక్షౌహిణీసంఖ్యాకథనము, దేవశుని వృత్తాంతము, చ్యవనుని చరిత్ర, ప్రమద్వరాకథ, దేవ దానవుల యుత్పత్తి క్రమము, పురూరవాది రాజవంశప్రసంగము, ఋషితాశ్వుడు, శ్వేతకేతుడు, దీర్ఘతముడు, సుందోపసుందులు. మందపాలుర చరిత్ర — మొదలగునవి ప్రధాన భారతకథతో అంతగా సంబంధము లేనివి. ఈ కథలు కవిత్రయ భారతమున నున్నను తిమ్మయ వీనిని తన ద్విపద భారతమున స్మరింపలేదు. ఈ కథలను వదలివేయుటవలన భారత కథాశ్రోతలను ప్రధాన కథయందే దృష్టిని మరలింపజేసి కాలయాపనకలుగకుండ వారికి కథావినోదమును కవి కల్గించెను. తిమ్మయ, శాస్త్ర ప్రసంగ ములను, వేదాంతవిషయములను అవసరమున్నంతవరకే వర్ణించి మిగిలినవానిని తెనిగింపక విసర్జించినాడు.

తిమ్మయ, భారతకథను క్లుప్తముగా సూచ్యార్థసూచనగా ప్రస్తావించినాడు. అసలు కథకు పూర్వరంగమైన సముద్రమథ నము, దానికి హేతువగు దుర్వాసశ్శాప వృత్తాంతములతో గ్రంథారంభము చేయబడినది. దుర్వాసశ్శాపవృత్తాంతమువ్యాస భారతమున గాని కవిత్రయ భారతమునగాని లేదు. ఈ రెండు భారతములందును సముద్రమథన వృత్తాంతము హఠాత్సంభూత ముగానే కనిపించు చున్నది. దుర్వాస శ్శాపవృత్తాంతమును తిమ్మయకవి తన ద్విపద భారతమునందు కల్పించుటవలన ఇతివృ త్తము సోపపత్తికమైనది. దుర్వాసుని శాపముచే అమరలోకము పతనమైనది. అమరలోకసర్వసంపదలు సముద్రమున కూలినవి

కనుక అమరులకు సముద్రమథన మవసరమైనది. అమరులు బల హీనులగుటచే వారొక్కరే సముద్ర మథనముగావింపలేరు. పగవారైన రాక్షసులతో సంధిచేసికొనుట వారికి తప్పనిసరి యైనది. దేవదానవులకు పొత్తుగుదుర్చుటకై దేవగురువగు బృహస్పతి యిరువురిమధ్య రాయబారము నడపినాడు. ఇది నన్నయ భారత మున లేదు. ఇది మూలమునకు మెఱుగుదెచ్చు ఔచితీ పరిపోషక మగు అమూలగాథాకల్పన. దుర్వాసశ్శాపవృత్తాంత కథను తిమ్మకవి విష్ణుపురాణాదులనుండి గ్రహించియుండును. దుర్వాసుడు ఇంద్రుని, ఐరావతమును శపించు వృత్తాంతము పచ్చకప్పూరపు తిరువేంగళనాథ (1540) రచితమగు 'చొక్కనాథ చరిత్ర' మను ద్విపదగ్రంథము ద్వితీయాశ్వాసమున చొక్కనాథుని రెండవలీలను తెల్పు సందర్భమునందును వివరింపబడినది.

ద్విపదభారతములో అక్కడక్కడ కొన్నికొన్ని ఘట్టములు రసవంతములైన చిన్నచిన్న కావ్యములుగా నిలువదగినంత మనోహరరచనలతో రచింపబడినవి. ఉపరిచర వసువృత్తాంతము, యయాతిచరిత్ర, సముద్ర మథనవృత్తాంతము - మున్నగునవి ఈ జాతికి చెందినట్టివి.

ద్విపద భారత కర్తలలో తిమ్మయరచన మేలురమైనది. ఇతని రచనారీతులనుగూర్చి మరొకఅధ్యాయమున చర్చింతము. ఇక బాలసరస్వతి రచన అంత రసవంతముగా లేదు. సోమన రచన విశిష్టము కాకపోయినను ఆస్వాదనీయ యోగ్యమైనట్టిదే.

## లింగకవి భారతము:

లింగకవి కూడ భారతమును ద్విపదలో రచించినట్లు 'సీతా విజయము' అను అముద్రితాంధ్ర గ్రంథ పీఠికలో తద్గ్రంథకర్త యగు లింగకవి చెప్పిన ఈ మాటలనుబట్టి తెలియుచున్నది.

"..............................
లింగ కవియంద్రు నా పేరు లీల మెఱసి
తెనుఁగునను భారతంబెల్ల ద్విపద చేసి
హరికి నంకిత మొనరించి తధికులైన
కవి వరేణ్యుల నితఁడు సత్కవి యనంగ."

ఈ విషయమును శ్రీ కొమ్మనమంచి జోగయ్య శర్మగారు తెల్పినారు.[30] ఈ లింగకవి యెక్కడివాడో, యెప్పటివాడో, అతడు రచించిన ద్విపదభారత స్వరూప స్వభావాదులెట్టివో తెలియరావు. కాలగర్భములో ఇంకను ఇట్టిద్విపదభారతము లెన్ని మరుగుపడి యున్నవో?

## ద్వి ప ద హ రి వం శ ము:

హరివంశము భారతమున కనుబంధ గ్రంథము. హరివంశమును చేర్పనిచో భారతమునకు లక్ష శ్లోకవిస్తృతి కలుగదని విమర్శకుల అభిప్రాయము. కథానాయకుడగు శ్రీ కృష్ణుని వంశ వర్ణనకు భారతమున ప్రాధాన్యములేదు. భారతమునకు సంపూర్ణతను చేకూర్చుటకు హరివంశరచన తప్పనిసరి.

తాళ్లపాక పెదతిరుమలయ్య (1460-1547 A. D.) ద్విపదలో హరివంశమును 'రసస్ఫూర్తి' తో రచించినట్లు తాళ్లపాక చిన్నన్న తన అష్టమహిషీ కల్యాణావతారికలో పేర్కొనినాడు. గ్రంథము అలభ్యము.

## 2. వం శ కీ ర్త న ము లు:

ఒక రాజవంశమునకు లేక ఒక కులమునకు, జాతికి పౌరాణిక సంబంధమును కల్పించి తదాధిక్యవర్ణన ప్రశంసగల ద్విపద రచనలను వంశకీర్తన రచనలని పేర్కొన బడినవి. ఇవి అటు

---

30. 'ద్విపద భారతము – కొమ్మనమంచి జోగయ్యశర్మ– పరిశోధన సంచిక 4. 1954.

ప్రసిద్ధపురాణముల వంటివి గాక, ఇటు శుద్ధ చారిత్రక రచనల వంటివిగాక లౌకికాలౌకిక సంబంధియగు కథాంశములతో కూడిన రచనలు. రచనావిషయమున కావ్యప్రబంధ పద్ధతికంటె పురాణ సరళియే వీనియందు గోచరించును. ద్విపద వంశకీర్తన రచనలీ క్రిందివి.

(1) నవచోళచరిత్ర– పోశెట్టి లింగన (15 శతాబ్దాంత్యము)
(2) దేవాంగపురాణము – భద్రకవిలింగన (16 శతాబ్ది)
(3) మార్కండేయపురాణము–ఎల్లకరనరసింహాకవి (1580 AD)
(4) వైశ్యపురాణము – భాస్కరాచార్యుడు (1609 పూర్వుడు)
(5) ,, –మాధవదాసు.
(6) మల్లారిచరిత్ర–మఱింగంటి వేంకటాచార్యుడు (1700A. D.)
(7) మల్లారిచరిత్ర (మంజరి)– ఎఱ్ఱమిల్లి పేరరాజకవి (1856 A.D)

## నవచోళచరిత్ర :

పోశెట్టి లింగన (15 శతాబ్దాంత్యము)రచితమగు నవచోళ చరిత్ర 5 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. ఇది ముద్రితము.[31] లింగనకవి వీరశైవుడు; గార్లపాటి లక్ష్మణకవిశిష్యుడు, చకిలాల లింగప్పకు ప్రియమిత్రుడు. గ్రంథము లింగప్పప్రేరణచేత శ్రీరాము పల్లి నివాసియగు మృత్యుంజయ స్వామి కంకితము చేయబడినది. కవి లింగప్పను సంబోధించియే కథలను చెప్పినాడు. గ్రంథమధ్యమున కృతిపతిని సంబోధించు నాచారమే కాని కృతిప్రేరకుని సంబోధించు నాచారము తెలుగున అంతగాలేదు.

31. ప్రకాశకులు - ఆంధ్ర పత్రికాధి పతులు. 1923. పీఠికాకర్త. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు.

"భావజ్ఞులగు భక్తిపరులు గారణులు
రసికులు నవచోడ రాజులు మున్న
నసలార( బూజించి యాధ్యత మించి
వలనొప్ప మోక్షంబు వడసిన మహిమ
నల( గన్నడము( జేసి రాద్యులు మున్న
వెలయు(గా నీవును విజ్ఞానముననూ
దెలు(గున నద్దాని ద్విపద గావించి"

—ప్రథమాశ్వాసము. పుటలు 3–4;

అను ద్విపద పంక్తులనుబట్టి నవచోళచరిత్రము కన్నడగ్రంథము నకు తెలుగుసేత అనుట తెలియును. ఈ కన్నడగ్రంథమును గూర్చిన వివరములేవియు తెలియవు. కన్నడ నవచోళచరిత్ర అలభ్యము. నవచోళచరిత్ర కథలను పండితారాధ్యుడు భైరవ రాజునకు వినిపించినట్లు కలదు. భైరవరాజు పశ్చిమ సముద్రతీర మందుండు సాసలాపురమున కధిపతియట. కాని పండితారాధ్యుని కాలమున భైరవరాజుండినట్లు చారిత్రక నిదర్శనములు లేవు. నవచోళచరిత్ర కథాసంవిధానము పురాణమార్గముననుసరించినది

నవచోళులు గొప్ప శివభక్తులుగా వీరశైవ కావ్యము లందు స్తుతింపబడినారు. ప్రథమాశ్వాసమున కరికాలచోళుని చరిత్రము, ద్వితీయాశ్వాసమున విక్రమచోళుని కథ. తృతీయా శ్వాసమున ఉత్తుంగచోళ, అహివరచోళ, వరధర్మచోళ, సత్యేంద్ర చోళుల కథలు, చతుర్థాశ్వాసమున మనుజేంద్రచోళ, వీరచోళ, ఉత్తమచోళుల కథలు తెలుపబడినవి. ఈ నాలుగాశ్వాసముల లోను నవచోళుల శివభక్తి ప్రపూర్ణములగు మహిమానుభావ ములను, వారు కైలాసమున కేగుటను వివరింపబడినది. నవచోళ చక్రవర్తులలో కరికాళచోళుడు తప్ప తక్కిన వారు చారిత్రక ముగ ప్రసిద్ధపురుషులని చెప్పుటకు యిదమిత్థమగు నాధారములు

లేవు. కరికాలచోళుడు కావేరికట్టను కట్టించుటచేత ప్రసిద్ధుడై తర్వాతివారిచే ప్రశంసింపబడినాడు.

పంచమాశ్వాసమున కథాశ్రోతయగు భైరవ రాజునకు సంబంధించిన కథలు కలవు. ఇందు ఈశ్వరపూజాద్రవ్యమహిమ, ఆరాధనవిధి, నైవేద్యవిధానము,-మొదలగు శైవాచారవిధులు, వేదాంతవిషయములును తెలుపబడినవి.

నవచోళచరిత్రయందలి విక్రమచోళుని కథలో (చూ॥ 2వ ఆశ్వా. పుటలు 54-60) శాస్త్రవిషయముల చర్చ విపులముగా 200 ద్విపదలలో కలదు. ఈ శాస్త్రీయ విషయవివేచనా పరిపాటి, ఉత్తమమగు దార్శనిక సిద్ధాంత వివరణము, భక్తి నిష్ఠా పరతత్వము, అముష్మిక పరాయణత - మున్నగునవి కవి యొక్క వైదుష్యమును ప్రతిభను విశదీకరించుచున్నవి. శాస్త్ర విషయములను విపులముగా వెల్లడించు శైవ గ్రంథములలో పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర తర్వాత ఈ నవ చోళచరిత్రయే పేర్కొనదగినది.

పోశెట్టి లింగకవి ప్రసక్తాను ప్రసక్తముగ నవచోళుల చరిత్రలలో భాస్కరచోళుడు, ముక్కంటిచోళుడు (ఇతనికి త్రినయనచోళుడనియు పేరుకలదు), పిట్టవ్వ, చెన్నయ్య, నయనారు, మితవచనుడు, గణపాలుడు - మొదలగు శివభక్తుల కథలనుకూడ చేర్చి ప్రధాన కథతో కూర్చినాడు.

చోళవంశములోని ప్రముఖులగు రాజుల కొందరి చరిత్రములను విపులముగ వర్ణించుటచే నవచోళచరిత్రను పురాణమనుట కన్న చోళవంశ కీర్తనారూపమగు గ్రంథమనుట యుక్తము. నవ చోళ చరిత్రము శాస్త్రదృష్టితో, కథాకథనదృష్టితోనే గాక కావ్య శిల్ప నిర్మాణదృష్ట్యాకూడ అద్వితీయ గ్రంథము.

## దేవాంగపురాణము:

భద్రకవి లింగన (16 శతాబ్ది) ద్విపదదేవాంగపురాణము అముద్రితము. (చూ॥ నెం. 948 ప్రా. భా. మద్రాసు.) భద్రకవి లింగన దేవరదాసి వంశీయుడు; వీరశైవుడు. ఇతడు రామయ ప్రభుని పుత్రుడు; సంగమేశ్వరగురునిశిష్యుడు. పదవీటి దేవాంగ ప్రభువుల కోరికపై ఈ గ్రంథమును లింగన ముదునూరి రామేశ్వర స్వామి కంకితముచేసెను.

ద్విపద దేవాంగపురాణము బ్రహ్మాండ పురాణాంతర్గత మగు దేవాంగపురాణ భాగము ననుసరించినది. పురాణముని స్పష్టముగా పేర్కొనబడినను, దేవాంగుల వంశావతారమును వర్ణించుటచే దీనిని వంశకీర్తనారూపమగు రచనగా గ్రహింప వచ్చును.

ఇందు 7 ఆశ్వాసములు కలవు. ప్రథమాశ్వాసమున మనుమహాముని ఈశ్వరునకు దేవాంగఋషిగా జన్మించుటయు, దేవతాస్త్రముల నిర్మించుటయు, మొదలగువిషయములు వర్ణింప బడినవి. దేవాంగఋషి, విద్యాధర, పుష్పదంత, భేతాళ, వరరుచి, దివసాళి, దేవరదాసి—అను నామములతో ఆరు అవతారముల నెత్తు వృత్తాంతము తక్కిన ఆరాశ్వాసములందు వర్ణింపబడినది. ఈ అవతారములు ప్రాయికముగా ఇంద్రజాల, రసవాద, వైద్యాది విషయములను పెంపొందించుట ప్రయోజనముగా నేర్పడినవి. మనుమహాముని చివరి యవతారమును, దేవాంగ కులమున నెత్తెను. దేవరదాసి జైనులను ఖండించి వీరశైవ మతమును పెంపొందించినట్లు తెలియుచున్నది. గ్రంథాంతరమున కొమరేంద్రుడను నొక దేవాంగునివంశావతారము వర్ణింపబడినది.

ద్విపదదేవాంగపురాణమునందు సుమారు 3750 ద్విపదలు కలవు. 'తెలుగునకు నెరవాది ద్విపదకు రాజు' నని భద్రకవి లింగన గ్రంథారంభమున చెప్పికొనినాడు. నవరసభావములతో వివిధ వర్ణనలతో ఈ గ్రంథమును లింగనకవి రచించెను.

దేవాంగపురాణమును 7 ఆశ్వాసముల పద్యగ్రంథముగా రొచ్చి వీరభద్రకవి రచించినాడు.

## మార్కండేయపురాణము:

ఇది మార్కండేయముని చరిత్ర కాదు. పద్మసాలీలవంశ వృత్తాంతమునకు చెందిన మార్కండేయ పురాణ గ్రంథ మొకటి సంస్కృతమున గలదు. ఇది దానికి ద్విపద సేత. పద్మసాలీల కోరికపై ఎల్లకర నరసింహకవి (1580 A. D.) దీనిని ద్విపదలో రచించి కొమర వోలులో వెలసిన రాజగోపాలుని కంకితము చేసెను. ద్విపద మార్కండేయపురాణము అముద్రితము. (చూ॥ ఆర్. నెం. 132. ప్రా; భా. మద్రాసు.) ఎల్లకర నరసింహకవి కృష్ణయామాత్యుని పుత్రుడు; తిరుమల లక్ష్మణాచార్యుని శిష్యుడు.

ఈ గ్రంథారంభమున పద్మసాలీల వంశమూలమును, వారి గొప్పతనమును కవి సంక్షిప్తముగ వర్ణించినాడు. ఒంటి కంబపు మేకను సాధించిరనియు, కాలువసేనుని (పల్లవరాజు) రణరంగమున జయించిరనియు, పద్మతంతులచే జనించిరనియు, భావన ఋషి వంశ్యులనియు పద్మసాలీలను గూర్చి మరికొన్ని విశేషములను కవి యిందు తెల్పినాడు. దీనిని పురాణమనియే కవి పేర్కొనినాడు. కాని యిందు పద్మసాలీల వంశమును, ఆ వంశములోని ప్రముఖుల చరిత్రను వర్ణింపబడియుండుటచే దీనిని వంశకీర్తన గ్రంథముగ పరిగణింపవచ్చును.

## వైశ్యపురాణము:

వైశ్యపురాణమునకు కన్యకాపురాణమని, వాసవీమాహాత్మ్యమని నామాంతరములు. దీనిని భాస్కరాచార్యుడు ద్విపదలో రచించెను. ఇదిఅముద్రితము. (చూ॥ నెం. 1011 (బి) ప్రా. భా. మద్రాసు.) ఇది వైశ్యుల కందరికి అంకితము. పెనుగొండలో వెలసిన కన్యకా పరమేశ్వరి కథ యిందలి ముఖ్యకథాంశము.

భాస్కరాచార్యుడు క్రీ.శ. 1609 సంవత్సరమునకు పూర్వుడైయుండునని డా॥ చిలుకూరి నారాయణరావు గారు శాసనాధారములతో తెల్పియున్నారు.[32] భాస్కరాచార్యుడు దీనిని 8 ఆశ్వాసముల పద్యకావ్యముగ కూడ రచించినాడు.

వైశ్యపురాణములో వాసవీకన్య అగ్నిగుండమున బడినప్పుడచ్చట నున్న వైశ్య కులాచార్యుడగు భాస్కరాచార్యులును ఈ గ్రంథకర్తయును ఒక్కరుకారు. భిన్నులు.

మాధవదాసు అను వైశ్యకులజుడు కూడ వైశ్యపురాణమును 5 ఆశ్వాసముల ద్విపదగ్రంథముగ రచించెను. ఈగ్రంథము ముద్రితము.[33] ఇది పెనుగొండలో వెలసిన నృసింహస్వామి కంకితము. వైశ్యపురాణములో వర్ణితమైన పెనుగొండ అనంతపుర మండలములోనిది కాదని, అది పశ్చిమ గోదావరి మండలములోని తణుకు తాలూకాలోని పెనుగొండ యని శ్రీ చాగంటి శేషయ్యగారు తెల్పియున్నారు.[34]

సూతుడు శౌనకాది మునులకు చెప్పిన మూడవజాతియగు వైశ్యవరుల జన్మవృత్తాంతమును, వారి ప్రాభవమును, వైశ్యుల

32. చూ॥ పండితారాధ్యచరిత్ర. పీఠిక. పుట 135.

33. పరిష్కర్త. సుబ్బరాయ సిద్ధాంతి. చింతామణి ముద్రాక్షరశాల.

34. చూ॥ ఆంధ్రకవి తరంగిణి_9వ సంపుటము. పుట 208.

కోరికపై శాలంకాయన ముని చెప్పినట్లు మాధవదాసు ద్విపద వైశ్యపురాణమునగలదు. ఈగ్రంథము మొదటి మూడాశ్వాసములును వైశ్యుల జన్మవృత్తాంతమును, వారుకైలాసమునుండి భూమియందవతరించుట మొదలుగాగల పురాణకథలతో నిండియున్నది. దక్షాధ్వరధ్వంస కథ, పార్వతీ పరిణయము, కుమారజననము, తారకాసురసంహారము - మొదలగు కథాంశములను కాళిదాసుని కుమారసంభవము ననుసరించి కాబోలు మాధవదాసు విపులముగ, కావ్యోపయోగ్యముగ, లోకజ్ఞతను ప్రదర్శించు మనోహర సన్నివేశములతో రసాధిక్యతతో రెండు, మూడాశ్వాసములలో వర్ణించినాడు. ఈశ్వరాజ్ఞచే వైశ్యులు గోకర్ణమూలముగ భూమియందు పెనుగొండ మొదలగు 18 పట్టణములలో నివసించుచు గురుదైవికములను ప్రోచుచుండిరి.

ద్విపద వైశ్యపురాణము తుది రెండాశ్వాసము లలో వాసవీకన్యతో సంబంధించిన కథ వర్ణితమైనది.

వాసవాంబిక, పెనుగొండనివాసియగు కుసుమసెట్టి పుత్రిక. ఒకనాడు చంద్రవంశజుడగు విష్ణువర్ధన మహారాజు దిగ్విజయము చేయుచు, మార్గవశమున పెనుగొండ కేతెంచెను. ఆ రాజున కాతిథ్యమిచ్చుటకై వచ్చిన వైశ్య యువతులలో నున్న వాసవాంబికను చూచి రాజు కామించి ఆ కన్యను తనకిచ్చి పరిణయము చేయుమని కుసుమసెట్టికి వర్తమానము పంపెను. అందుకు వైశ్యులంగీకరింపమిచే విష్ణువర్ధనుడు బలవంతముగా నా కన్యను తెమ్మని తన సేనానాయకునాజ్ఞాపించెను. వైశ్యులపురోహితుడు భాస్కరాచార్యుడు తమ మతాచారములను కాపాడుకొనుటతమ ధర్మమని వైశ్యులకు బోధించెను. బలవంతుడగు రాజుతో పోరాటము లాభములేదని తలచి వైశ్యులు సతీపుత్ర బాంధవ సహిత

ముగా అగ్నిగుండముల బడి తమ ధర్మమును కాపాడుకొన నిశ్చయించిరి. వాసవాంబిక తలిదండ్రులకుకూడ ధైర్యముచెప్పి, తనతో కూడ అగ్నిలో పడుటకు సంసిద్ధులైన 102 గోత్రములవారి వంశీయులు ఐశ్వర్యముతో తులతూగునట్లును, వారు తమ గురువగు భాస్కరాచార్యుని యందును, వారి వంశీయులందును భక్తిశ్రద్ధలు కలిగి పూజింపు చున్నట్లును ఆశీర్వదించి, మిగిలిన 612 గోత్రములవారు వర్ణభ్రష్టులై చెడిపోవుదురని శాసించి, తన్ను కామించిన విష్ణువర్ధనుడు తాను అగ్నిని ప్రవేశించినవార్త వినినంతనే శిరసు బ్రద్దలై మరణించునని శాపమొసగి అగ్నిగుండమున బడి ప్రాణములఁ బాసెను. చారుల వలన రాజు ఈ వార్త వినిన క్షణముననే యాతనితల వ్రక్కలై మరణించెనట. వైశ్యుల ఆడపడుచగు వాసవీకన్య పేరు వైశ్యవంశమున కలకాలము నిలిచిపోయెను. ఆమె పేర తటాకములు, గుళ్లు, గోపురములు వెలసెను. వైశ్యులు ఆమెను కులదేవతగానారాధించుచున్నారు.

మాధవదాసు భక్తితో వివిధపురాణములందలి వైశ్యుల కథలను శోధించి ఒకచో ఔచితీవంతముగ ద్విపద వైశ్యపురాణమునందు కూర్చినాడు. పురాణములందలి కథలు ఇందు కూర్పబడుటచే దీనికి పురాణమను నామము సార్థకమే. కాని మూడవ జాతియగు వైశ్యవంశవృత్తాంతము, ఆ వంశములోని ప్రముఖుల చరిత్రను తెలుపు గ్రంథమగుటచే దీనిని వంశకీర్తనగ్రంథముగా పరిగణింపవచ్చును.

మాధవదాసు "నవరసాలంకార నవ్యప్రబంధ గవితా ప్రవీణుడ, గాంభీర్యధనుడ" నని గ్రంథాంతమున తెల్పినాడు. అతని కవితలో చక్కని భావనాపటిమ, భాషాపటిమ తొణికిసలాడుచుండును. ఉదా:- సూర్యాస్తమయ వర్ణన—

"సరసిజాతుండు దైత్య సంఘంబు దునిమి
కరమర్థి చక్రంబు గడగుట కొఱకు
మున్నీటి లోపల ముంచెనో యనగ
యన్నీరజ హితుండు యపరాద్రి గ్రుంకె
భూషణు వేడ్క కంభోరాశి మదిని
గాసిల్లు తనయందు గలుగు రత్నముల
దిశల జల్లిన మాడ్కి దిక్కులనెల్ల
రసికత్వమున సంధ్య రక్తంబు దోచె

..........................................................

-ద్విపద వైశ్యపురాణము-3 వ ఆశ్వా. పుటలు 160-162.

మల్లారిచరిత్ర :

మతేంగంటి వేంకటార్య (1700 A. D.) రచితమగు మల్లారిచరిత్ర 4 ఆశ్వాసములు మాత్రమే గల అసంపూర్ణమగు ద్విపదగ్రంథము. ఇది అముద్రితము. (చూ॥ ఆర్, నెం. 338, ప్రా. భా. మద్రాసు) ఈద్విపదగ్రంథమున చాలతప్పులు కలవు.

మల్లారి చరిత్రయందు కర్ణుని వంశపురాజుల చరిత్ర విపులముగ వర్ణింపబడినది. కర్ణుడొక ఋషి చెవినుండి పుట్టెనట. ఈ రాజపూర్వికుడగు గిరిరాజు మల్లారి లేక 'మలహారి' కరుణచే రాజ్యమును సంపాదించెనట. మల్లారిచరిత్రలో గోడేవారి కులాచారములు, ఆచార వ్యవహారములు సవిస్తరముగ వివరింపబడినవి. కనుక గోడేవంశమువారందరును మల్లారియెడ భక్తిశ్రద్ధలను ప్రకటింతురు. మల్లారికథ స్కాంధపురాణమున నున్నది. గోడేవారి వంశచరిత్ర విపులముగ నిందు వర్ణింపబడుటచే ఇది వంశకీర్తనారూపమగు గ్రంథమగుచున్నది.

పేరాజకవి మల్లారిచరిత్ర:

గోడే సూర్యప్రకాశరాయని భార్యయగు జానకమ్మ యాజ్ఞప్రకారము, వేంకటార్యుని ద్విపదమల్లారిచరిత్రను, అక్కడక్కడ సంస్కరించి మరికొన్ని మంజరీద్విపదలను చేర్చి గ్రంథమును పెంచి పేరాజకవి (1856 A. D.) కూర్చినాడు. ఈవిషయమును పేరాజకవి తన మంజరీద్విపద రూపమగు మల్లారిచరిత్ర గ్రంథావతారికలో తెల్పినాడు. పేరాజకవి మల్లారిచరిత్రకూడ అముద్రితమే. (చూ॥ సంఖ్య 338 (b) - (25-64). ప్రా. భా. మద్రాసు.)

జానకమ్మ గోడేవంశమునకు చెందినది. ఆమె, అంతకు ముందుప్రచారములోనుండు వేంకటార్యునిద్విపదమల్లారిచరిత్రలో కొన్ని తప్పులుండుటచే మరల పేరాజకవిచే మంజరీద్విపదలచే విస్తరింపజేయించినది.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు ఆర్. నెం. 338 (a) గల మల్లారిచరిత్ర పద్యకావ్యము ఒకటి కలదు. ఈగ్రంథమాద్యంతములు శిథిలములగుటచే గ్రంథకర్త నామాదికములు తెలియరావు.

3. కావ్యప్రబంధములు:

వేదములలోని కథలను పెంపొందించి ఉపాఖ్యానములతో నీతిబోధకముగా లోకవృత్తము ప్రతిబింబించునట్లు రచించుట పురాణ పద్ధతి. పురాణములలోని ఒక ప్రసిద్ధకథను గ్రహించి వివిధ వర్ణనాలంకారములతో పాత్రచిత్రీకరణముతో రసభావ ప్రధానముగా రచించుట కావ్యపద్ధతి. ఈ కావ్యపద్ధతియొక్క విశిష్టపరిణామమే తెలుగుసాహిత్యమున ప్రబంధపద్ధతి అనిపించు

కొనినది. ప్రబంధమును కావ్యమే అయినను ప్రబంధమందు వస్త్వైక్యము, ఏకనాయకాశ్రయము, రసాధిక్యత, నాటకీయత, ఆలంకారికరచన - మున్నగు కావ్యకళాధర్మముల కధికప్రాధాన్య ముండును. తెలుగున కొన్ని కావ్యములనుకూడ ప్రబంధములని వ్యవహరించుట కలదు. ప్రసిద్ధమగు కథను గ్రహించి కథావస్తు పోషణమున స్వాతంత్ర్యమును, రచనావిషయమునకొంత ప్రాబంధికతయు, ప్రధానముగ రచింపబడిన ద్విపదకావ్యములను కావ్య ప్రబంధములని పేర్కొనవచ్చును. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, గోపాలకవి సౌగంధిక ప్రసవాపహరణము, రాఘవాచార్యుని నలచరిత్ర, రామనార్యుని కుశలవోపాఖ్యానము - ఇత్యాది ద్విపద కావ్యములు రచనా విధానమున ప్రబంధ సామ్యమును బొందినవి. పురాణ ప్రసిద్ధకథలను నూతనములగు కల్పనలతో దేశిలక్షణ శోభితముగ రచింపబడిన ద్విపద కావ్యములును కలవు. కృష్ణార్జునసంవాదము, మైరావణచరిత్ర, శతకంఠరామాయణము — మొదలగునవి ఈ జాతికి చెందినవి. 'మేఘదూతము' వంటి అనువాదములును ద్విపదకావ్యములలో కలవు. 'సేవాంజలి' వంటి స్వతంత్ర కావ్యములును ద్విపదలలో నున్నవి. పురూరవోపాఖ్యానము, పరశురామాయణము — మున్నగునవి వస్త్వైక్యము కల్గి, జనసామాన్య సుబోధకముగ సులభశైలిలో, రసాధిక్యముతో రచింపబడినవి. స్త్రీజనోపయుక్తముగ రచింపబడిన 'సత్యాద్రౌపదీ సంవాదము', 'అరుంధతీచరిత్ర'; 'సావిత్రిచరిత్ర', మొదలగు ద్విపద లఘుకావ్యములు కూడ నున్నవి.

పైని పేర్కొనిన కావ్యములన్నింటిలోను కావ్యప్రబంధ సంబంధియగు సామాన్యధర్మములు కొన్ని యుండుటవలన వానిని 'కావ్యప్రబంధము' లనివర్గీకరించి పరిశీలించుటయుక్తము.

హరిశ్చంద్రోపాఖ్యానము:

వేద, పురాణ ప్రసిద్ధమైన హరిశ్చంద్రకథను ఇతివృత్తముగా గల్గిన ద్విపదకావ్య ప్రబంధము లీక్రిందివి:

(1) హరిశ్చంద్రోపాఖ్యానము – గౌరన (1440 A. D.) (పూర్వోత్తర భాగములు)

(2) హరిశ్చంద్రచరిత్ర (రెండు భాగములు) – వెన్నకంటె చంద్రశేఖరకవి (1700 A. D.)

(3) హరిశ్చంద్రకథ – కనకబండి గట్టయ్య (18 శతాబ్ది)

(4) ఉత్తర హరిశ్చంద్రచరిత్ర – గద్దె చంద్రశేఖరకవి (18 శతాబ్దాంత్యము.)

(5) ఉత్తరహరిశ్చంద్రీయము – గార్లదిన్నె సుబ్బారావు (20 శతాబ్ది)

(6) ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర – కర్తృత్వ నామాదికములు తెలియవు. ఆర్. నెం. 160 – Triennial catalogue of MSS

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము:

వేద, పురాణములలో భిన్నరీతులుగనున్న హరిశ్చంద్ర కథను కావ్యవస్తువుగా గ్రహించిన తెలుగుకవులలో మొట్టమొదటివాడు గౌరన. అతని ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానము ననుసరించియే తక్కిన ఆంధ్రకవులందరును హరిశ్చంద్ర కథను ప్రత్యేకకావ్యములుగ తమచిత్తవృత్తికి తోచినట్లు వివిధప్రక్రియలలో రచించినారు.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము ముద్రితము.[35] ఇందు పూర్వోత్తరభాగములు కలవు; సుమారు 2900 ద్విపదలున్నవి.

---

35. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్. 1951.

"చెలగి ఋగ్వేద ప్రసిద్ధుడై జగతి
వెలయు హరిశ్చంద్ర విభు పుణ్యచరిత."



అని గౌరన హరిశ్చంద్ర కథా ప్రారంభమునందు తెల్పినాడు. కాని ఈ కథకును ఋగ్వేదములోని ఐతరేయ బ్రాహ్మణము నందలి హరిశ్చంద్రకథకును సంబంధము లేదు. వేదహరిశ్చంద్ర కథ సత్యహరిశ్చంద్ర కాదు. హరిశ్చంద్రకథ భాగవత, దేవీ భాగవతములందును, మార్కండేయ, స్కాందపురాణములందును కలదు. "మార్కండేయపురాణములోని హరిశ్చంద్రకథ ఉత్తర, పశ్చిమ హిందూస్థానములలో వ్యాపించియున్నది. స్కాందము లోని హరిశ్చంద్రకథ దక్షిణమున వ్యాపించి యున్నది. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము స్కాంద పురాణోక్త కథకే దగ్గర సంబంధము కల్గియున్న" దని శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారి అభిప్రాయము.[36]

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున స్వతంత్రములగు కల్పనలు, మూలభిన్నములగు మార్పులు కొన్ని కలవు.

(1) హరిశ్చంద్రుడు స్వర్గమునకేగిన తర్వాత వసిష్ఠ విశ్వామిత్రులు ఒకరినొకరు శపించుకొని పక్షిరూపముల కలహించినట్లు మార్కండేయపురాణ, దేవీభాగవతములందు వర్ణింప బడినది. వసిష్ట విశ్వామిత్రుల కలహమును కావ్యారంభముననే ఇంద్రసభలో జరిగినట్లు గౌరన కల్పించినాడు. కథావస్తునిర్మాణ దృష్టితో కావించిన ఈ కల్పన ఔచిత్యప్రధానముగ నున్నది.

(2) మూలమున హరిశ్చంద్రు నెలయించినది మాయా సూకరమనియుండ గౌరన మాయ లేడిగా వర్ణించినాడు.

---

36. చూ॥ "హరిశ్చంద్ర - గౌరనమంత్రి" - వ్యాసము. భారతి. ప్రమాది సంవత్సరము చైత్రము.

(3) హరిశ్చంద్రుడు వేటకు పోయినచోట విశ్వామిత్రు నకు రాజ్యమును ధారవోసినట్లు మార్కండేయ పురాణమున కలదు. దీనికి భిన్నముగా గౌరన ద్విపద కావ్యమునందు కలదు.

(4) వేదపురాణములలోని నరమేధవృత్తాంతము హరి శ్చంద్రుని శీలమునకు, సత్యవ్రతమునకు, ధార్మిక ప్రవర్తకతకు భిన్నముగా నున్నదని తలంచికాబోలు గౌరన దానిని పూర్తిగా వదలినాడు.

(5) వేద, పురాణములలోని హరిశ్చంద్రకథలో నక్షత్రక పాత్ర కానరాదు. నక్షత్రకుని సృష్టించినది గౌరనయే. నక్షత్రక పాత్ర హరిశ్చంద్రోపాఖ్యానమున చాల ప్రాముఖ్యము కల్గినట్టిది. విశ్వామిత్రుడు, చంద్రమతిని అమ్మగా వచ్చినధనము తన గురు దక్షిణకుచాలదని హరిశ్చంద్రునికూడ అమ్మినట్లు మార్కండేయ పురాణమున కలదు. ఈ అసంగతమును గౌరన నక్షత్రకుని మూలమున తొలగించినాడు. నక్షత్రకుడు చంద్రమతిని అమ్మగా వచ్చిన ధనమును తన బత్తెపు నెలవుగా గ్రహించి, మునికీయ వలసిన సొమ్మునకు రాజును అమ్మినట్లు గౌరన ఔచితీవంతముగ కల్పించినాడు.

(6) చంద్రమతిని అమ్మినపుడు ఏడ్చుచు వెంబడించిన లోహితునకు కాలకౌశికుడు తనంతనే మూల్యమొసగినట్లు మార్కండేయ పురాణమున నున్నది. హరిశ్చంద్రుడు లోహితు నకు మూల్యమడిగినను కాలకౌశికుడీయక పెనగుచుండ, నక్షత్ర కుడు లక్షమాడలు లంచముగొని కాలకౌశికునిపక్షము తీర్పుచెప్పి పంపినట్లు గౌరన మార్చినాడు. దీనిచే కాలకౌశిక నక్షత్రపాత్ర ములు మరింత నీచములుగను, హరిశ్చంద్రునిస్థితి దైన్యముగను, చిత్రింపబడినది.

(7) హరిశ్చంద్రుని భార్య 'శైబ్య' యని మార్కండేయపురాణమునందుకలదు. స్కాందపురాణమునందు మాత్రము చంద్రమతి యని యున్నది. గౌరన దీనినే గ్రహించినాడు.

(8) మార్కండేయపురాణము నందునను, దేవీ భాగవతమునందునను హరిశ్చంద్రుడు కాటియందు పిండములను తిని ఖున్నివారణము చేసికొనుచుండెనని తెల్పబడినది. దీనిని నీచముగా భావించి కాబోలు గౌరన,

"దివినుండి కనుగొని దివిజులు మెచ్చి
యవనీశ లేకున కాకలిదప్పు
లొదవ కుండగ వరం బొసగి రావేళ."

-ద్వితీయభాగము. ద్విపదపంక్తులు 1557-59

అని తన ద్విపద కావ్యమునందు హరిశ్చంద్రున కాకలిదప్పులు లేకుండ దేవతలు వరమిచ్చినట్లు కల్పించినాడు.

(9) మార్కండేయపురాణమునందు లోహితుని చావు విని దుఃఖముతో హరిశ్చంద్రుడు భార్యాసహితముగ చిచ్చులో పడబోవగ దేవతలు ప్రత్యక్షమైనట్లు చెప్పబడినది. స్కాంద పురాణములో మాత్రము హరిశ్చంద్రుడు భార్యను నరకబోవు చుండ దేవతలు ప్రత్యక్షమైనట్లు తెల్పబడినది. ఇది మార్కండేయ పురాణమునందలి దానికంటె ఔచిత్యవంతమైనది. గౌరన స్కాంద పురాణాంతర్గతమైన కథనే గ్రహించినాడు. మంగళ సూత్ర జ్ఞానముచే చంద్రమతి సార్వభౌముడగు హరిశ్చంద్రుని గుర్తించుట, చంద్రమతి మరల మాడకై యింటికిబోవుట, శిశు హత్యా నిందారోపణము, రాజదండన, హరిశ్చంద్రుని ఆజ్ఞా నిర్వహణము- ఇవన్నియు గౌరన కల్పనలే. చివరకు ఒకప్రక్క పుత్రశోకము, ఇంకొకవైపు భార్యాప్రేమ, మరొకదిక్కున వీర

బాహుని యాజ్ఞ, వేరొకవైపు విశ్వామిత్రుడు వచ్చి మాతంగ కన్యలను వివాహమాడినచో కష్టముల నన్నిటిని తొలగింతునని ఆశపెట్టుట — శోకము, ప్రేమ, అసత్యభీతి, ఆజ్ఞానిర్వహణము, ఆశ — ఒక్కుమ్మడి హరిశ్చంద్రుని హృదయమును కలచివేసినవి. కాని ధీరుడగు హరిశ్చంద్రుడు మాత్రము చలించలేదు. అతని సౌశీల్యము, సత్యసంధత, వీసమైనను తగ్గలేదు. ఇట్టి సన్నివేశ చిత్రణ గౌరన ద్విపదకావ్యములో నుండుటవలన హరిశ్చంద్రుడు నిత్యసత్యవ్రతుడను భావము ఆబాలగోపాలములో నేర్పడినది.

(10) ఇంద్ర ప్రార్థనముచే చివరకు హరిశ్చంద్రుడు లోహితాస్యుని పట్టాభిషిక్తుని చేసి అయోధ్యా నగరవాసులతో కూడ స్వర్గమున కేగినట్లు పురాణములలో కలదు. ఈ అసంగతములను వదలివేసి హరిశ్చంద్రుడు తానుపడిన కష్టములన్నిటికిని ఫలితముగ చాలకాలము సుఖముగ రాజ్యమేలినట్లు గౌరన తన ద్విపదకావ్యమున కావించిన మరొకమార్పు. గౌరన కావించిన స్వతంత్ర కల్పనలను మార్పులను హరిశ్చంద్రకథను కావ్యవస్తువుగా గ్రహించిన తెలుగుకవు లందరును చాలవరకు అనుకరించి యున్నారు.

గౌరన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానమున హరిశ్చంద్రుని ధర్మవీరత్వము చక్కగా ప్రకటింపబడినది. హరిశ్చంద్రునిగూర్చి వసిష్ఠుడనిన మాటలివి.

"తనువెల్ల సత్యంబు తలపెల్లఁ గరుణ
పనులెల్ల ధర్మంబు పలుకెల్లఁ బ్రియము
బొంకు నాలుకకు జేర్పుట కాని వావి..."

ప్రథమ భాగము - ద్వి. పం. 233-35.

"తల్లిసత్యము నాకుఁ దండ్రి సుజ్ఞాన
మెల్లెడ సోదరుఁ డెసగు ధర్మంబు
చెలువార ధైర్యంబు చెలికాడు శాంతి
కులసతి వినయంబు కొడుకు చర్చింప."

—ద్వితీయభాగము — ద్వి. పం. 1525–30.

అని హరిశ్చంద్రుడు పల్కు సందర్భమునను,

"హరిహర బ్రహ్మాదు లచ్చెరు వొంద
జరిపె సన్నుతి కెక్క సత్య వ్రతంబు."

—పూ. భా. ద్వి. పం. 141–142.

"లెక్కింప నపకీర్తి లేని జీవనము
నిక్కంబుగా నొక్క నిమిషంబె చాలు."

అను హరిశ్చంద్రుని పల్కులలోను అతని ధర్మవీరత్వము, సత్యవ్రతదీక్ష సువ్యక్తమగును. హరిశ్చంద్రోపాఖ్యానమున సత్యవీగమంగి. ధర్మయశోవీరములు తత్పోషకములు. రౌద్రకరుణాద్భుత హాస్యములు అంగరసములు.

వేదపురాణప్రసిద్ధమైన హరిశ్చంద్రకథను గౌరన సత్యవీర రసస్ఫోరకముగ, అనల్ప కల్పనా శేముషితో, 'కవితా చమత్కృతి'తో, 'కవులందఱును శిరఃకంపంబుసేయు' నట్లుగ 'వీనుల పండువుగాఁగ', అనన్యసామాన్యప్రతిభతో నొక ప్రబంధముగ తీర్చి దిద్దినాడు. ఈద్విపద కావ్యప్రబంధములన్నిటిలోను గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము మేల్తరమైనది. ప్రౌఢమైనది. "హరిశ్చంద్ర ద్విపదలోఁ బూర్వప్రబంధ రచనా సంప్రదాయములు పాటింపఁ బడకున్నను, అందలి రచనాఫక్కి, సంభాషణశైలి, స్వభావోన్మీలన శక్తి, జాతీయప్రయోగనైపుణి, రసావిష్కరణ దృష్టి, భావౌచిత్యపోషణము — మొదలగునవి దీనినొక ప్రౌఢ ప్రబంధ

ముగఁ జేయుటయే గాక, గారనామాత్యునికిగల 'సరససాహిత్య లక్షణ విచక్షణు' డను బిరుదును సార్థకము చేయుచున్నవి.'' 37

హరిశ్చంద్రకథ పూర్వోత్తర భాగములను వెన్నెకంటి చంద్రశేఖరకవి (1700) కూడ ద్విపదలోరచించినట్లు గోలకొండ కవుల సంచిక (పుట 399) లో తెల్పబడినది. చంద్రశేఖరకవి ఒరంగల్లు నివాసి. ఈగ్రంథమును గూర్చిన వివరములు తెలియవు.

గోలకొండ కవుల సంచిక (పుట 398) లో కనకబండి గట్టయ్య హరిశ్చంద్రకథను ద్విపదలో రచించినట్లుకలదు. ఇతడు 150 సంవత్సరముల క్రిందట నుండెననియు, నిజాము రాష్ట్రము లోని నేలకొండపల్లి నివాసి యనియు, యాదవుడనియు అందు తెల్పబడినది. ఈ ద్విపద హరిశ్చంద్రకథ నాకు లభ్యముకాలేదు.

ఈ కవి కాటమరాజు కథను, పోలరాజు కథను కూడ రచించెనట. 38

ఉత్తర హరిశ్చంద్రచరిత్ర:

హరిశ్చంద్ర ఉత్తర కథాభాగమును ద్విపదలో రచించిన వాడు గద్దె చంద్రశేఖరకవి. గ్రంథము అముద్రితము. (ఆర్. నెం. 1028 ప్రా. భా. మద్రాసు.) ఇది చెంగరాయాపరనాముడగు కుమారస్వామి కంకితము.

విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని బాధించుటకు పలువిధ ముల ప్రయత్నించుట, తుదకు హరిశ్చంద్రుడు సత్యవాక్య పరి పాలనముచే రాజ్యమును, కీర్తిని బడయుట పూర్వ హరిశ్చంద్ర

---

37. చూ॥ నవనాథ చరిత్ర పీఠిక. పుట XXX - శ్రీ కోరాడ రామకృష్ణయ్య.

38. ఆంధ్రకవి సప్తశతి - పుట 54 - బులుసు వెంకటరమణయ్య ప్రచురణ సెప్టెంబరు - 1956.

లోని కథ. హరిశ్చంద్రాదుల పూర్వజన్మవృత్తాంతము, చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహము, ఆ రాజదంపతులు కష్టముల పాలగుటకు హేతువులు, తక్షకశాపము వలన నలకూబరుడు లోహితాస్యుడుగా జన్మించుట, యముడు వీరబాహుడగుట, శని కాలకౌశికుడై జన్మించుట. హరిశ్చంద్రుడు రాజసూయ మొనర్చుట — మొదలగు కథాంశములు ఉత్తర హరిశ్చంద్రీయము నందు విపులముగా వివరింపబడినవి,

ఉత్తర హరిశ్చంద్రీయము!

గార్లదిన్నె సుబ్బారావు (1910 A. D.) ఉత్తర హరిశ్చంద్ర కథను 6 ఆశ్వాసముల ద్విపదకావ్యముగా కొమండూరు అనంతాచార్యులు గారి వచన ఉత్తర హరిశ్చంద్ర కథ ననుసరించి రచించెను. ద్విపద ఉత్తరహరిశ్చంద్రీయము ముద్రితము.[39] ఇందు సుమారు 2700 ద్విపదలు కలవు. కృతిపతియగు రాచోటి రామయ్య దీనికి కథాశ్రోత.

కథావస్తువు పురాణమునుండి గ్రహించినను సుబ్బారావు కవితలో నవ్యత, దేశీయత మిక్కుటము.

సాయుధహస్తులైన సైనికుల వర్ణనలో వాడిన ఉపమానములను చూడుడు:

"కత్తుల నెత్తిన ఘనసైన్యభాగ
మత్తఱి సద్దచే నట్లు చూపట్టె
గదల నెత్తిన దండుఁ గనఁ గంకిపట్టె
పొదలెడు జొన్నచేనో్బలి చెల్వొప్పె
నీకెలు శూలంబు లెగనెత్తిన పరి
పాటి బొంగుల పొద పగిది కన్పట్టె."

— ద్విపద ఉత్తర హరిశ్చంద్రీయము 5 వ ఆశ్వా. పుట 170.

39. Rowjea's Press - Adoni - 1936.

కలకంధర ఏకులువడకుటలోని స్వాభావికవర్ణనఅద్భుతము.

"రాటము ముందట రతనంపుఁ జిన్న
పీటపైఁ గూర్చుండి బిసరుహ పాణి
కుడి కాల రాట్నపు కొన పీటఁ ద్రొక్కి
యెడమ హజ్జ నిలుపు నిలఁ జిక్కఁ బట్టి
కడియముల్ గాజులు కట్లు తోడాలు
బడిబడి ఘల్లని ధ్వని సేయు చుండఁ
గుడి చేతిలోఁ బిడిఁ గొని త్రిప్పిత్రిప్పి
యెడమ కేలున నేకు నెగయీడ్చి యీడ్చి
తన చూక్కి యేకుతో దారంబు తోడ
ననుగమింపఁగ దార మప్పుడు నపుడు
కదురుకుఁ జుట్టిన క్షణమాత్ర మందు."

—ద్వి. ఉ. హ. 4వ ఆశ్వా. పుటలు 141–142.

చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహసందర్భమున నేర్పాటు చేయబడిన 'సంగీతసభ' 40 లో,

"సారిస, రిసనిద, సరిగపమాప్ప
సారిగ, రిగమప, సనిదప, మామ్మ"

అను సంగతులతో గాయకులు ఘనరాగములను పాడిరి.

"టంటణ్ణు టంటణ్ణు టంటణ్ణు టణ్ణు
టంటణ్ణు టంటణ్ణు టంటణ్ణు టణ్ణు."

అనుచు తాళముల వాద్యకాతులు వాయించిరి.

"థేథధ థకథక్క థైథద్ధ థాద్ధ
థాథక్క థకథైక థక్క థైథక్క."

అని సాభినయముగ నట్టువరాండ్రు నృత్యములు సల్పిరి.

---

40. చూ॥ ఉత్తర హరిశ్చంద్రీయము – 3వ ఆశ్వా – పుట 126.

ధిమి ధిమి ధింధిమ్మి ధిధిమ్మి ధికిట
ధిమి ధిక్కిట ధికిట తిక్ద తోంతధిమ్మి."

అని మృదంగములు మార్మోగినవి.

కృష్ణార్జున సంవాదము:

కృష్ణార్జున సంవాదమును ద్విపదలో రచించిన వాడు నాదిండ్ల గోపన. (1520 A. D.) గోపమంత్రి తిమ్మరుసు మంత్రికి మేనల్లుడు; తొలుత గుత్తిదుర్గమునకు పరిపాలకుడుగను పిదప కొండవీటి సామ్రాజ్యమునకు రాజప్రతినిధిగను రాయలచే నియోగింపబడినవాడు.

కృష్ణార్జున సంవాదము ముద్రితము.[41] ఇందు సుమారు 700 ద్విపదలు కలవు. ఇది బహుళ జనాదరణ పాత్రమైనది; విస్తృత వ్యాప్తికలది.

కృష్ణార్జున సంవాదము గయోపాఖ్యాన కథ. ఇది కేవల సంవాదరూపము. కృష్ణార్జును లిరువురు ఒకరితో నొకరు సంభాషించు కొనుటయే యిందలి ప్రధానాంశము. మహాభారతము నందీకథ కానరాదు. బ్రౌణుదొరగారీ గ్రంథమును గూర్చి 'బ్రౌణ్యనిఘంటువు' (పుట 516) నందిట్లు వ్రాసిరి.

"A mere fiction. The name is given to apocryphal poems that are not grounded on any classical tradition as (1) మైరావణ చరిత్ర (2) శతముఖ రామాయణము (3) కృష్ణార్జున సంవాదము (4) గంగాగౌరీ సంవాదము (5) జైమినీ భారతము."

కృష్ణార్జున సంవాదము కథాఛాయ చరిగొండ ధర్మన (16 శతాబ్ది ప్రారంభము) చిత్రభారతములో కలదు. ఇందలికథ

41. గోలకొండ పత్రికాలయము - తూపుబజారు, హైదరాబాదు. 1930.

యిది: రంభతురగాకృతిలోనున్నప్పు డాకాశమార్గమున సంచరించుచుండగా దాని నోటనుండి వచ్చిన ఫేనము సూర్యున కర్ఘ్యప్రధాన మాచరించు కృష్ణుని దోసిట పడెను. శ్రీకృష్ణుడదిచూచి ఆ అశ్వారోహకు డగు చతుర్ధన మహారాజును సంహరింతునని ప్రతినబూనెను. తర్వాత చతుర్ధను డది తెలిసి, అర్జునుని శరణు వేడుటయు, అతడు రాజును రక్షింతునని అభయహస్తమిచ్చి శపథము చేయును. యాదవ పాండవ యుద్ధము జరిగినది. ధర్మరాజొక్కడు తప్ప తక్కిన కౌరవపాండవబలము సమసిపోయినది. గతించిన యోధులలో నొక్కనికి ప్రాణమిచ్చెద కోరుకొమ్మని కృష్ణుడు ధర్మరాజునడుగగా నతడు, చతుర్ధనుని బ్రతికింపుమని కోరెను. అతని సత్యవ్రతమునకు, ధార్మిక ప్రవర్తకతకు మెచ్చి కృష్ణుడు అందరిని బ్రతికించెను.

ద్విపద కావ్యమునందు చతుర్ధన మహారాజునకు బదులు గంధర్వరాజగు గయుడు పేర్కొన బడినాడు. ఇందు రంభ తురగాకృతి ప్రశంస లేదు.

కృష్ణార్జున సంవాద మందలి కథ కొంతవరకు మరుత్తరాట్చరిత్రమందలి యొకకథను బోలియున్నదని శ్రీ జయంతి రామయ్య పంతులు గారు తన 'ఆధునికాంధ్రవాఙ్మయ వికాసవైఖరి' (పుట 78-79) అందు ఆ కథను తెల్పెను. మహారాష్ట్రమందున నిట్టి కథయొకటి కలదని వింటిని[42] అని డా॥ బి. రామరాజు గారు తెల్పిరి. కాని ఆ కథాస్వరూప స్వభావాదు లెట్టివో వారు అందు పేర్కొనలేదు.

గోపమంత్రి ఈ కావ్యమును యుక్తియుక్తము, సందర్భశుద్ధి, సముచితము నగు కథాంశములతో, సరససంభాషణలతో

42. చూ॥ తెలుగు జానపదగేయ సాహిత్యము - పుట 112.

మృదుమధురమగు శైలితో, సమయోచితములగు వర్ణనలతో రసోచితములగు తేటతెలుగు పదప్రయోగములతో రమణీయముగ రచించినాడు.

ఉదా:-

అక్రూరుడు అర్జునునితో పల్కిన పల్కులివి:—

"వినవయ్య! రుక్మిణీవిభుడు నీకడకుఁ
బనిచిన వచ్చితిఁ బాండుకుమార
జలజాక్షుతోడ నీ జగడ మేమిటికి
బలవద్విరోధంబు భావ్యంబుగాదు
నలిని క్షీరోదక న్యాయమై యుండ
వలవదే? కైటభ వైరియు! నీవు
కాచుకొన్నాడ వెక్కడ గోత్ర కలహ
మాచరింపంగ నేమన వచ్చు నిన్ను
ఏవారి కెవ్వార లెక్కడి గయుడు
నీవేల పెనఁగెదు నీతిఁ బోవిడిచి
చెలిగి వెన్నుఁడు నీకుఁ జేసిన మేలు
తలఁపక మాటాడ ధర్మంబు గాదు
దైవంబు గురుడు బాంధవుడు మిత్రుండు
గోవిందుఁ డతని మార్కొనఁ దగునయ్య
నిగ్రహానుగ్రహ నిపుణుండు శౌరి
ఆగ్రహింపక మున్నె యనుపుము గయుని

—కృష్ణార్జున సంవాదము — పుట 30.

అర్జును డొసగిన ప్రత్యుత్తర మిది:—

"ఆవల ప్రాణ భయాతురుఁ డగుచు
నీవె దిక్కని వచ్చి నిలిచిన వాని
భూపాల వర్యులు పుడమిని దొల్చి
చేపట్టి విడిచిరే చెప్పుమా నీవు

విని ప్రాణ భయమున వెనుక జొచ్చినను
గనికరంబున శిబి గావడే ఖగము
ఆ విభీషణు శరణాగతు మున్ను
కావడే చేపట్టి కరుణ రాఘవుడు
పరికించి భూపతి పట్టిన ప్రతిన
అరయ శిలాక్షరమై యుండవలదె."

— పుటలు 30--31.

పై ద్విపదలు సరస సంభాషణాత్మకముగా సాగినవి:

'కృష్ణార్జున సంవాదము' ను ఓబయమంత్రికూడ ద్విపదలో రచించినట్లు తెలియుచున్నది. (చూ॥ తెలుగు అకాడమి ఆకారాద్యముద్రిత గ్రంథ సూచిక - I Part — పుట 11.)

కుశలవోపాఖ్యానము :

లావనూరి రామనార్యుని (16 శతాబ్ది) కుశలవోపాఖ్యానము సంస్కృత జైమినీభారతములోని అశ్వమేధ పర్వాంతర్గతమగు ప్రస్తావికోపాఖ్యాన రూపమగు కుశలవ చరిత్రమునకు ద్విపదరూపమగు స్వతంత్రానువాదము. గ్రంథము ముద్రితము.[43] దీని పూర్వోత్తరభాగములందు దాదాపు 2002 ద్విపదలుకలవు. రామనార్యుడు 16 శతాబ్దికి పూర్వుడై యుండునని పీఠికా కర్తలగు శ్రీ V. సుందరశర్మగారు గ్రంథములోని శైలినిబట్టి ఊహించిరి. రామనార్యుడు 'సంగీత సాహిత్యచతురుడు; రామకథా విశారదుడు; రామాయణచక్రవర్తి'బిరుదాంకితుడు. ఈగ్రంథము రామాంకితము.

43. తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణ నెం. 22. పరిష్కర్త వి. సుందర శర్మ. 1951,

జైమినీభారతము మహాభారతమునకు ఛాయగా వెలసినదే కాని పురాణప్రసిద్ధమైనదికాదు. జైమినీభారతమున పార్థ బభ్రువాహనుల యుద్ధావసరమున తండ్రి కొడుకులకు యుద్ధమేర్పడుట ఆశ్చర్యము కాదని తెల్పుటకే ప్రస్తావికముగా కుశలవోపాఖ్యానము వర్ణింప బడినది. ద్విపద కుశలవోపాఖ్యానమున కర్ణార్జునుల యుద్ధావసరమున జైమినిముని కుశరాముల యుద్ధమును జనమేజయునికి వినిపించినట్లు కలదు. ఈ విషయమున ద్విపద కావ్యమునందుకంటె మూలమునందే సందర్భోచితముగనున్నది. మూలములో సంగ్రహముగా నుండు కుశలవోపాఖ్యానమును రామనార్యకవి సర్వాంగసుందరమగు కావ్యముగాతీర్చిదిద్దినాడు.

సంస్కృత జైమినీభారతములో కౌసల్య, రాక్షసబాణములచే క్షతగాత్రుడైన కుమారుడగు శ్రీరాముని చూచి, మిక్కిలి చింతించి తనకరములచే నతనిదేహమును స్పృశింప శ్రీరాముడు గతక్షతుడైనట్లు తెల్పబడినది. ఈ విషయము ద్విపద కుశలవోపాఖ్యానమున లేదు.

ద్విపద కుశలవోపాఖ్యానము పూర్వభాగమునందలి వసంతాగమనము, సీతారాముల యారామకేళి, జానకి వర్ణన, వన వర్ణన, వర్షాగమ వర్ణన — మొదలగునవి మూలమున మృగ్యములు. ప్రాబంధికమగు ఈ వర్ణనలు రామనార్య కల్పితములు.

మూలములో, లవుడు యుద్ధములో తనవిల్లు విరిగిపోగా సూర్యభగవానుని స్తుతించి దివ్యకార్ముకము బడయునపుడు సౌర స్తోత్రము చేయును. ఇది ద్విపదానువాదమున లేదు.

మూలమున సంగ్రహముగ చెప్పబడిన కొన్ని విషయములను ద్విపదకవి ఔచితీపరముగ విస్తరింపజేసి రసవంతముగ

రచించినాడు. శ్రీరామునికి సంతతి లేకుండెనను విషయమును మూలమున ఒక్క శ్లోకములోనే తెలుపబడినది.[44] దీనిని రామ నార్యకవి తన ద్విపదానువాదములో ధార్మికుడైన నృపతికి పెక్కు సంవత్సరములు రాజ్యమేలిన పిదప సంతానము లేకుండుట వలన కలుగు సంతాపమును, నిర్వేదమును, నిస్పృహను, మనోవికలత్వమును, హృద్గత భావాదులను ప్రస్ఫుటముగ కన్నులకు గట్టినట్లు విపులముగ విశదీకరించినాడు. (చూ॥ పూర్వభాగము – పుట 17,)

'కుశలవ చరిత్రము' అను పేర మరొక ద్విపదగ్రంథమున్నట్లు తెలియుచున్నది. (ఆ. సా. ప. సంపుట 6 – సంచిక 55 పుట 244.) దీని కర్త యెవ్వరో తెలియదు.

సా నం దో పా ఖ్యా న ము!

సానందోపాఖ్యానమును ద్విపదలో రచించినవాడు భద్రకవి లింగన (16 శతాబ్ది). ఇతడు 'తిరుణ్ణామలై' దగ్గర నుండు 'అరుణాద్రిమంగల' అను గ్రామనివాసి; కాళహస్తి క్షేత్రమున నివసించు సంగమేశ్వరుని శిష్యుడు. శివయోగి చెన్నవీరుని శిష్యుడగు వీరభద్రయ్యకు గ్రంథమంకితము.

సానందోపాఖ్యానము 3 ఆశ్వాసముల ద్విపదకావ్యము. ఇది ముద్రితము.[45] సానందుడు శివభక్తుడు; ప్రథమ గణములలో నొకడు. అతడు ధర్మప్రసంగుడను ముని వలన పుణ్యాపాప లోకముల మార్గములను విని, శివపంచాక్షరీ ప్రభావము వలన

---

44. చూ॥ సంస్కృత జైమినీభారతము_అశ్వమేధపర్వము. 26అధ్యా 1 శ్లోకము.

45. విబుధ మనోహారిణీ ముద్రాక్షర శాల. మద్రాసు. 1885. పరిష్కృతము_ఆరాధ్యుల వీరేశలింగము.

యమలోకవాసులకు నరక బాధలను తప్పించిన విషయమిందు వర్ణింపబడినది. శివభక్తులయిన వారికి నరకబాధలుండవనుట యిందలి ముఖ్యాంశము. ఎన్ని రీతుల చెప్పిన పామరులకు కూడ సుబోధకమగునో అన్ని రీతుల అనేకోదాహరణములతో పుణ్యాపాపముల ప్రకారమును లింగకవి వర్ణించినాడు.

ద్విపద సానందోపాఖ్యానము ననుసరించి కోట శివరామకవి 5 ఆశ్వాసములుగను, కొండమడుగు పురుషోత్తమ కవి 3 ఆశ్వాసములుగను పద్యకావ్యములుగ ప్రత్యేకముగ రచించిరి.

బుచ్చన్న పంతులు (1880) కూడ 'సానందచరిత్ర' అను ద్విపద కావ్యమును రచించినట్లు తెలియుచున్నది.[46]

యాజ్ఞవల్క్యవిజయము:

యాజ్ఞవల్క్యవిజయమను 6 కాండల ద్విపదకావ్యమును రచించినవాడు చల్లగురవయ్య. ఇతడు క్రీ.శ. 16వ శతాబ్దియందుత్తరార్థమున నుండెనని శ్రీ చాగంటి శేషయ్యగారి అభిప్రాయము. ఇతడు 'బాలసరస్వతి' బిరుదాంకితుడు; 'దుర్గావరప్రసాదు' డట; కొచ్చర్లకోట వెంకటమంత్రి (కొండవీటికి స్థలకరణము) ప్రేరణముచే ఈ గ్రంథమును రచించి శ్రీరామచంద్రునకంకితము చేసెను. చల్ల గురవయ్యయును, గ్రంథ ప్రేరేపకుడగు వెంకట మంత్రియును కూడ యాజ్ఞవల్క్యయులే.

యాజ్ఞవల్క్యవిజయము 6 కాండలుగల ద్విపదకావ్యము. ఇది అముద్రితము. (ఆర్. నెం. 493. ప్రా. భా. మద్రాసు) జన్మకాండము, వేదకాండము, మైత్రేయి కాండము, పరబ్రహ్మకాండము, యజ్ఞకాండము, విశ్వజిత్కాండము — ఈ ఆరుకాం

46. చూ॥ ఆంధ్రవాఙ్మయ సూచిక. పుట 223. ఆంధ్ర గ్రంథమాల. మద్రాసు.

డలలోను యాజ్ఞవల్క్యమహర్షి జీవితచరిత్ర, అతడనుసరించిన విధానములు వర్ణింపబడినవి. యజుర్వేద విభేదములను తెల్పు సంఘటనలు ఇందు సమీక్షింపబడినవి.

గురవయ్య కవిత్వము మృదుపద సంయుతమై మంచిధార కలిగి సుబోధకముగ నున్నది.

నలచరిత్ర:

నలదమయంతుల కథ భారతారణ్యపర్వమునందు కలదు. ఇది జనసామాన్యమున బహుళవ్యాప్తి నొందినది. ఇందు పాతివ్రత్యము, పరదారాసక్తివలన కలుగు అరిష్టములు, వ్యసనాభిలాషవలన కలుగు కీడులు - మున్నగు కథాంశములు పండిత పామర జనాకర్షణీయముగ కరుణరసాత్మకముగ వర్ణింప బడినవి.

తెలుగులో ముద్రితా ముద్రితములగు నలచరిత్ర ద్విపద కావ్యములు తొమ్మిది యున్నట్లు తెలియు చున్నది.

(1) నలచరిత్ర - రఘునాథ నాయకుడు (1614-1633 A. D.)
(2) ,, - చక్రపురి రాఘవాచార్యుడు (1690)
(3) ,, - తిమ్మన కవి.
(4) ,, - కాకర్లపూడి రాఘవాచార్యుడు
(5) ,, - వీరరాఘవ కవి

ఇవి గాక కవిపేరు తెలియని నలచరిత్ర ద్విపదగ్రంథములు కొన్ని మదాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు కలవు. వాని ప్రతుల వివరణము.

(6) ఆర్. నెం. 145 (అసమగ్రము)
(7) ,, 1072 (సమగ్రము)
(8) ,, 1073.
(9) ,, 166c (31-39)

రఘునాథనాయకుని నలచరిత్ర:

నలచరిత్ర పూర్వోత్తర కథాంశములను ద్విపదలో మొట్ట మొదట రచించినవాడు రఘునాథనాయకుడు. అతని నలచరిత్ర 8 ఆశ్వాసముల ద్విపదకావ్యము. 'ఆంధ్రభాషోల్లాసిని' యను సారస్వత మాసపత్రిక [47] యందు ఇందు కొంత భాగము ప్రకటింప బడినది. ఈ ద్విపద నలచరిత్ర ముద్రితము. [48]

రఘునాథ నాయకుని యితర కృతులగు వాల్మీకి చరిత్ర, రామాయణము – మున్నగు వానిలో సాధారణముగ కన్పించు సంగీత సాహిత్యాభిమానము, శృంగారము, హాస్యచతురత – ఈ నలచరిత్ర ద్విపదయందు లేకుండుటచే నిది రఘునాథనాయక కృతమేనా? అని కొందరు శంకించిరి. "రఘునాథరాయలు నల చరిత్రమును వ్రాసిన మాట నిజమే కాని యాగ్రంథమిదియే యని నిరూపించుట కాధారములు చాలతక్కువ" అని డా॥ కె.వి. ఆర్. నరసింహము గారి అభిప్రాయము. [49] కాని దక్షిణాంధ్ర యుగ సారస్వత లక్షణములైన భాషాసౌలభ్యము. కథాకథనమునందలి దృష్టియు ఈ నలచరిత్ర ద్విపదయందు సంపూర్ణముగ నున్నవి. పైగా ఇది కరుణరసోపేతకావ్యమగుటచే శృంగార రసపోషకములగు వర్ణనలు మిక్కుటముగానుండుటకు అవకాశము లేదు. కనుక ఈద్విపదనలచరిత్ర రఘునాథనాయక రచితమేయని విశ్వసింపవచ్చును.

---

47. చూ॥ సెప్టంబరు 1928 – ఏప్రిల్ 1929 పత్రికలు.

48. శ్రీరామవిలాస ముద్రాక్షరశాల – చిత్రాడ. 1921.

49. చూ॥ 'దాక్షిణాంధ్రయుగ వాఙ్మయచరిత్ర' – ప్రథమ భాగము, పుట 65.

రఘునాథ నాయకుడు మహాభారతములోని నలకథనే గ్రహించి పెంచి వ్రాసినట్లు గ్రంథాంతమందలి,

"రంగుగాఁ జెలగు భారత పురాణమున
పన్నుగా నారణ్య పర్వంబు నందు
చెన్ను రంజిల్ల మించిన నలచరిత్ర."

అను ద్విపద పంక్తులను బట్టి తెలియు చున్నది. గ్రంథావ తారికయందు,

"అరసి ఈ కథ తొల్లి వ్యాసమహర్షి
వరుఁడై యాద్యంతముల్ వ్యక్తంబుగాఁగ
పలికెను పిమ్మట పల్కంగ లేక
యలసులై యేమొ శ్రీ హర్షాది కవులు
పూర్వభాగము జెప్ప బూనిరి గాని
సర్వంబు జెప్పంగ జాలరై రెందు
పూర్వోత్తర కథాంశములు సకలంబు
నిర్వహించెద."

నని రఘునాథనాయకుడు చెప్పుటచే ద్విపద నలచరిత్రకథ సంపూర్ణముగ వర్ణింపబడినదనుటస్పష్టము. గ్రంథము సమగ్రముగా నున్నది. కాని మొదటకొంత శిథిలమైనది. ఇందు కృతికర్తను గూర్చిగాని, కృతిభర్తనుగూర్చి కాని వివరణములేదు. నలచరిత్రను,

"వినగ వ్రాసిన చదివిన పేరుకొనిన
శని పీడ వారల చారంగ నీక
కమనీయ ధర్మార్థ కామ్యంబు గలుగు."

అని కావ్యఫలము. నలకథను రఘునాథరాయల తర్వాత పలువురు ద్విపదకవులు రచించుటకు హేతువు.

## చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్ర:

ఇది పూర్వోత్తర భాగములుగల 5 ఆశ్వాసముల ద్విపద కావ్యము. ఇందు మొత్తము 2828 ద్విపదలుకలవు. దీనిని చక్రపురి రాఘవాచార్యుడు రచించెను. గ్రంథము ఘటికాద్రి నారసింహుని కంకితము.

రాఘవాచార్యుని ద్విపదనలచరిత్ర ఆంధ్రలోకమున విపుల ప్రచారము నందినది.

"కొంకక యీ కథఁ గోరిక సభల
వెలయఁ బ్రఖ్యాతిగా వేడ్కఁ జెన్నొంద
సలలిత సారాంధ్ర శబ్ద సంగతులఁ
దెలిపెద నీకథ ద్విపద కావ్యమున
వలనొప్ప నల చక్రవర్తి చరిత్ర
విరచింతు నానేర్పు విధమెల్ల తెలియ."

అని గ్రంథావతారికలో తెల్పినాడు. ఇది సభలలో ప్రఖ్యాతినొంది పండిత పామర హృదయాకర్షముగ వర్ణింపబడినదని పై ద్విపద పంక్తులవలన తెలియును. తెలుగునాటపల్లెలలో ఆపత్సమయములందు రాత్రివేళ దీనిని ఆసక్తితో చదువుచుండుట నేటికినికలదు.

రాఘవాచార్యుని నలచరిత్రలో ప్రబంధములలో సామాన్యముగ కానవచ్చువర్ణనలు కథాసందర్భమున కనువుగా వర్ణింపబడినవి.

కలిపురుషుని క్రోధమునిట్లు వర్ణింపబడినది:

"భుగభుగ నిగిడి నిప్పుల పొగలెగయ
జొటజొట చెమటలు సోనలై పరియ
తటతట మని ఔొమ్మ తడఁబడుచుండ
కటకటా! యని యాడు గఱచికన్నులను
దొటదొట నిప్పులు దొరఁగ హుమ్మనుచు

కాలాగ్ని రుద్రుడో కాలభైరవుఁడో
కాల సూర్యుఁడొ లయకారుఁడో యనఁగ
గర్జించి భీషణాకారుఁడై."

—నలచరిత్ర-ద్వితీయాశ్వాసము-పుటలు 142-143.
ద్వి. పం. 634-641. వావిళ్ళప్రతి.

ఇందలి శబ్దాలంకారములు భావమును చక్కఁగా వెలువరించు చున్నవి.

ఉదా:—

అంత్యానుప్రాసములు:—

"ఇదియేమి నెలఁత! నీ కిటువలె నలఁత
యిదియేమి చెలియ! నీ కిటువలె సొలయ
నిదియేమి లలన! నీ కిటువలెఁ జలన
మిదియేమి మగువ! నీ కిటువలె వగవ
నిదియేమి తెఱఁగు నీ కిటువలె మఱుఁగ
నిదియేమి వింత నీ కిటువలెఁ జింత
యిదియేమి యబల! నీ కిటువలె బదల
నిదియేమి కన్నె! నీ కిటువలెఁ జిన్నె
..............................
యిదియేమి యింతి! నీ కింతవిభ్రాంతి."

—1వ ఆశ్వా. పుట 77. ద్వి. పం. 923-937.

ముక్తపదగ్రస్తము:—

"రామాభిరామ నిర్భర పుణ్యసీమ
సీమ కాదిది మంచి చెలువైన వేమ
లేమ కాదిది మంచి లేమావి కొమ్మ
కొమ్మ కాదిది మంచి కలుకు కెందమ్మి

తమ్మి కాదిది మంచి తావిపూలతిక
లతిక కాదిది మంచి లావణ్య ప్రతిమ
... ... ... ... ... ... ... ...
నీరు గాదిది చిన్ని నెలరాజుతీరు."

—2వ ఆశ్వా. పుట 155. ద్వి. పం. 812—823.

ఇందు, పురవర్ణన, వసంతవర్ణన, సాయంకాలవర్ణన, నాయికానాయకులవర్ణన, మృగయావర్ణన—మున్నగునవి ప్రబంధోచితముగ వర్ణింపబడినవి. మృదుమధురమగు తెలుగు పదములతో ద్రాక్షాపాకమున వెల్లివిరిసినదీ కావ్యము.

తిమ్మనకవి నలచరిత్రము:

తిమ్మనకవి ద్విపద నలచరిత్రము అముద్రితము. (చూ॥ ఆర్. నెం. 1070. ప్రా. భా. మద్రాసు.) ఇది మూడాశ్వాసములు గలది. గ్రంథము సంపూర్ణమేకాని అస్పష్టముగానున్నది. ఇందు నలకథ పూర్వభాగము మాత్రమే వర్ణితమైనది, ఇదికూడ భారతారణ్యపర్వ నలకథననుసరించినదే. ఈ ద్విపద నలచరిత్ర రామాంకితము.

కాకర్లపూడి రాఘవాచార్యులు[50], వీరరాఘవకవి[51] అనువారుకూడ ద్విపదలో నలచరిత్రను రచించినట్లు తెలియుచున్నది. వీరినిగూర్చిన వివరములు తెలియవు.

కవిపేరు తెలియని ద్విపద నలచరిత్రలు:-

ఆర్. నెం. 145 గల ప్రతి అసమగ్రము. ఇది ఘటికాద్రి

50. చూ॥ ఆ. వా. సూ. పుట 95.

51. చూ॥ ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారము-ఆకారాద్యముద్రిత గ్రంథసూచిక II Part పుట 18.

నారసింహున కంకితము. గ్రంథకర్త కందాళ దొడ్డయాచార్యుని, ఆసూరిభాష్యకారుని గురుభావమున స్మరించినాడు.

ఆర్. నెం. 1072 నలచరిత్ర — దీనికర్త తిరుమలాచార్యుల శిష్యుడట. తిమ్మనకవి కృతమగు ద్విపద నలచరిత్రకు దీనికిఁగొన్ని పోలికలున్నవి. దీనినికూడ తిమ్మకవియే రచించియుండునని ఊహించుట కవకాశము కలదు.

ఆర్. నెం. 1073 నలచరిత్ర- ఇది అసమగ్రము. అగస్త్యుడు శ్రీరామునికి ఇందలికథను చెప్పినట్లు కలదు. గ్రంథము రామాంకితము. "సరసులు, బుధులు మెచ్చ" నట్లుగ కవి ఈనలచరిత్రను ద్విపదలో రచించినాడు.

ఆర్. నెం. 166c (31-139) — నలచరిత్ర - దీనిలో గ్రంథకర్తృనామాదికములు లేవు.

నలచరిత్ర ద్విపద కావ్యకర్తలందరును భారతారణ్య పర్వములోని నలకథనే గ్రహించి పెంచివ్రాసినారు. ద్విపద నలచరిత్రలలో రఘునాథనాయకుని, చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్రలే ముఖ్యమైనవి. వీరి దృష్టియంతయు ప్రధానముగ కథాకథనమునందే కేంద్రీకరింప బడినది. రచనా విధానమునందు రఘునాథనాయకుని నలచరిత్రకు, రాఘవాచార్యుని నలచరిత్రకు పెక్కు పోలికలు కలవు.

మహాభారత నలచరిత్రకథలో కలిప్రవేశముకలదు. రఘునాథనాయకుని నలకథలోమాత్రము శనిప్రవేశముకలదు. చక్రపురి రాఘవాచార్యుని నలకథలో మూలముననున్నట్లే కలిప్రవేశమున్నది.

శ్రీనాథుని శృంగారనైషధమున పంచమాశ్వాసములో దమయంతీ స్వయంవరాగతులగు రాజుల వంశచరిత్రములు దీర్ఘ

వర్ణనలతో సుమారు 140 పద్యములలో వర్ణింపబడినవి. ఇందు సరస్వతీదేవి దమయంతికి వరణీయులనుగూర్చి వర్ణించినట్లుకలదు. భారతారణ్యపర్వమున ఈ విషయమేమియు చెప్పలేదు. రఘునాథుని నలచరిత్రలో చెలికత్తెలు స్వయంవరాగతులగు రాజులను దమయంతికి చూపినట్లు తెలుపబడినది.

"కుంతలేశ్వరుఁ జూపి ఘూర్జరుఁ జూపి
గౌళాధిపతిఁ జూపి కాంభోజుఁ జూపి
కాళింగపతి జూపి కాశ్మీరుఁ జూపి
చోళాధి పతి జూపి.........

...........................................................
అనుచు రాజేంద్రుల నందఱఁ జూపి."

ఈ రఘునాథునివర్ణన కేవలము కథాకథనపద్ధతిని నడచినట్లు గమనింపవచ్చును. కాని చక్రపురిరాఘవాచార్యుని నలచరిత్రలో దమయంతికి వసుదేవుడను విప్రుడు స్వయంవరాగతులను గూర్చి వేర్వేరుగా నిట్లు చెప్పును:

"కలకంఠి! యీతఁడు గౌళ భూనాథుఁ
డలివేణి! యితఁడు మహారాష్ట్ర విభుడు
లలన! యీఘనుడు మాలవమహీశ్వరుడు
వెలత! యీ నరపతి నేపాళ విభుడు

...........................................................
చెలియ! యీ ధీరుండు సింధు భూనాథు
డని యిట్లు రాజుల నందరఁ జూపి"

— 2వ ఆశ్వా. పుట 129–130, ద్వి. పం. 445-59.

ఈసందర్భమున రాఘవాచార్యుని వర్ణన నాటకీయమున కనువుగ దృశ్యమానమగు చున్నది. ఈ ద్విపదకావ్య కవులిరువురిదృష్టి ప్రధానముగ కథాకథనముమీద నేకనుక శృంగారనైషధకావ్యమునగల దీర్ఘవర్ణనలకిందు ప్రసక్తి లేదు.

పదముల పొంకమును, నుడికారముల బింకము, వర్ణనా చమత్కారమును, పాత్రపోషణవిధానమును — రఘునాథనాయకుని కవిత్వమునకు వన్నెబెట్టినవి. వాస్తవికత యొప్పునట్లు, వర్ణనాంశములు కనులకు బొడకట్టునట్లు మాటలచిత్తరువును చిత్రించుటయందు రఘునాథునికి చక్కని నేర్పుకలదు. నలదమయంతుల అరణ్యసంచార వర్ణనను పరికింపుడు.

రఘునాథనాయకుని రచన:

కాంతామణియు దాను కంఠంబు లెండ
జడిసి యాకల యట జలమె యా కలత
బుడిసిట ద్రావి గ్రొబ్బున గ్రేగులెల్ల
నొక్కట నాతికి నొడ్డ గిలంగ
గ్రక్కుచు నీళోత గనుకంటె నిచట
గ్రక్కన బోయిన గడు మేలటంచు
పొక్కుచు నాకట బొదలపై బొదల
యెలమింత నేదైన నలమిదె నమలి
బలిమి మ్రింగుచు గుండె బట్టిన నేల
కలికల బడి యొక్కొ కళ్లు చేయూత
గలిగూడు కొనలేచి కదలిపోవుచును
త్రుక్కి పైతోలు నస్తులె చిక్కి చాల
చిక్కి చక్కలములై చేరంగ రాని
మైల కంపును జన్మమె యింకచాల
చాలుబో యనిపించు చలిబోని చీర
యొంటి కట్టులచేత నొరయుచు కొండి
యంటి చీములు గార నడవులు దూర
కంపలు జీరమై కడుదుమ్ముదేర
చెంపల వెంద్రుకల్ చెమటలు జార
దుర్భర ఖేదంబు దొరయ నయ్యాది
గర్భేశ్వరులు మహా గహన మార్గమున.

రాఘవాచార్యుని నలచరిత్ర నుండి:

మగువ క్రొమ్ముడి త్రోవ మలయు కంపలను
దగిలిన దనజేతఁ దప్పించుకొనుచు
మురువు దూలిన వాఁడి ముండ్లఁజేఁదీయ
వెఱచి మెల్లనె తీసి వెలవెలఁబాఱి
పఱతెంచి కంపలఁబయ్యద కొంగు
నరిమురిఁ దగిలిన నవి తీయలేక
తనువాఁడి గలఁపాలు దాకి పాదముల
కనుమల నెత్తురు గాఱ నందందఁ
గన్నుల ముత్యాల కైవడి నీరు
చన్నుకట్టుల మీఁద జలజల రాల
జాఱిన వెంద్రుకల్ సరిపడఁ గేల
సారెకు సారెకుఁ జక్కఁజేయుచును
గదలిపోవుచు వట్టు గట్టిన తనదు
పెదవుల దడపుచు బెగడుచు నవని
నడుగిడ లేక హా! యనుచు శోకింప
పుడమిఱేఁ డాత్మలోఁ బురపురఁ బొక్కి

— 3వ ఆశ్వా. పుటలు 221—222.

పై ద్విపదలను పరిశీలించిన రాఘువాచార్యుని ద్విపద రచన రఘునాథనాయకుని ద్విపద రచనముకంటె నొకింత పేలవముగానున్నది. రఘునాథకృత నలచరిత్ర రాఘువాచార్యుల రచనకంటె రసవత్తరమైనదని శ్రీ నేలటూరి వేంకటరమణయ్యా గారు అభిప్రాయపడిరి.[52] కాని రాఘువాచార్యుని ద్విపద నలచరిత్రకు విస్తృతవ్యాప్తి కలదు.

---

52. చూ॥ దాక్షిణాత్యాంధ్రసాహిత్యము - పుట 65· డా॥ నేలటూరి వేంకటరమణయ్య.

దక్షిణాంధ్రయుగ ప్రబంధములందు సామాన్యముగ గోచరించు పచ్చి శృంగారము రఘునాథుని నలచరిత్రమునందు కానరాదు. కవి శృంగార ఘట్టములందు ఔచిత్యమునే పాటించినాడు.

నలదమయంతుల విహారవర్ణన:

"కలసి యిద్దరికి నొక్కటి ప్రాణమనఁగ
మలసిన లీల సమ్మతిఁ గూడి మాడి
కేళీవనము లందు కృతకాద్రు లందు
మేలి పూఁబొదలందు మేడల మీద
శేరాజు ముఖి యగు ప్రియ వధూటియును
ఆరాజ వరుడును నర్థి సల్పుచును."

— రఘునాథుని నలచరిత్రనుండి.

చక్రపురి రాఘవాచార్యుడు దీని ననుకరించిన తీరు యిట్టిది:

"సంతసంబునఁ గూడి సరసుల యందుఁ
గేళీవనము లందుఁ గృత కాద్రులందు
మేలిమి పొదలందుఁ మేడల యందు
నిరుప మాన విభూతి నితరంబు నిట్లు
సురత భాసుర కేళి సౌఖ్య సోలుచును."

— ద్వితీయాశ్వాసము - పుట 158. ద్వి. పం. 856-860.

నలదమయంతుల దుర్భరకష్టముల వర్ణించుపట్ల కవి కరుణ రసమును వెల్లివిరియించినాడు. దమయంతి నేలపై బడి పరుండియుండు దృశ్యమునుగాంచి నలుడిట్లు శోకించినాడు.

రఘునాథుని రచన:

"చటుల మధ్యాహ్న భాస్కర ఘోరకిరణ
స్ఫుటవల్లిఁ గందిన పూఁదీగవోలె
కసుగంది ధరమీద కన్నులు మోడ్చి
కుసుమ కోమలి నిద్ర గూర్కుచున్నదియు

సన్నుతి సకల రాజన్యుల సతులు
కనుసన్న తన యూడిగంబులు సేయ
హంస తూలిక పాన్పు నందుఁ జెంపొందు
హంస యానకు నేడు అవని పాన్పాయె."

చక్రపురి రాఘవాచార్యుని రచన :

"చటుల మధ్యాహ్న భాస్కర కిరణముల
స్ఫుటముల కందిన పూఁదీగ వోలె
నటవులఁ ద్రిమ్మరి యాఁకట సొలసి
మదిరాక్షి తనదేవి మహిమీఁదఁ బండి
నిదురఁ వోవఁగఁ జూచి నృపపంజరుడు
సన్నుత సకల రాజన్య కామినులు
కన్ను సంజ్ఞల నూడిగంబులు సేయ
హంస తూలికల శయ్యను నిద్రఁ బోవు
హంస యానకు పానుపయ్యెఁ బోనేల."

— తృతీయాశ్వాసము – పుటలు 242-243.

రాఘవాచార్యుడు ఈ సందర్భమున శోకరసమును హృదయ ద్రావకముగా పెంచి వ్రాసినాడు.

"వనజాక్షి ! నిను గూడి వర్తించుఘోర
వనములు శృంగార వనములైయుండు
.... ........................................
నీయట్టి కులసతి నీయట్టి సాధ్వి
నీయట్టి ప్రియురాలు నీయట్టి ముగ్ధ
నీయట్టి కులశీల నీయట్టి యబల
నీయట్టి లావణ్యనిధి యెందు గలదు."

అని నలుడు గతస్మృతులతో శోకము పారముట్ట నేడ్చినాడు. రచనావిధానమున ఈ ద్విపదకావ్యములకు పోలికలు కలవని పైన పేర్కొనబడినది.

## సౌగంధిక ప్రసవాపహరణము :

మహాభారతారణ్యపర్వము తృతీయ చతుర్థాశ్వాసముల లోని సౌగంధిక ప్రసవాపహరణకథ ననుసరించి రత్నాకరము గోపాలకవి (1575–1650 A. D.) దీనిని 3 ఆశ్వాసముల ద్విపద కావ్యముగా రచించినాడు. ఈ గ్రంథము ముద్రితము.[53] ఇందు సుమారు 3350 ద్విపదలు కలవు.

ఈ ద్విపదకావ్యమును గోపాలకవి రావెల్ల లింగభూపాలునికంకితముచేసెను. లింగభూపాలుడు కమ్మసామంతనాయకుడు. గ్రంథావతారికలో సుమారు 350 ద్విపదలలో రావెలవారిచరిత్ర విపులముగా వర్ణింపబడుటచే చరిత్రకారులకు ఈపీఠిక అమూల్యమైనది.

గోపాలకవి మూలకథకు భిన్నములగు మార్పులను తన ద్విపదకావ్యము నందు కూర్చినాడు. భారతములో సౌగంధిక ప్రసవాపహరణకథా సందర్భమున అర్జునుడు అమరావతియందుండెను. ధర్మరాజుపంపిన లేఖను చదువుకొని అర్జునుడు అమరావతినుండి తిరిగి వచ్చి భీమునికి సహాయముగా యక్షరాక్షసులతో యుద్ధముచేసినట్లు ద్విపదకావ్యములో తెలుపబడినది.

మూలములో లేకున్నను గోపాలకవి పాండవ కౌరవులిరువురును సమిష్టిగా శత్రువులనెదుర్కొనినట్లు కల్పించినాడు.

ఈ ద్విపదకావ్యమున నారదునికి ప్రాముఖ్యము కల్పింపబడినది. అతడు ధర్మరాజాదులను, ఘటోత్కచుని, అమరావతియందుండు అర్జునుని భీమసహాయార్థమై పంపును. పాండవులపక్షమున శ్రీకృష్ణుడును, కుబేరునిపక్షమున ఈశ్వరుడును పోరినట్లు హరిహరులయుద్ధమును గోపాలకవి కల్పించినాడు.

---

53. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు. 1949.

ఇందలి పాత్రలు, సన్నివేశములు – మొదలగునవి మహా భారతమునుండి గ్రహించినను గోపాలకవి వానికొక నూతన రూపమునిచ్చి సరససంభాషణాత్మకముగ, కావ్యోపయోగ్యముగ కథావస్తువును కూర్చుకొని దృశ్యకావ్యలక్షణములతో నొప్పు నట్లు రచించినాడు. ఇందు నాయకుడు భీముడు. ''సతులవాంఛలు దీర్పకున్న నగణితపాతకంబని'' తలంచి అతడు ప్రియురాలగు ద్రౌపదికోర్కెను తీర్చుటకుయక్షరాక్షసులతో యుద్ధముచేయును. నాయిక ద్రౌపది.

"ఒక నాయకుని నమ్మి యుండిన సతికి
సకల కోరికలెల్ల సమకూర్చ నతడు
అతులి తాటోపు లత్యంత ప్రతాపు
లతి ధైర్య బల విక్ర మాటోపు లయిన
పతులేవురును గల్గి పడు పాటులెల్ల
జితపడ ననుభవించితి."

నని ఆమె భీమునిమాత్రమే నమ్ముకొని తనవాంఛితముల నీడేర్చు కొనినది.

ఇది వీరరసప్రధానకావ్యము. భీమ హనుమంతులసంవాదము, ఘటోత్కజ కౌరవులయుద్ధము, యక్షరాక్షస పాండవుల యుద్ధము – మొదలగు ఘట్టములు వీరరసాత్మకముగ మనోహరముగ, సరససంభాషణాత్మకముగ వర్ణింపబడినవి.

గోపాలకవి సూర్యాస్తమయ వర్ణనలోని మనోహరత్వమును గమనింపుడు:

"తను ప్రయోగింప నుద్దండత వెడలి
దనుజ వీరుల నెల్ల దగఁ దునుమాడి
ఘనర క్తయుక్తమై గ్రక్కున మరలి
చనుపున పశ్చిమ జలరాశి యనెడి

చెలువంపు టారలోనఁ జేరుకంజాతు
సలలితంబగు దివ్య చక్రమనంగ
నరయ మహో నటుండను వీరముష్టి
దురుసునఁ బరువల్లు ద్రొక్కు నవ్వేళ
నలరు చు సమయ కంజాక్షి వాయించు
చెలు వైన బంగారు జేగంట యనఁగ
విను తారుణ ప్రభావిత వైఖరులఁ
దనరు పంకజ బాంధవు డ స్తమించె.''

—ద్విపద సౌగంధిక ప్రసవాపహరణము.

1 వ ఆశ్వా. పుట 141-143. ద్వి. పం. 1473-84.

ఈ ద్విపదసౌగంధిక ప్రసవాపహరణ కావ్యమును గోపాల కవి వంశమువాడయిన రత్నాకరము అప్పప్పకవి పద్యకావ్యముగ రచించినాడు.

విష్ణు మా యా వి లా స ము :

'విష్ణుమాయా విలాస' మను 5 ఆశ్వాసముల ద్విపద కావ్యమును కంకంటి నరసింహకవి (17 శతాబ్ది) రచించెను. నరసింహకవి, ఉత్తరరామాయణ కృతికర్తయగు కంకంటి పాపరాజు (1660) నకుతమ్ముడు. కంకంటి పాపరాజుకూడ విష్ణుమాయా విలాసమును యక్షగానముగ రచించియున్నాడు.

ఈద్విపదకావ్యము ''విష్ణుమాయానాటకము'' అను పద్య కృతికి స్వతంత్రానువాదము. విష్ణుమాయా నాటకకర్త చింతల పూడి ఎల్లనార్యుడని కొందరువాదింతురు. మడికి అనంతయ్యయే విష్ణుమాయానాటక కర్తయని శ్రీ చాగంటి శేషయ్యగారు అభిప్రాయపడిరి. [54]

---

54. చూ॥ ఆంధ్రకవితరంగిణి - 4 వ సంపుటము - పుటలు 189-209

ద్విపద విష్ణుమాయావిలాసము రామాంకితము. శ్రీ మహా విష్ణువు, అహంకారపూరితులైనవారికి తనమాయాప్రభావమును చూపి వారి గర్వమడంచిన కథలీ ద్విపదకావ్యమున వర్ణింపబడినవి. సత్యభామ, మహాలక్ష్మి, బ్రహ్మ, ఈశ్వరుడు, నారదుడు - వీరి గర్వభంగకథ లిందు మనోహరముగ వర్ణితములు.

మైరావణచరిత్ర :

మైరావణచరిత్ర సంస్కృత వాల్మీకి రామాయణములో లేదు. ఇది దేశీయానుగుణముగ ప్రచారములోనికి వచ్చిన కథ. తెలుగునాట జన సామాన్యమున ఈకథ బహుళప్రచారము గాంచినది; పండిత పామర జనరంజకమైనది.

మైరావణచరిత్రమును పలువురుకవులు ద్విపదలో రచించినారు.

(1) మైరావణచరిత్ర (ముద్రితము) – కాచనకవి. (మంజరీద్విపద)

(2) మైరావణచరిత్ర (ద్విపద) – పోలుమంచి బసవన (1600A. D.) – అముద్రితము. ఆర్. నెం. 1177, (అసమగ్రము) ప్రా. భా. మద్రాసు.

(3) మైరావణచరిత్ర (ద్విపద) – చంద్రగిరి చిన్నయ్య. (ఆ. వా. సూ. పుట 157)

(4) మైరావణచరిత్ర (పూర్వోత్తరభాగములు)- కైప లక్ష్మి నరసింహశాస్త్రి. (ముద్రితము) కవిరంజనీ ముద్రాక్షర శాల, చిత్తూరు 1882.

(5) మైరావణచరిత్ర (ద్విపద) – పాతూరి తిరుపతికవి. (ఆర్. నెం. 602) (సమ.) ప్రా; భా. మద్రాసు.

(6) మైరావణచరిత్ర – బసవప్పకవి. (Telugu Academy - అకారాద్యముద్రిత గ్రంథసూచిక I Part పుట 18.)

(7) మైరావణచరిత్ర (మంజరీద్విపద) — కవిపేరు తెలియదు.
(ఆం. సా. ప. నెం. 1590.)

ఈ ద్విపద మైరావణచరిత్ర లన్నిటిలోను కాచనకవి రచించినదే విపులవ్యాప్తిలోనున్నది. కాచనకవి మైరావణచరిత్ర ముద్రితము.[55] ఇందుసుమారు 830 ద్విపదలుకలవు. ఈకావ్యము చెలలూరిలో వెలసిన చిన్నికృష్ణుని కంకితము.

కాచనకవి ఈ దేశికావ్యమును సరళమైనశైలిలో, సర్వజన సుబోధకముగ, కథాకథన చాతురీవిలసితముగ రచించినాడు. ఈ కావ్యము హనుమంతుడు నాయకుడుగా గల వీరరస ప్రధానమైనది. యోగదృష్టితో సర్వమును చూడగల్గిన వసిష్టుడీ కథను శ్రీరామునికి వినిపించినట్లు కలదు.

మైరావణుడు పాతాళ లంకేశ్వరుడు. లంకాధీశ్వరుడగు రావణుని మిత్రుడు. పెక్కు మాయలందారి తేరినవాడు. అతడు విభీషణుని వేషముచే హనుమంతుని కనుగప్పి, నిద్రించుచున్న రామలక్ష్మణులను పాతాళమునకు తీసికొనిపోయి వారినచ్చట కాళికి బలియిచ్చుట కుద్యమించును. హనుమంతుడిది తెలిసికొని, పాతాళలంక నుండి రామలక్ష్మణులను విముక్తులనుచేయుట యిందలి ప్రధానేతివృత్తము.

కథలో వేరువేరు సందర్భములలో వేరువేరు పాత్రలచే కవి చమత్కారముగా పూర్వరామాయణ గాథనుకూడ సంగ్రహముగా చెప్పినాడు. మైరావణుని భార్య మాతంగి భర్తను దుర్వృత్తినుండి వారించుచు జననాది పరశురామ గర్వభంగము వరకు నడచిన రామకథను వర్ణించి చెప్పును. ఇట్లే మరొక సం

---

55. తంజావూరి సరస్వతీమహాల్ ప్రచురణ.
పరిష్కర్తలు: V. సుందరశర్మ, A. మహదేవశాస్త్రి.

దర్భమున హనుమంతుడు మిగిలిన రామకథ ఖరదూషణాది సంహారముతో కూడినది వర్ణించి చెప్పును. ఇట్లు ఔచిత్యము చెడకుండ కథామధ్యములో పూర్వరామాయణ గాథను చెప్పించుట కాచనకవి శిల్పవైదగ్ధ్యమునకొక తార్కాణము.

ఈ ద్విపదకావ్యము తెలుగుసాహిత్యమున బహుళ జనాదరణపాత్రమైనది. ఇందు మంజరీద్విపదలను కవి స్వేచ్ఛానుసారముగ గానానుకూలముగ సాగించినాడు. తోలుబొమ్మలాటవారు కాచనకవి మైరావణచరిత్రలోని మంజరీద్విపదలనేపాడుచుందురు.

## సారంగధరచరిత్ర:

సారంగధరుని చరిత్రము నిజమునకు తెలుగుదేశమునకు, తెలుగురాజగు రాజరాజనరేంద్రునికి సంబంధించినది కాకపోయినను అది తెలుగుదేశమునకు సంబంధించిన కథగా రూపొంది ప్రసిద్ధిగాంచినది. తెలుగునాట జనసామాన్యమున దానికి విపులమగుప్రచారము వ్యాప్తి కలదు. తెలుగులో పెక్కుమందికవులు సారంగధరచరిత్రను తమచిత్తవృత్తికి తోచినరీతి పద్యములుగ, ద్విపదలుగ, వచనములుగ, నాటకములుగ, యక్షగానములుగ, పదములుగ, కీర్తనలుగ రచించినారు.

సారంగధరుని కథను చెప్పు గ్రంథములలో గౌరనద్విపద నవనాథచరిత్రము మొదటిది. ఇందు మొదటి రెండాశ్వాసములలో ఈ కథ వర్ణింపబడినది. సారంగధరుడు 'చౌరంగి' యను పేర సిద్ధుడయ్యెనని ఇందు వివరింపబడినది. ఈ కథనే గ్రహించి పలువురుకవులు ద్విపదలో ప్రత్యేకగ్రంథములుగ రచించినారు.

(1) సారంగధరచరిత్ర (అముద్రితము)[56] – బాణాల శంభుదాసుడు (17 శతాబ్ది తర్వాతివాడు.)

---

56. ఆర్. నెం. 1193. ప్రా. భా. మద్రాసు.

(2) సారంగధరచరిత్ర (ముద్రితము)[57] - కూచిమంచి తిమ్మ కవి (1684-1757. A. D.)

(3) సారంగధరచరిత్ర - పూరి పరశురాముడు. (అముద్రితము)[58]

శంబుదాసుని సారంగధరచరిత్ర:

శంబుదాసుడు విశ్వకర్మ కులజుడు. ఇతడు కొండపల్లి గోపాలునిచేత కవిత్వశక్తిని సంపాదించెనట.

"ధరణిలో సారంగధరు చరితంబు
కరమను రక్తిశక్తి గల చేమకూర
యప్పన చెప్పిన యాప్రకారమున
నొప్పుగాఁ జెప్పితి"

నని శంబుదాసుడు తన గ్రంథాంతమున చెప్పికొనినాడు. ఈ అప్పన యెవ్వరో తెలియదు. చేమకూర వేంకటకవి(1630)సారంగ ధరచరిత్రను ప్రబంధరూపమునరచించినాడు. చేమకూర వేంకట కవికే చేమకూర అప్పనయని మరొక పేరున్నదేమో! వేంకట కవి సారంగధర చరిత్రమందలి పద్యములనేకము లిందు ద్విపద లుగా కూర్పబడినవి.. ఇతడనుసరించినది వేంకటకవి పద్యసారంగ ధర చరిత్రనే. కాని వేంకటకవికృతికిని ఈద్విపదకృతికిని కథలో కొన్ని భేదములున్నవి.

శాణాల శంబుదాసు క్రీ.శ. 17 వ శతాబ్ది తర్వాతివాడని తెలియుచున్నది.

---

57. చిత్రాడ రామవిలాస ముద్రాక్షరశాల - 1920.

58. ఆర్. నెం. 166a (1-30) ప్రా. భా. మద్రాసు.

## సారంగధరకథ:

సారంగధరుని కథ ప్రాచీనమై, దేశకాల స్థితిగతులను బట్టి పెక్కు మార్పులను బొంది, అనేక రూపముల పొడగట్టు చున్నది, సారంగధరకథను బోలినవనేకములగు కథలు వ్యాప్తికి వచ్చినవి. మహారాష్ట్రి భాషలోని 'నవనాథచరిత్ర' మందును, కన్నడములో గంగాధర రచితమగు 'కుమారరామునికథ'లోను, బౌద్ధజాతక కథలలోను సారంగధరునికథనుబోలిన కథలు కన్పట్టు చున్నవని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు తెల్పిరి.[59] పంజాబీ భాషలో 'పూరణ్ భగత్' అను ప్రాచీనమైన జానపదగాథ యొకటి కలదు. అందలి కథయంతయు మన సారంగధరుని కథను బోలియుండునని తద్జ్ఞులు చెప్పుదురు.[60]

గౌరన (15 శతాబ్ది) కృతనవనాథచరిత్రములోని సారంగ ధరచరిత్రకు కథారంగము మాళవదేశము (మహారాష్ట్రి) లోని మాంధాతపురము.[61] ఆ పురమున కధిపతి రాజమహేంద్రుడు. చేమకూర వేంకటకవి (1630) కూడ గౌరనవలె రాజనరేంద్రుని మాళవపతిగానే వర్ణించినాడు.

> "మహిని రాజనరేంద్రుఁడు మాళవపతి
> రాజరాజనరేంద్రుడు రాజరాజు
> ననఁగఁ బేరన్నికవ నెక్కి యతిశయిల్లు
> నింద్ర విభవుండు రాజమహేంద్రవిభుడు."[62]

కాని ఇచట ఒక చిన్నమార్పును వేంకటకవి కావించినాడు.

---

59. చూ॥ నవనాథచరిత్ర - పీఠిక XXIV - XXVI.
60. చూ॥ విషాద సారంగధర - తిమ్మావజ్ఝల కోదండరామయ్య. పరిశోధన. సంచిక 5. 1955 సం॥.
61. చూ॥ నవనాథచరిత్ర, 1 వ ఆశ్వా. పుటలు 24-25.
62. పద్యసారంగధరచరిత్ర - 1 వ ఆశ్వా. 5 ప. వావిళ్ళప్రతి.

సారంగధరకథ రాజమహేంద్రవరముననే, రాజరాజనరేంద్రు నింటనే జరిగినదనియు, దేశముమాత్రము మాళవమనియు వేంకటకవి అసందిగ్ధముగా చెప్పినాడు. దీనినిబట్టి సారంగధరచరిత్రమునకును, ఆంధ్రదేశమునందలి రాజమహేంద్రమునకును దాని కధిపతియగు రాజరాజనరేంద్రునకును సంబంధము కల్పించు కథలు వేంకటకవికి పూర్వమే జనసామాన్యమున ప్రబలియుండినవని మనమూహింపవచ్చును. చిరకాలానుగతమగు ఈకథకు వ్యతిరేకముగా వ్రాయలేక, సత్యమును పూర్తిగా కప్పిపుచ్చలేక వేంకటకవి ఇట్లు అసందిగ్ధముఁగా వ్రాసియుండును. వేంకటకవికి తర్వాతివాడగు కూచిమంచి తిమ్మకవి, సారంగధరునికథ గౌతమీతీరమునందలి రాజమహేంద్రవరముననే జరిగినదని స్పష్టముగా వ్రాసియున్నాడు.

"తిలకింప గౌతమీ తీర దేశమున
..............................
రాజమహేంద్రవరంబను వీడు
ఆ వీడు పాలించు నయంబు వేల్పు
టావీడితని కంచు నర్థులు వొగడ
రాజరాజనరేంద్ర రాజన్య మరుఁడు."

—కూచిమంచి తిమ్మకవి సారంగధరచరిత్ర.

శానాల శంబుదాసుని సారంగధరచరిత్రలోను నిట్లే కలదు.

సారంగధరకథను ఆంధ్రదేశమునకు ముడిపెట్టినవారిలో ప్రథముడు ద్విపద బాలభాగవత కర్తయగు దోనూరు కోనేరునాథుడు (1547 A. D.). అప్పకవి (1656) నన్నయ ఫక్కిలో ఈ సారంగధరునకు సంబంధము కల్పించినాడు. కాని చాళుక్యరాజగు రాజరాజునకు సారంగధరుడను పుత్రుడున్నట్లు చారిత్రక నిదర్శనము లేదు. రాజరాజనరేంద్రునికి రాజమహేంద్రుడని

పేరుండుటంబట్టి కాబోలు మాళవదేశాధిపతి యగు రాజమహేంద్రునికథ యీతనియందారోపితమగుట తటస్థించినది. చారిత్రక విషయములకు, జనవాదమునకు ఒకప్పుడెట్టి సంబంధముండదనుటకు సారంగధరకథ ఒక చక్కని నిదర్శనము.

గౌరన నవనాథచరిత్రలోను, వేంకటకవి పద్య సారంగధర చరిత్రలోను చిత్రాంగి రాజరాజనరేంద్రుని భోగ స్త్రీగా చెప్పబడినది. 'నృపభోగభామిని', 'భూకాంతునిభోగసతి', అని గౌరన చిత్రాంగిని పేర్కొనినాడు. 'భోగకుటిల శిరోజాతిలక' మనియు, 'వారకాంత' అనియు చేమకూర వేంకటకవి చిత్రాంగిని పేర్కొనెను. గౌరన నవనాథచరిత్రయందు చిత్రాంగి విషయము, వేశ్యాప్రసక్తి పావురముప్రాలు సందర్భముననే తెలుపబడినది. ఇది కొంత యుచితముగానున్నది. వేంకటకవి గ్రంథారంభముననే రాజరాజునకు చిత్రాంగియను భోగ స్త్రీ యును రత్నాంగియను కులసతియును ఎలజవ్వనులున్నట్లు తెల్పినాడు. సారంగధరుని తల్లియగు రత్నాంగితో సమానమగు నీడుగల చిత్రాంగి సారంగధరుని వలచినదనుట సంభావ్యముగ లేదు. అట్టియెడ చిత్రాంగిని 'మవ్వంపుజవ్వనమున' తొణికసలాడుచున్న యంగనవలె వర్ణించుట మరియు నసంగతముగనున్నది. ఈసందర్భమున నవనాథచరిత్రకర్తయగు గౌరనకొంచెము మెలకువతో వర్ణించినాడు. బాణాల శంబుదాసుడు చిత్రాంగిని రాజకన్యగాను, రాజరాజనరేంద్రుని రెండవభార్యగాను, వివాహముకాకమునుపే సారంగధరుని వలచియు, విధివైపరీత్యముచే రాజును వివాహమాడి 'ఇష్టములేనికాపురము' చేయుచుండెననియు చిత్రించినాడు. శంబుదాసుడు సారంగధరకథలో చేసిన ఈ మార్పును లేక సవరణను కూచిమంచి తిమ్మకవి అనుసరించినాడు. కాని

ఈ మార్పుమూలమున కవి చిత్రాంగిపాత్రను సరిదిద్దయత్నించి నాడు. కాని దీనివలన రాజరాజు పాత్రము మాత్రము కలుషిత మగుచున్నది. దీనితో బుద్ధిమంతుడైన సుబుద్ధి చిత్రాంగియింటి కేగినచో కీడుతప్పక కల్గునని సారంగధరుని వారించుట అనుచిత ప్రసంగమగును. కనుక శంబుదాసుడు చేసినసవరణ, తదనుసారి తిమ్మకవిరచన సరసమైనది కాదనితోచునని శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు అభిప్రాయపడిరి. 63

గౌరన ప్రకారము సారంగధరునిభార్యపేరు 'మంగళాంగి', వేంకటకవి ప్రకారము 'మంజువాణి'. పేరేదైనను ఈ గ్రంథము లలో ఆమెకు ఏమాత్రమును ప్రాముఖ్యము లేదు. సారంగధరుడు శిక్షపొందినపుడు దుఃఖించినవారి జాబితాలోకూడ నాతని భార్య పేర్కొనబడలేదు. ఇది కావ్యశిల్పమున కొక విధమగు లోప మనియే చెప్పవలెను.

కావ్యమునందు రసదృష్టి వేరు; కథాదృష్టి వేరు. ఒకేకథ గల కావ్యమున రసదృష్టి ప్రధానముగానుండును. బహుకథలు గల కావ్యమున కథాదృష్టి యెక్కువగానుండును. కథాదృష్టితో వ్రాయు కావ్యమున వస్తుగత శిల్పమధికము. దీనియందుకూడ, రసాధారణము లేకున్నచో కావ్యమునకు శోభ లేదు. ఏకవస్తు కావ్యమునకు, బహుకథాకావ్యమునకు ఈ భేదమున్నది

బహుకథాకావ్యములలో రసపోషణనిర్వహించుటకష్టమే. కాని రసము ఒక్క సంచారిభావముచేతనే, యొక యనుభావ విశేషముచేతనే వ్యంజితము కావచ్చును. సంచారి సామర్థ్యము చేత విభావాదులన్నియు పొడగట్టి రసస్ఫూర్తి కలుగవలెను.

---

63. చూ॥ సారంగధరచరిత్ర - జితకాశి టీక - దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు.

నవనాథచరిత్ర బహుకథాకావ్యము. అందలి సారంగధర చరిత్ర ఏక వస్తుకావ్యము వలె రసాధారణము కల్గియున్నది. బాణాల శంభుదాసు, తిమ్మకవుల సారంగధరచరిత్రలు ఏకవస్తుమయ కావ్యములు.

సారంగధరచరిత్రలోని చిత్రాంగీ సారంగధరులువచ్చు రంగము మనుచరిత్ర ద్వితీయాశ్వాసములోని వరూధినీప్రవరుల దృశ్యమువంటిది. రెంటియందును నాయకుడు పరస్త్రీవిముఖుడు; నాయిక అగ్గలమైన తమిచే ప్రేరేపింపబడి పురుషుని బలవంతపెట్టును. ఈ సందర్భమున వేంకటకవి రచనకంటె గౌరన రచనయే రసవంతమై, ఔచిత్యము కల్గియున్నది. పెద్దనరచన ఈరచనలకంటెను మెరుగు.

## పురూరవోపాఖ్యానము:

పురూరవుడు షట్చక్రవర్తులలో నొకడు. అతని వృత్తాంతము బ్రహ్మపురాణమునందు ప్రత్యేక గాథగా వర్ణింపబడినది. వాయుపురాణమునందు ఊర్వశీపురూరవుల పరిణయవృత్తాంతము కలదు.

పురూరవోపాఖ్యానమును పురాణం రామశర్మ ద్విపదలో రచించినాడు. ఇది 5 భాగములుకలది. ముద్రితము.[64] ధర్మరాజునకు వ్యాసుడీకథను చెప్పినట్లు కథాసందర్భము కలదు. పురూరవచక్రవర్తికి సంబంధించిన సంపూర్ణచరిత్ర యిందు వర్ణింపబడినది. పురూరవుని, ధర్మదీక్షను, సత్యవ్రతమును, సత్కృత్యములను, పరీక్షింపగోరి శని అనేక మాయలుపన్ని అతని రాజ్యభ్రష్టుని చేసి అష్టకష్టములపాలు చేయును. ఇది నలచరిత్రకథను బోలి

---

64. అమెరికన్ డైమెండ్ ప్రెస్-మద్రాసు. 1915 (గుజలీప్రతి)

కరుణ రసాత్మకమైనది. భారతీదేవి కృపచే పురూరవుడన్ని కష్టములకోర్చును. శని అతని ధృఢదీక్షకు మెచ్చి అతనికి సర్వసౌఖ్యములనుకల్గించును. పురూరవునికీర్తి ఆచంద్రతారార్కమయ్యెను.

పుత్రులు లేరని చింతించుచు సోమదత్తుడు సభలోపల్కిన పల్కులు పోతన భాగవతములోని ప్రహ్లాదచరిత్ర ఘట్టమునందలి పద్యరచన ననుసరించినవి.

"పుత్ర సంతతి లేని భోగంబులేల
గోత్ర వృద్ధియులేకఁ గూలుటఁ గాక
సుతులు లేకయు మంచి గతి చిక్కబోదు
గతమగు దేహి సంతత ముండబోదు
పరిమితి లేని సంపద లెన్నియున్న
సరసఁ బుత్రులు లేక సంతస మున్నె
బాలుర ముద్దు పల్కులు వినినంతఁ
జాలదె వీణాది సంగీత మేల
సుతుల పల్కులు విను శ్రోత్రముల్ చెవులు
సుతులాడు మాటల సారిదిగా వినని
వీనులు వీనులే కోనలు గాక
సూనులతో జేరి సురుచిరాన్నమును
భుజియించు వానికి భుక్తము గాక
రజనీ చరులఁ బోలి రామణీయకపు
నన్నంబు సుతులు లేకయ భుజించినను
సున్నంబుగాదె యా సురుచిరాన్నంబు."

— పురూరవోపాఖ్యానము. పుట 16.

ఇది సులభశైలిలో పామరజనసుబోధకముగ కరుణరసము వెల్లివిరియునట్లు రచింపబడినది. కవి కాలమును తెలిసికొనుటకు ప్రత్యక్షసాక్ష్యములు లేవు. పూర్వకవిస్తుతిలో ఒక్కపోతనను మాత్రమే స్తుతించినాడు. గ్రంథమునందలి శైలిని బట్టి ఈ కవి 18 శతాబ్దివాడై యుండునని నూహింపవచ్చును.

వస్త్వైక్యముకల్గి కరుణరసభరితమైన కావ్యమిది.

గ్రంథకర్తలకాలాదికములు ఇదమిత్థముగా తెలియని కొన్ని ద్విపదకావ్యములు కలవు. వానియందలి ఇతివృత్తము ప్రాచీనతమమైనదిగా నుండుటచే వానినిచట పేర్కొని పరిశీలింతము.

శతకంఠరామాయణము:

లింగనకవి, శతకంఠరామాయణమును ద్విపదలో రచించెను. ఇది 3 కాండలు కలది. అముద్రితము.[65] శతకంఠరామాయణమునకే శతముఖరామాయణమని, సీతావిజయమని పేర్లు కలవు. 'సీతావిజయము' అనుపేర మరొక ద్విపదకావ్యమును వల్లూరి హనుమంతకవి రచించినట్లు,

"సీతా విజయము త్రిపురా
రాతి విజయమని కతలను రచియించె బుధ
ప్రీతిగను ద్విపద కల్పన
మాతరమా మెచ్చగ హనుమంతుని కవితల్."[66]

అను నాగజిత్తీపరిణయమను పద్యప్రబంధమునందలి అవతారికను బట్టి తెలియుచున్నది. సీతావిజయ ద్విపదకావ్యము అలభ్యము.

లింగకవి ద్విపద శతకంఠరామాయణము భవిష్యోత్తర పర్వము ననుసరించి రచింపబడినది. కేవలము దశకంఠుని సంహారముతో శ్రీరాముని త్రేతాయుగ వీరునిగ ఎంత వర్ణించినను పదకవులకు తృప్తికలుగలేదు. శ్రీరాముని వీరాధిక్య చిత్రణకు శతకంఠ, సహస్రకంఠరావణులను కూడ కల్పించి, వారి సంహారమునుకూడ శ్రీరామునిచేతనే చేయించినారు.

---

65. చూ॥ ఆ. వా. సూ. 1320.

66. నాగజిత్తీ పరిణయము - అముద్రితము. ఆర్. సెం. 546 ది. ప్రా భా. మద్రాసు.

శతకంఠునితో పోరుటకు సీతయు రాముని వెంట వెడలుట ఈ గ్రంథమునందలి విశేషము. సీత ధనుర్ధారిణియై రణరంగమున నిలిచి శతకంఠుని పరాభవించినదని యిందువర్ణింపబడినది. ఇందు సీత రాముని అర్ధాంగియనినిరూపించుకొనిన వీరనారి. నరకాసుర సంహారమున శ్రీకృష్ణావతారములో సత్యభామసహాయము లభించెననెడి పురాణప్రసిద్ధగాథ నాధారముగ చేసికొని కల్పించిన కథయైయుండవచ్చును. సీతాదేవి రణరంగమున నిలిచి వీరరస మొలికించు ఘట్టము తెలుగున ఈ శతకంఠరామాయణమునందే కలదు.

శతకంఠరామాయణము పౌరాణికములలో చేర్పదగినదే కాని ఇందలి రచనాశిల్పము పురాణపద్ధతికి చెందినది కాక కావ్యపద్ధతికి సన్నిహితముగ నుండుటచే ఇది కావ్యప్రబంధములలో చేరుచున్నది.

శతకంఠరామాయణమును మర్దనకవి (17 శతాబ్ది), లింగకవి (1700 A. D.), గంగకవి – అనువారు పద్యప్రబంధములుగ రచించినట్లు తెలియుచున్నది.

## కపోతవాక్యము

మహాభారత శాంతి పర్వాంతర్గతమగు లుబ్ధకపోతోపాఖ్యానము దీనికి మూలము. ఈ ఉపాఖ్యానమును కావ్యవస్తువుగా గ్రహించి 'కపోతవాక్యము' అనుపేర కొన్ని ద్విపద కావ్యములుకలవు. ద్విపదలోని 'కపోతవాక్యము' రచనల తాళపత్రప్రతులు అయిదుగలవు. ఈ అయిదును భిన్నకర్తృకములు. ఇవి స్వతంత్ర ప్రబంధములవలె రచింపబడినవి.

ఆర్. నెం. 1035 ప్రతి (ప్రా. భా. మద్రాసు) – ఈకపోతవాక్యమును ఓబళయ్య అనునతడు రచించినట్లు తెలియుచున్నది.

"కారణం బైనట్టి కపోత వాక్యంబు
నెవ్వరు చదివిన నెవ్వరు విన్న
నెవ్వరు వ్రాసిన నెలమితోడుతను
......................................
వైకుంఠ వాసంబు వలనొప్ప గలుగు."

అని కవి గ్రంథాంతమున చెప్పినాడు.

ఆర్. నెం. 1036 ది (ప్రా. భా. మద్రాసు) గల ప్రతిలో దీనికర్త వేంకటగిరికవి అని కలదు.

ఆర్. నెం. 1039 ప్రతిగల కపోతవాక్యమునకు కర్త్రు నామాదికము తెలియదు. కాని అతడు కందాళ వరదయాచార్యుని శిష్యుడని యున్నది.

ఆర్. నెం. 1038 ప్రతి గ్రంథకర్త్రు నామాదికములు తెలియవు. ఇది భారతకథ గాక కల్పితమైన కథకలది. రామాయణకథా ప్రసక్తముగా రామసుగ్రీవుల సంభాషణమునడుమ సాగిన కపోతకథయే యిందలి యితివృత్తము. విభీషణుడు శ్రీరాముని శరణుజొచ్చినపుడు సుగ్రీవుడభ్యంతరము చెప్పును. అప్పుడొక కపోతమువచ్చి శ్రీరామునితో విభీషణుని చేరదీసి తనశరణాగతవత్సల బిరుదమును నిలుపుకొనుమని హెచ్చరించును. కపోత వాక్యమునుపాటించి రాముడు విభీషణుని చేరదీసి అతనిని లంకాధీశునిగా చేసెను. శరణాగతుల రక్షించుటధర్మమని శ్రీరాముడు సుగ్రీవునితో కపోతవృత్తాంతముదృష్టాంతముగ చెప్పుట ఈకావ్యమందలి కథాసందర్భము.

తంజావూరు పుస్తకశాలలోని 335 సంఖ్యగల 'రామకథ' లోకూడ ఈ కపోతవాక్య కథ చెప్పబడినది. ఇది పురాణపద్ధతితో నొప్పిన రచన.

సంస్కృతరామాయణమున ఈకపోతవృత్తాంతముస్మరింప

బడినది.

"శ్రూయతేహి కపోతేన శత్రు శ్శరణమాగతః
అర్చి తశ్చ యథాన్యాయం స్వైశ్చమాంసైర్ని మంత్రితః
సహితం ప్రతిజగ్రాహ భార్యా హర్తార మాగతమ్
కపోతో వానర శ్రేష్ట కింపు నర్మద్విధోజనః."

— శ్రీ రామాయణే - యుద్ధకాండే-అష్టాదశస్సర్గః 24-25 శ్లో.

ఇందుదాహృతమగు కపోతకథయే తెలుగు కపోతవాక్యమునందు విపరింపబడినది. రంగనాథరామాయణమున ఈ వృత్తాంతము మరొకవిధముగ నుండుట గమనింపదగినది.

"అర్కజ! ఇతడు మేలాటఁ గీడాట
తర్కింప నేటికి ధర్మంబు త్రోవ
శరణని వచ్చిన శత్రువు నైన
బరికింపగా రాచపాడి రక్షింప
నొక కపోతము డేగ యుదటి దరుమ
వికల భావంబున వేగంబ వచ్చి
శిబిమాటు సొచ్చెఁ జొచ్చిన డేగయుడుగ
శిబితను విచ్చి చెచ్చెర గువ్వగాచె."

—రం.రా. యుద్ధకాండము- పుట 305. రాయల్ అండ్ కో ప్రతి.

## పరశురామాయణము:

గ్రంథనామమునుబట్టి చూచిన ఇది పౌరాణికములలో చేర్పదగినదే యయ్యును రచనావిధానమునుబట్టి దీనిని కావ్య ప్రబంధములలో చేర్చవచ్చును. ఇది వీరరసస్ఫోరకమగు మంజరీ ద్విపదకావ్యము. ఇందు పూర్వోత్తరభాగములు కలవు. అముద్రిత గ్రంథము.[67] ఉలిచి భావజ్ఞుడు దీనిని పాడుకొనుటకు వీలుగ

67. ఆర్. నెం. 1110 (పూర్వభాగప్రతి)
,, 1111 (ఉత్తరభాగప్రతి) } ప్రా. భా. మద్రాసు.

యింపుతో, కవులు మెచ్చునట్లుగ రచించినాడు. గ్రంథము కన కాద్రి కంకితము. గ్రంథాంతమున ఫలశ్రుతి కలదు.

పరశురాముడు కార్తవీర్యుని ఓడించినకథ ఈ మంజరీ ద్విపదకావ్యమునందువర్ణితము. శ్రీరాముడు పరశురామునివిల్లును నడిమికి త్రుంచి భంగపరచుటయు, పరశురాముడు శ్రీరాముని ప్రస్తుతి చేయుటయు గ్రంథాంతమున తెలుపబడినది.

పరశురామాయణకథను వీరావేశముచే పాటలరూపమున ఎఱ్ఱగొల్లలను దేశద్రిమ్మరి తెగవాండ్రు పాడుచుందురు. ''పరశు రామ రామాయణము, పరశురామ విజయము, మాహురమ్మకథ (ఏకవీరకథ) - ఇత్యాదులు వారు (ఎఱ్ఱగొల్లలు) పాడు ద్విపద ప్రబంధము లిప్పుడును కలవ''ని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తెలిపి యున్నారు.[68]

ధర్మజకృష్ణసంవాదము:

తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీయందు దీనివ్రాతప్రతి (ఆర్. నెం. 300 సమగ్రము) కలదు. ఈ ద్విపదకావ్యకర్త నర సింహకవి. ఇతడు కడమ తాతాచార్యుని శిష్యుడట. ఇతడు ఏకాలమువాడో తెలియదు. ధర్మరాజునకు శ్రీకృష్ణుడు స్వర్గనరక ముల మహిమను విస్తరించిచెప్పుట ఈ ద్విపదకావ్యమునందలి ప్రధాన కథాంశము. ''గ్రంథనామము గ్రంథములో కానరాదు. విషయమునుబట్టి పేరూహింపబడినది.'' అని డా॥ చిలుకూరి నారాయణరావు గారు పండితారాధ్యచరిత్ర పీఠిక (పుట 153) యందు తెల్పిరి.

68. చూ॥ క్రీడాభిరామ పీఠిక - పుట 103.

## గజాననోపాఖ్యానము:

శైవులకు శివునితోపాటు శివాంశసంభూతులు కూడ ఆరాధ్యదైవములు. శివునికుమారులందొకడగు గజాననుడు సాధారణముగ అందరిచేతను పూజింపబడును. విఘ్నోప శాంతికి వినాయకుని పూజించుట తెలుగువారి ఆచారము. మహారాష్ట్ర దేశమందు గణేశునిపూజకు నెక్కువ ప్రాధాన్యము కలదు.

'గజాననోపాఖ్యాన' మను ద్విపదకావ్యమును నరసింహదేవర పేరిశాస్త్రి రచించెను. ఈగ్రంథము అముద్రితము. (చూ॥ ఆ. వా. సూ. పుట 51.)

కవుల పేర్లు, గ్రంథముల పేర్లు తెలిసినను గ్రంథమునుగూర్చిన వివరములు తెలియని ద్విపదకావ్యములు కొన్ని కలవు.

## బలభద్రవిజయము:

ఈ ద్విపదకావ్యమును లోకేరావు సోమన రచించెను. ఇది అముద్రితము. (చూ॥ ఆర్. నెం, 306. తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీ) శ్రీ వేంకటేశ్వరున కంకితము.

> "వరనలంకార నటనలు మీర
> కవిరాజు లొగి శిరః కంపంబు చేయ
> ప్రవిమలాత్మకు లైన భావజ్ఞులకను
> చెవుల పండువుగాగ."

రచించితినని కవి గ్రంథాంత్యమున తెల్పినాడు.

లోకేరావు సోమన బల్లాడచరిత్రమును (పద్యకావ్యము), శివరాత్రి మాహాత్మ్యము (వచనము)ను, లక్షణాదేవి కల్యాణమును (ద్విపద; యక్షగానము), రంభ సంవాదమును (యక్షగానము) రచించినట్లు బలభద్ర విజయావతారికనుబట్టి తెలియుచున్నది. ఇతడు క్రీ. శ. 18 శతాబ్దమువాడై యుండును.

### సత్యభామవిజయము :

ఈ ద్విపదకావ్యమును ఘట్టుప్రభువు (16 శతాబ్ది) రచించినట్లు తెలియుచున్నది.[69] ఇతడు ఎల్లనామాత్యుని పుత్రుడు. నెల్లూరు ప్రాంతమువాడు, ఈ ద్విపదకావ్యము అలభ్యము.

### శ్రీకృష్ణతులాభారము

ఈ ద్విపదకావ్యమును రచించినవాడు మరింగంటి వేంకట నరసింహాచార్యులు (1800). ఇతడు నల్లగొండ జిల్లాలోని కనకల్లు నివాసి. గ్రంథము అలభ్యము. (చూ॥ గోలకొండ కవుల సంచిక - పుట 410).

### సత్యాద్రౌపదీసంవాదము :

సత్యభామకు ద్రౌపదికిజరిగినసంభాషణ ఇందలివిషయము. దీనిని 200 మంజరీ ద్విపదలలో స్త్రీజనోపయుక్తముగ వివిధ స్త్రీ ధర్మబోధకముగ సరసముగ వీరేశలింగముపంతులు (1848–1919 A. D.) రచించినాడు. ఇది ముద్రితము.[70]

గ్రంథాంతమున ఫలశ్రుతి కలదు.

"ద్రుపదాత్మజకు సత్య తోడ నైనట్టి
సంవాదమును దీనిఁ జదివిసుందరులు
వరగుణంబులు గల్గి వర్తింతురేని
పతుల ప్రసాదంబు వడసి యెల్లపుడు
సకల శుభంబుల సత్కీర్తి నొంది
యిహపర సుఖముల నెలమిఁ గాంచెదరు."

వీరేశలింగము పంతులు అడుగుజాడలలో నడచి కొందరు కవులు ద్విపదకావ్యములను చేపట్టిరి. వీరేశలింగము పంతులు

69. చూ॥ ఆంధ్రకవి సప్తశతి - పుట 65.
70. చూ॥ వీరేశలింగకృత గ్రంథములు - 6 వ సంపుటము.

తర్వాత వెలసిన ద్విపదకావ్యములను ఆధునికరచనలుగ పరిగణింపవచ్చును. వీనిలో పురాణకథలు వర్ణింపబడినను దేశీయత, నవ్యత రచనావిధానమున గోచరించు చుండును. గార్లదిన్నె సుబ్బారావు ఉత్తర హరిశ్చంద్రీయములోని నవ్యకవితారీతులను ఈ అధ్యాయమునందే వివరించితిమి.

తెలుగునాట ద్రౌపది, అరుంధతి, సావిత్రి – మొదలగు పతివ్రతలకథలు స్త్రీలలో బహుళప్రచారమునొందినవి. స్త్రీలకు పాతివ్రత్యమే సకలార్థప్రదమని ఈ కథలలో వర్ణింపబడినది.

అరుంధతీదేవిచరిత్ర:

ఇది మహాభారత శల్య పర్వాంతర్గతకథకు ద్విపదరూపమగు తెలుగు సేత. గ్రంథములో కవిపేరు కానరాదు. గ్రంథము ముద్రితము.[71] ఇది సులభశైలిలో రచింపబడిన కావ్యము.

సావిత్రీచరిత్ర:

సావిత్రీచరిత్రను ముప్పిరాల సుబ్బరాయకవి రచించినట్లు "తలరుచు ద్విపదగా వెలయ సావిత్రిచరిత్ర యొనర్చితి చిత్రలీల" అను కృష్ణాభ్యుదయ పద్యకావ్యావతారికనుబట్టి తెలియుచున్నది. గ్రంథము అలభ్యము.

సావిత్రిచరిత్రను ద్విపదలో ఎలమందరాజుకూడ రచించినట్లు తెలియుచున్నది. (చూ॥ ఆ. వా. సూ. పుట 224.)

మేఘదూతము:

మేఘదూతమును పల్లెపూర్ణప్రజ్ఞాచార్యులు (1910 A. D.) కాళిదాసుని మేఘసందేశము ననుసరించి ద్విపదలో రచించెను.

---

71. జనరంజనీ గ్రంథమాల – మద్రాసు 1908.

గ్రంథము ముద్రితము.[72] ఇందు 2 ఆశ్వాసములలోను మొత్తము 521 ద్విపదలు కలవు.

మహాకవి కాళిదాసు 122 శ్లోకములలో సంస్కృతమున మేఘసందేశ కావ్యమును రచించినాడు. ఇది కాళిదాసుని ప్రతిభా చాతుర్యమునకును, కల్పనాచమత్కృతికిని, లోకజ్ఞతకు, రసపరాకాష్ఠకు ప్రబలనిదర్శనమై ధ్వని ప్రధానకావ్యమైనది. దీనికి సుమారు 20 వ్యాఖ్యానములు సంస్కృతమున కలవు. దీనిని ద్విపదలో అనువదించుటకు గల హేతువును కవియే కృతిప్రశంసలో నిట్లు తెల్పినాడు. "భావపూర్ణములగు నిందలి శ్లోకంబుల ననువదింప వ్యాస సమాసానుకూలంబులుగా నుండునని ద్విపద వృత్తముఁ జేకొంటిని. మేఘదూతమంతయు మందాక్రాంతలోనే యుండుటచే ననువాదంబు గూడ నొకేవృత్తములో నుండుట సమంజసము."

పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు తన ద్విపద మేఘదూతానువాదములో చాలవరకు మల్లినాథసూరి వ్యాఖ్యానమునే అనుసరించినాడు.

మేఘదూతము కవికల్పితమైన భావకావ్యము. భావములు, భాష, వర్ణనాలంకారములు, కల్పనలు – ఏకస్థాయి నందుకొన్న కాళిదాసుని మేఘసందేశ కావ్యమును తెనగించి ఈ ద్విపదకవి ధన్యుడైనాడు.

## సేవాంజలి:

ఇది ఎల్లమరాజు నారాయణభట్టు (20 శతాబ్ది) కృతము. గ్రంథము ముద్రితము.[73] ఇందు 1300 ద్విపదలుకలవు. గ్రంథము

72. చంద్రికా ముద్రాక్షరశాల - గుంటూరు 1931.
73. శ్రీసాధన ముద్రాక్షరశాల - అనంతపురము 1929 సంవత్సరము.

ఈశ్వరార్పితము. ఇది స్వతంత్ర ప్రధానమైన కావ్యము. భావ ప్రధానమైనది.

"సేవ అంటే స్వోదరప్రియుడైన మానవసేవకాదు. మానవుని ఉదరపోషణముకోసము తమప్రాణములను నిష్కారణముగా, దార్జన్యముగా ప్రాణములనువిడువవలసిన జీవకోటియొక్క సేవ." అని డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఈ ద్విపదకావ్యము యొక్క 'తొలిపల్కులలో' తెల్పిరి.

జీవకోటియొక్క దీనాలాప మొక కరుణగీతమయి ఈ 'సేవాంజలి' గా పరిణమించినది. ఆ జీవకోటికి కలుగుచున్న బాధ కవిహృదయమున కావేగమును కలిగించి కన్నీటిధారలను ప్రవహింప జేసినది. ప్రజలలో ప్రబలియుండు దురాచారములను, మూఢనమ్మకములను, జాతరలపేరిట జీవహింసను విచ్చలవిడిగా చేయుట, నామదారిమతము పేరిట పీనుగకు శృంగారముచేసి మాంసభక్షణముచేయుట - ఇత్యాదులను కవి జుగుప్సాకరముగ వర్ణించి అహింసా తత్త్వము, శాంతికాముకత్వమునకై ప్రజల నుద్బోధించుట ఈద్విపదకావ్యమునందలి ఇతివృత్తము. అహింసామతమునకు జీవకారుణ్యదీక్ష అవసరము. ఈ దీక్షను, ఈ మతమును ప్రచారమొనర్చుటకు ద్విపద యెంతేని యుపకరించునని కవి దీనిని ద్విపదలో రచించినాడు.

జనసామాన్యమునకు హృదయ పరివర్తనము కలిగించుటయే ఈ కావ్యోద్దేశము.

"దేవు నారాధింపఁ దివిరెడు మున్న
'సేవాంజలుల' గూర్చి సిద్ధి యత్నమునఁ
జేసిన చేతిలో జీవజంతువుల
గాసి మాన్ప దృఢంబుఁ గాంచి రారయ్య."

అని కవి గ్రంథాంతమున నుద్బోధించెను.

మరియు, ఈ క్రింది ద్విపదలు కలవు.

"ఇది భూత హితకాంక్ష నీశ్వరు కృపను
బొదలు ప్రజ్ఞాలవ పూర్వకంబుగను
అతి మ్లాన హృదయ "నారాయణభట్ట
కృతము సేవాంజలీకృతి."

4. ద్వి ప ద క ల్యా ణా త్మ క ము లు :

'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతానిచ (కావ్యాని)" అను లక్షణమును పాటించి కావ్యరచనచేయుట భారతీయ కవిలోక సంప్రదాయము. ఇట్టి దృష్టియే భారతీయ వివిధ భాషాసాహిత్యములలో కల్యాణకావ్యములు వెలయుటకు ముఖ్య హేతువు. రామాయణ, భారత, భాగవతాదులలో సీతా కల్యాణము, సుభద్రాకల్యాణము, రుక్మిణీకల్యాణము - ఇత్యాది కథాభాగములను విడివిడిగ చదువుకొను నాచారము మనలో కలదు. ఈ కల్యాణకావ్యపరంపర తెలుగులో అన్నిప్రక్రియ లందును వెలసినది. నాయికానాయకుల వివాహము, తదనుగుణ మగు శృంగారరసపోషణకు, వర్ణనకు ప్రాముఖ్యముకలది కల్యాణ కావ్యము. ద్విపదకావ్యప్రక్రియలో పండితాదరణపొందిన రస వత్తర కల్యాణకావ్యములు కొన్ని వెలసినవి. అవి:

(1) సుభద్రాకల్యాణము – తాళ్లపాక తిమ్మక్క (15శతాబ్దాంత్యము.)

(2) అష్టమహిషీకల్యాణము – } తాళ్లపాక చిన్నన్న
(3) ఉషాకల్యాణము – } 1498-1561 A. D.)

(4) జాంబవతీకల్యాణము (అలభ్యము) – కాళాధరకవి (1600 A. D.)

(5) అభిమన్యుకల్యాణము – శేషము చెన్నుభట్టారకుడు (1690 A. D.)

(6) రుక్మిణీకల్యాణము – చౌదరి రామదాసు.

(7) ,, – చిన్నయ.

(8) ,, – యస్. లింగయ్య

(9) ,, – కవిపేరు తెలియదు

(10) భానుకల్యాణము – చంద్రశేఖరకవి

(11) గంగావివాహము – చిత్తూరుగంగాధరకవి(1823 A. D.)

(12) ద్రౌపదీ స్వయంవరము (అలభ్యము) – వీరభద్రుడు

సుభద్రాకల్యాణము :

సుభద్రా కల్యాణమును మంజరీ ద్విపదలో స్త్రీజనోపయుక్తముగ తాళ్ళపాక తిమ్మక్క రచించెను. ఈమె తాళ్లపాక అన్నమాచార్యుని (1408-1503 A. D.) ప్రథమ పత్ని. ఈమెనే 'తిరుమలాంబ' అని, 'తిమ్మాంబ' అనియు వ్యవహరింతురు. ఆంధ్ర సాహిత్యచరిత్రలో తెలిసినంతవరకు ఈమెయే ప్రథమకవయిత్రి.

ఈ సుభద్రాకల్యాణము ముద్రితము.[74] ఇది ఆంధ్రమహాభారతాంతర్గత కథాభాగము నధికముగా ననువర్తించుచున్నది. ఈ కథాభాగమును ప్రత్యేక కావ్యముగా తెనుగున రచించుటలో తిమ్మక్కదే ప్రథమప్రయత్నమని చెప్పవచ్చును. దీనికి భారతకథ ఆధారమైనను ఇది స్వతంత్ర రచనయే. సుభద్రా కల్యాణగాథను గ్రహించి కావ్యములుగా రచించిన వారిలో ముఖ్యులు చేమకూర వేంకటకవి, కూచిమంచి జగ్గకవి. వావిల

74. Sri Venkateswara oriental Series. No. 20.
పరిష్కర్త:- శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.
T. T. D. Press, Tirupati. 1950.

కొలను సుబ్బారావు, ముదిగొండ నాగవీరయ్యశాస్త్రి-మున్నగువారు. వీరందరును తిమ్మక్కకు అర్వాచీనులే.

వర్ణనలందు తిమ్మక్క దేశకాల పాత్రోచితములైన మార్పులను చేసినది. మూలమున అర్జునుడు కేవలము స్నానయోగ్యములయినతీర్థములనే సేవించినట్లువర్ణింపబడినది. తిమ్మక్క తన కాలమున ప్రసిద్ధములయిన వైష్ణవ దేవస్థానములకు కూడ అర్జునుని ఆహ్వానించినది.

"చనుదెంచె పర్వతస్వామి సన్నిధికి
అమర నహోబలంబా వేంకటాద్రి
వరుస నాపై కంచి వరదుల గొలిచె
క్రమమున కావేటి రంగనాయకుల
ప్రేమను దర్శించి..............."



— సుభద్రాకల్యాణము — పుట 6.

ఇది తిమ్మక్క ఆంధ్రదేశీయాభిమానమును వెల్లడించును.

తిమ్మక్క తనసుభద్రాకల్యాణకథను సుభద్రార్జున సమాగముతో ముగించి కథాకథన చాతుర్యమును, కావ్యకళాకౌశలమును చూపినది. లలితశృంగారాత్మకముగ దేశీయత వెల్లివిరియునట్లు, ఆనాటి తెలుగువారి ఆచారవ్యవహారములు ప్రతిబింబితమగునట్లు ఈకావ్యము రచింపబడినది. ఇందలి పాత్రలన్నియును తిమ్మక్కచేతిలో తెలుగువారైనారు. లోకసహజములగు స్వభావాదులనే వారిపట్ల తిమ్మక్క ప్రదర్శించినది.

తిమ్మక్క స్త్రీ హృదయమెరిగిన అనుభవజ్ఞురాలు. కనుకనే స్త్రీ పాత్రల మనస్సులను సహజముగ వర్ణించినది. సుభద్రను వెంటబెట్టుకొని ఇంద్రప్రస్థ నగరమును సమీపించిన అర్జునుడు ద్రౌపదీదేవి ఆశీస్సు బడయుమని తానే బోధించి ఆమెకు గొల్లెతలను తోడిచ్చి ముందుగానే పంపినట్లు మహాభారతమున

వర్ణింపబడినది. ఇచ్చట తిమ్మక్క మూలములోని పద్ధతినిమార్చి నది. సుభద్రాకల్యాణకావ్యములోని సుభద్ర, ద్రౌపదిని ప్రసన్నురాలిగా చేసికొనిన గాని తన భవిష్యజ్జీవితము సుఖమయము కాదని గ్రహించినది. కనుక ఆమె

"యీ చందమున నన్ను నీక్షించి కృష్ణ
యేమని పల్కునో యీసరమ్మనను
ఆపలుకు లన్నియు నటు తాకు నేమొ
గోపాల సతులతో కూడ నన్నును."

— సుభద్రాకల్యాణము — పుట 48.

మని అర్జునునికి సూచించినట్లు తిమ్మక్క కల్పించినది.

మహాభారతమున సుభద్రా వివాహానంతరము ద్రౌపది హృదయము నిర్వికారముగనున్నట్లే వర్ణింపబడినది. ఇది తిమ్మక్కకు అసహజమనిపించినది. తనకు సవతివచ్చుట ఏ స్త్రీయును సహింపదు కదా! ద్రౌపది స్వయముగా సుభద్రార్జునుల పెండ్లి సన్నాహము చేసి, పడుకటింటి శృంగారము చేసి తరువాత పడిన ఆవేదన, సమాధానము ఎంతవాస్తవికముగా ఉచితముగా, స్వానుభవపూర్వకముగ, భావస్ఫోరకముగనున్నదో గమనింపుడు.

"తలపోసె మనసులో తాళంగ లేక
యేమి వస్తువు లైన నియవచ్చు గాని
ప్రాణేశు నిచ్చి మరి బ్రతుకంగరాదు
అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని
చెల్లెలు గనుక నే నొల్ల ననరాదు.
అదిగాక సభలోన ఆ కౌరవులకు (?)
మాన భంగము కల్గు హీన కాలమున
మాన ధన మొసగిన మాహాత్మ్యశాలి

అటువంటి శ్రీకృష్ణు కనుగు చెల్లెలట
అని మరి తలపోసి అతివ మోదించె."

— పుట 54.

ఇచట ద్రౌపది, సుభద్రవలన ప్రాప్తించిన సాపత్న్యమును ఉదార భావముతో అంగీకరింప లేదు. పరిస్థితుల ప్రాబల్యమునకులొంగియే అంగీకరించెనని చెప్పబడినది. ఇదియెంతయు నుచితముగానున్నది.

తిమ్మక్క మంజరీద్విపద కృతి స్త్రీ బాల పామరాదులు కంఠ పాఠముగా నేర్వదగినది; పాడదగినది కూడ. ఈ కావ్యము లోని పోలికలు, పలుకుబడులు కొన్ని చేమకూర వేంకటకవి విజయవిలాసమున చేరియుండుట దీనిగుణాధిక్యతకొకదృష్టాంతము.

సుభద్ర యతివేషమున నున్న అర్జునుని కుశలప్రశ్న వేయు ఘట్టము చాల నాజూకయినది.

సుభద్రాకల్యాణ రచన :

"అయ్య మీ రేదేశ మరసి చూచితిరో?
ఎయ్యది మీనామ ? మెచ్చట నుండుదురో?
పరగ నింద్ర ప్రస్థ పట్టణమ్మున
బహుళ సంపదలతో బరగు చున్నార
ధీర మానసులు కుంతీ సుతుల్? వారు
ఆరయ గడు సుఖులై యున్న వార ?"

— పుట 29.

విజయవిలాసములోని ఈ క్రింది పద్యములోని పోలికను గమనింపుడు :

"మీరింద్ర ప్రస్థముఁ గని
నారా? పాండవులఁ జూచినారా? సుఖులై
వారందరు నొకచో ను
న్నారా? వీరాగ్ర గణ్యు నరు నెఱుఁ గుదురా?"

- విజయవిలాసము - 2 వ ఆశ్వా. ప. 163. (వావిళ్లప్రతి)

సుభద్ర, కపటసన్యాసి సమక్షమున చేసిన అర్జునుని రూప వర్ణన సుభద్రాకల్యాణమున నిట్లున్నది.

"ఎగు భుజమ్ములవాడు మృగరాజు నడుము
నడచి పుచ్చుకొను నెన్నడుము గలవాడు
గర గరని వాడు చక్కనివాడు నతడు
గొప్ప కన్నులవాడు కోదండ గుణకి
ణాంకంబులౌ బాహు లమరినవాడు
వెన్నున మచ్చగలఁ విభవంబు వాడు
బవిరి గడ్డమువాడు పన్నిదం బిడిన
వెన్ను పగడ సాల వెస నాడవచ్చు."

–పుట 34.

చేమకూర వేంకటకవి తన విజయవిలాసమున పైరచనను అనుసరించినతీరును గమనింపుడు.

"ఎగు బుజంబులవాఁడు మృగరాజ మధ్యంబు
పుడికి పుచ్చుకొను నెన్నడుము వాడు
నెఱి వెండ్రుకలవాడు నీలంపు నికరంపు
మెఱుఁగుఁ జామన చాయ మేనివాడు
గొప్ప కన్నులవాడు కోదండ గుణకిణాం
కములైన ముంజేతు లమరువాడు
బవిరి గడ్డమువాడు పన్నిదంబిడి డాఁగ
వచ్చు నందపు వెన్ను మచ్చ వాఁడు
గర గరనివాఁడు నవ్వు మొగంబువాడు
చూడఁ గలవాడు మేలైన సొబగువాఁడు
............................................"

– 2వ ఆశ్వా. ప. 164.

ఇచట నేవియో కొన్ని చిన్నచిన్న పదములు తప్ప తక్కినవర్ణనమంతయు అచ్చముగా తిమ్మక్క రచనమునే పోలియున్నది. చమత్కృతులకు, సొంపైన పదములకూర్పుకు, శబ్దాలంకారఘట

నకు ప్రసిద్ధిబడసిన చేమకూర వేంకట కవివంటివాడే తన విజయ విలాసమున పైవిధమున తిక్కన రచన ననుసరింపనిష్టపడెననిన దానివలననే తిక్కన రచనాప్రావీణ్యము విశదమగుచున్నది.

"సుభద్రాకల్యాణము ఆకారమున చిన్నదైనను గుణము నందు పెద్దది." [75] ఇందు సుమారు 1170 మంజరీద్విపద పంక్తులు గలవు.

## అష్టమహిషీకల్యాణము :

తాళ్లపాక చిన్నన్న (1498–1561) రచితమగు అష్ట మహిషీకల్యాణము 5 ఆశ్వాసముల ద్విపదకావ్యము. ఇది ముద్రితము. [76] ఇందుసుమారు 7365 ద్విపదపంక్తులుకలవు. అలమేల్మంగమ్మకు అంకితము.

హరివంశము, భాగవతము—ఇత్యాదులందు శ్రీకృష్ణుని అష్ట మహిషులచరిత్రకలదు. కృష్ణభక్తి, కథాగౌరవము—ఈరెండును చిన్నన్నను ఈ చతురశృంగార రసాత్మక రచనకు ప్రేరేపించినవి. శ్రీకృష్ణావతారము, శ్రీకృష్ణుని బాల్యక్రీడలు ప్రథమాశ్వాసముననను, కృష్ణలీలామాహాత్మ్యములు, గోపికలతోడి సరస సల్లాపములు ద్వితీయాశ్వాసముననను విపులముగా వివరింపబడినవి తృతీయాశ్వాసమున కంసవధ, జరాసంధ యుద్ధప్రకారము— ఇత్యాది కథాంశములు గలవు. చతుర్థాశ్వాసమున కృష్ణుని ప్రథమ పట్టమహిషియగు రుక్మిణీదేవి వివాహవృత్తాంతము వర్ణితము. పంచమాశ్వాసమున జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, సత్యకీర్తి, భద్ర, లక్ష్మణ—అనునీ ఏడుగురు పట్ట

75. చూ॥ సుభద్రాకల్యాణము–కావ్యము–సమీక్ష–జీ రెడ్డి చెన్నారెడ్డి

76. తిరుపతి దేవస్థానం ప్రచురణ, సం॥ 1937.

మహిషుల వివాహవృత్తాంతములు శృంగార రసోపేతముగ క్లుప్తముగ తెలుపబడినవి.

ఈ కావ్యమునందలి కవితావిశేషములు ముందు వివరింపబడును.

ఉషాకల్యాణము :

తాళ్ళపాక చిన్నన్న రచించిన మరొక కల్యాణకావ్యము ఉషాకల్యాణము. ఇది ముద్రితము.[77] పూర్వోత్తర భాగములుగా విభజింపబడి సుమారు 1970 ద్విపదపంక్తులుగల రచన యిది. అలివేలుమంగమ్మకు అంకితము. ఉషానిరుద్ధుల కలయిక, కారాగృహ వాసము పూర్వభాగమునను, బాణాసురకృష్ణుల యుద్ధము, శంకర పరాజయము, ఉషానిరుద్ధుల వివాహము ఉత్తరభాగమునను వర్ణింపబడినవి.

ఉషాకల్యాణద్విపదకు మాతృక సంస్కృత హరివంశోక్తమైన ఉషాపరిణయగాథ.

"హరివంశ మార్గోక్తమగు నుషాకన్య
కరమొప్ప బరిణయ క్రమమెట్టి దనిన."

అను గ్రంథావతారికలోని ద్విపదపంక్తులనుబట్టి తెలియును. ఉషాపరిణయగాథ భాగవతము దశమస్కంధ ఉత్తరభాగమునందును కలదు. కథాదృష్టితో పరిశీలించిన ద్విపద ఉషాకల్యాణము భాగవతకథనే ఎక్కువగ ననుకరించినట్లు తెలియుచున్నది.

హరివంశములో చిత్రలేఖ ఉషానిరుద్ధుల సమావేశమునకై దూత్యకృత్యము నెరపినట్లు కలదు. అనిరుద్ధుని సమ్మతిపైననే చిత్రలేఖ తన యోగమాయచే ఉషాకన్యకడ కతని చేర్చును. ఉషానిరుద్ధుల వివాహము గాంధర్వవిధిని జరుగును.

---

77. తిరుపతి తిరుమల దేవస్థానం ప్రచురణ. 1938 సం॥

వారు దంపతులై అంతఃపురమున సంచరించుచుండ కావలివారి వలన బాణుడు తెలిసికొని వారిని చెరసాలనుంచును. ఇది హరి వంశములోని కథాంశము.



భాగవతములోని కథ మరొకవిధముగ నున్నది. ఇందు చిత్రలేఖ దూత్యకృత్యము లేదు. నిద్రించుచుండు అనిరుద్ధుని చిత్రలేఖ తన యోగమాయచే ఉషాకన్య అంతఃపురమునకు చేర్చును. ఉషాకన్య అనిరుద్ధునికోరి అతనిని బలవంతముగ బడసి నట్లుమాత్రమే భాగవతమున కలదు. ఇందు ఉషానిరుద్ధుల గాంధర్వ పరిణయ ప్రశంస లేదు. అనిరుద్ధుడు కాముకుడుగా మాత్రమే భాగవతములో చిత్రింపబడినాడు. ఇందు ఉషాకన్యకు గర్భచిహ్నము లేర్పడిన తర్వాతగాని అక్కడివారు అంతఃపు రములోని అనిరుద్ధుని పసికట్టలేదు.

శివుడు తనభక్తుడగు బాణుని పక్షమున శ్రీకృష్ణునితో యుద్ధముచేయును. చివరకు శివుడు బ్రహ్మకోరికపై కృష్ణునితో యుద్ధముచేయక విరమించుకొనును. అపుడు పార్వతీదేవి బాణుని రక్షింపుమని కృష్ణుని కోరును. ఇది హరివంశమున కలదు. కాని భాగవతమున బాణునికి బాసటగావచ్చిన శివుడు కృష్ణునిచే నోడి నట్లును ఆమీదట తన వోటమినొప్పుకొని శివుడు శ్రీకృష్ణుని లీలా మాహాత్మ్యాదులను కీర్తించినట్లును కలదు. ఈ ఘట్టము వైష్ణవ మహిమ ప్రతిపాదకమగుటచే చిన్నన్న తన ద్విపద ఉషాకల్యాణ ములో గ్రహించెను. భాగవతములోని కథాంశములు విష్ణుమహి మాన్వితములుగ నుండుటవలననే వైష్ణవుడగు చిన్నన్న వానిని తన ద్విపద కావ్యమున గ్రహించెను.

సంస్కృత హరివంశములో అనిరుద్ధుడు కోటవతీదేవిని సుమారు 40 శ్లోకములలో స్తుతించి నాగపాశ బంధవిమోచను

డయ్యెనని కలదు, శైవమాహాత్మ్య ప్రతిపాదకమగు కోటవతీదేవి స్తుతి భాగవతమునవిస్మరింపబడినది. కాని వైష్ణవమాహాత్మ్యప్రతిపాదకముగ గరుత్మంతుని రాకచే సర్పబంధములు తొలగెనని నూతన కల్పనగావించినాడు చిన్నన్న.

ఉషాకల్యాణమును చంపువుగ దామెర్ల అంకభూపాలుడు (1600–30 A. D.), కైపామాయనకవి (1800 A. D) అనువారలు రచించిరి.

జాంబవతీకల్యాణము:

జాంబవతి శ్రీకృష్ణుని అష్టభార్యలలో నొకతె.

"కళాధరకవి కృతే జాంబవతే కల్యాణే ద్విపద ప్రబంధే–
వసుదేవ తనయుఁడు వాసుదేవునకు, బిస కుసుమేక్షణ ప్రీతిమై మ్రొక్కె."
అనునొకద్విపద 'ఆంధ్రకౌముది' అను లక్షణగ్రంథములో ఉదాహరింపబడినది. గ్రంథము అలభ్యము. కళాధరుడనునది బిరుదనామమై యుండునని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు అభిప్రాయపడిరి. 'బాలసరస్వతీయ చంద్రికాపరిణయాది బహుగ్రంథకర్తయగు ఎలకూచి వేంకటకృష్ణరాయుడు తాను 'బహుకళాధరుడ' నని చెప్పికొనెను (చూ॥ బాలసరస్వతీయ పీఠిక). పెమ్మసాని తిమ్మానాయుని కాలమున (క్రీ. శ. 1580–1610 A. D.) నుండిన ముడియము వేంకటరమణకవి 'కళాధరోపాఖ్యాన' మను ప్రబంధమును రచించెను. అతడు ఆ గ్రంథరచనముచే కళాధరుడని ప్రఖ్యాతి చెందెనేమో! అట్లయినచో నీగ్రంథకర్త వేంకటరమణకవియే యైయుండును." [78] ఈఅభిప్రాయమును నిడుదవోలు వేంకటరావుగారు తెల్పియున్నారు.

---

78. చూ॥ 'లక్షణ గ్రంథములు' – ఆంధ్రపత్రిక జయ సంవత్సరాది సంచిక. 1954 – 55

అభిమన్యుకల్యాణము లేక శశిరేఖాపరిణయము :

అభిమన్యు కల్యాణమను శృంగారరస ప్రధానమగు 5 ఉల్లాసముల ద్విపదకావ్యమును రచించినవాడు శేషము చెన్న భట్టారకుడు (1690 A. D.). ఇతడు వైష్ణవమతమును గూర్చి గ్రంథావతారికలో అధికముగా కీర్తించినాడు. శ్రీరాముని కృప వలన చిన్ననాడే ఇతడు కవిత్వమును బడసినాడట. "సరసులు మెచ్చంగ సభలఁ గీర్తింప విరచింతుఁగృతి రఘువీరాంకితముగ" అని గ్రంథారంభమున తెల్పినాడు. ఇతడు హరిభక్తుడు; వైష్ణవ మతాభినివేశముతో గ్రంథరచనచేసినట్లు ఈక్రింది ద్విపదపంక్తుల వలన వ్యక్తమగుచున్నది.

గ్రంథాంతము :—

"సరస రామ పదాబ్జ సక్త చిత్తుండు
పరమ వైష్ణవ దాస్య పరతంత్ర బుద్ధి
పావనంబుగఁ జెన్న భట్టారకుండు
గావించు నభిమన్యు కల్యాణ మనెడు
జయ మొప్పు కృతిలోన సర్వంబునిదియె
యయిదవ యుల్లాస మగుచుశోభిల్లి"

అర్జునుని పుత్రుడగు అభిమన్యుడు, బలరాముని పుత్రిక యగు శశిరేఖను పెండ్లియాడినకథ కావ్యేతివృత్తము. శశిరేఖా భిమన్యులు మేనమామ మేనత్తబిడ్డలు. తెలుగువారికి మేనరికము మేలయినది కదా!

అభిమన్యుకల్యాణము ముద్రితము.[79] ఇది సుగ్రహము, ధారాళము, హృద్యము నగు రీతిని రచితమైనది. ఈకథ భారత

79. కవిరంజనీ ముద్రాక్షరశాల - 1889 సం॥
పరిష్కర్త: వారణాసి సుబ్బరామశాస్త్రి

మందలిదే యైనను వర్ణిత విషయములన్నియు కల్పితములే. ఇంచుమించు 3250 ద్విపదలిందు గలవు.'' 80 అని సి. పి. బ్రౌనుకథా సంగ్రహాంతమున వ్రాసినట్లు కలదు.

శశిరేఖాభిమన్యుల సమాగమమును ప్రారంభమున చెన్నభట్టారకుడు చక్కగా నాటకీయరీతిని ప్రవేశపెట్టినాడు. శశిరేఖ తన పెంపుడుచిలుక అభిమన్యునికడనున్నట్లు తెలిసికొని, దానిని తనకిమ్మని అభిమన్యునిఅడుగుటతో సరససంభాషణము ప్రారంభమయినది. అభిమన్యుని చూడగానే శశిరేఖకు సిగ్గు మొగ్గలేసినది. తనతో గూడి విహరించుదువు రమ్మని అతడు కోరినపుడోడిగముతో నిట్లనినది:

"కులధర్మ మెఱిగి రాకూడునే నాకు
వావులెట్లున్నను వనజాతగంధు
వే వీట మగవారి నెదుట నిల్చెదరు
పూని మీరలు దప్ప పొలతుల నెచట
మేనత్త కొడుకులు మిగుల నాడెదరె
యిలమీద మీరున్న యలమావి దక్క
నిలవ నింకొక చోట నీడలు గలవె
యేజాడ లెరుగక యిటవచ్చి మీకు
చేజిక్కుటకు వెఱ్ఱి చిలుకనే నేను
యిటువంటి నిచ్చోటి కేతెంచు కతన
కటకటా ముకుద్రాట కాలు ద్రొవ్వెదరు
అమ్మక్క మిము బోటు లడవులలోన
కొమ్మల నరికట్టు కొన ధర్మమగునె."

- ప్రథమ భాగము - పుటలు 14-15.

---

80. No. 1022. Descriptive catalogue of Telugu Manuscripts in G. O. M. L. Madras.

అభిమన్యుడు ప్రణయ కోపము నటించి,

"బోటితో సల్లాపములు శేయుటెల్ల
నేటికి నెదురుగా నీదుట నిజము
మాని చింత ముహూర్త మాత్రంబు నిలువ
మానినీ మణులకు మాన భంగంబు
విపరీతముగ బల్క వెఱ్ఱినే నేను
నిపుణురాలవు గాన నెపములెన్నెదవు
రమ్ము బొమ్మని రాని రమణులు మీరు
నిమ్మాట లాడంగ నేమి ధర్మంబు
పల ధర్మములు మాకు గురుతు జూపెదవా
నెలత యీవలి వారు నీపాటి వారు
యలనాగ మొగమోట మేమియు లేక
ములుకు మాటల నన్ను ముంచివేశెదవు
యిది గాక మొగవారి నంటిన చిలుక
ముదిత నీవిక దీని ముట్టంగ రాదు."

పొమ్మనినాడు. దానికి శశిరేఖ మనస్సులో చాల బాధపడినది. చింతతో చేతులు మోడ్చి మన్నింపుమని ఇట్లు పల్కినది.

"ఏనన్న మాటల కెడబాసెనో మనసు
మేన బావవు గాన మేలమాడితిని
బాలత్వమున యేను బలికిన పలుకు
లాలింపుదురు గాక నాగ్రహించుదురె

........................................

నమ్మి యుండితి పిన్న నాటినుండియును
బొమ్మంచు విడనాడ బోలునే మీకు
గాజుల గుదికి రోకలి బూనినట్లు

రాజీవ ముఖుల దూరంగ నేమిటికి

.......................... ...............

పొలయక నన్ను నీ సొమ్ముగా దలచి
దలపు నందిన వేరు తలపకు డనిన."

— ప్రథమ భాగము — పుట 16.

ఈ మాటలచే అభిమన్యునికి కోపముపోయి తాపము హెచ్చినది. గాంధర్వపరిణయవిధికి నొడబడుమని అతడు ఆమెను కోరినాడు. కాని ఆమె నెమ్మదిగా ఆలోచించి, పెద్దలయాజ్ఞ యగు వరకు ఓపికపట్టుమని అతనిని కోరినది.

"తడవోర్వ లేమంచు తహతహ బడిన
పుడమిపై కార్యముల్ పొసగునే యకట
గుడ బాయసంబైన గుదిటపై నిడక
నుడుకు జుర్రిన నోట కొకరుచి గలదె
బంధువుల్ మనల గూర్పంగ నూహింప
గాంధర్వ కల్యాణ కాంక్ష యేమిటికి
వింతయే మనవారు పెండ్లియనంగ
నంతలో నిటులైన యాడికల్ గావె
యీచందమున మీర లెవరు లేనట్లు
రాచ కూతురి నేల రవ్వజేసెదరు
మదన మాంద్యమున భామలు నగబడిన
సుదతు లెవ్వరినైన చులక జూచెదరు."

— ప్రథమ భాగము — పుట 17.

ఇట్లు ఈసన్నివేశము సరస సంభాషణాత్మకముగ, లలితభావములతో, నాటకీయముగ, శృంగార రసపోషణాత్మకముగ నిర్వహింపబడినది. శశిరేఖ విరహతాపము, మన్మథ, చంద్రదూషణములు ప్రబంధములందువలె నిందును వర్ణింపబడినవి. నాయికా

నాయకుల వివాహానంతరము వారి శృంగార చేష్టలను ద్విపదకవి మనోహరముగ పెంచి వ్రాసినాడు.

చెన్న భట్టారకుని ద్విపద అభిమన్యు కల్యాణముననుసరించియే వీణె లక్ష్మీపతి నాల్గు ఆశ్వాసముల పద్యప్రబంధముగ అభిమన్యు కల్యాణమును రచించినాడు. (చూ॥ అముద్రిత ప్రతి, ఆర్. నెం. 381. ప్రా. భా. మద్రాసు.) తెలుగులో ఈ కథ బహుళజనాదరణ పాత్రమైనది.

రుక్మిణీ కల్యాణము:

రుక్మిణీకల్యాణ కథాభాగము భాగవతమునందొక కళాఖండము. రుక్మిణీదేవి శ్రీకృష్ణుని వివాహమాడినకథ యిందు శృంగారాత్మకముగ మనోహరముగ వర్ణింపబడినది. పోతనభాగవతములోని రుక్మిణీ కల్యాణఘట్టము బహుళ జనాదరణ పాత్రమైనది. దీనిననుసరించి 'రుక్మిణీకల్యాణ' మను పేర ద్విపదలో చౌదరి రామదాసు, చిన్నయ, యస్. లింగయ్య[81] అను వారు ప్రత్యేక కావ్యములుగా రచించిరి. చౌదరి రామదాసు కొలుచునూళ్ల గోత్రుడు. రాయప్ప పుత్రుడు. ఇతని రుక్మిణీకల్యాణమును గూర్చిన వివరములు తెలియవు.

పాటూరి చిన్నయ రుక్మిణీకల్యాణము[82] పోతన భాగవతములోని రుక్మిణీకల్యాణమునకు ద్విపదరూపమగు రచన.

రుక్మిణీకల్యాణము ద్విపదప్రతి ఒకటికలదు. (చూ॥ ఆర్. నెం. 200. A. T. C. MSS). ఈ అముద్రితప్రతి ఆద్యంతములు శిథిలము లగుటచే దీని కవి నామాదికములనుగూర్చి తెలియదు.

81. చూ॥ ఆ. వా. సూ. పుట 174.
82. చూ. ఆంధ్రా ముద్రిత గ్రంథ విషయానుక్రమణిక - ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - పుట 247 - సంపుటము 6. సంచిక 5.

రుక్మిణీకల్యాణము 'బ్రతుకమ్మపాట' అనుపేరుతో స్త్రీలు పాడుకొనుట కనువుగా తెలంగాణపు కవియగు కొండూరు నారాయణగుప్త వ్రాసినాడట.[83] ఈ కథనే 'చిలుకరాయబారము' అను పాటగా స్త్రీలు పాడుకొందురు.

భానుకల్యాణము :

భానుకల్యాణమను ద్విపదకావ్యమును రచించిన వాడు చంద్రశేఖరకవి. ఇతడు 'విశ్వకర్మాన్వయమున' జన్మించిన కిన్నెర బ్రహ్మావంశస్థుడు; ప్రమథయాచార్య పౌత్రుడు; కంచెర అయ్యగారి పుత్రుడు. ఈ ద్విపదకావ్యము అముద్రితము. (డి. నెం. 1176. ప్రా. భా. మద్రాసు.) ఇది శివార్పితము.

బ్రహ్మకూతురగు సంజ్ఞాదేవిని సూర్యుడు వివాహమాడిన కథ యిందలి ఇతివృత్తము. చంద్రశేఖరకవి ''ధీవరుల్ మెచ్చునట్లు'' నిపుణముగ, 'తేట ముద్దుమాటలతో' ఈ కావ్యమును రచించినట్లు గ్రంథారంభమున చెప్పికొనినాడు.

గంగావివాహము :

శైవులకు పరమప్రియములైన కథలలో గంగావివాహమొకటి. ఈ ద్విపదకావ్యమును శైవకవియును, జంగమకులమువాడును నగు చిత్తారు గంగాధరకవి (1823) రచించెను. గ్రంథము అముద్రితము. (చూ॥ ఆర్. నెం. 1040 (బి) ప్రా. భా. మద్రాసు). ఇది చరిచ కోడూరిపురమున వెలసిన రామేశ్వర స్వామి కంకితము.

గంగావివాహకథ స్కాందపురాణము నుండి గ్రహించినట్లు కవి తెల్పినాడు.

---

83. చూ॥ తెలుగు జానపదగేయ సాహిత్యము. పుట 135

"కరమొప్ప చిత్తూరు గంగాధరయ్య
విరచితంబుగ సర్వవేదోక్తమైన
స్కాందపురాణాది కథలనున్నట్టి
యాగంగ కల్యాణ మెవ్వరునైన"

—గ్రంథాంతమున

ఈ కావ్యములోని గంగ ఏలూరులోని జాలరికులమువారగు శంఖదేవునికి చక్రమదేవికిని పెంపుడు కుమార్తె. యౌవన వతియైన గంగ యొకనాడుద్యానవనమందుండగ శివుడు జంగమ వేషమున వచ్చి ఆమెను వలచి వలపింపజేసికొని వివాహమాడును. గంగాశివుల వివాహకథ మాత్రము స్కాందపురాణాంతర్గత కథననుసరించి రచించినదే కాని గంగాశివుల వివాహానంతర కథాభాగము మాత్రము దేశీయముగ నున్నది. గంగను వివాహమాడినందులకు శివునిపై పార్వతి కోపించి నిష్ఠురోక్తులాడును. శివపార్వతుల సంభాషణము, గంగాగౌరుల సపత్నీకలహమును దేశీయానుగుణముగ, రమణీయముగ, చమత్కారముగ కవి యిందు వర్ణించినాడు.

గంగా వివాహకథను కవిసార్వభౌముడగు కూచిమంచి తిమ్మకవి (1756 A.D.) 2 ఆశ్వాసముల చంపువుగ రచించినాడు. గంగా వివాహ కథనే 'హరిహరీ పదాలను' పేరుతో పసగాడ సన్యాసకవి జానపదులు పాడుకొనుట కనువుగ రచించెను.

## ద్రౌపదీ స్వయంవరము

వీరభద్రుడను కవి 3 ఆశ్వాసముల ద్విపదకావ్యముగా 'ద్రౌపదీ స్వయంవరము'ను రచించినట్లు తెలియుచున్నది. వీరభద్రుడు వదనూరి పురహర నివాసి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు 'నన్నయ్య భట్టువంశపు కవి— గోపాలుని రామ

కవి [84] అను వ్యాసము నందు ఒకానొక ప్రతిలో ఈ ద్విపద కావ్యముకూడ చేర్చి వ్రాయబడినదని తెల్పుచు ఇందలి కృత్యవతరణికలోని కొంతభాగము నిచ్చియున్నాడు.

5. క్షేత్రమాహాత్మ్యములు :—

తెలుగులో క్షేత్రమాహాత్మ్యములు ఒక సాహిత్యప్రక్రియగా పరిగణింపబడుచున్నవి. స్థలపురాణములనే క్షేత్రమాహాత్మ్యము లందురు. రసభావ నిర్భరమైన భక్తి, స్వభావోక్తి సుభగములైన ఆయా క్షేత్రములకు సంబంధించిన వర్ణనలు, ఆయా క్షేత్రములలో వెలసిన దైవమాహాత్మ్యములు -- వానికి సంబంధించిన ఉపాఖ్యానములు మొదలగునవి క్షేత్రమాహాత్మ్య గ్రంథములలో విశిష్టముగా గోచరించుచుండును. ఈ క్షేత్రమాహాత్మ్య గ్రంథములందు ఫలసిద్ధి విహితముగా నుండును. వీనిని రచించిన కవులును మహాభక్తులు. వారి భక్తి ప్రపత్తులు, ఆత్మీయత ఈ గ్రంథములలో ప్రతిబింబితమై యుండును.

క్షేత్రతీర్థ మాహాత్మ్యములు చాలవరకు బ్రహ్మాండ, స్కాందాది పురాణములనుండియే పుట్టినవి. బాహ్యదృష్టికవి పురాణములవలె భాసించుచుండును. కాని పురాణధర్మమిందు గాణము. "పురాణములు కథకొఱకు పుట్టినట్లుండును. కాని స్థలపురాణములు కవికొఱకు పుట్టినట్లుండును." [85] క్షేత్రమాహాత్మ్య గ్రంథములలోని ఉపాఖ్యానములు ప్రధానకథకు పోషకములై కథాకథన చాతుర్యముతో, శిల్ప వైదగ్ధ్యముతో నొప్పారుచుండును. ఈ ఉపాఖ్యానములు కథాశ్రవణ ప్రవణమైన జనాభి

---

84. చూ॥ ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 1919 సం॥

85. చూ॥ మనస్థలపురాణములు - సప్తతంతువు (సాహిత్యవ్యాసముల సంపుటి) — డా॥ యస్వీ జోగారావు.

రుచిని కొంతవరకు సంరక్షించుటచే ఇవి ప్రబంధముల కంటెను మిన్నయనదగు గౌరవమును బడసినవి. (ఉదా:- పాండురంగ మాహాత్మ్యము, కాళహస్తి మాహాత్మ్యము మున్నగునవి.)

జనసామాన్యమున విపులప్రచారము చేయు నుద్దేశ్యముతో ద్విపదలో రచితమైన క్షేత్ర మాహాత్మ్య గ్రంథములివి.

(1) నృసింహాపురాణము (అలభ్యము) -

ప్రోలుగంటి చెన్నశౌరి (15 శతాబ్ది ఉత్తరార్ధము).

(2) కాశీఖండము (అలభ్యము)-కంచర్ల అయ్యన్న (1500A. D.)

(3) ,, (అలభ్యము)- మోచర్ల నన్నయ (1650 A. D.)

(4) చొక్కనాథచరిత్ర (ముద్రితము) -

పచ్చకప్పూరపు తిరువేంగళకవి (1540 A. D.)

(5) శ్రీరంగమాహాత్మ్యము (అముద్రితము) -

ముకుందయోగి (1560 A. D.)

(6) ,, -కవిపేరు తెలియదు.

(7) శ్రీనివాసవిలాస సేవధి (ముద్రితము)-

శ్రేష్టలూరి వేంకటాచార్యుడు (17 శతాబ్ది)

(8) సురాభాండేశ్వరము (అముద్రితము) - పులిగడ్డనారన

(9) ,, (అముద్రితము) రావులపురము గురవయ్య

(10) ఏకవీరామాహాత్మ్యము (అముద్రితము)-

బడగలపాటి నరసకవి (1740 A. D.)

(11) కొలిపాకమాహాత్మ్యము (అముద్రితము) -

చిత్తూరు గంగాధరకవి (1823 A. D.)

(12) పినాకినీమాహాత్మ్యము (ముద్రితము) -

లక్ష్మీనృసింహ గోవిందసోమయాజి.

పై ద్విపద క్షేత్రమాహాత్మ్యములలో 2, 3, 4, 8, 9,

11-నెంబర్లు గలవి శైవ సంబంధములు. 'ఏకవీరామాహాత్మ్యము' దేవీమాహాత్మ్య ప్రతిపాదకము. మిగిలినవి వైష్ణవమహిమ ప్రబోధకములు.

## నృసింహపురాణము

బ్రహ్మాండ పురాణాంతర్గతమగు అహోబల క్షేత్రమాహాత్మ్యకథను 'నృసింహపురాణ' మను పేర ప్రోలుగంటి చెన్నశౌరి (15 శతాబ్ది ఉత్తరార్థము) ద్విపదలో రచించినట్లు హరిభట్టు పద్య నృసింహపురాణావతారికను బట్టి తెలియుచున్నది.

"ద్విపదగా నారసింహపురాణ మొనరించి భక్తి నహోబల భర్తకిచ్చె" అని హరిభట్టు చెన్నశౌరిని గూర్చి తెలిపెను. ద్విపద నృసింహపురాణము అలభ్యము. అహోబల క్షేత్రమాహాత్మ్యమిందు కలదని చెప్పుటచే దీనిని 'పౌరాణికముల' లో గాక క్షేత్రమాహాత్మ్యములలోనే చేర్చుట యుక్తము.

## కాశీఖండము:

సంస్కృత స్కాందపురాణమునందలి ఖండములలో కాశీఖండ మొకటి. కాశీక్షేత్ర మాహాత్మ్యమిందు ప్రతిపాదింపబడి యుండుటచే దీనిని క్షేత్రమాహాత్మ్యముగ పరిగణింపవచ్చును.

కాశీఖండమును ద్విపదలో కంచర్ల అయ్యన్న (1500A.D.) రచించినట్లు కంచర్ల శరభకవి తన 'అధ్యాత్మ రామాయణము' (అముద్రితము. ఆర్. నెం. 313. ప్రా. భా. మద్రాసు) నందు తన తాతయగు అయ్యన్ననుగూర్చి తెలుపుచు చెప్పినాడు.

"చెలువు మెఱయ కాశీఖండ మెలమి ద్విపదఁ జేసి కంచర్ల అయ్యన్న శ్రీలుప్రబల". ద్విపదకాశీఖండము అలభ్యము.

మోచర్ల అన్నయ (1650 A. D.) కూడ కాశీఖండమును ద్విపదలో రచించినట్లు తెలియుచున్నది. "కాశీఖండము

వేడ్కతో ద్విపదగావించి నేనిచ్చితిన్, వాసిన్మీఱ నరాంకితము గను దానన్ లాభ మేమంచు'' అని మోచర్ల అన్నయ తన సాంబోపాఖ్యానము (అముద్రితము. ఆర్. నెం. 495. ప్రా. భా. మద్రాసు) నందు పేర్కొనెను. ఇదియును అలభ్యమే.

చొక్కనాథ చరిత్ర :

చొక్కనాథచరిత్రకు చొక్కనాథ విలాసమని, చొమక్షి లీలావిలాసమని, మధురా పురాణమని నామాంతరములు. దక్షిణ మధురలో వెలసిన ఈశ్వరునికే చొక్కనాథుడని, హాలాస్య నాథుడని, సుందరేశ్వరుడని పేర్లు. మధురలో వెలసిన సుంద రేశ్వరుని మాహాత్మ్యలీలలు ఈ గ్రంథమునందు వర్ణింపబడి యుండుటచే దీనిని క్షేత్రమాహాత్మ్య గ్రంథముగా పరిగణింప వచ్చును.

చొక్కనాథ చరిత్రను పచ్చకప్పురపు తిరువేంగళకవి (1540 A. D.)సంస్కృత హాలాస్యమాహాత్మ్యమునందలి మధురా ఖండము ననుసరించి 9 ఆశ్వాసముల ద్విపదగ్రంథముగా రచించి నాడు. గ్రంథము ముద్రితము.[86] పరమశివుడు మీనాక్షీదేవిని వరించి పాండ్యరాజగు మలయధ్వజునకు నిల్లటపుటల్లుడై మధురా ప్రజలను పునీతులనుజేసిన పుణ్యకథ యిందు వర్ణింపబడినది. మధురలో వెలసిన సుందరేశ్వరుడు యుగమునకు పదునారు చొప్పున నాల్గుయుగములయందు అరువదినాలుగు లీలలను నెర పిన కథలిందు తెలుపబడినవి. ఈ 64 లీలలందును చొక్కనాథుని సేవించి తరించినవారి కథలు వర్ణితములు. కథావస్తువు తమిళ దేశమునకు సంబంధించినదగుటచే కథాపాత్రలలో ''ముమ్మొల

---

86. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత భాండాగారమువారి ప్రచురణ నెం. 35. 1954 సం॥

త్తాయి''- మున్నగు తమిళ పేర్లు కన్పట్టుచుండును.

గ్రంథారంభమున కవి చొక్కనాథుని 64 లీలలను సంగ్రహముగా తెల్పినాడు.

"ఇది సత్య మిది నిత్య మిది ముక్తి మార్గ
మిది సిద్ధ మిది శుద్ధ మిది చోద్యము" ని

తిరువేంగళకవి చొక్కనాథచరిత్రను గూర్చి పేర్కొనినాడు.

17 వ లీలలో రత్నములను గూర్చి, 31 వ లీలలో గాజుల రకములను గూర్చి, 41 వ లీలలో సంగీతశాస్త్ర ప్రశంస, రాగ భేదములు, సూళాదిగీత ప్రబంధములను గూర్చి విపులముగా వర్ణింపబడినది.

గాజులసెట్టి వేషముతో మధురలోని వైశ్యవీథులందు తిరుగాడు పరమశివుని వర్ణన:—

"చొక్కనాయకుడు గాజులసెట్టియగుచు
జక్కగా ముతుక వేషము తోడఁజల్లి
పట్టు సూత్రఁపు ద్రాళ్లు పైఁడుంగరములు
బెట్టు బసవనిఁ జేసి పెట్టిన ముద్ర
పట్టు వస్త్రము గూర్చి బాగుగా బిగియఁ
గట్టిన దేవుండు కంఠాన నమర
నొసలను విభూతి నునుపుగాఁ దీర్చి
రొసపరి పెండి కట్టొరపుగాఁ బెట్టి
సన్నపు రుద్రాక్ష సరములు వైచి
వన్నె మీఱఁగను ధోవతి కట్టు గట్టి
పైమించు గజము పప్పళి పచ్చడంబు
వామాంగమున వల్లెవాటుగా వైచి
నెతి మించు తలపాగ నేర్పుగాఁ జుట్టి
కర మొప్ప వ్రేళ్ల నుంగరములు వెట్టి
భుజములపై గాజుల పొది చాలఁబెట్టి."

— చొక్కనాథచరిత్రము — 5 వ అశ్వా, పుట 161.

పై వర్ణన కవియొక్క నిశిత పరిశీలనకు రూపచిత్రణకు తార్కాణమగుచున్నది.

చొక్కనాథ మువ్మెలత్తాయిల వివాహమును తిరువేంగళ కవి చక్కని జాతీయోక్తులతో, సొగసైన దేశీయాచార వర్ణనలతో సర్వజన సామాన్యముగ, మనోహరముగ వర్ణించినాడు.

చొక్కనాథ చరిత్రమందు కథావస్తుగత మాధుర్యము; కథా వైచిత్యమును జనసామాన్యము నాకర్షించును. రచన సుబోధకము. ఇది లక్షణయుక్తముగ రచింపబడినది.

"పద సంధు లర్థముల్ ప్రాసంబు యతులు
సదిలమై లక్షణ ప్రామాణ్యముగను
గల్పాంతర స్థాయిగా మించి వెలయఁ
గల్పింతు."

నని కవి గ్రంథావతారికలో తెల్పినాడు.

తిరువేంగళకవి అనంతరము చొక్కనాథచరిత్రము నాధారముగ చేసికొని మల్లంపల్లి బుచ్చికవి, తిరుమలసెట్టి జగన్నాథ కవి-మొదలగువారు చంపూకావ్యములుగ రచించిరి. కళువె నంజరాజు దీనిని వచనముగ చేసెను. సంస్కృతమున నీలకంఠ దీక్షితులు దీనిని 22 సర్గలలో 'శివలీలార్ణవ' మనుపేర సర్గబంధముగా సంఘటించినాడు.

## శ్రీరంగమాహాత్మ్యము :

శ్రీరంగ మాహాత్మ్యమును ద్విపదలో రచించిన వాడు ముకుందయోగి (1560 A. D.). ఇతడు కందాళ అప్పలాచార్య శిష్యుడు. కందాళమువారు శ్రీ వైష్ణవులు.

చిరుచునాపల్లి జిల్లాలోని శ్రీరంగము వైష్ణవుల కాది పీఠము. శ్రీరంగమున వెలసిన శ్రీ రంగనాథుని మాహాత్మ్య

ములు ఇందు 10 అధ్యాయములలో వర్ణింపబడినవి. ముకుంద యోగి ద్విపద శ్రీరంగమాహాత్మ్యము అముద్రితము.[87] ఇది శ్రీరంగేశ్వరుని కంకితము. ఇందలి కథను మహాదేవుడు నారదునికి చెప్పినట్లు కలదు.

శ్రీరంగమాహాత్మ్యము గరుడపురాణమున 100 అధ్యాయములలోను, బ్రహ్మాండపురాణమున 9 అధ్యాయములలోను వర్ణింపబడి యున్నది. ముకుందయోగి, బ్రహ్మాండ పురాణములోని శ్రీరంగమాహాత్మ్య వర్ణననుసరించియే తన ద్విపదకావ్యమును రచించినాడు. ఇందు వైష్ణవతత్త్వము విపులముగా చర్చింపబడినది. శ్రీవైష్ణవులు ఈ గ్రంథమును పవిత్రముగా భావించి ఆదరముతో పఠింతురు.

ముకుందయోగి శ్రీరంగమాహాత్మ్యము కాక ఇంకొక ద్విపద శ్రీరంగమాహాత్మ్యము మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు కలదు. (చూ॥ ఆర్. నెం. 1016 (డి) అసమగ్రము). గ్రంథావతారికలేమిచే గ్రంథకర్తపేరు తెలియదు. ఇందు 6 అధ్యాయములును, 7 వ అధ్యాయములో కొంతభాగము కలవు..

భైరవకవి (15 శతాబ్ది), కట్టా వరదరాజు (1630 A. D.) అనువారు శ్రీరంగమాహాత్మ్యమును పద్యకావ్యములుగా రచించినారు. కాని వీరి శ్రీరంగమాహాత్మ్యములు గరుడపురాణమునందలి శ్రీరంగమాహాత్మ్య వర్ణన ననుసరించినవి. బ్రహ్మాండపురాణములోని శ్రీరంగమాహాత్మ్యము ననుసరించి భాగవతుల రామయకవి, గుంటుపల్లి జగన్నాథకవి – మున్నగువారు పద్యకావ్యము

87. (a) సంఖ్య 1017 (డి) ప్రా. భా. మద్రాసు.
(b) 362, 363 (సమ) - తంజావూరు సరస్వతిమహల్ లైబ్రరీ.

లుగా రచించినారు. శ్రీగిరికవికూడ శ్రీరంగ మాహాత్మ్యమును పద్యకావ్యముగా రచించినాడు.

శ్రీనివాసవిలాససేవధి :

ఇది వెంకటాచల మాహాత్మ్యమును, అందు వెలసిన శ్రీనివాసుని విలాసములను, విహారలీలలను వర్ణించు 6 ఆశ్వాసముల ద్విపదకావ్యము. ఇది ముద్రితము.[88] దీనినిరచించినవాడు శ్రేష్ట లూరి వేంకటాచార్యుడు (17 శతాబ్ది). ఇతడు వాధూల అప్పలాచార్యుని శిష్యుడు. కృతిపతియగు వేంకటేశ్వరుని ప్రాకృత, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికోక్తి, భాండీరల – అను షడ్విధ ప్రాకృతములలో ఇతడు స్తోత్రము చేసినాడు.

"ధరసంస్కృత ప్రాకృత ముఖభాషలను
ద్రవిడాంధ్రముల ప్రబంధము వెన్నియైన
నవరించితివి"

అను గ్రంథావతారికలోని ద్విపద పంక్తులను బట్టియు.

"అష్ట భాషా కవితార్జిత ప్రౌఢ్య
దష్టావధాన విఖ్యాత భైరవుడు"

అని గ్రంథాంత ద్విపదనుబట్టి వేంకటాచార్యుడు బహుభాషా పండితుడని తెలియుచున్నది.

వేంకటాచలపతి కథలను వరాహ, వామన, బ్రహ్మాండ, పాద్మ, గారుడ, స్కాంద, మార్కండేయ – మున్నగు పురాణములనుండి వేంకటాచార్యుడు సంగ్రహించి పునరుక్తములగు కథలను పరిహరించి, సక్రమపద్ధతిలో, సర్వసమాధానముగా, బంధుర రససంగతుల ఒక కావ్యముగా రచించినాడు. ఈ ద్విపద కావ్యము

---

88. శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ప్రచురణ నెం. 47.
పరిష్కర్త: కోరాడ రామకృష్ణయ్య.

మొదటి మూడా శ్వాసములలో వేంకటాచలక్షేత్ర, తీర్థదైవములతో మూడు యుగములందలి కథలు ముడిపెట్టి రచింపబడినది. ఇందలి ఆదివరాహ కథ కృతయుగమునకు సంబంధించినది. దీనికి మూలము వరాహపురాణము. ఆదివరాహమూర్తి యగు విష్ణువే సౌమ్యరూపము ధరించి శ్రీనివాసుడై వెలసెను. విష్ణువు వైకుంఠము నుండి గరుడునిచే తెప్పించిన రత్ననగరాజమే వేంకటాచలము. ఈ కథ పాద్మ, గారుడ, పురాణములలో తెలుపబడినది. ప్రథమాశ్వాసములోని శంఖణుడను చంద్రవంశపు రాజు కథలో శ్రీనివాసమూర్తి ప్రభావము, వేంకటాచలస్థల తీర్థముల మహిమ తెలుపబడినది.

ద్వితీయాశ్వాసములోని ఆత్మారాముని కథాసందర్భమున వేంకటాద్రి ప్రభావము అందలి పదునేడు తీర్థముల మాహాత్మ్యములు తెలుపబడినది. రామలక్ష్మణులు రావణుని సంహరింపబోవుచు వేంకటాద్రికి వచ్చి స్వామి పుష్కరిణియందు స్నానము చేసినట్లు తెలుపబడినది. ఇది రెండవ యుగమునకు సంబంధించిన కథ. ఇట్లే పాండవులు అరణ్యావాస సందర్భమున శ్రీనివాసాచల శిఖరమున నొక సంవత్సరముండి తపస్సు చేసినట్లు ఇందలి 3-వ ఆశ్వాసమున కలదు. ఇది మూడవ యుగమునకు సంబంధించిన కథ.

వేంకటాచల మందలి తీర్థాదుల మహిమలు, వానికి సంబంధించిన కంథాశములు చతుర్థాశ్వాసమున కలవు. వీనికి మూలము బ్రహ్మాండ వామనపురాణములు.

వేంకటాద్రికి వివిధ నామములు కల్గుటకు గల హేతువులను ఉపాఖ్యానముల మూలమున బ్రహ్మాండ పురాణమునుబట్టి అయిదవ ఆశ్వాసమున వర్ణింపబడినది. ఇందు శ్రీనివాసుడు పద్మినిని

(ఈ పాత్రకు పద్మిని యని పేరేకాని పద్మావతి యనిపేరు ఈ గ్రంథమున లేదు.) పరిణయ మాడుటను కవి విపులముగా వర్ణించినాడు.

ఆరవ ఆశ్వాసమున కలియుగమున స్వామి అర్చాకృతి, శ్రీనివాసుడై వేంకటాచలమున వెలసిన రీతిని భవిష్యత్పురాణము నాధారముగ రచింపబడినది.

వేంకటగిరి పాపై కదాహమను నర్థమును వ్యక్తము చేయుటకు మాధవసోమయాజి యను బ్రాహ్మణకుమారుని కథ చతుర్థాశ్వాసములో తెలుపబడినది. ఇది తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్యము నందలి నిగమశర్మ కథను బోలి యున్నది. గ్రంథాంతమున ఫలసిద్ధి కలదు.

ఇట్లు బహుపురాణములలో నుండి గహనమై యున్న శ్రీనివాసుని కథలను, వేంకటాద్రి మాహాత్మ్యమును పునరుక్తి దోషమును పరిహరించి ప్రబంధధోరణిలో రసభావబంధురముగ, ప్రౌఢవర్ణనలతో వేంకటార్యుడు వర్ణించినాడు. ఇతని కవిత ముందు వివరింపబడును.

దామెర చిన వెంకటరాయడు, చెళ్లపిళ్ల నరసకవి, తరిగొండ వెంగమాంబ — మొదలగువారు వేంకటాచలమాహాత్మ్య కథలను పద్యకావ్యములుగా రచించిరి. కాని వీరందరును వేంకటాచార్యున కర్వాచీనులే.

సురాభాండేశ్వరము :

సురాభాండేశ్వరము శివకథా ప్రతిపాదకము. స్కాంద పురాణాంతర్గతమగు కాశీఖండములోని సురాభాండేశ్వర కథ ననుసరించి రావులపురము గురవయ్య, పులిగడ్డ నారన (18

శతాబ్ది) అనువారు ప్రత్యేక ద్విపదకావ్యములుగ రచించిరి. గురవయ్య ద్విపద సురాభాండేశ్వరము అముద్రితము. (చూ॥ డి. 1207 (సమ) ప్రా. భా. మద్రాసు. వ్రాతప్రతి). సురాభాండములో అవతరించిన ఈశ్వరునికథ కాశికామాహాత్మ్య ప్రతిపాదకముగా నిందు వర్ణింపబడినది. గ్రంథారంభమున కాశికా నగరవర్ణన విపులముగా కలదు. ఒక భక్తురాలిని పరీక్షించుటకై శివుడు, బ్రహ్మచారియై, ఆమెను కామించి, లజ్జావిహీనుడై యొక కల్లుకుండలో మునిగిపోయి చివరకు శివలింగరూపమైన కథ యిందువీరశైవ మాహాత్మ్య ప్రతిపాదకముగ తెలుపబడినది. ఈద్విపదగ్రంథమున కథాసందర్భమున నించుమించు 220 ద్విపదలలో కామశాస్త్రమునకు సంబంధించినవిషయములు విపులముగ వివరింపబడినవి. గురవయ్య రచనను తెలిసికొనుటకొక ఉదాహరణము:

బ్రహ్మచారివేషముననున్న శివుడు గమళ్ళవనితను చూచి తనలోనిట్లు చింతించెను.

"ఈ చన్ను లీ కన్ను లీ చెల్వమైన
యీ తళ్కు లీచెళ్కు లీచెళ్కు చూపు
యీ తెంపు లీసొంపు లీయొయారంబు
యీ కురు లీకేలు లీనడకలీరు
లీకాను లీగాను నెంచనరూరి
లీవన్నె లీచిన్నె లీచిన్నపాయ
మే విన్నదే కన్న దేమియు గాదు."

పులిగడ్డ నారన (18 శతాబ్ది) ద్విపదసురాభాండేశ్వరము కూడ నముద్రితమే. (సంఖ్య డి. 1208. ప్రా. భా. మద్రాసు). ఈశ్వరుడు గమళ్లవారి యింట సురాభాండేశ్వరుడై వెలయుట యిందలి ప్రధానేతివృత్తము. కాశిలోగల కోటిలింగములలో

అధికుడై, భక్తులసేవలుకొనుచు, సురాభాండేశ్వరుడై వెలసెను. ఈ సురాభాండేశమాహాత్మ్యము ఈద్విపదకావ్యములందు వర్ణిత మగుటచే వీనిని క్షేత్రమాహాత్మ్యములుగ పరిగణింపవచ్చును.

నింబజామాహాత్మ్యము లేక ఏకవీరామాహాత్మ్యము:

ఇందు ఏకవీరాదేవి మాహాత్మ్యము వర్ణితమగుటచే దీనిని క్షేత్రమాహాత్మ్యములలో చేర్పవచ్చును. నింబజా మాహాత్మ్య మను 5 ఆశ్వాసముల ద్విపదగ్రంథమును రచించినవాడు బడగల పాటి నరసకవి (1740). ఇతడు దీనిని మన్నారుజెట్టి ప్రేరణమున ధేనువాళము గరిడిలో వెలసిన రఘురాముని కంకితము చేసెను. మన్నారుజెట్టి ధేనువాళము గరిడి కధ్యక్షుడు. అతడు దేవమల్లు కులములో విశ్వామిత్ర గోత్రము, ఋక్శాఖ, అశ్వలాయన సూత్రమువాడు. కనుకనే అతడు నరసకవిని తనవంశమువాడగు దేవమల్లుని కథను, దేవీమాహాత్మ్యమును ప్రత్యేక శాఖలుగా విభజించి వ్రాయుమని చెప్పినాడు.

నింబజామాహాత్మ్యము అముద్రితము. దీనిప్రతి తంజా వూరు సరస్వతీమహల్ లైబ్రరీయందు (ఆర్. నెం. 303 (అస మగ్రము) కలదు.

ఈగ్రంథ పంచమాశ్వాసాంత్యమునందు,

"రమణమా నేక వీరామాహాత్మ్యమున
హామణు మీరిన పంచ మాశ్వాసమయ్యె"

అని 'ఏకవీరామాహాత్మ్యము' అని పేర్కొనబడినది. కాని తక్కిన ఆశ్వాసాంత ద్విపదలలోను, గ్రంథము మధ్య అచ్చటచ్చటను 'నింబజామాహాత్మ్యము' నియే యున్నది.

ఇది బ్రహ్మాండ పురాణాంతర్గతమగు కథ ననుసరించినది. ఇందు దేవమల్లుని కథ, దేవి మాహాత్మ్యమును ప్రత్యేక శాఖ

లుగా విభాగించి ద్విపదలలో వివరింపబడినది.

ఇందలి రచన సరళమైనది. కాని దోషములు మెండు.

### కొ లి పా క మా హా త్మ్య ము :

కొలిపాకమాహాత్మ్యమను ద్విపదగ్రంథమును చిత్తారు గంగాధరకవి (1823 A. D.) రచించెనని గోలకొండకవుల సంచిక (పుట 397) అందు కలదు. ఇది శైవ సంబంధమైనది. కొలిపాక శైవులకురాజధాని. పశ్చిమ చాళుక్యరాజయిన సింహబల్లహుని రాజ్యస్థానములలో నీ కొలిపాక యొక పట్టణము. ఇది తెలంగాణాయందు కలదు. సుప్రసిద్ధ శైవాచార్యుడగు వేవణసిద్ధుని జన్మస్థానము ఈ కొలిపాకయే. కొలిపాక శైవపీఠముగా ప్రసిద్ధిగాంచినది. కొలిపాకలో పోతపోసిన కంచు గంటలను జంగములు దాల్చుచుండెడివారని చిత్తారు గంగాధరకవి తన ద్విపద భల్లాణచరిత్ర (పుట 11) లో తెల్పినాడు.

శైవ క్షేత్రమగు కొలిపాకమాహాత్మ్యమిందు వర్ణితమగుటచే దీనిని క్షేత్రమాహాత్మ్యముగనే పరిగణింపవచ్చును.

### పి నా కి నీ మా హా త్మ్య ము :

శివుని అంశమునుండి జన్మించిన పంచనదులలో పినాకిని నది ఒకటి. ఇది శివుని చాపమునుండి జన్మించినది. ఈ పినాకినీ మాహాత్మ్యమును 8 ఆశ్వాసముల ద్విపదగ్రంథముగా లక్ష్మీ నృసింహ గోవిందసోమయాజి రచించెను. ఇతడు సుబ్రహ్మణ్యా ఓబులాంబలకు పుత్రుడు.

ఈ ద్విపదగ్రంథము ముద్రితము. [89] బ్రహ్మాండపురాణములోని తీర్థమాహాత్మ్యకథల ననుసరించి ఈ ద్విపదగ్రంథమునందలి

---

89. శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాల - మద్రాసు 1908. పరిష్కృతము: ముత్యాల నారసింహయోగీంద్రుడు.

తీర్థమాహాత్మ్యకథలు విపులముగా 'ఆంధ్ర సూక్తుల నలరి పామరులకు తేటపడునట్లుగ' వర్ణింపబడినవి. గంగ, గోదావరి, కృష్ణవేణి మున్నగు నదీమాహాత్మ్యకథలు, చక్కని ఉపాఖ్యానములతో జోడింపబడి ప్రథమాశ్వాసమున వర్ణింపబడినవి. కామాంధుడను బ్రాహ్మణుడు స్వధర్మములను వదలి అకృత్యములాచరించినను గంగాజల బిందువులను గ్రోలుటచే పాపవిముక్తుడయ్యెనని యిందు తెలుపబడినది. ఇట్లే నందసుమాలి యను విప్రాంగన చండాలుని గూడి అపవిత్రయైనను గోదావరినీట స్నానమాడుటచే బ్రహ్మలోకప్రాప్తిని బడసినది. సుబంధుడను విప్రుడు గోహత్యా దోషమును బాపుకొనినకథ కృష్ణవేణీ మాహాత్మ్యమును వెల్లడిచేయును.

పినాకినీ మాహాత్మ్యమును గూర్చి వసిష్ఠుడు నిమిచక్రవర్తి కిట్లు చెప్పెను.

> "పాపంబులనియెడు బహు యరణ్యముల
> నేపు మాపగ నోప నిది యనలంబు
> జనన మరణముల జడధికి నౌర్వ
> మనదగి శివు చాపమందు జనించి
> వర పినాకిని సమాహ్వాయమంది ముక్తి
> సరణిని దెల్పెడి సామర్థ్య మమరి
> దుర్గమ మైనట్టి దోషసంసర్గ
> మార్గంబులను బాపి మహిమ నొసంగ
> గలదీ పినాకిని కౌశల మరయ
> నిల నీ ధునిని బోలదే నదియైన."

—ప్రథమాశ్వాసము. పుట 19.

పినాకినిలో స్నానముచేయుటచే నిర్మలుడను విప్రుడు గురుద్రోహదోషము బాపుకొనుట, అగస్త్యముని శాపమువలన ఉదరము పగిలిన వినాయకుడు వ్రణము మాన్పుకొనుట, మేధావి,

కుష్ఠువ్యాధి నిర్ముక్తుడగుట — మున్నగుకథలు పినాకిని నదీమాహాత్మ్యమును వెల్లడించుచున్నవి.

పినాకినిలో కలియు తీర్థముల, నదుల మహిమ, తీర్థస్నాన విధులు, వర్ణాశ్రమ ధర్మనియమములు, మహానదులకు అధిదేవతల విమర్శలు — మున్నగు కథాంశములు 4, 5, 6 - ఆశ్వాసములలో వివరింపబడినవి. సప్తమాశ్వాసమున శివభక్తుడగు కత్యయను చరిత్రముకలదు. కత్యయనునకు శివునివరమువలన 'కాత్యాయని' యను పుత్రిక జన్మించినది. ఈ కాత్యాయని శివుని విభునిగా కోరి పినాకినీ తీరమున శివునిగూర్చి తపస్సుచేయుట, శివుడు వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చి కాత్యాయనిని భ్రమింపజేసి, చివరకు వరమిచ్చుట, కాత్యాయినీ పరమేశ్వరుల వివాహము, పినాకిని సాగరములో సంగమించుట, నిమిమహారాజు శివసాయుజ్యము నొందుట - ఇత్యాది కథాంశములు అష్టమాశ్వాసమున వర్ణింపబడినవి.

గోవిందసోమయాజిరచన దేశీయానుగుణముగ పామరజన సుబోధకముగ; తేట తెలుగు పల్కులతో నొప్పియుండును. కాత్యాయిని బాల్యక్రీడలను కవి యెంత సహజముగా వర్ణించినాడో తిలకింపుడు.

"యీ చిన్ని బాలలు యమ్మమ్మ యనుచు
హుంకారముల చేత హొాయలుల చేత
సంకేతముల చేత సౌజ్ఞల చేత
భావ లక్షణ పరిభవ లీల లెలమి
సావధానముగ సత్సంచార గతుల
సారెప నత్తత్త సరియన్న యన్న
వారు వీరను సౌజ్ఞ వరుసదల్చకను
.......................... ...............

అమ్మ అమ్మ యటంచు నతిప్రేమ బిలుచు
రమ్మ రమ్మని బిల్వ రంజిల్ల నురుకు
బువ్వ బెట్టు మటంచు ఫుటఫుట దిరుగు
అవ్వల బట్టుక నరశి మాటాడు
నల్లారి చిల్లారి యనుచును దిరిగి
చల్లగ కూకుండి సరియూరకుండు
గంతులు వైతురు గాంభిర్యముగను.......”

— సప్తమాశ్వాసము - పుటలు 98-99.

### 6. వ్రతమాహాత్మ్యములు :

వర్ణాశ్రమాచారధర్మములు, వేదవిహితకర్మలు, వ్రతములు, ఆచారనియమములు, నిష్ఠలు - వీనికి భారతీయుల సంప్రదాయములలో నొక ప్రత్యేకత కలదు.

భక్తిజ్ఞానములవలెనే కర్మమార్గముకూడ మోక్షమునకు సాధనము. కర్మయోగమువలన ఒక వ్యక్తి అంతఃకరణశుద్ధిని, ఆత్మనిగ్రహమును బడయును. వేదాదులీ కర్మమార్గమున కధిక ప్రాముఖ్యము నిచ్చినవి. కాని వేదోక్తకర్మాచరణమున కన్ని జాతులకును, అన్ని కులములకును అర్హత లేదు. వీరశైవమత విజృంభణము భక్తినే పరమాధికారముగా పేర్కొని అన్ని జాతులవారికిని, స్త్రీలకును పూజార్హతనుకల్గించినది. సౌభాగ్యము సంతానముఁగోరి స్త్రీలు వ్రతములుచేయుట, వీరశైవమత ప్రచారముతోడనే మొదట ప్రారంభింపబడినదని చెప్పవచ్చును. కర్మకాండయందు పురుషులకన్న స్త్రీలకెక్కువ అభిమానము. కర్మములాచరించుటవలన అష్టైశ్వర్యసిద్ధియు, పుణ్యప్రాప్తి కల్గునని తెలుగువారి నమ్మకము. కాని ఈ ఆచార నిష్ఠలవలన సాంస్కృతికమగు ఐక్యము (Cultural unity) మాత్రము సిద్ధించును,

తెలుగుదేశమున వ్రతములుచేయుట అనునాచారము చిరకాల ముగ నున్నది. ఈ వ్రతములలో బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యము అనెడి నాల్గుదశలందును ఆచరించు వ్రతములున్నవి. బాల్యమున స్త్రీలు కోరవలసిన సంతోషప్రాప్తి మొదలుకొని వార్ధక్యమున వాంఛించు కైవల్యప్రాప్తివరకు కోరుచు ఆచరింప దగిన వ్రతములుండుట చూడగా స్త్రీలకీ వ్రతములనే సకలార్థ సాధనములుగ మనపూర్వులు నిర్ణయించినట్లు వ్యక్తమగుచున్నది.

"సంస్కృత సారస్వతమున (?) 360 వ్రతములు కలవని ప్రతీతి. కాని తెలుగునాట దాదాపు 200 వ్రతములు ప్రచార మున నున్నట్లు తెలియుచున్నద"[90] ని శ్రీమతి కనుపర్తి వర లక్ష్మమ్మ గారు తెల్పియున్నారు. ఈ వ్రతములయందు బ్రహ్మ, విష్ణుమహేశ్వరులను త్రిమూర్తులు వారివారి దేవేరులతో కూడ పూజింపబడుట కలదు.

వ్రతములు చాలవరకు స్త్రీలకు సంబంధించినట్టివే. ఏకా దశ వ్రతకథవంటివి పురుషులకు సంబంధించినట్టివి. పురుషులకు సంబంధించిన వ్రతకథల సంఖ్య చాలస్వల్పమే.

"మతవ్యాపనమును జానుతెనుగు వలన సాగించిన వీర శైవులు ఈ వ్రతకథలను కూడ జానుతెనుగు ద్విపదలలోను, నాటి పాటల వరుసలతోను రచించి ప్రచారము చేసినారని"[91] శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అభిప్రాయపడిరి. తర్వాత ఈ విధానమును శైవేతరులుకూడ పాటించి వ్రతకథలను ద్విపద లలో రచించినారు. ద్విపదలో రచితమైన వ్రతకథలలో శైవ

90. చూ॥ నోములు - తెలుగు విజ్ఞాన సర్వస్వము. 8 వ సంపుటము. పుట 905. తెలుగు భాషాసమితి.

91. చూ॥ దేశసారస్వత విభూతి - కిన్నెర పత్రిక - డిశంబరు 1953

మత సంబంధములును, వైష్ణవమత సంబంధములును, శివకేశవోభయ ప్రతిపాదకములును కలవు.

ద్విపదలో రచితమైన వ్రతమాహాత్మ్య కథలివి.

(1) రుక్మాంగదచరిత్ర – చదలువాడ మల్లన (1580 A. D.) (అలభ్యము)

(2) రుక్మాంగదచరిత్ర – దర్భాకవిగిరి కవి (1700 A. D.)

(3) సోమవారవ్రత మాహాత్మ్యము – శ్రీగిరి మల్లికార్జునకవి.

(4) ,, – కవిపేరు తెలియదు.

(5) సీమంతినీకథ – మహాదేవకవి (18 శతాబ్దాంత్యము). (సోమవారవ్రతమాహాత్మ్యము)

(6) ఆదిలక్ష్మీవిలాసము– రేటూరిభావయామాత్యుడు (1600AD) లేక కామేశ్వరిచరిత్ర

(7) అనంతవ్రతకథ – పుచ్చా గోపాలకవి.

### రుక్మాంగదచరిత్ర :

రుక్మాంగదచరిత్ర ఏకాదశవ్రతమాహాత్మ్య ప్రతిపాదకమైనదగుటచే వ్రతకథలందు చేరుచున్నది. ఇందు వైష్ణవుడగు రుక్మాంగదరాజుయొక్క కథను దృష్టాంతముగ తీసికొని ఏకాదశవ్రత మాహాత్మ్యమును వర్ణింపబడినది. శైవులకు సోమవారవ్రతమెట్టిదో వైష్ణవులకు ఏకాదశీవ్రత మట్టిది.

రుక్మాంగదచరిత్రను చదలువాడ మల్లన (1585) ద్విపదగాను, పద్యముగాను వ్రాసినాడు. అతని ద్విపద రుక్మాంగదచరిత్ర అలభ్యము. పద్య రుక్మాంగదచరిత్ర ముద్రితమై ప్రచారముననున్నది. ఇది ప్రౌఢరచన కలది.

దర్భాకవిగిరికవి (1700 A. D.) రచించిన రుక్మాంగదచరిత్ర 3 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. ఇది అముద్రితము. (అర్

నెం. 353. తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ). కవిగిరి కవికి వేంకటగిరి అనియు నామాంతరము. అతని అన్నయగు గోపన్న లేక గిరిరాజకవి తంజావూరును పాలించిన శాహ భూపాలుని (1684-1712 A. D.) కొలువులోను, ఆతర్వాత శరభ భూపాలుని (1712-1728 A. D.) కొలువులోను నుండి బహువిధయక్షగానములను, పదములను రచించి ప్రసిద్ధిపొందినాడు. కనుక కవిగిరి కవికూడ ఈ కాలము వాడే అనుటస్పష్టము. కవిగిరికవి ఘటికాచల మాహాత్మ్యము, అభినయదర్పణము అను పద్యకావ్యములను కూడ రచించినాడు.

రుక్మాంగదచరిత్రను కవిగిరి కవి మాళిశంశమువాడయిన విచిత్రరాయని కుమారుడగు ఖండోజీరాయని (శాహభూపాలుని బంధువు) కోరికపై వ్రాసి మన్నారు రాజగోపాలుని కంకితము చేసెను. రుక్మాంగదచరిత్రలోని కథాంశమిది:

వైష్ణవుడగు రుక్మాంగదుడను రాజు ఏకాదశవ్రతమును తానాచరించుటయే గాక ప్రజలందర చేతను చేయించుచుండెను. ఈ ఏకాదశవ్రత ప్రభావమువలన ప్రజలందరును సకల సద్గుణ సౌభాగ్య సంపన్నులై వైకుంఠప్రాప్తిని పొందుచుండిరి. అందువలన యమలోకమున కెవ్వరును పోరైరి. యముని అభ్యర్థనమును మన్నించి రుక్మాంగదుని ఏకాదశవ్రతమును మాన్పించుటకై బ్రహ్మ, మోహినిని సృజించి భూలోకమునకు పంపుట, మోహిని రుక్మాంగదుని వలచి, వలపించుకొని గాంధర్వవిధినిఅతని పరిణయమాడుట, మోహిని ఏకాదశవ్రతమును మానుమని రుక్మాంగదునికోరుట, వ్రతముమానుటకిష్టము లేనిచో ప్రియపుత్రుడగు ధర్మాంగదుని తల్లియగు సంధ్యావళిసమక్షమున నరకవలెనని ఆజ్ఞాపించుట, వ్రతభంగముచేయుట కిష్టము లేక అసత్య

దోషము నెదిరించు సాహసములేక తుదకు రుక్మాంగదుడు తన కన్నకుమారుని శిరస్సును నరకుటకు సిద్ధపడి, అతని కంఠముపై కత్తివ్రేటు వేయగా ఏకాదశవ్రతమాహాత్మ్యము వలన నాకత్తి వ్రేటు పూలమాలగా మారుట — అను కథాంశములు హృదయంగమముగా ఈ ద్విపదకావ్యమున వర్ణింపబడినవి.

## సోమవారవ్రతమాహాత్మ్యము :

వైష్ణవులకు ఏకాదశవ్రత మెట్లు ముఖ్యమైనదో శైవులకు సోమవారవ్రతమంత ప్రధానమైనది. వీరశైవులందీ వ్రతసంప్రదాయము పాటించువారు మిక్కుటముగా గలరు.

సోమవారవ్రత మాహాత్మ్యమును శ్రీగిరి మల్లికార్జునస్వామి ద్విపదలో రచించెను. ఈ గ్రంథము అముద్రితము. (ఆర్. నెం. 1018 — 1020 ప్రా. భా. మద్రాసు).

అన్ని సోమవారములకంటె మాఘమాసమందలి సోమవారములు చాలముఖ్యమని కవియిందు తెల్పినాడు. మాఘ సోమవార మాహాత్మ్యమును కథల రూపమున, వీరశైవమత బోధకముగ కవి యిందు వర్ణించినాడు.

సూతుడు ఋషులకు సోమవారమాహాత్మ్యమును వినిపించినట్లు కలదు. "వేదశాస్త్రంబులందు వెలసిన వ్రతము" అని కవి గ్రంథారంభమునందు పేర్కొనినాడు. సంస్కృతములోని సోమవారవ్రత మాహాత్మ్యమును జనసామాన్యమునకు సుబోధకమగునట్లు శ్రీగిరి మల్లికార్జునస్వామి ద్విపదీకరించినాడు. దీనిని బట్టి సోమవారవ్రతమాహాత్మ్యము ప్రాచీనమైనదని తెలియుచున్నది. "కర్ణామృతంబైన కథల"ను చెప్పెదనని కవి గ్రంథారంభమునందు పేర్కొనినాడు.

"ఘన సోమవారంబు కథవిన్నవారు
ధరణిఁ గృతార్థులై ధర యేలు."

చుందురని గ్రంథాంతమున ఫలసిద్ధి కలదు.

శ్రీగిరి మల్లికార్జునస్వామి సోమవారవ్రతమాహాత్మ్య గ్రంథమునందు పెక్కు చోట్ల ద్విపద, మంజరీభేదమనదగు గేయరచనముగా కానవచ్చుచున్నది. వ్రాతకూడ గానఫణితిని బట్టి చరణాంతములందు దీర్ఘస్వరములు కల్గియున్నవి.

శ్రీగిరి మల్లికార్జునకవి కృతికంటె భిన్నమైన సోమవార మాహాత్మ్యమొకటి ద్విపదలో కలదని శిష్టా రామకృష్ణ శాస్త్రి గారు వ్రాసినారు. కాని దాని ప్రతి వివరణములను తెలుపలేదు. "ఇది యాద్యంత రహితముగ నుండుటచే దీని కర్త యెవరో తెలియరాదు. ఇందు కార్తిక సోమవారమాహాత్మ్యము ప్రతిపాదింపబడిన కథలు గలవు." [92] అని వారు వ్రాసిరి.

సోమవార వ్రతమాహాత్మ్య ప్రతిపాదకముగనే 'సీమంతినీ కథ' అను పేరుతో మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు ఆర్. నెం. 658 ప్రతి కలదు. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారనివేదిక [93] లో ఈ గ్రంథమునుగూర్చి యిట్లు వ్రాయబడినది. "గ్రంథకర్తపేరు వీరభద్రకవి. ఈవని గ్రామవాస్తవ్యుడు. శ్రీపతి పండితారాధ్య వంశ్యుఁడగు మల్లనారాధ్యులకిది యంకితము సేయుబడినది." డా॥ చిలుకూరి నారాయణరావు గారును, [94] శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారును [95] తమ గ్రంథము

92. చూ॥ వీరశైవాంధ్ర వాఙ్మయము - పుట 225.

93. See 'Trinniel catalogue of Telugu MSS. 1919-22. Vol IV Part 3. Pages 1655-1658.

94. చూ॥ పండితారాధ్యచరిత్ర పీఠిక - పుట 126.

95. చూ॥ వీరశైవాంధ్ర వాఙ్మయము - పుట 226.

లలో సీమంతినీకథ కర్త ఈవని వీరభద్రకవి అనియే పేర్కొనిరి. ఈవని వీరభద్రకవికిని ఈవని గ్రామవాసియైన పోచిరాజు వీరన కును సంబంధమున్న దేమో తెలియదని కూడ వీరు వ్రాసినారు. కాని ఇవి ప్రామాదికములనియు 'సీమంతినీకథ' అను పేరుతోనున్న సోమవారవ్రత మాహాత్మ్యమును తెలుగున బసవపురాణమును పద్యముగా రచించిన మహాదేవకవి రచించినాడని శ్రీమతి ఆది లక్ష్మిగారు సప్రమాణముగ నిరూపించి యున్నారు.[96] మహాదేవ కవి పదునెనిమిదవ శతాబ్దాంతమున పందొమ్మిదవశతాబ్ద ప్రారం భమున నుండెనని చెప్పవచ్చును.

సోమవారవ్రతమాహాత్మ్యమును తుమ్మలపల్లి నాగభూషణ కవి ఏకాశ్వాస పద్యప్రబంధముగా రచించినాడు. సీమంతినీ పరి ణయమును పెనుమల్ల సోమనామాత్యుడు 5 ఆశ్వాసముల పద్య కావ్యముగా రచించినాడు. (చూ॥ అముద్రితము. ఆర్. నెం. 513. ప్రా. భా. మద్రాసు).

కామేశ్వరిచరిత్ర లేక ఆదిలక్ష్మివిలాసము :

కామేశ్వరికథ శివకేశవోభయ మాహాత్మ్య ప్రతిపాదకమగునొక విశిష్టవ్రత సంప్రదాయము. కాకతీయుల కాలమునాటికే కామే శ్వరీపూజ యున్నట్లు క్రీడాభిరామమునుబట్టి తెలియుచున్నది. అక్కల వ్రతసంబంధియగు ఇతివృత్త మిందుండుటచే దీనిని వ్రత మాహాత్మ్యములలో చేర్చవచ్చును.

కామేశ్వరిచరిత్రను ద్విపదలో రేటూరి భావయామా త్యుడు (1600 A. D.) రచించెను. ఈ ద్విపద కామేశ్వరిచరిత్ర అముద్రితము. (ఆర్. నెం. 1045 – ప్రా. భా. మద్రాసు). కామే

---

96. చూ॥ మహాదేవకవి బసవపురాణ అవతారికలో విశేషాలు శ్రీమతి ఆదిలక్ష్మి. పరిశోధన సంచిక 8. జూన్, జూలై 1955.

శ్వరి చరిత్రకు ఆదిలక్ష్మి విలాసమనియు నామాంతరము. ఇందలి కథాంశమిది:

కామేశ్వరి ఆదిలక్ష్మి యవతారము. వైకుంఠమునకువచ్చిన శ్రీరాముని చూచి ఆదిలక్ష్మి మోహించినది. కాని ఏకపత్నీవ్రతు డగు శ్రీరాముడామెను తిరస్కరించుటచే ఆమెకు ఇష్టార్థసిద్ధి కలుగలేదు. "ఇంకొక యవతారమెత్తి గొల్లచేడెల కాళ్ల వేళ్లఁ బడి జారుడని యాఁబడిఁ బడదువుగాక" అని ఆదిలక్ష్మి శ్రీరాముని శపించినది. శ్రీరాముడామెను కామేశ్వరిగానవతరించి, తనమీఁది మోహమున నవయుచుండుమని ప్రతిశాపమిచ్చెను.

లక్ష్మీదేవి తన శాపవృత్తాంతమును విష్ణువున కెరిగించి దుఃఖించినది. విష్ణువామె నూరడించి "శ్రీమహాదేవునికి పుత్త్రికవై జన్మించి, సజ్జనుల కామితార్థము లీడేర్చుచు విరహక్లేశము నోర్వ గల" వని చెప్పెను. లక్ష్మీదేవి ఒక కొలనులో నివాసమేర్పరచుకొని యుండెను. శివుడు పార్వతితోకూడ లక్ష్మీదేవియుండు కొలనులో జలక్రీడ సల్పుచుండెను. పరస్పర విహార విలాస క్లేశమున పార్వతి యా కొలనులో ఏడు దోసెళ్లు నీరు త్రాగెను. కొలనులోనున్న లక్ష్మీదేవి యా నీటితో గౌరి గర్భమున ప్రవేశించెను. "సప్తక్రమంబులఁ జనిగొన్నకతన" నామెకు లక్ష్మి సప్తకన్య కలుగా సద్యోగర్భమునఁ బుట్టెను. ఈసప్తకన్యకలలోను 'కామేశ్వరి' కడగొట్టుది. మొత్తముమీఁద ఈ ఏడుమందికి 'అక్కల' ని పేరు. శివపార్వతులు వీరి సంరక్షణార్థము పోతరాజును సృజించి వారి నచటనే విడిచిపోయిరి. అనంతరము బ్రహ్మవారికి సమస్త సౌకర్యములతో కనకావతీ పురమును నెలకొల్పి పోతరాజునకు కూనలమ్మను సృజించెను.

ఒకనాడు కామవల్లి తన అక్కలతో కొలనులో స్నానము

చేయుచుండగా శ్రీకృష్ణుని గీతాలాపమును వినెను. శ్రీరాముడే ఈ అవతారమున సాక్షాత్కరించెనని గ్రహించి కామవల్లి విరహోద్వేగమున తన్నేలుకొమ్మని కృష్ణుని ప్రార్థించినది. కృష్ణుడు, పరస్పర శాపవిధముల నెఱిగించి, 'ఎప్పుడు నన్నుఁ జూడఁగోరుదువో అపుడెల్ల నా యాకార రేఖ చూపుదును. దానినీకు కొంత శాంతి కలుగగలదు. మరియును,

ధర్మంబు గల చోట దయగల చోట
అర్మిలి వసియించి యర్చనల్ గొనుము
విరహ వేదన నిన్ను వేధింప దండు
అదిగాక మీద కల్క్యవ తారమున
పొదలుచు కవ గూడి భోగింపగలవు
కమలాక్షి యందాక కాక నొందు."

మని ఆమెకు విరహోపశాంతిని తెల్పెను.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు కామవల్లిని గూర్చి క్లుప్తముగా క్రీడాభిరామ పీఠిక [97] యందు తెల్పినారు.

నేటికిని కూడ సర్వాంధ్ర దేశమునను బ్రాహ్మణాది వర్ణములవారికి కామేశ్వరి యిలవేల్పు. కామేశ్వరి యిలవేల్పుగాగల యిండ్లలో వివాహాది శుభకార్యములు జరిగిన తోడనే 'అక్కల కొలువు' ను జరుగును. ఆనాడు ఏడుగురు ముత్తైదువుల కర్చనము జరుగును. ఉద్రేక జనకమైన గానఫణితిని కామేశ్వరిపాట వీర వాద్యములతో పాడుదురు. ఆ పాటతీవ్రములో స్త్రీలకు కొందరకు శివమెత్తును. ఆ అర్చనము జరుగునాడెంత త్వరపడినను భోజనము లగుటకు సూర్యాస్తమయమగును. కనుకనే 'అక్కలు లేచేటప్పటికి నక్కలుకూయును' అను సామెత వ్యాప్తిలోనికి వచ్చియుండుట.

97. చూ॥ శ్రీ ప్రభాకర పరిశోధకమండలి ప్రచురణము - 5. తృతీయ ముద్రణము 1960.

అక్కలకొలువు వ్రత సంప్రదాయమును స్త్రీలు జరుపుదురు. ఇది చాలకాలమునుండి ఆంధ్ర దేశమున వివిధప్రాంతములందు వ్యాప్తిగాంచినది. కామవల్లి 72 ప్రదేశముల కొలకులందు వెలసి పూజాదికము లందుచున్నది. రాయలసీమ జిల్లాలలో కామేశ్వరీ ఆరాధన వ్రతసంప్రదాయము చాల ప్రాచుర్యము నందినది. కడపజిల్లా రాయచోటి తాలూకాలోని చిన్నమండెము గ్రామ సమీపములో అక్క దేవతల కొండకలదు. అక్కడ అక్కలకు గుర్తులుగా ఏడు విగ్రహములుకలవు. ఏటేట స్త్రీలు, ముఖ్యముగా సంతాన కాంక్షిణులైనవారు, వివాహము కానివారును అక్కదేవతలను కొలువ బోవుచుందురు. కొండపై సంతర్పణ కూడ జరుగుచుండును 'అక్కలపాట'లో బెజవాడ, ఏలూరు, రాజమహేంద్రవరము, కొవ్వూరులు ఆదిలక్ష్మి కామేశ్వరి వెలసిన పుణ్యక్షేత్రములుగా పేర్కొనబడుటచే ఈ వ్రతసంప్రదాయము సర్కారుజిల్లాలందును వ్యాప్తిచెందియున్నదనుట తెలియగలదు.

కామేశ్వరీచరిత్ర కథనే 'ఆదిలక్ష్మీవిలాసము' అను 4 ఆశ్వాసముల పద్యకావ్యముగా అక్కినేపల్లి నరసింహకవి రచించినాడు. ఈ పద్య ఆదిలక్ష్మీవిలాసము కూడ అముద్రితమే. (ఆర్. నెం. 388 ప్రా. భా. మద్రాసు).

### అనంతవ్రతకథ:

'అనంతవ్రతకథ' అను ద్విపదగ్రంథమును పుచ్చా గోపాలకవి రచించినట్లు తెలియుచున్నది. (చూ॥ ఆం. సా. ప. పుట 59). పుచ్చా గోపాలకవి పేరయ పుత్రుడు; గౌతమ గోత్రుడు; తంజాపురానందవల్లి భక్తుడు.; దాక్షిణాత్యకవి. ఈ గ్రంథము గోపాలకవి కృష్ణమాంబా తనయుడగు చినరంగరాయనికి కృతి.

ఇది 5 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. ప్రథమాశ్వాసము మొదట కొంత శిథిలమైనది.

అనంతవ్రత కథను కాకనూరి అప్పకవి పద్యకావ్యముగ రచించినాడట. ఈ గ్రంథమిపుడు అలభ్యము.

7. భక్తిప్రబోధకములు:

సత్య, శివ, సుందరమైన పరమాత్మసిద్ధోపాయము. కర్మ జ్ఞాన, భక్తిమార్గములను సాధనములు సాధ్యోపాయములు. ఈ కర్మ జ్ఞాన భక్తి మార్గములలో భక్తియే దైవానుభూతికి, స్వర్గ ప్రాప్తికి ప్రధాన సరణి; సులభమార్గమును.

శైవము వలెనే వైష్ణవము కూడ భక్తిమతమే. జ్ఞాన మార్గమందువలె గాక ఈభక్తిమార్గమున ధ్యానమునకు చిత్తై కాగ్రతకు మూర్తి యవసరము. శైవ వైష్ణవ భేదములీ మూర్తి భేదములనే సూచించును. ఈభక్తి ముఖ్యముగా శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర – భావములను పంచవిధ సాధనలవలన అనుభూతమగుచుండును; ఈ పంచవిధ రూపములతో అభివ్యక్త మగుచుండును.

భక్తికిని కవిత్వమునకును నిసర్గమధురమగు మాధ్వము, నిగ్గుదేరిన ఆవేశము ముఖ్యలక్షణములు భక్తి వ్యక్తినిష్ఠమైన తత్వము. కనుకనే భక్తివాఙ్మయము తరచు ఆత్మాశ్రయ ఫక్కి ననుసరించి యుండుట.

తమిళదేశమున వైష్ణవమత ప్రవర్తకులగు పన్నిద్దరాళ్వారులు, శైవమతానుయాయులగు నాయనారులు భక్తిమార్గ ప్రచారమునకు బాసటయై నిల్చినారు. ఆళ్వారులు, నాయనారులు మొదలగు వైష్ణవ శైవ మతానుయాయులగు మహానుభావులచే

స్వయంవ్యక్తములయిన భక్తిరచనలు, తదుపరివారి జీవితగాథలు బోధనలు — ఇతివృత్తముగా, పరంపరగా ప్రవృత్తములయిన రచనలన్నియుకలిసి ఒక సువిశాలమైన భక్తివాఙ్మయకోశ మవతరించినది. ఈ ఆళ్వార్ల, నాయనారుల భక్తితత్త్వము పిమ్మట విశిష్టాద్వైతముతో విశేషముగాభక్తితత్త్వముకొనసాగినది. అటు పిమ్మట అది వీరశైవవిజృంభణముతో పరాకాష్ఠ నందినది.

తెలుగున భక్తివాఙ్మయము బహుముఖముల విస్తరిల్లినది. అందు అనేక కృతులు భగవత్పరమైనవే. శివతత్త్వసారము, బసవపురాణము, పండితారాధ్యచరిత్ర - ఇత్యాది శివకవుల రచనలలో అందందు భక్తిప్రసక్తి లేక పోలేదు. కాని, వానిలో భక్తితత్త్వముకంటె మతప్రచార ధోరణియే యధికము. సిరియాళచరిత్ర, భల్లాణచరిత్ర — మున్నగు శివభక్తులకథలందు భక్తితత్త్వము గోచరించుచుండును.

ఇక వైష్ణవవాఙ్మయములో భక్తికి విశేష ప్రాముఖ్యము. తాళ్ళపాకవారిలో అన్నమాచార్యుడు, పెదతిరుమలయ్య, చిన్నన్న అనువారు మధురభక్తిసంప్రదాయానుగుణముగ భక్తిరచనలను ద్విపదలో రచించిరి. భగవంతుని తన ప్రాణనాథునిగా నెంచు మహాభావమే మధురభక్తి. కేవల స్తుతిపరములైన భక్తిరచనలు కూడ ద్విపదలో రచింపబడినవి. భక్తిప్రబోధక ద్విపదరచనలను పరిశీలింతము:

## సోమనాథస్తవము:

ఇది పాల్కురికి సోమేశ్వరస్వామిపై చెప్పబడిన చిన్న ద్విపదకృతి. సోమనాథస్తవము లిఖితప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు సంఖ్య 2272 లిఖితప్రతి కలదు. ఇందు గ్రంథకర్తపేరు కానరాదు. "ఏలూరు వాస్తవ్యులు శ్రీ

కొండ గుంటూరు నాగభూషణము ప్రకటించిన ఒక మిశ్రగ్రంథమున ఇది ప్రకటితమైనది. ఇందులో 'సోమనాథ స్తవము' చివర 'ఇది పాల్కురికి సోమేశ్వర విరచితము' అని కూడ ముద్రింపబడినది.''[98] ఈ విషయమును శ్రీ బండారు తమ్మయ్యగారు తెల్పియున్నారు. ఈ గ్రంథమున ప్రాసయతి విరళముగ కానవచ్చుచున్నది. బసవని ప్రసక్తి స్వల్పమాత్రముగ నుదహరింపబడుటచే నిది సోమనాథునికి బసవనియందు భక్తియంకురించిన తొలుతొలుతటి కాలమున రచింపబడి యుండునని శ్రీ బండారు తమ్మయ్యగారి అభిప్రాయము.

ఈక్రింది పంక్తులవలన గ్రంథస్వరూపము కొంత వ్యక్తమగును.

గ్రంథారంభము:

"శ్రీగురులింగ సుస్థిర దయాపాంగ
యోగీంద్ర హృదయేశ యురగేశభూష
సామ గాన ప్రియ సకలలోకేశ
సోమశేఖర శర్వ శూలిత్రినేత్ర

..........................................

పాయక కిన్నర బ్రహ్మయ్య పిలువ
హోయని పలికిన యొడయ రక్షించు
చెన్నయ్య భక్తావశేషంబు గొన్న
పన్నగ కుండలాభరణ రక్షించు

..............................

భక్తుల పదసేవ పదపడి సేయఁ
గరమర్థి నొసఁగవే కలకంఠ మూర్తి
గురునాథ శ్రీ పాలకురికి సోమేశ."

---

98. చూ॥ 'సోమనాథ స్తవము'-బండారు తమ్మయ్య. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - సంపుటి 21, సంచిక 3. పుట 101.

గ్రంథాంతము:

"అనుదినం బీ స్తవం బఠిఁ బఠింపఁ
బనిపూని చదివిన భక్తితో వినిన
నరయంగ వ్రాసిన యభవ భక్తులకు
దొరకును ముక్తియు దురితముల్ తొలగు
బరమ లింగైక్య సంప్రాప్తి చేకూరుఁ
...................... ..................
బరమ ప్రభుండు పాల్కురికి నిలయుండు
గరుణతోఁ బ్రోచును గల కాలమెల్ల."

## భక్తస్తవము:

ఈ లఘు ద్విపదకృతిని కూడ భక్తపరనార్థము పాల్కురికి సోమనాథుడే రచించియుండునని శ్రీ బండారు తమ్మయ్యగారి అభిప్రాయము.[99]

భక్తస్తవములోని ఈ క్రింది ద్విపదలు పండితారాధ్య లోని ద్విపదపంక్తులను బోలియున్నవి.

బసవ పుత్రుండను భక్తపాత్రుండ
భక్తుల శ్రీపాద పద్మసేవకుడ
భక్తులఁ బొగడఁ బొల్పడు కవీంద్రుడ
భక్తుల దూతను భక్తుల బంట
భక్తుల లెంకను భక్త సత్రాణి
భక్తుల చెలికాడ భక్త బంధుండ.

పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణము:

బసవని పుత్రుండ బసవ గోత్రుండ
బసవేశు శ్రీపాద పద్మశేఖరుడ
బసవని బొగడఁ బొల్పడు కవీంద్రుడ
.......................................... "

99. చూ॥ పాలకురికి సోమనాథకవి - పుట 156.

## శృంగార మంజరి:

శృంగారమంజరి తాళ్ళపాక అన్నమాచార్యుడు (1408–1503 A. D.) తిరువేంగళనాథ దేవునికి విన్నపముచేసిన మంజరీ ద్విపద రూపమగు ఒక లఘుకృతి. ఇది ముద్రితము.[100] ఇది కేవలము స్తుతిపరముగాక, కథాలంబనమును లేక నిసర్గ మనోహరముగ భక్తుడైన కవియొక్క అనుభవమును, అభినివేశముల ప్రేరణతో అతని హృదయమునుండి ప్రసవించిన భక్తిరస సంపుటము. గ్రంథము వేంకటేశ్వరున కంకితము.

భగవత్సాన్నిధ్యము లభించుటకు భక్తి శృంగారములు రెండును సమప్రాముఖ్యములని అన్నమాచార్యుని ఉద్దేశ్యము. శృంగారమంజరి-భక్తిసూనృతముగా భావప్రధానముగా నడచిన రచన. గ్రంథారంభమునందు చేసిన శ్రీ వేంకటేశ్వరుని స్తుతిలో భక్తిశృంగారముల సమ్మేళనమును గమనింపవచ్చును.

"శ్రీకామినీ వక్షు జిత హిరణ్యాక్షు
భువన పాలన దక్షుఁ బుండరీకాక్షు
..........................................."

అన్నమాచార్యునిరచన భక్తిప్రధానమై భగవంతునితో ప్రత్యక్షముగ మాటలాడినట్లుండును. ప్రబంధోచితరీతిని సాగిన ఈక్రింది వసంతోత్సవ వర్ణనలోని స్వాభావిక సౌకుమార్యమును, సూక్తి వైచిత్రిని గమనింపుడు.

"పాంథుల సునుసిగ్గు బయలైన రీతి
కారాకు వెడలి వృక్షంబులు నిలిచె
తగవిర హుల కోర్కి తలిరించె ననగ
నవకమై చిగుళులు ననిచె భూజముల

100. See. Tirupati Devasthanam Tallapakam Telugu Works Vol I. The Minor Works of Annamacarya and his sons. 1935.

వలరాజు రాకప వన మహీజములు
కలయఁ గట్టిన పేలు కట్లో యనంగ
నిండారఁ దరువుల నీడలునిండె
................................ ........ ....
సకల వసాంత విశ్రాంత పాంథులకుఁ
బగలు రేలై తోఁచుఁ బరికింప రేలు
పగలులై తోఁచి విభ్రాంతి పుట్టించు."

— శృంగారమంజరి - పుటలు 3-4.

శ్రీ వేంకటేశ్వరుడు దేవిని ఊరడించు సందర్భమునందలి రచన సందర్భోచితముగ, చక్కని శైలిలో సరసముగానున్నది. పరామర్శింపుడు:

"గతి నొప్పు నిలువెల్లఁ గన్నులై యమరఁ
గ్రాఁగిన గందంబు గ్రమ్మఁ బన్నీటఁ
దోఁగిన చెంగావి దొడరి శైత్యమున
గ్రాఁగిన హృదయంబు రతిరాజు చేత
మ్రాఁగిన మతియుఁ బ్రమాదంబు వలన
నీఁగిన వగలును నేత్రాంబుధార
లాఁగిన ఱెప్పలు నైయున్న యింతి
గనుఁగొని కరుణా వికాస చంద్రికలు
నీలోత్పలాక్షిపై నిండంగఁ జల్లి
భామిని యున్న పూఁబానుపు చేరి
చిట్టింటి చేతల సేదలు దీర్చి
చెదరిన యలకలఁ జిక్కుల్లఁ దీర్చి
కొడలేని పులకల నింపు పుట్టించి
కళల మర్మంబుల కడగాను పించి
యాలింగనాది సౌఖ్యముల నొందించి
కరఁగించి మరగించి కలికిఁ గావించి
యుడివోని సురతాబ్ధి నోలలాడించి."

— శృంగారమంజరి - పుట 13.

చక్రవాళమంజరి:

'చక్రవాళమంజరి' ని 120 మంజరీద్విపదలలో తాళ్లపాక పెదతిరుమలాచార్యుడు (1460_1547 A. D.) రచించెను. గ్రంథము ముద్రితము.[101] ఈ లఘుకృతికి శ్రీ వేంకటేశ్వరుడు, పద్మావతి నాయికానాయకులు. పెదతిరుమలార్యుడు తాళ్ళపాక అన్నమాచార్యుని రెండవ కుమారుడు. "పన్నుగ పెదతిరుమలయ్య పదముల కెలుగున్" అను చాటూక్తిని బట్టి ఇతడు పదకవిత్వమున పేరుగాంచిన కవి అని తెలియుచున్నది.

చక్రవాళ మంజరిని కవి ప్రతిపాదమును ముక్తపదగ్రస్తాలంకారములతో నడిపినాడు.

"తన రాకకోరు కాంతామణి యలరు
నలరుల పొదరింట కరగి చెల్వార
నారయఁ జేపట్టి యనుభవంబొసగి
సగియించు గతి ఘర్మజలమార విసరి
సరిలేని విరహంబు చల్లార్చి కలసి
కలసిగ్గుఁదేర్చి వేంకటశైలవాస
వాసవార్చితుఁడు శ్రీవామాక్షితోడఁ
దోడఁ బ్రవేశించె దొల్లింటి నగరు."

Vol. I. Minor works - Page 20.



ఇట్లే గ్రంథమంతటను, ప్రతి పాదములోని చివరిమాటలో దాని తర్వాతిపాదము ఆరంభించును. అక్షరములు అవియే యైనను అర్థముమాత్రము వేరు. పెదతిరుమలార్యుడు ప్రబంధయుగములో రాయలకు సమకాలికుడు. కనుక అతని రచన ముక్తపదగ్రస్త

101. Vol I. The Minor works of Annamacharya and his sons. 1935.

ములు, యమకములు- మొదలయినశబ్దాలంకారములతో ప్రౌఢమై ప్రాబంధికతను బొందినది.

పరమయోగివిలాసము:

తాళ్ళపాక చిన్నన్న (1498-1561 A. D.) రచితమగు పరమయోగి విలాసము 8 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. ఇది ముద్రితము.[102] ఇందు 12755 ద్విపదలు కలవు. అలమేలుమంగా వేంకటేశ్వరుల కంకితము.

తెలుగులో ఆళ్వారులను విష్ణుభక్తుల చరిత్రములు పరమయోగివిలాసమను పేర బరగుచున్నవి. ఆళ్వారులను 'దివ్యసూరు' లని, 'నిత్యసూరు' లని పేర్కొందురు. ద్విపద పరమయోగి విలాసమునందు విష్ణుభక్తులగు పన్నిద్దరాళ్వారులచరిత్రములు వైష్ణవ మతవ్యాప్తి గావించిన ఆచార్యుల చరిత్రలు వర్ణింపబడినవి. ఆళ్వారుల చరిత్రములను తెలిపిన తొలి తెనుగుగ్రంథ మిదియే.

ఆళ్వారులచరిత్ర దివ్యసూరిచరిత్ర (11 శతాబ్ది), ప్రసన్నామృతము (1554-1614)- మొదలగు సంస్కృత గ్రంథములందును కలదు. ఉదేశరత్నమాల (14 శతాబ్ది) అను తమిళ గ్రంథములోను, 'గురుపరంపరా ప్రభావము' (14 శతాబ్ది)అను సంస్కృత ద్రావిడ మిశ్రమ గ్రంథమందును ఆళ్వారులచరిత్రకలదు. తాళ్ళపాక చిన్నన్న ద్విపద పరమయోగి విలాసమునకు మాతృక ద్రావిడ గ్రంథమనుట తెలియుచున్నది.

"పనుపడ ద్రవిడ ప్రబంధంబు చూచి
తెనుఁగున రచియింపు ద్విపద రూపమున"

అని వేంకటేశ్వరుడు కలలోకనబడి తన కానతిచ్చినట్లు చిన్నన్న తెల్పినాడు.

---

102. తిరుపతి దేవస్థానము ప్రచురణ - 1938 సంవత్సరము.

పరమయోగులచరిత్ర ప్రాచీనమైనది. నారదుడు చెప్పిన యాదవశైల మాహాత్మ్యమునందునను, భాగవతమునందునను, పద్మపురాణమునందును పరమయోగుల వైభవము ప్రశంసింప బడినది.[103] ఆళ్వారులు కలియుగాది యందు ఆవిర్భవించిరని వైష్ణవ సంప్రదాయము. కాని ఆధునికచరిత్రకారులు వీరు క్రీస్తు తర్వాత 2–8 శతాబ్దముల మధ్యయుండిరని చెప్పుదురు.

విష్ణుమూర్తి వస్తువాహనాదులకు ప్రతిరూపములే ఆళ్వారులని వైష్ణవుల విశ్వాసము. వీరు వైష్ణవ భక్తివాదమువలనను, అత్యద్భుత మహిమాదులను ప్రదర్శించుటవలనను ప్రజాభిమానమునకు పాత్రులయిరి. "ఆళ్వారులు భగవదర్చా విగ్రహోపాసనమత్తులు; ధ్యానసిద్ధులు; బ్రహ్మానుభవమునందారి తేరినవారు. 'అంతరశుద్ధి', శీలము – భగవదనుగ్రహప్రాప్తికి మూలములని వీరి నిశ్చితాభిప్రాయము."[104] అందువలననే వీరుజైనబౌద్ధాదిమతములందుండు వర్ణవ్యవస్థారాహిత్యము నంగీకరించిరి. వీరు భగవద్ జ్ఞానమును అన్నిజాతులవారికిని, అన్నికులములవారికిని స్త్రీ పురుష విభేదము లేకుండ విచ్చలవిడిగ నందజేసిరి. ఆళ్వారులలో శఠకోపుడు, పరకాలయోగి, మునివాహనయోగి (హరిజనుడు) – వీరు శూద్రులు; గోదాదేవి స్త్రీ.

ఆళ్వారులలో మొదటి ముగ్గురు కాసారయోగి, భూతయోగి, మహాయోగి–అనువారు తమిళదేశమందు సంచరించుచు పాశుర శతకములను రచించినారు.

---

103. చూ॥ పరమయోగి విలాసము, అవతారిక – పుట 6.

104. చూ॥ విజ్ఞాన సర్వస్వము – 7 వ సంపుటము. దర్శనములు మతములు – 298.

భక్తిసారుడు మహాయోగి; అపార మహిమాన్వితుడు. ఈశ్వరుడితని విష్ణుభక్తికి, తేజమునకబ్బురపడి వైష్ణవభక్తుల మహిమాధిక్యమును యిట్లు కీర్తించినాడు.

"శ్రీనాథు భక్తులజెయ్యు లెవ్వరికిని
.................................................
నారయ హరిదాసు లధికులుగాన
.................................................
హరిదాసు లఖిలలోకైక పావనులు
హరిదాసు లపగతాహంకారమతులు
హరిదాసులగు వారలధికుల కధికు
లరయ వారలకంటె నధికులు లేర"

— ద్వితీయాశ్వాసము — పుట 67.

భక్తిసారుని పాదరజము సోకినమాత్రముననే శిలలు, ఇసుకయు సువర్ణరూపమును దాల్చుటను కొంకణసిద్ధుడు చూచి ఆశ్చర్యపడి "హరికన్న హరిభక్తు లధికులే" (పుట 74) అని కీర్తించినాడు. భక్తిసారుని కథలో చిన్నన్న విష్ణుభక్తుల యాధిక్యమును నిరూపించినాడు. భక్తిసారుడు నారాయణపారమ్యమునువాదించు 'నాన్ముఖమ్', 'తిరువందాడి', 'తిరుచ్చాందవిరుత్తమ్' — అను గ్రంథములను రచించెను.

శఠకోపుడు పన్నిద్దరాళ్వారులలో చాల విశిష్టుడని చెప్పుదురు. అతడు సర్వజ్ఞుడు. అతనియందుభక్తి పరాకాష్ఠనందుకొనినది. 'తిరువిరుత్తమ్', 'తిరుదాశిరియమ్', 'పెరియతిరువందాది', 'తిరువాయ్ మొళి' — అను ఈతని నాల్గుగ్రంథములును నాల్గువేదములుగా శ్రీవైష్ణవులు పరిగణింతురు.

మధురకవియోగి శఠకోపునిశిష్యుడు. ఇతడుతనకు వైష్ణవ మంత్రోపదేశమిచ్చిన గురువగు శఠకోపునిచరిత్రను వ్రాసినాడు.

ఇది శ్రీ వైష్ణవులలో గురుభక్తి ప్రాముఖ్యమును సూచించును.
కులశేఖర యోగి విష్ణుభక్తి అపారమైనది. ఇతడు,

"శైరిసాక్షిగను వైష్ణవులు చోరకులు
కారు ముమ్మాటికిం గారు కారు"

అని వైష్ణవులను లోకపావనులని నమ్మినవాడు. ఇతడు వాత్సల్య భావరూపమగు భక్తిని అవలంభించెను. భగవంతుని పుత్రభావముతో ప్రేమించుట వాత్సల్య భక్తి.

రామాయణములోని సీతాపహరణవార్తను పురాణము చదువుచుండగా కులశేఖరుడు విని, పరితాపమును చెంది,

"తడయక రామచంద్ర ద్రోహిఁబట్టి
యాక్షణంబున సురలెడఁ జొచ్చిరేని
శిక్షింతు నెందుఁ జొచ్చినఁ బోవనీను
మును కొని యరకాలములు గాడకుండ
ననుఁ గన్నతల్లిఁ గన్నన రాముఁ గూర్తు"

— 3 వ ఆశ్వాసము - పుట 188.

నని యుద్ధసన్నద్ధుడై నగరు వెడలినాడట. ఇచట కులశేఖరుని విష్ణుభక్తి పారవశ్యము భావోద్రేకపూరితమైనదిగ వర్ణింపబడినది. కులశేఖరుడు 'తిరుమొళి' అను గ్రంథమును, 'ముకుందమాల' అను భావగీతమును రచించెను.

విష్ణుచిత్తయోగి శ్రీ విల్లుపుత్తూరు నందుండు విష్ణువును సేవించుచుండు బ్రాహ్మణుడు. అతడు విష్ణుప్రభావముచే పాండ్య రాజును శ్రీ వైష్ణవునిగా మార్చెను. శ్రీకృష్ణదేవరాయలు తన 'ఆముక్తమాల్యద' లో ఈ విష్ణుచిత్తుని చరిత్రను వర్ణించినాడు.

గోదాదేవి విష్ణుచిత్తుని పుత్రిక. ఆళ్వారులస్థానము సంపాదించుకొనిన ఏకైక స్త్రీ గోదాదేవి. ఈమె మధురభక్తికి దృష్టాం

తము. భారతీయుల భక్తిసంప్రదాయ మార్గములలో ఈ మధుర భక్తి సర్వోత్కృష్టమైనది. గోదాదేవి గోపికలవలె మహావిష్ణువునే ప్రియునిగా వలచి వలపించుకొనినది. గోదాదేవి రచించిన 'తిరుప్పావై', 'నాచ్చియార్ తిరుమొళి' – అను గ్రంథములు శ్రీవైష్ణవులలో బహుళప్రచారము నొందినవి.

విప్రనారాయణునికి భక్తాంఘ్రిరేణువనియునామాంతరము. అతడు ఆదర్శ దాస్యభక్తికి ప్రబలనిదర్శనము. భక్తుడు తాను భగవత్సేవకుడనని సంభావించుటయే దాస్యభక్తి. శ్రద్ధాయుక్తుడైన సేవకునకు తనప్రభువునందుండు అనురాగము దాస్యభక్తునకు ఆదర్శము. భగవత్సేవకుడగువాడు దుష్కృత్యములాచరించినను, పాపియైనను భగవంతుని కటాక్షమువలన దుర్లభమగు మోక్షమును బడయునను దానికి విప్రనారాయణుచరిత్ర నిదర్శనము. విప్రనారాయణుడు నిరంతర యోగధ్యానసంపన్నుడయినను, దేవదేవి శృంగారచేష్టలకు చలించినాడు. వైష్ణవుల దైవమగు శ్రీకృష్ణునందే భక్తిశృంగారములు మూర్తీభవించినవికదా!

మునివాహనుడు లేక కవియోగి పంచమకులప్రసూతుడు. భగవంతుని దివ్యసౌందర్య సాక్షాత్కారానుభవమున కితడు చక్కని నిదర్శనము.

పరకాలయోగి పూర్వాశ్రమమున దుశ్చరితుడు. కాని వైష్ణవభక్తి అతనిని పరమసాధువుగ చేసినది. అతడు శ్రీరంగ దేవాలయమును కట్టించెను. ఇతర మతములవారిని నొప్పించియైనను వైష్ణవుల కాపాడవలెనని పరకాలయోగి మతము. ఇతడు రచించిన ఆరు తమిళగ్రంథములును ద్రావిడవేదమునకు షడంగములుగా ప్రసిద్ధినొందెను.

అళ్వార్లు చేసిన భగవత్ స్తోత్రములును, వారిలో శఠకో

పుడు, పరకాలయోగి రచించిన కృతులు కలిపి 'నాలాయిర ప్రబంధ' మనుపేర సంగ్రహింపబడినది. ఈ ద్రావిడ ప్రబంధ మును ద్రావిడవేదమనియు, పంచమాగమమనియు వ్యవహరింతురు. ఇందు 4000 సంకీర్తనములు కలవు.

వైష్ణవమున ఆచార్యులు వేదాంత, విజ్ఞానములకు ప్రాతినిధ్యము వహింతురు. ద్విపద పరమయోగి విలాసము అష్టమాశ్వాసమునందు ఈ వైష్ణవాచార్యుల చరిత్ర వర్ణింపబడినది. ఈ వైష్ణవాచార్యులపరంపర తమిళ దేశమున నాదముని (823A. D.) తో ప్రారంభమగును. నాదముని శఠకోపుని శిష్యపరంపరలోని వాడు. న్యాయతత్త్వాది గ్రంథకర్త; ద్రవిడవేదసంచయిత; ఉద్ధారకుడు. ఇతని పౌత్రుడు యామునాచార్యుడు (918-1037 A D.) ఒక గొప్ప వైష్ణవ గురువు. అతడు రామానుజులకు (1017-1137 A. D.) పరమ గురువు. నాదముని, యామునాచార్య, రామానుజులచే ప్రవర్తితమైన దర్శనము విశిష్టాద్వైత దర్శనము. రామానుజాచార్యులు భక్తిని విష్ణుపరముగ ప్రతిపాదించి విశిష్టాద్వైతమతమును ప్రచారము చేసెను.

విష్ణుభక్తచరిత్రము:

ఇది పన్నిద్దరాళ్వారులు మొదలయిన విష్ణుభక్తుల చరిత్రములను తెలుపు పూర్వోత్తరభాగములుకల ద్విపదగ్రంథము. ఇది అముద్రితము. (ఆర్. నెం. 1182. లిఖితప్రతి. తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ) ఈ ద్విపద విష్ణుభక్తచరిత్రకర్త చక్రపురి రాఘవాచార్యుడు (1690). ఇతడు శ్రీ వైష్ణవుడు. ఇతడు రచించిన ద్విపద నలచరిత్ర బహుళ జనాదరణపాత్రమైనది.

ద్విపద విష్ణుభక్తచరిత్రము ఘటికాచల నారసింహస్వామి కంకితము. ఈ విష్ణుభక్తచరిత్ర సంస్కృత విష్ణుపురాణమున

కాంధ్రీకరణముకాదు. వెన్నెలకంటి సూరనార్యాదులు రచించిన ఆంధ్రవిష్ణుపురాణముల కనుకరణమునుకాదు. ఇదియొక స్వతంత్ర ద్విపద గ్రంథము. ఇందు పూర్వభాగమున ముఖ్యముగా యమలోక వర్ణనమును, ఆలోకమునకు వచ్చెడి పాపాత్ములు చేయు పాపములు మొదలగునవి చెప్పబడినవి. ఉత్తరభాగమున శ్రీ రామానుజుల ప్రభావమును, రామానుజ మతస్థాపనమును, తన్మత మాహాత్మ్యమును వర్ణింపబడినది.

ఈ ద్విపద విష్ణుభక్తచరిత్రమును, 'అలంకారవైఖరుల' రచించినానని చక్రపురి రాఘవాచార్యుడు గ్రంథాంతమునందు తెల్పినాడు.

ఆసూరి శేషావతారకవి కూడ విష్ణుభక్తచరిత్రమును దిపదలో రచించినట్లు తెలియుచున్నది. (చూ॥ తెలుగు అకాడమి - అకారాద్యముద్రిత గ్రంథ సూచిక I Part పుట 18). ఇతడు రాఘవాచార్యునికి తర్వాతివాడు.

సిరియాళచరిత్ర:

భగవంతునికే గాక భగవద్భక్తులకు కూడ భక్తిపరులుగా నుండుట శైవ వైష్ణవమతముల రెంటియందును సమానధర్మమే. భక్తిని ప్రతిపాదించు అర్థవాదములలో 'సిరియాళచరిత్ర' కథ ప్రశస్తమైనది. భక్తిపరవశులై సర్వత్యాగముచేయుట వీరశైవ భక్తుల కభిమతము. వీరశైవులు పరమేశ్వరుని స్థిరలింగమనియు, జంగములను చరలింగమనియు, లింగధారణము కరలింగమనియు ఈ మూడింటికి భేదములేదనియు భావింతురు. కనుకనే శైవులు జంగములను పరమేశ్వర భావమున నారాధించుట.

సిరియాళుడు తన ప్రియపుత్రునే జంగమునకుభోజనముగా నర్పించుటయందు అతని నిష్కల్మష భక్తిత్యాగములు వ్యక్త

పరుపబడినది. ''సిరియాళకథ చరిత్రాత్మకమైనది. సిరియాళుడు క్రీ. శ. 630 ప్రాంతమున నుండినట్లు అతనికిసంబంధించిన తమిళ శాసనములవలన తెలియుచున్నది. సిరియాళునికథ 'అరువత్తి మూవురచరిత్ర' మను ద్రవిడ గ్రంథమున కలదు. పెరియ పురాణమునందలి ఈ కథ తమిళమున చిరకాలమునుండి పాటలుగా ప్రచారమున గలదు. నూరు సంవత్సరముల క్రితమొక కవి దీనిని నాటకముగ తమిళమున రచించినాడట. కన్నడమున శాంతకవి క్రీ. శ. 1750 ప్రాంతమున 'సిరియాలసత్వపరీక్షే' యను యక్షగానముగ రచించినాడు. మఱియు వార్ధకషట్పది ఛందమున 'సిరియాళసెట్టియ' యను పేరుతో పాటలు గలవు.''[105]

సిరియాళ చరిత్రను ద్విపదలో చిత్తారు గంగాధరకవి (1823) రచించెను. ఈ ద్విపద సిరియాళచరిత్ర అముద్రితము (ఆర్. నెం. 278. ప్రా. భా. మద్రాసు). సిరియాళకథను పాల్కురికి సోమనాథుడు (1160–1240) బసవపురాణము చతుర్థాశ్వాసమున 180 ద్విపదలలో ఒక ఉపాఖ్యానముగ రచించినాడు. ఇది శైవుల కెక్కువ అభిమానమగు కథయగుటచే శైవభక్తులైన కవులు పలువురు ప్రత్యేక కావ్యనాటకములుగ రచించిరని పాల్కురికి సోమనాథుడే బసవపురాణముననిట్లు తెల్పినాడు.

> ''కరమర్థి నూరూర సిరియాలు చరిత
> మేటిరై చను భక్తకూటములందు
> పాటలుగా గట్టి పాడెడువారు''

—బసవపురాణము. 4వ ఆశ్వా. పుటలు 289–90.

---

105. చూ॥ సిరియాళ చరిత్ర - శిష్టా రామకృష్ణశాస్త్రి, భారతి, సంపుటి 28 - సంచిక 8, ఆగష్టు 1951.

సోమనాథు ననుసరించియే చిత్తారు గంగాధరకవి సిరియాళచరిత్రను ద్విపదలో రచించినాడు. ఇందు కథాకథనమే ముఖ్యము. ఇందు కల్పనాశక్తిగల వస్తువర్ణనలు కానరావు. ఈ సిరియాళ చరిత్ర ద్విపదపంక్తుల అంత్యమునందు పాడుకొనుట కనువుగా హ్రస్వము దీర్ఘముగా రచింపబడినది.

సిరియాళచరిత్ర శ్రీనాథుని హరవిలాసములో ప్రథమ శివవిలాసముగ వర్ణింపబడినది, సిరియాళకథను ప్రత్యేకముగ 3 ఆశ్వాసముల పద్యగ్రంథముగ గరికిపాటి తమ్మయ్య రచించినాడు. 'చిరుతొండభక్తునికథ' అనుపేరుతో ఒకద్విపదగ్రంథము కలదు. ఇది అముద్రితము (చూ॥ Telugu Academy- అకారాద్యముద్రిత గ్రంథ సూచిక I Part పుట 18). దీని కర్తృత్వమును గూర్చి తెలియరాదు.

భల్లాణచరిత్ర:

శైవభక్తి, వీరవ్రతాచార నిష్ఠనుబూని తన ప్రియతమ వస్తువులను గూడ జంగమముల కర్పించి ప్రసిద్ధిగాంచిన భల్లాణ రాజు చరిత్ర వీరశైవులగువారి యుల్లములను కొల్లగొని పద్యములుగా, ద్విపదలుగా, పదములుగా, యక్షగానములుగ బహుముఖముల ప్రకటితమై ప్రశస్తికెక్కినది. భల్లాణచరిత్రను ద్విపదలో చిత్తారు గంగాధరకవి, బసవన్న, నింబాద్రిదాసు, జక్కన సాంబయ్య - మున్నగువారు ప్రత్యేకముగారచించిరి. చిత్తారు గంగాధరకవి భల్లాణచరిత్ర 3 ఆశ్వాసముల ద్విపదగ్రంథము; ముద్రితము,[106] బసవన్న ద్విపద భల్లాణచరిత్ర అముద్రితము (చూ॥ తెలుగు అకాడమీ - అకారాద్యముద్రిత గ్రంథసూచిక I Part.

106. శృంగార గ్రంథమాల - 4. జి. యస్. శాస్త్రి అండ్ కో., మద్రాసు 1928. పరిష్కర్త: గంటి సూర్యనారాయణశాస్త్రి

పుట 18). నింబాద్రిదాసు భల్లాణచరిత్ర కూడ అముద్రితమే (ఆం. సా. ప. సంఖ్య 3490). జక్కన సాంబయ్య రచితమగు భల్లాణచరిత్రకూడ అముద్రితమే. (చూ॥ ఆం.వా.సూ. పుట 137)

వైష్ణవులందలి మధురభక్తి కథలకు శైవులందీ భల్లాణ రాజు కథ దీటుగానుండును. దీనిని జానపదులు 'మిండజంగము కథ' అందురు. శివుడు మిండజంగములను సృజించి, తానును మిండజంగముడైనందున కాబోలు ఇట్టి పేరువచ్చినది. ఇందు భక్తి ప్రధానరసము. శృంగార మంగముగాగలది. ఇది పచ్చి శృంగారముతో, బూతుల బుంగలతో నిండియున్నది. పారమార్థిక చింతతో చూచిన ఈ గ్రంథము నీతిబాహ్యమైన అతి శృంగార భూయిష్ఠమైన కథ. ఆనాటి సాహిత్య ప్రక్రియలకిది యొక ప్రబలమైన తార్కాణము.

"గంగాధరుని రచన చాల పేలవముగను, నీరసముగ నున్నది. కవిత్వమర్మముగాని ఛందోవ్యాకరణ విశేషములుగాని, యితనికిఁ దెలియనట్లు తోఁచును." అని శ్రీ శిష్టారామకృష్ణ శాస్త్రిగారు తెల్పియున్నారు. కాని చిత్తారు గంగాధరుడు కావ్య లక్షణమును ఒక్కొక్కచో శబ్దస్వరూపమును సైతమంతగా పాటింపకున్నను, అతని రచన పామరజన సుబోధకమై తేట తెలుగు మాటలతో కూర్చబడినది.

చిత్తారు గంగాధరుని ప్రకృతివర్ణనలు చాలవరకు కథాగమనమున కనుగుణముగనే యున్నవి.

"తెగువ భల్లాణుని తేజము కేను
దగనని పోయి పాతాళంబు నకను
జొరఁ బారి నట్టులు సూర్యుండు గ్రుంకెఁ

గర గొన్న చీకట్లు గ్రమ్మె నాలోనఁ
దారలు వికసించెఁ దఱచుగామింట
వీరశైవము చాల వెదజల్లినట్లు
విహితమై నిండాతి వెన్నెలల్ గాయ
బహు జీవరాసులు బాసల నుడుగ.''

— ప్రథమాశ్వాసము — పుట 12.

భల్లాణచరిత్రను రాజశేఖర విలాసమనుపేర కూచిమంచి తిమ్మ కవి పద్యప్రబంధముగా రచించినాడు. గంగాధరకవి ద్విపద భల్లాణచరిత్ర దీని ననుసరించి రచింపబడినదే. వాలేశ్వరుడు, పోచిరాజు వీరన — మున్నగువారు దీనిని పద్యప్రబంధముగా రచించినారు.

## కృ ష్ణ మ ం జ రి :

'కృష్ణమంజరి' అను చిన్న ద్విపదకృతిని 'మంగమాంబ' యను కవయిత్రి రచించినట్లు ఇటీవల వేపనపల్లి చెంతనుండు బూదిమట్లు అను గ్రామమున కొన్ని శిథిల తాళపత్రములనుండి తెలియవచ్చుచున్నదని శ్రీ. కె. యస్. కోదండరామయ్యగారు తెల్పిరి. [107]

మంగమాంబ సుప్రసిద్ధాంధ్ర కవయిత్రులలో నొకతె యగు తరిగొండ వెంగమాంబ (1840 A. D.) తల్లి. కనుక మంగమాంబ 19 శతాబ్ది పూర్వార్థమున నుండెనని చెప్ప వచ్చును.

తరిగొండ వెంగమాంబ కూడ నొక 'కృష్ణమంజరి' ని ద్విపదలో రచించినట్లు తెలియుచున్నది. [108] వెంగమాంబ కృష్ణ

107 చూ॥ 'కృష్ణమంజరి_మంగమాంబ' — ఆంధ్రప్రభ దిన పత్రిక సంపుటము 26 సంచిక 278.

108 చూ॥ ద్విపద భాగవతము అవతారిక తరిగొండ వెంగమాంబ

మంజరిని గూర్చి వ్రాయుచు శ్రీ వంగూరి సుబ్బారావుగారు "ఇందు 137 ద్విపదలుకలవు. ఇది ద్విపద శతకమనవచ్చును." 109 అని వ్రాసియున్నారు. వెంగమాంబ కృష్ణమంజరి 1910 సం॥ ప్రాంతమున ముద్రితమైనదని శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు తెల్పియున్నారు. 110

పైని పేర్కొనిన దానిని బట్టి కృష్ణమంజరి ద్విపదలు రెండని తేలుచున్నది. ఒకటి తరిగొండ వెంగమాంబ కర్తృకము. మరొకటి ఆమె తల్లియగు మంగమాంబది. మంగమాంబ రచనలో 134 ద్విపదలను, వెంగమాంబ రచనలో 137 ద్విపదలును కలవు.

మంగమాంబ కృష్ణమంజరి భక్తిజ్ఞాన వైరాగ్య ప్రబోధకమై, రసవంతముగ, సులభముగా రచింపబడినది.

మంగమాంబ శైలిని తెలిసికొనుటకు ఆమె కృష్ణమంజరి నుండి కొన్ని ద్విపద పంక్తు లివి:

"కనక రత్నప్రభా కలితమైనట్టి
సురు చిర మకుటంబు సూపవే కృష్ణా
మద్గురు స్వామిని సతత మన్నిటిని
సరసంబుగా బోధ చేయవె కృష్ణా
నీవు శాధ్యుడవని నేనిన్నినాళ్లు
గనలేక పోతిని క్రమముగా కృష్ణా
నిరతంబు పరులను నిందింతుగాని
నాదుర్గుణంబు లెన్నగ నేరకృష్ణ
మహినొప్పు సర్వ ధర్మముల బోవిడిచి

---

109 చూ॥ శతక కవుల చరిత్ర పుట 370

110 చూ॥ కవయిత్రి మంగాంబ కృష్ణమంజరి ఆంధ్రప్రభ దిన పత్రిక సంపుటము 26 సంచిక 305

పొసగ నీ శరణు నే బొందితి కృష్ణా
నాయప చారముల్ నాదుర్గుణములు
సైరించి బ్రోవవే స్వామిని కృష్ణా
నిన్నిట్లు నుతియింప నే నెంత గలను
తప్పొప్పులను గాచి దయ జూచు కృష్ణా."

ఇందు శతకములందు వలె 'కృష్ణా' అను మకుట నియమము పాటింపబడి యుండుట గమనింపవచ్చును.

వెంగమాంబ 'కృష్ణమంజరి' రచన నెరుంగుటకు కొన్ని ద్విపద పంక్తులివి:

"నీవు నా స్వామివి నీసొమ్ము నేను
కావున బాధ్యమెక్కడ బోదు కృష్ణ!
శేష భూతుడ నేను శేషివి నీవు
కావున బాధ్యమెక్కడ బోదు కృష్ణ!
పావనుండవు నీవు పతితుండ నేను
కావున బాధ్యమెక్కడ బోదు కృష్ణ!
నీవు బాధ్యుడవని నే నిన్నినాళ్లు
కనలేక పోతిని క్రమముగా కృష్ణ!."

ఇట్లు కృష్ణ' అను మకుటములో, పల్లవివలె పాడుటకు యోగ్యమైయున్నది. వెంగమాంబ కృష్ణమంజరికిని, మంగమాంబ కృష్ణమంజరికి పెక్కు పోలికలుండుట పై ఉదాహరణములను బట్టి తెలియును.

ఈ కృష్ణమంజరులు నారాయణశతకము వలె భక్తిప్రబోధాత్మకములై సులభశైలిలో రచింపబడినవి. ఈ లఘుద్విపద గ్రంథములందు వైరాగ్యాదులకన్నను భక్తితత్త్వమునకే ప్రాముఖ్యముండుటచే వీనిని భక్తిప్రబోధకములలో చేర్చుట యుక్తము.

## శరణాగతి ద్విపద:

ఈ ద్విపద గ్రంథము అముద్రితము. (సంఖ్య డి. 2228 ప్రా. భా. మద్రాసు). గ్రంథావతారిక లేకుండుటచే దీని కర్తను గూర్చిన వివరములు తెలియవు. ఇది వైష్ణవమత పరమైనది. ఇది విశిష్టాద్వైత మతప్రవర్తకుడగు రామానుజాచార్యుల స్తుతి రూపమగు ద్విపద. స్తుతిపరమగు ఈ కృతిని భక్తిప్రబోధకముల లోనే చేర్పవచ్చును.

## కుచేలోపాఖ్యానము:

కుచేలోపాఖ్యానము భాగవతమునందు కలదు. ప్రసిద్ధమైన ఈ కథను పనప్పాకము శ్రీనివాసాచార్యులు 3 ఆశ్వాసముల ద్విపదగా రచించినాడు. ఇతడు కొంత భాగము రచించి పరమపదించగ ఇతని భార్యయగు కనకమ్మ కోరికపై వావిలకొలను సుబ్బారావు ఈ గ్రంథమును పూర్తిచేసెను. ఈ విషయము గ్రంథ పీఠికలో చెప్పబడినది. గ్రంథము ముద్రితము. లఘుకావ్యము. భక్తపఠనార్థ ముపయుక్తమైనది.

## ప్రహ్లాద చరిత్ర:

ప్రహ్లాదుడను ప్రసిద్ధ భక్తుని కథను ద్విపదలో బాలకవి శేఖర వాకాటి పెంచలరెడ్డి రచించెను. ఇతడు నెల్లూరినివాసి. గ్రంథము ముద్రితము.

## సక్కుబాయమ్మగారి చరిత్ర:

'సక్కుబాయి' అను భక్తురాలిచరిత్రను వెంపల శాంతాబాయమ్మ (1900 A. D.) ద్విపదలో రచించెను. ఈ గ్రంథము ముద్రితము.

## 8. తాత్త్వికములు:

తాత్త్వికార్థ ప్రతిపాదన ప్రధానములైన ఉపాఖ్యానము

లతో కూర్పబడిన రచనలు తాత్త్వికములనబడును.

జ్ఞానమార్గమునే వేదాంతమని వ్యవహరింతురు. ఇది కర్మ భక్తిమార్గములకంటెను శ్రేష్ఠమని పండితుల అభిప్రాయము. ఈ వేదాంతమువలననే భారతదేశమునకు తక్కిన ప్రపంచమునకన్న వైశిష్ట్యమేర్పడినది. భారతీయవేదాంతమందలి సాంఖ్యతత్త్వము యోగవిద్య-మెదలగునవి వారికిప్రత్యేకతనాపాదించినవి. పాశ్చాత్య దేశ సాహిత్యమందు ఏ పండితుడో, మహానుభావుడో వేదాంత వాక్యములను నూటికొకడు పల్కును. కాని భారతీయ సాహిత్యమును పరిశీలించిన గర్భస్థశిశువులుకూడ జ్ఞానామృత పానమొనర్చిన గాథలు కలవు. సంస్కృతమున వేదాంతమును గూర్చిన అపారవాఙ్మయము కలదు.

జ్ఞానమార్గము పరబ్రహ్మస్వరూపమని, కర్మయోగము జ్ఞానమునకు సాధనమగుచుండుననియు ఉపనిషత్తులలోను, భగవద్గీతాదులలోను చెప్పబడినది.

శ్రీ శంకరాచార్యులు వేదాంతము అద్వైతమును స్థాపించుచున్నదని వాదించెను. కాని అతడు మాయావాదమును స్వీకరించి దానిననుసరించి అద్వైతమును స్థాపింప యత్నించెను. బ్రహ్మమొకటే సత్యము; జగత్తు మిథ్య అను మతమును అతడు బోధించెను: శంకరాచార్యుని తర్వాతవచ్చిన అచార్యులు అతని మాయావాదమును ఖండించిరి. నాదముని యామునాచార్యుల తర్వాత రామానుజాచార్యులు విశిష్టాద్వైత మతమును వ్యాప్తిగావించెను. విశిష్టాద్వైతము ఉభయ వేదాంతమని చెప్పబడుచున్నది.

కర్మ జ్ఞాన భక్తి మార్గముల మూడింటికి శైవ వైష్ణవాది మతావలంబకులుస్వమతపరములగువిపులవ్యాఖ్యానములొసంగిరి.

శైవమునుండి వెలువడిన ఒక శాఖ వీరశైవము. దీనిని 'లింగాయత మత' మని కూడ అందురు. లభించిన ఆధారములను బట్టి వీరశైవ మతోద్ధారకుడు, కర్ణాట దేశీయుడగు బసవేశ్వరుడు (12 శతాబ్ది). వీరశైవము రేవణారాధ్యుడు, మరుళారాధ్యుడు, పండితారాధ్యుడు, ఏకోరామారాధ్యుడు, విశ్వారాధ్యుడు-అను అయిదుగురు మహాప్రవక్తల మూలమున ప్రచారము సాగినదని చెప్పుదురు. వీరిలో పండితారాధ్యుడు వీరశైవ మతములోని నొక అవాంతర శాఖయైన ఆరాధ్య సంప్రదాయమును స్థాపించినవాడు. వీరశైవులు మాయావాదము నంగీకరింపరు. జగత్తు వాస్తవమని, యదార్థమని వారి విశ్వాసము. కాని శివుని శక్తి యొక్క ఒక ప్రకారము 'మాయ'.

"శైవసిద్ధాంతములు ద్వైతప్రతిపాదకములనియు, ద్వైతాద్వైత ప్రతి పాదకములనియు అద్వైత ప్రతిపాదకములనియు బిన్నాభిప్రాయములు ప్రబలియున్నను, వీరశైవము శివాద్వైతమును బ్రతిపాదించుచున్నదని పండితాభిప్రాయము. 111

వేదాంతమందు సాంఖ్య, యోగములు ప్రత్యేకత కల్గినట్టివి. ఇవి రెండును ఒకేదర్శనముయొక్క రెండు విభాగములు. " 'సాంఖ్య' మనగా సమ్యక్ ఖ్యాతి, సరియగు జ్ఞానము, ప్రకృతి పురుషుల వివేకము." 112 సమ్యగ్వివేకమున ఆత్మను తెలియ జెప్పుటచేత దీనిని సాంఖ్యమందురు. సాంఖ్యదర్శనద్రష్ట కపిల

---

111. చూ॥ బసవపురాణము. ప్రస్తావన - పుటలు 11-12. కాశీనాథ నాగేశ్వరరావు. ఆంధ్ర గ్రంథమాలప్రతి. రెండవ ముద్రణము 1952.

112. చూ॥ విజ్ఞాన సర్వస్వము - 7 వ సంపుటము - పుట 115. తెలుగు భాషాసమితి.

మహర్షి. పురుషుడు, ప్రకృతి అను రెండు చరమ తత్త్వములను సాంఖ్యవాద మంగీకరించును. పురుషులనంతములు. ప్రకృతి యొక్కటే. ఈ రెండింటికిని గల అన్యోన్య తత్త్వమే సాంఖ్యమున నిరూపితము. ప్రకృతి పురుషసంయోగమువలన జగత్తు ఆవిర్భవించినదని సాంఖ్యుల మతము. సాంఖ్యమతము భగవద్గీతలోను, భారత భాగవతములందును వర్ణింపబడినది. "జైన బౌద్ధమతములు సాంఖ్యమతమునుండి పుట్టినవే." 113

యోగమనగా ఈశ్వరునితో సంయోగముపొందు ప్రక్రియ. ఆధ్యాత్మిక సాక్షాత్కారమును పొందు విధానము యోగమని అర్థము. జ్ఞానయోగము, భక్తియోగము, లయయోగము — ఇత్యాది యోగములన్నియు మోక్షప్రాప్తికిసాధనములే. యోగ సూత్రములను పతంజలి వ్రాసినాడు. వ్యాసుడీ యోగసూత్రములకు భాష్యము వ్రాసెను.

అద్వైత. శైవ, వైష్ణవ, సాంఖ్య, యోగాది ప్రతిపాదకములగు సంస్కృత గ్రంథములను, గ్రంథాంతర విషయములసాధారముగ గొని తెలుగు ద్విపద కవులు కొన్ని రచనలను గావించి యున్నారు. వీని అన్నిటిని 'తాత్త్వికములు' అని వర్గీకరించి పరిశీలింతము. ద్విపద కేవలము సాహిత్యమునకే గాక వేదాంతాది ఆధ్యాత్మిక విషయ ప్రతిపాదనమునకును ఉపయుక్తమైయుండుట గమనింపదగిన విశేషము.

స్వర శాస్త్రము :

స్వరశాస్త్రమను చిన్న ద్విపదకృతిని గణపనారాధ్యుడు

113. చూ॥ 'దర్శనవాఙ్మయము - శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి. భారతి - సంపుటము 16. సంచిక 3.

(14 శతాబ్ది పూర్వార్థము)[114] రచించెను. గణపనారాధ్యుని తండ్రియగు గన్నయామాత్యుడు ఓరుగంటి ప్రతాపరుద్రమహారాజునకు మంత్రి.

స్వరశాస్త్రము వేదాంతగ్రంథము. ఇందు యోగశాస్త్రములు వివరింపబడినవి. ఈ గ్రంథమునుగూర్చి మొదట తెల్పిన వారు డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు.[115] గ్రంథము అముద్రితము.

గణపనారాధ్యుడు యోగశాస్త్రవేత్త.

"సంసార జితులకు సహజయోగమున
స్వరశాస్త్ర యోగంబు సరిగాగ దలచి."

అతడు, 'హరిమతశాస్త్రము,' హరశాస్త్రమతము', 'వాసిష్ఠమతము', వల్క్యయోగము, నవనాథమతము, మార్తాండమతము, గోరక్షమతము, కామాక్షిమతము మొదలగు ముఖ్య యోగశాస్త్రములను పరిశీలించి,

"జీవ హితంబుగా జీవుని బట్టి
తెరగొప్ప జనులెల్ల దెలియునట్లుగను స్వరశాస్త్రమంజరి"

అను గ్రంథమును ప్రీతితో వర్ణించినాడు.

మాయాచిదానందమంజరి:

ఇది వేదాంత సంబంధమగు మంజరీద్విపద గ్రంథము. అముద్రితము. (ఆర్. నెం. 96. ప్రా. భా. మద్రాసు). దీనిని నాదిండ్ల ఉమాపతి లేక ఉమ్మయామాత్యుడు (1460 A. D.)

---

114. చూ॥ ఆంధ్రకవితరంగిణి - 4వ సంపుటము - పుట 49 - శ్రీ చాగంటి శేషయ్య.

115. చూ॥ 'గణపనారాధ్యుడు'-వ్యాసము. భారతి. 12వ సంపుటము. సంచిక 1. పుట 29-31.

రచించెను. ఇతడు తనగురువగు చిదానంద ఘనయోగి అనుమతిని ఈ ద్విపద గ్రంథమును రచించినట్లు తెలియుచున్నది.

ఆత్మైకబోధ:

అద్వైతపరమగు ఈద్విపదకృతిని రచించినవాడు యోగానందావధూతస్వామి (16 శతాబ్ది). ఇతడు చింతల లింగగురుని శిష్యుడు. ఈ గ్రంథము అముద్రితము.[116]

శ్రీగురుని చేరువిధము, సద్గురుని వినుతించువిధము, ఆత్మతత్త్వము-ఇందు చక్కగా సంభాషణాత్మకముగావివరింపబడినవి.

"సకల వేదాంతార్థ సారమై యున్న
వికలంక మాత్మ మిది విస్తరించితిని
ఒప్పైన ద్విపదగా నున్నదున్నట్లు
చెప్పితి నీ ద్విపద చిత్తగింపుడు."

అని కవి గ్రంథాంతమునందు తెల్పియున్నాడు.

"ఇలలోకమున జనులు యీద్విపద విన్న
చాలించి చూచినఁ బట్టి వ్రాసినను
బుద్ధి కదురై లెస్స బుధజనులఁ జేరి."

అని గ్రంథ ఫలశ్రుతి.

ఆత్మానందరసమంజరి:

అద్వైత వేదాంత ప్రతిపాదకమగు ఈ'ఆత్మానందరసమంజరి' 3 ప్రకరణములుగల ద్విపదగ్రంథము. దీనికర్త శేషదాసు తిరువేంగళాచార్యుడు (1700 A. D.) కృష్ణరాయపురమున వెలసియున్న శ్రీ వేణుగోపాలస్వామికి గ్రంథము అంకితము. గ్రంథము అముద్రితము (డి. నెం. 2062, ప్రా. భా. మద్రాసు).

---

116. ఆర్. నెం. 5 (c) ప్రా. భా. మద్రాసు.
ఆం. సా. ప. 678, డి 2063.

గ్రంథారంభము:

"శ్రీ రమాలోల యాశ్రిత భక్తపాల
వారిజ భవరుద్ర వందితముద్ర
........................ ....................
రమణ నాత్మానంద రసమంజరనెడి
విమలమైనట్టి సద్ద్విపద కావ్యంబు
జేసి కృతార్థతఁ జెందెదనంచు."



## తత్త్వచంద్రోదయము:

ఇది వేదాంతగ్రంథము. దీనిని ద్విపదలో రచించినవాడు ముమ్మడి మల్లనార్యుడు (1650 A. D.) "యేను బాల్యంబున సకల వేదాంత సిద్ధాంత సార సంగ్రహంబైన తత్త్వార్థంబుల తత్త్వచంద్రోదయంబను ద్విపద కావ్యంబు రచియించి యా తత్త్వ చంద్రోదయంబునకు జానకీ నాథు నాథుగా నియోగించి సంతసిల్లితి" అని మల్లన తన శ్రీరామ స్తవరాజ మను పద్యకావ్యావతారికలోనివాక్యము దీనికిఆధారము. గ్రంథము అలభ్యము.

## ప్రబోధచంద్రోదయము:

జటిలములగు దార్శనిక వాదములు, దురవబోధమగు తత్త్వములు, మనోమయ జగత్తునందలి వివిధ భావములకు పాత్ర రూపములు కల్పించి కృష్ణమిశ్రుడు సంస్కృతమున ప్రబోధ చంద్రోదయ మను వేదాంత నాటకమును రచించెను. ఇట్టి వేదాంతనాటకములు మరికొన్ని కలవు. వీనిని అంతరార్థ (Allegory) రచనలందురు. వేదాంత దేశికుని సంకల్ప సూర్యోదయము విశిష్టాద్వైత మతపరమైనది. కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయ నాటకమున పాత్రలు సామాన్యములు కావు. మానవ స్వభావాదులగు కామక్రోధాదులకు పాత్రకల్పన గావింపబడినది. కృష్ణమి

శ్రుడీ నాటకమును భారత కథాప్రణాళిక ననుసరించి రచించి యున్నాడు.

ప్రబోధ చంద్రోదయమునందు ఈశ్వరునకు మాయకును సంగమము లేకయే 'మనస్సు' అను పుత్రుడుదయించెను. ఆ మనస్సే నిఖిల సంసారమునకును కర్త. అతనికి ప్రవృత్తి, నివృత్తులు భార్యలు. ప్రవృత్తియందు మోహ, లోభ కామాదులగు దుష్కర్ములను సంతానము కల్గిరి, నివృత్తియందు విమలమతులగు వివేక, వస్తువిచార, సంతోషాదులను గనెను. రాజ్యకాంక్షతో కౌరవ పాండవులు పోరాడినట్లు జ్ఞాతులగు ఈ యిరుతెగలవారు ఆధ్యాత్మిక రాజ్యాక్రమణకు పోరాడిరి. ఇది భావములకు రూపకల్పన మైనను ఈపాత్రములు ప్రాణులకన్న ప్రాణవంతములై స్ఫుటరేఖలతో మన యెదుట సాక్షాత్కరించును. దీనియందు శాంతము ముఖ్యరసము. దాని తర్వాత ముఖ్యమైనది హాస్యము.

కృష్ణమిశ్రుని నాటకము ననుసరించియే రాచూరి వేంకటలింగకవి 5 ఆశ్వాసముల ద్విపదరచనగా ప్రబోధ చంద్రోదయమును రచించినాడు. ఈ ద్విపదగ్రంథము అముద్రితము (ఆర్ నెం. 715. ప్రా. భా. మద్రాసు).

"మిహిరతేజుడు కృష్ణ మిశ్రుడుఁ దొల్లి
రహి నాటకంబుగా రచియించినట్టి
రౌనరు ప్రబోధ చంద్రోదయం బనగ
జన వినుతంబైన సచ్చరిత్రంబు
అవ్యయ పదనిధా నాంజనం బగుట
భవ్యంబుగా రామ భద్రార్పితముగ
తెనుఁగున రచియింతు ద్విపదకావ్యంబు
ఘనులెంచ లోకోపకారంబు గాగ."

అని వేంకట లింగకవి గ్రంథారంభమునందు తెల్పినాడు.

రాచూరి వేంకట లింగకవికిముందే కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమును నందిమల్లయ, ఘంటసింగన అను సోదరజంట కవులు పద్యరూపమున నాంధ్రీకరించిరి. ఈ జంటకవులు క్రీ. శ. 1480 ప్రాంతమున ఈ గ్రంథమును పద్యములో రచించియుందు రని శ్రీ చాగంటి శేషయ్యగారు అభిప్రాయపడిరి.[117]

వాసిష్ఠరామాయణము:

వాసిష్ఠరామాయణము వేదాంతప్రతిపాదకమైనది. తత్త్వ రూపమైన ఈ గ్రంథమును సంస్కృతములో వాల్మీకి రచించెను. పదునారేండ్ల ప్రాయమున శ్రీరామునకు తత్త్వజిజ్ఞాస కలుగగా విశ్వామిత్రుని కోరికపై వసిష్ఠుడు రామునకి తత్త్వోపదేశము చేయుటయిందలి కథాంశము. వాసిష్ఠరామాయణమునకు యోగ వాసిష్ఠమని, జ్ఞానవాసిష్ఠమని, వసిష్ఠ శ్రీరామచంద్ర సంవాదమని నామాంతరములు.

జ్ఞానవాసిష్ఠ రామాయణార్థసారమును గ్రహించి 'వాసిష్ఠ రామాయణమ'ను పేర ద్విపదగ్రంథముగా తరిగొండ వెంగ మాంబ (1840 A. D.) రచించెను. ఈ ద్విపద వాసిష్ఠరామా యణము ముద్రితము.[118] ఇందు 6 ప్రకరణములు కలవు. ప్రథమ ప్రకరణమున విషయములందలిదోషములు, జగదుత్పత్తిక్రమము తెలుపబడినది. ఇందు అనేకోపాఖ్యానములు సందర్భానుగుణ ముగ, అర్థబోధనలతో వివరింపబడినవి. పరమాత్మయొక్క మాయ మనోరూపమై జగత్తులను సృష్టించుచున్నదని ఆకాశజోపాఖ్యా నమున తెలుపబడినది. లీలోపాఖ్యానమున జగన్మాయకత్వము

117. చూ॥ ఆంధ్రకవి తరంగిణి - 6 వ సంపుటము. పుట 131.

118. వావిళ్ల రామశాస్త్రులు అండ్ సన్స్ - 1925. మద్రాసు.

కర్కట్యుపాఖ్యానమున పరబ్రహ్మసృష్టివలన కలిగెడు లాభములు వివరింపబడినవి. ఇట్లే ఐందవోపాఖ్యానము, కృత్రిమేంద్రోపాఖ్యానము. చిత్తజోపాఖ్యానము, బాలోపాఖ్యానము, సప్తిసహిత శాంబరికోపాఖ్యానము, లవణోపాఖ్యానము — మున్నగునవి తదర్థబోధకములైనవి.

ద్వితీయ ప్రకరణమున ప్రపంచముయొక్కయు, దానికధిష్ఠానమయిన పరబ్రహ్మముయొక్కయు యదార్థమునుగూర్చిన చర్చ కలదు. తృతీయ ప్రకరణమున ఉపశమనము — తెలుపబడినది. ఇందు ప్రసక్తానుప్రసక్తముగ బలిచక్రవర్తి శుక్రాచార్యునిచే తత్త్వజ్ఞానోపదేశమును బడసి విశ్రాంతిబొందినకథ, ఉద్దాలకమహర్షి మోక్షమార్గమును గాంచిన కథయును తెల్పబడినది.

చతుర్థ ప్రకరణములో యోగములను గూర్చిన చర్చ, నిర్వాణగతి నీయగల దేవతార్చన విధానమును, అంతఃకరణ పూజావిధానమును వివరింపబడినది. అన్ని కర్మలను చేయుచు విశ్రాంతిబొందిన రాజులకథలు — అర్జునోపాఖ్యానము, శతరుద్రజననము, భేతాళుప్రశ్నములు, భగీరథోపాఖ్యానము, శిఖధ్వజోపాఖ్యానము, గజోపాఖ్యానము — మొదలగునవి వివరింపబడినవి.

పంచమ ప్రకరణములో నిర్వాణముకలదు. కచోపాఖ్యానము, భృంగ్యుపాఖ్యానము — మున్నగునవి ఈ ప్రకరణమునందున్నవి.

వసిష్ఠుని యుపదేశము వలన శ్రీరాముడు జీవునియొక్కయు పరమేశ్వరునియొక్కయు కార్య కారణైకత్వ ప్రకాశమర్మములను తెలిసికొనెను. పంచమ ప్రకరణాంత్యమున శ్రీరాముడు విశ్వామిత్రుని వెంట క్రతురక్షణార్థము పోవుట మొదలుకొని

మిగత రామాయణ కథాసార మంతయును క్లుప్తముగా 30 ద్విపదలలో తెలుపబడినది.

అతిగహనములగు వేదాంత విషయములను వెంగమాంబ తేట తెలుగు ద్విపదలతో సులభశైలితో సుబోధకముగ రచించినది.

ఆధ్యాత్మ రామాయణము:

ఇది రామకథా పరముగ జెప్పబడు వేదాంతార్థ ప్రతిపాదకము. దీనిని మామిడమ్మ సుభద్రమ్మ (1900 A· D.) ద్విపదలో రచించెను. ద్విపదలో వెలసిన ఆధ్యాత్మరామాయణములలో నిదియే మొదటిది, చివరది కూడ. ఈగ్రంథము ముద్రితము.

ఆధ్యాత్మ రామాయణమును సంస్కృతమున విశ్వామిత్రుడు రచించినాడట, కాణాద పెద్దనసోమయాజి (1775-1800 A. D.), కోటంరాజు నాగయామాత్యుడు (1860 A. D.), కంచర్ల శరభకవి — మున్నగువారు సంస్కృత ఆధ్యాత్మరామాయణమును పద్యకావ్యములుగ ననువదించిరి.

బ్రహ్మైక్యబోధ:

ఇది వేదవేదాంత విచారణగల తత్త్వగ్రంథము. దీనిని శేషమాంబ (1900 A, D.) ద్విపదలో రచించెను. ఈ ద్విపదగ్రంథము ముద్రితము.[119] ఇందు పూర్వోత్తర భాగములు కలవు. మొత్తము 300 ద్విపదలున్నవి. 8 అధ్యాయములుగ విభాగింపబడినది.

"యతులు గణంబులు ఎరుగను నేను
అతిశయ ప్రాస మిశ్రమముల నెరుగ
యప్పుడు గురుసేవయే యతి గణాము
యప్పుడు గురుభజ నే ప్రాసములు."

119. శైవసిద్ధాంత ముద్రాక్షరశాల - మద్రాసు. 1898 సం॥

అని శేషమాంబ తన్నుగూర్చి చెప్పికొనుటచే ఈమెకు గురుసేవ, గురుభజనతప్ప పాండిత్యప్రకర్ష లేదనియే తెలియుచున్నది. ఈమె గురువు సీతారాముడు.

శేషమాంబ పరతత్త్వముల నెన్నిటినో రచించినది. ఐ) హైమ్లక్యబోధ లోని ద్విపదలుకూడ చాలవరకు తత్త్వములవలెనే పాడుకొనుట కనువుగ రచింపబడినవి. తత్త్వములను తలపించు రచన యిది:

"తన్నుదా తెలియక తన గర్వము నాను
కన్న రాళ్ళకు మ్రొక్కి కడగానలేక
తల్లెవరో తండ్రెవరో తనపుత్రులెవరో
వెళ్లి పొయ్యేవేళ వెంటనురారు
తనపూర్వ కర్మంబు తాననుభవించి
కనుదప్పి పోదు దా కడ కేగుదనుక."

ఇట్లే నేటికిని జనసామాన్యమున ప్రచారములోనుండు తత్త్వముల భావములు, ఫణితులు ఈ ద్విపదగ్రంథమున చాల కలవు.

శేషమాంబ, సన్న్యాసులను, జంగాలను, వైష్ణవులను, మాధ్వులను తిరస్కారపూర్వకముగా విమర్శించిన విధముగనుడు:

సన్న్యాసులు:

"జిహ్వాకు రుచిగ భోంచేశేటి కొరాకు
జుట్టు జంధ్యము దీశి చోద్యమా కావి
బట్టలు జుట్టుక చట్టాల బాశి
జపమాల ధరియించి శ్రీహరి స్మరణ
నెపముగా ద్రిప్పుచు నేత్రముల్ మూశి
నారాయణా యనుచు నరులు జూడగాను
పూరూర నొకనాడు పుచితముగనుండి

జంగాలు :

"చంకను జోలెయు చక్కగా దొడిగి
వంకరశంఖంబు వకచాత బట్టి
పూరింపు కొనుచును బూడిదె బూశి
పారము తెలియక బ్రహ్మను భావాము
గోర నేరక తమకు గురులింగ మనూచు
హరహరా యనుచును అయ్యల మనూచు
తిరుగు చుందురు గాని దేహంబులోన
హరుడున్న కైలాస మందుకో లేరు."

వైష్ణవులు :

"బుట్టి ప్రసాదంబు తట్టెడు దినీయు
పట్టె వర్ధనములు బాగుగా దీర్చి
కట్టిన వస్త్రముల్ కడు తెల్లజేశి
యిట్టిటు దిరుగుచు యేము శ్రీవిష్ణు
భక్తుల మనుచును పరమపద మయిన
ముక్తియు గానక మరియు చుండుదూరు."

మధ్వాలు :

"మరియును కొందరు మధ్వల మనూచు
సరగున ముద్రలు చాలను బట్టి
అమరంగ గాల్చిన యంతనే మోక్ష
దము గల్గునని భ్రాంతి దగులుచే గాని."

పై వర్ణనలు చక్కగానున్నను, రచయిత్రికి భాషాపాట వముగాని, లక్షణజ్ఞానముగాని యెక్కువగా లేదనుట స్పష్టమగు చున్నది.

వసిష్ఠవాక్యములు:

'వసిష్ఠవాక్యములు' అనుపేరనున్న వేదాంత ద్విపదగ్రంథము అముద్రితము. (చూ॥ ఆ వా. సూ. 183 పుట). ఆద్యంతములు శిథిలములగుటచే దీని గ్రంథకర్త నామము తెలియదు. వసిష్ఠుడు శ్రీరామునికి బోధించిన అద్వైతము ఈ గ్రంథములోని కథాంశము. ఇది వేదాంతగేయముగా స్త్రీలలో ప్రచారమందినది.

జీవైక్యబోధము:

ఇది అద్వైత వేదాంత ప్రతిపాదకమగు ద్విపదగ్రంథము. ఇది అముద్రితము. (సంఖ్య 392 ఆర్. (ఎ) ప్రా. భా. మద్రాసు). దీని ఆద్యంతములు శిథిలములగుటచే గ్రంథకర్తృ నామాదికములను గూర్చిన వివరములు తెలియవు.

స్వరమంజరి:

'స్వరమంజరి' అను వేదాంతగ్రంథమును గౌరయామాత్యుడు రచించినట్లు మల్లయ వ్రాసిన పల్నాటివీరచరిత్ర కోళ్లపోరు అవతారికనుబట్టి తెలియుచున్నది.

"తత్త్వసారంబెల్లఁ దలపోసి కూర్చి
తేట తెల్లము గాను దెలుఁగు వారలకు
స్వరమంజరి యనంగ జగములో వెలయఁ
జేసిన పుణ్యుండు శివపదార్చకుఁడు
కౌండిన్య గోత్రుడా గౌరయామాత్య."

—కోళ్లపోరు – అవతారిక భాగము.

ఈ ద్విపద గ్రంథము అలభ్యము. ఈ గౌరయామాత్యుడును ద్విపద హరిశ్చంద్రోపాఖ్యాన కర్తయగు గౌరనయు ఒక్కరే కాదు. భిన్నులు.

## భగవద్గీత:

సంభాషణరూపమున వ్రాసిన ఛందోబద్ధములైన తాత్త్విక రచనల కన్నిటికిని 'గీత' లను వ్యవహారము కలదు. భగవద్గీత, ఉత్తరగీత, అష్టావక్రగీత, అవధూత - మొదలగు గీతలు కలవు. ప్రతి గీతయు నేదో ఒక పరమార్థిక సిద్ధాంతమును ప్రతిపాదించుటకే ప్రయుక్తమైనది. భగవద్గీత గీతలన్నిటికంటె ప్రశస్తమైనది; ప్రఖ్యాతమైనది. అది అమూల్యసూక్తులసంపుటి. ఆర్యసంస్కృతి సాకల్యమును ప్రదర్శించు దర్పణము వంటిది. విశ్వజనీన దృక్పథము కలదగుటచే భగవద్గీత సర్వదేశ సర్వకాలములందును ఆదరణపాత్రమగు చున్నది.

భగవద్గీతను ద్విపదలో కర్పూరము కృష్ణమాచార్యులు (1650 A. D.) రచించి చర్లపల్లి కేశవున కంకితము గావించెను. ఈ గ్రంథము గోలకొండ కవులసంచిక (పుట 397) లో పేర్కొనబడినది.

ఆధునికులలో వావిలకొలనుసుబ్బారావు(1863-1938AD) కూడ భగవద్గీతను ద్విపదలో రచించినట్లు తెలియుచున్నది. (చూ॥ ఆ. వా. సూ. పుట 134).

## ఉత్తరగీతామంజరి:

ఇది మహాభారతమునందలి అశ్వమేధపర్వమునగల ఉత్తర గీతలకు మంజరీద్విపదరూపమగు తెలుగు సేత. ఉత్తరగీతలలో పరబ్రహ్మస్వరూపుడగు కృష్ణుడు అర్జునునికి ఆత్మతత్త్వమును బోధించెను. దీనిని లక్ష్మీనారాయణయోగి 3 ఆశ్వాసములలో రచించెను. ద్విపద ఉత్తరగీతామంజరి అముద్రితము. (నెం. డి. 2072 (సమగ్రము) ప్రా. భా. మద్రాసు). ఈ గ్రంథమును కవి తన గురువగు అమృతానందయతి కంకితమిచ్చెను.

### రాజయోగసారము :

తరిగొండ వెంగమాంబ (1840 A. D.) రచితమగు 'రాజయోగసారము' 3 ప్రకరణములు గల ద్విపదగ్రంథము. ఇది ముద్రితము.[120]; సుమారు 850 ద్విపదలుగల వేదాంతగ్రంథము. దేవహూతీకర్దమ ప్రజాపతులకు శ్రీహరి కపిలుడై జన్మించును. కపిలదేవహూతులకు జరిగిన సాంఖ్య, యోగ వేదాంతసంబంధమగు సంభాషణము భాగవతము తృతీయస్కంధమున వివరింపబడినది. భాగవతభాగము నాధారముగ చేసికొనియే వెంగమాంబ రాజయోగసారమును రచించినది. విరక్తిమార్గము, పిండోత్పత్తి లక్షణము, బ్రహ్మస్వరూపము, జీవన్ముక్తి విచారఘట్టము, తారక యోగ, రాజయోగలక్షణములు, పంచకోశప్రకరణము-ఇత్యాది వేదాంతవిషయములను వెంగమాంబ తేటతెలుగు ద్విపదలతో విశదముగా పామరజన సుబోధకముగ రచించెను.

దేవహూతి తన పుత్రుడగు కపిలునే సద్గురువుగా భావించి, జీవన్ముక్తి బడయగోరి అతనితో పల్కు వాక్యములివి:

"ఏనొల్ల భాగ్యంబు నే నొల్ల పదవి
నేనొల్ల సంసార మే నొల్ల నెల్ల
నీలీలఁ దెలియక యే యున్న నాళ్ళు
కాలంబు నూరక గడుపుచు నుంటి
సకల లోకాతీత సత్యమా తత్వ
మికనైన నుపదేశ మీవయ్య దేవ."

—ద్వితీయ ప్రకరణము. పుటలు 37–38.

పై ద్విపదలోని సులభశైలిని, సారళ్యమును బట్టి వెంగమాంబ రచన సుబోధకమైనదని చెప్పవచ్చును.

---

120. వావిళ్ల రామస్వామి అండ్ సన్స్. మద్రాసు. 1930.

## మాయానిరాలంబమంజరి:

ఈ మంజరీ ద్విపదకర్త రామకృష్ణకవి. ఇతడు పెనుపర్తి నివాసియగు సుబ్రహ్మణ్యగురు ప్రేరణమున ఈ ద్విపదగ్రంథమును రచించి అతనికే అంకితమిచ్చెను. ఇది అముద్రితము. (ఆర్. నెం. 2155. ప్రా. భా. మద్రాసు). ఇందు సాంఖ్యాది యోగములలోని యమనస్క యోగమునుగూర్చి వివరణము కలదు. నిరాలంబోపనిషత్తు దీనికి మూలము.

గ్రంథాంతమున ఫలశ్రుతి:

"ఆశపాశలఁ జెంద నతఁడె జీవుండు
ఆశఁ జెందనివాడు నతఁడె జీవుండు
గాన మహావాక్య క్రమమిది పుత్ర
పూని మననము చేసి పొందు మోక్షంబు
లాలితంబౌ నిరాలంబోపనిషతు
నాలీల సహజామనస్క రాజంబు
పరగ మహావాక్య పద్ధతు లెలమి
వినుతింప వ్రాసిన వినినఁ జదివినను
పనుపడ మననంబు పరగఁ జేసినను
అరయ జీవన్ముక్తి యనుభవంబగును
............................................"

## వీరమాహేశ్వరాచార సంగ్రహము:

సంస్కృతమున నీలకంఠ నాగనాచార్యుడను శైవాచార్యునిచే రచింపబడిన వీరమాహేశ్వరాచార సంగ్రహమును పర్వతమంత్రి లింగన 10 ఆశ్వాసములలో ద్విపదకావ్యముగా భాషాంతరీకరణము గావించినాడు. లింగన ద్విపద వీరమాహేశ్వరాచార సంగ్రహము అముద్రితము (ఆర్. నెం. 2197 ప్రా: భా. మద్రాసు. లిఖితప్రతి).

పర్వతమంత్రి లింగన ఈ గ్రంథమును తన గురువగు శ్రీ మల్లికార్జునుని ప్రేరణముచే రచించినాడు. లింగన, మల్లికార్జున పండితారాధ్యుని ప్రత్యక్షశిష్యుడేని అతడు 12 శతాబ్దముననుండి యుండును. లింగన, రుద్రాక్షమాహాత్మ్యమను ద్విపద గ్రంథమునుకూడ రచించినాడు.

ద్విపద వీరమాహేశ్వరాచారసంగ్రహ లిఖితప్రతియందు బ్రౌనుదొరగారీ క్రిందివిధముగ సమీక్షించిరి.

"This is one of the Aradhya or semijangama works labouring to reconcile the creed of Basava with the various superstitions in Vogue among Brahmins. Such treatises seems to aim at reconciling the Smarthas to the Aradhyas, No wonder that the Jangamas reject such books as heritical. Basava endevoured to abolish the very customs herein inculcated."

వీరమాహేశ్వరాచార సంగ్రహము 10 ఆశ్వాసముల లోను విభూతిమహిమ, రుద్రాక్షమహిమ, పంచాక్షరీమహిమ, శివరాత్రి మహిమ, శంఖచక్రోత్పత్తి మహిమ, మార్కండేయ చరిత్ర, విష్ణుశాపవిమోచనము, శరభేంద్రమహిమ, వ్యాసశిక్ష అను 10 విషయములు వర్ణింపబడినవి.

రుద్రాక్షమాహాత్మ్యము:

ఈ ద్విపదగ్రంథకర్త పర్వతమంత్రి లింగన.

"లీల పర్వత మంత్రి లింగనామాత్య
విరచితముగ సర్వ వేదోక్త మగుచు
శ్రీ రమ్యమై సర్వ సేవ్యమై యొప్పు
వీరమాహేశ్వరాచార సంగ్రహణ

మందులో నొప్పు రుద్రాక్షమాహాత్మ్య
మందమై యొప్పును నఖిల లోకముల."

అను గ్రంథాంత ద్విపదపంక్తులనుబట్టి వీరమహేశ్వరాచారసంగ్రహములోని రుద్రాక్షమాహాత్మ్య భాగమునే ప్రత్యేక ద్విపద గ్రంథముగా లింగన రచించినట్లు తెలియును. రుద్రాక్షమాహాత్మ్యము, దాని పుట్టుక, రుద్రాక్షలు ధరించిన కలగు ఫలమును ఈ ద్విపదగ్రంథములోని ముఖ్యాంశములు.

ఈ ద్విపద గ్రంథము ననుసరించియే అమలాపురము సన్యాసకవి 3 ఆశ్వాసముల పద్యగ్రంథముగా రుద్రాక్షమాహాత్మ్యమును రచించెను.

మనోబోధ:

'మనోబోధ' అను శైవవేదాంతగ్రంథమును గణపనారాధ్యుడు (కొలని గణపతి దేవుడు-1400 A. D.) మంజరీద్విపదలో రచించెను. ఈ గ్రంథము అముద్రితము (సంఖ్య డి. 2152 ప్రా. భా. మద్రాసు).

మనస్సును సంబోధించుచు శైవమాహాత్మ్యమును, శైవభక్తిని ప్రబోధించుట ఈ మంజరీద్విపదగ్రంథములోని కథాంశము.

గ్రంథారంభము:

"మనస! తలంపు మీ మాయలంబడక
మాయచే జగములు మాయమౌచుండు."

గ్రంథాంతము:

"భక్తులఁ బూజింపు భక్తులఁ గొలువు
భక్తులందు శివుండు ప్రమథులు దాను
బాయ కెప్పుడు నుండు పరమార్థ మిదియ

నా బోధ విని భక్తి నైష్ఠికంబునను
భక్తాను భవమునఁ బ్రదుకవే మనసా
అని మది బోధించె ననురాగ మలర."

పై ద్విపదలనుబట్టి గణపనారాధ్యుని రచన కొంతకుకొంత తెలిసికొన వచ్చును. గణపనారాధ్యుడు శివయోగ సారమను పద్యగ్రంథమునుకూడ రచించినాడు.

వీరశైవదీక్షాబోధము:

వీరశైవ దీక్షాబోధమును కెరయపద్మరసు (1165 A. D.) మొదట సంస్కృతమునను, ఆ తర్వాత కన్నడములో రగడల లోను రచించినాడు. ఈ కన్నడ దీక్షాబోధ ననుసరించియే పిడుపర్తి బసవన (1475–1500 A. D.) 3 ఆశ్వాసముల ద్విపదగ్రంథముగ రచించెను. ఈ గ్రంథము అముద్రితము (ఆర్. నెం. 2204. ప్రా. భా. మద్రాసు). వీరశైవాచార ధౌరేయుడైన వీరభూవరుని కీ గ్రంథము అంకితము.

ఇందు వీరశైవమత సిద్ధాంతములు, ఆచారధర్మములు, మతతత్త్వము, గురుశిష్య లక్షణములు, దీక్షావిధానాదికమును విపులముగా వర్ణింపబడినది. వేదవేదాంత సిద్ధాంత సకలాగమ గ్రంథ సారములీ గ్రంథమున కూర్పబడినవి. వీరశైవదీక్షాబోధము నందలి వీరశైవమత సిద్ధాంతములు, గురుదీక్ష బోధనాదికములు మున్నగున వన్నియు మల్లికార్జునుని శివతత్త్వసారమునందును, పాల్కురికి సోమనాథుని ద్విపద గ్రంథములందును సప్రమాణముగా నిరూపింపబడినవి.

శివజ్ఞానమంజరి:

ఇది 'శివజ్ఞానము' అను పేరుతోనున్నను నిది అద్వైత జ్ఞానమునే బోధించుటచే దీనికి అద్వైతపరమగు ద్విపదతాత్త్వి

కములలో చేర్చుటయు క్తము. ఈద్విపదగ్రంథమునురచించినవాడు పరమానంద తీర్థుడు. (1600 A. D.) ఇతడు దత్తాత్రేయశిష్యగణములలో అద్వితీయుడు. "వీరశైవవాఙ్మయమునకు పాల్కురికి సోమనాథు డెట్టులో దత్తాత్రేయ వాఙ్మయమునకు పరమానంద తీర్థుడట్టివాడు." 121 ఈతనికి "పరమానందయతి"యను నామాంతరముకూడ కలదు.

ద్విపద శివజ్ఞానమంజరి అముద్రితము (ఆర్. నెం. 2232. ప్రా. భా. మద్రాసు). తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ యందలి ప్రతి (నెం. 369_361) సమగ్రముగా నున్నది.

పరమానందయతి వేదాంతశాస్త్రములందు మంచి అనుభవము గడించినవాడు. తనకు ముందుండు వేదాంతశాస్త్రముల నన్నిటిని పరిశీలించి, ప్రాజ్ఞులు మెచ్చుకొనునట్లు, 'లోకరక్షణార్థము' ద్విపదలలో శైవ, యోగ, వేదాంత విషయములను సుబోధకముగ ఈ ద్విపద శివజ్ఞానమంజరిని రచించినట్లు కవి తెల్పియున్నాడు.

"మహిత శివజ్ఞాన మంజరి యనగ
మహిలోనఁ బ్రాజ్ఞ సమ్మతి గాఁగఁ బూని
రచియించెదను లోక రక్షణార్థముగ
బ్రచురంబుగా నాంధ్ర భాషను బూని
సిద్ధాను భూతి సంసిద్ధి వహించు
సిద్ధులు లోక ప్రసిద్ధులు సొమ్మి
మున్ను జేసిన యట్టి ముఖ్యశాస్త్రంబు
లన్నియు చూచినే నందుల యర్థ
భావమెల్లను దేట పఱచెద ప్రౌఢి."

---

121. చూ॥ దత్తాత్రేయ వాఙ్మయము' - శ్రీ నిడుదవోలు వేంకటరావు. క్రోధి సంవత్సరాది సంచిక (55వ సంచిక). పుట 20. 1964_65.

అని గ్రంథారంభమున పరమానందతీర్థుడు తెల్పినాడు. ఇతడు తెలుగులో శతకములను, యక్షగానములను, వచనములనుకూడ రచించినాడు.

## అనుభవదర్పణము:

పరమానందతీర్థుడు రచించిన మరొక వేదాంతగ్రంథము అనుభవ దర్పణము. ఇది 4 ఆశ్వాసముల ద్విపదగ్రంథము; అముద్రితము. (ఆర్. నెం. 293. తంజావూరు సరస్వతీమహాల్ లైబ్రరీ) ఇందు కవియొక్క వేదాంతానుభవములు చక్కగా వివరింపబడినవి. వేదాంతశాస్త్రమునం దనుభవము గడించినయోగి యగుటచే పరమానందతీర్థుడు తన అనుభవజ్ఞానమును బోధచేయు నుద్దేశముతో నీ గ్రంథమును రచించెను. ఇందు వ్యాకరణదోషము లచ్చటచ్చట కన్పించుచున్నను, పరమానందతీర్థుని కవిత్వము మొత్తము మీద మృదువై, సుబోధకమై యలరారుచున్నది.

## శివగీత:

'శివగీత' అనుపేర ఒక ద్విపదగ్రంథము కలదు (చూ॥ ఆ. వా.సూ. పుట 205). దీనికర్తృనామాదికములు తెలియవు. శైవవేదాంత మిందు వివరింపబడినది.

## గురుశిష్యసంవాదము:

ఇది మంజరీద్విపదలో రచితమైన శైవవేదాంత బోధకమగు గ్రంథము. అముద్రితము (ఆర్. నెం. 98. ప్రా. భా. మద్రాసు). ఈ గురుశిష్య సంవాదకర్త యోగానందావధూత స్వామి (16శతాబ్దాంత్యము). ఇతడు చింతలలింగగురునిశిష్యుడు.

ఈ మంజరీద్విపదలో జీవుని ముక్తిమార్గమును, రాజయోగమును, వానిచే పరబ్రహ్మమును చేరువిధమును చక్కగా వర్ణింపబడినది.

"అనుభవార్థంబంత యదిలెస్స తెలిసి
అనుదిన మీబోధ నరయుఁడు మీరు
యతి ప్రాసముల గొడవ యేలను మీఁద
గతి గురుఁడని తలఁచు గతియది మాఁక."

అని కవి గ్రంథారంభమున తెల్పుటచే ఈ గ్రంథమున విషయ విపులీకరణమే ప్రధానమనుట తెలియును.

యోగీశ్వరవిలాసము :

యోగీశ్వరవిలాసమును ద్విపదలో రచించినవాడు సిద్ధేంద్ర యోగి (1750 A. D.). ఇతడు బాలబ్రహ్మలింగవిగ్రహ విశాల కృపాలబ్ధకు తకవిత్వంబు శ్రీమతిఁగైకొన్నవాడ" నని గ్రంథాంతములో చెప్పికొనినాడు. బాలబ్రహ్మలింగడు కవియొక్క గురువు. యోగీశ్వర విలాసము అముద్రితము. (ఆర్. నెం. 1178, 1189. ప్రా. భా. మద్రాసు). ఇది కర్నూలు నవాబగు భ్రాజత్ఖానునకు అంకితము. ఇందు అల్లమప్రభువు అక్కమహాదేవి కుపదేశించిన వీరశైవమత సిద్ధాంతములు వివరింపబడినవి.

విభూతిరుద్రాక్షమాహాత్మ్యము :

బ్రహ్మోత్తరఖండములోని విభూతి, రుద్రాక్షమాహాత్మ్య కథాంశముల ననుసరించి పోచిరాజు వీరకవి (1800 A. D.). విభూతి రుద్రాక్షమాహాత్మ్య మను ఏకాశ్వాస ద్విపదగ్రంథమును రచించి శ్రీపతి పండితారాధ్యున కంకితము చేసెను. ఈ ద్విపదగ్రంథము అముద్రితము (ఆర్. నెం, 635. ప్రా. భా. మద్రాసు). కవి వీరశైవుడు.

## శైవసిద్ధాంతశిఖామణి:

ఇది రేణుకాచార్యుని సంస్కృత శైవసిద్ధాంతశిఖామణికి ద్విపదానువాదము. దీనిని 4 ఆశ్వాసములుగా చెన్నాప్రగడ నాగేశ్వరకవి రచించెను. గ్రంథము అముద్రితము (ఆర్. నెం. 550. ప్రా. భా. మద్రాసు లిఖితప్రతి). నాగేశ్వరకవి దీనిని తన గురువగు మల్లంపల్లి రామలింగారాధ్యులప్రేరణముచే ద్విపదలో రచించినాడు. ఇది వీరశైవవేదాంత ప్రతిపాదకమైన గ్రంథము. పిండతామాహాత్మ్యము, గోపిండ విజ్ఞానమహిమ, సంసారగుణ హేయచరితము, ఘోరసంసారహరము, దీక్షాప్రకరణము, లింగ ధారణమాహాత్మ్యము, విభూతిధారణము- రుద్రాక్షధారణము- అను కథాంశములు ప్రథమాశ్వాసములో కలవు.

ద్వితీయాశ్వాసములో ఆదిభక్తస్థల వ్యాఖ్యానమను శైవ పంచాక్షరీమహిమ, భక్తప్రియాచరణము, గురులింగపూజ, జంగమపూజ, ప్రసాదలక్షణము, సాంగదానత్రయ చరిత్రము లనెడి యంతరావాప్తస్థలాష్టకాఖ్యాన మంతయును కలదు.

తృతీయాశ్వాసమున మాహేశ్వరస్థలము, ఆంతరస్థల సప్తకాఖ్యానమగుచు ప్రసాదస్థలము, ప్రాణలింగస్థలము, శరణ స్థలము, ఐక్యస్థలమును కలవు.

చతుర్థాశ్వాసమున షట్స్థలములను గురులింగస్థలము, జంగమస్థలము-ఇత్యాదులుగ 18 లింగస్థలములు వివరింపబడినవి.

## గురుబోధ:

వీరశైవుడగు సోమనకవి 'గురుబోధ' ను 3 ఆశ్వాసముల ద్విపదగ్రంథముగా రచించెను. సోమనకవి రేవణుని శిష్యుడు; శివకవియగు వీరభద్రుని పుత్రుడు.

ఈ ద్విపదగ్రంథము అముద్రితము (ఆర్. నెం. 2081, 2082. ప్రా. భా. మద్రాసు). ఇందు శివయోగరహస్యములు వివరింపబడినవి. ఒక శిష్యుడు తన సందేహములను తీర్చుమని గురువును ప్రార్థింపగా గురువాతని సందేహములను తీర్చుచు శైవయోగ రహస్యములను బోధించినాడు.

గ్రంథారంభము :

"చూపులు గోచరము చూపేటి యట్టి
యీ పంచ తత్త్వంబు లెందుదయించె
నీ శరీరంబులు నీ యింద్రియములు
వేసట లేని యీ విషయేంద్రియములు
నాసక్తిఁ దిరుగు జీవాత్మ తోడుతను
భాసురంబుగ నెందుఁ బ్రభవించె దీని
తెఱఁగెల్ల వేర్వేఱ తెలుపగవలయు."

అని శిష్యుడు గురువును ప్రార్థించును.

## శతైకస్థలము :

ఈ ద్విపద గ్రంథప్రతి (ఆర్. నెం. 2227) మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు కలదు. గ్రంథము అసమగ్రము. కృతివిషయము, కవికిసంబంధించిన వివరములు తెలియరావు. దీని కర్త యెవరో కూడ తెలియదు. ఇందు శైవవేదాంతము వివరింపబడినది.

## తత్త్వార్థదర్పణము :

లక్ష్మణార్యకవి రచితమగు తత్త్వార్థదర్పణము 4 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. ఈ గ్రంథము అముద్రితము (ఆర్. నెం. 609. ప్రా. భా. మద్రాసు). ఇందు రామానుజాచార్యుడు బోధిం

చిన ముఖ్యమైన విశిష్టాద్వైత వేదాంత మతసిద్ధాంతములు తెలుపబడినవి. ఇది వైష్ణవ మత గ్రంథము.

గ్రంథాంతము:

"శేషావతార నిశ్శేషితా శేష
పాషండ దుర్వాది బాహ్యకు దృష్టి
వాద వేదాంతర జ్వర భేషజాస్మ
దాది రక్షక యతీంద్రాంఘ్రి నిక్షిప్త
కామ లక్ష్మణయోగి గర్భి తాత్మాభి
రామానుజోక్త సుశ్రావ్య తత్త్వార్థ
దర్పణంబును ప్రబంధము లక్ష్మణార్యుఁ
డర్పించు మని తానె యంగీకరించె
నందుఁ జెప్పిన చతుర్థాశ్వాస మిలను
నెందు నెప్డు జనుల కిష్టమై వెలయు."

తత్త్వార్థ దర్పణమును అచ్చి రామానుజాచార్యులు (1700 A. D.) కూడ ద్విపదలో రచించినట్లు తెలియుచున్నది.[122] అచ్చి రామానుజాచార్యులు తెలంగాణా ప్రాంతమువాడు. ఇతడు మోక్షసారము, ముముక్షుజనకల్పము—అను గ్రంథములనుకూడ రచించినాడు.

తిరువాయిమొళి:

'తిరువాయిమొళి' అను వైష్ణవ సంప్రదాయగ్రంథమును ద్విపదలో రచించినవాడు కాంద్రవేటి రామానుజాచార్యులు (1600 A. D.). ఇతడు 'శృంగారకవిరాయ' బిరుదాంకితుడు. తెలంగాణా ప్రాంతమందలి కాంద్రవేడు ఇతని నివాసము.

'తిరువాయిమొళి' ద్విపదగ్రంథమును గూర్చి గోలకొండ కవుల సంచిక (పుట 407) లో కలదు.

122. గోలకొండ కవుల సంచిక పుట 407.

తిరుప్పల్లాండు:

ఇది వైష్ణవమత ప్రబోధకమగు ద్విపదగ్రంథము. దీనిని శ్రీ భండారం సుదర్శనార్యారయ్య రచించెను. ఈ ద్విపదగ్రంథము ముద్రితము. (సంఖ్య B. M.C. 14174 1-2(3) ప్రా. భా. మద్రాసు). 123

మువ్యార్తవైభవము:

ఇది విశిష్టాద్వైతమతప్రబోధకమగు శ్రీ వైష్ణవగ్రంథము. దీనిని గోవర్ధన అనంతకవి (1794 A. D.) 3 ఆశ్వాసముల ద్విపద గ్రంథముగ రచించెను. గ్రంథము అముద్రితము (ఆర్. నెం. 336 (సమ). ప్రా. భా. మద్రాసు). అనంతకవి వేంకటకృష్ణుని శిష్యుడు.

ఈ ద్విపదగ్రంథమున పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతార వర్ణనపూర్వకముగ విశిష్టాద్వైత మతస్వరూపము వివరింపబడినది. గ్రంథమున సౌమ్యజ మాతృముని, పరవస్తు లక్ష్మణమునీంద్రుడు – అనువారి ప్రస్తావన కలదు.

గ్రంథాంతకవి గద్య:

"గద్యయితి శ్రీ జగన్మంగళార్ధ
విద్యావిశేష ప్రవీణ స్వరూప
శీల తెన్నరంగం పొన్నుడిప్ర
భా శుంభ దాకార పరవస్తు నిస్తు
లాక్షీణ కరుణా కటాక్ష లబ్ధ
వీక్షణ వేంకట కృష్ణార్య చరణ
కమల మిళింద వేంకట రాయపుత్ర
విమల గోవర్ధన విఖ్యాత వంశ
శ్రీనిరుపమ గుణాంచిత యనంతాభి

123 చూ॥ ద్విపద వాఙ్మయ సూచిక - Annals of oriental Research Madras Vol IX 1951-52 ని॥ వేంకటరావు.

ధాన కవి ప్రణీతం బైనయట్టి
ప్రతివేని మువ్వార్త వైభవంబందు
చతురత్వ విభవాది షట్కళాకృతులు
పదములు నవ శతోపరి డెబ్బదెనిమి
దుది సర్వమును దృతీయాశ్వాసమయ్యె"

## 9. చారిత్రకములు:

భారతీయులకు చారిత్రక దృక్పథము లేదని పాశ్చాత్య విమర్శకాభిప్రాయము. ఈ అభిప్రాయము సర్వజనాంగీకృతము కాదు. పాశ్చాత్యులకు చరిత్ర రచనావిషయమున వ్యక్తుల జనన మరణాదికములకు, జీవితవిధానములకు, యుద్ధములు దండయాత్రలు - మున్నగు లోకసంబంధములే ప్రధానాంశములు. కేవలము ఐహికాంశములు భారతీయులకంత ముఖ్యములు కావు. వారి దృక్పథము ఆముష్మిక వ్యగ్రమైనది. "భారతీయుల చరిత్ర రచనములో విజ్ఞానము, యశస్సు, విక్రమము - అనునవి ప్రధానాంశములు. భారతీయుల చారిత్రక దృక్పథమును గ్రహింపలేకపోవుటవలననే అవి వెఱ్ఱిమొఱ్ఱి వేదాంతములతో నిండియుండునని పాశ్చాత్యులు కొందరు భారతీయచరిత్రల నీసడించియుండుటకు హేతువు." తెలుగువారికికూడ చరిత్రమంటే అంత ప్రత్యేకమైన ఆసక్తియున్నట్లు కన్పించదు. మొత్తముమీద తెలుగులో సిసలైన చారిత్రక గ్రంథముల సంఖ్య స్వల్పము. పండితలోకమున వాని కాదరణకూడ అంతగానుండినట్లు తోచదు. తెలుగులో చారిత్రకాధారములుగ నుపయుక్తములగు ద్విపదరచనలును తక్కువ. ఉన్నవానిని ఈ క్రింద పేర్కొని పరిశీలింతము.

(1) సిద్ధేశ్వరచరిత్ర - కాసె సర్వప్పకవి (1400 A. D.)

(2) పల్నాటి వీరచరిత్ర — శ్రీనాథుడు (15 శతాబ్ది)
మల్లయ (16 శతాబ్ది)
కొండయ ... ... ...
(3) కాటమరాజు కథ (అలభ్యము)— శ్రీనాథుడు.
(4) ,, -- గంగుల పినయల్లయ (17 శతాబ్ది)
(5) అన్నమాచార్యచరిత్ర - చిన్నన్న (16 శతాబ్ది)
(6) అచ్యుతాభ్యుదయము (అలభ్యము) — రఘునాథనాయకుడు (17 శతాబ్ది)
(7) రఘునాథనాయకాభ్యుదయము — విజయరాఘవనాయకుడు (17 శతాబ్ది)
(8) భేతాళచరిత్ర — పిల్లలమఱ్ఱి బంగారు రంగప్ప (1770 A.D.)
(9) పెద్దబొబ్బిలిమహారాజుకథ — కాదూరు చెంగల్వరాజువీరయ్య

సిద్దేశ్వరచరిత్ర:

సిద్దేశ్వరచరిత్రమునకు 'సిద్దేశ్వర మాహాత్మ్యము', 'ప్రతాపచరిత్రము, 'కాకతీయరాజవంశావళి' — అను నామాంతరములు కలవు. దీనిని కాసె సర్వప్పకవి రచించెను. గ్రంథము ముద్రితము.[124] సర్వప్పకవి క్రీ. శ. 1400 ప్రాంతమువాడని శ్రీ చాగంటి శేషయ్యగారు తెల్పిరి.[125] సర్వప్పకవి తన సిద్దేశ్వర చరిత్రలో ఏకామ్రనాథుని (1369 A. D.) వచనప్రతాపచరిత్రను స్మరించినాడు.[126] సిద్దేశ్వరచరిత్రను ఆధారముగ చేసికొని 'సోమ

---

124. ఆంధ్ర రచయితల సంఘము _ హైదరాబాదు. 1960.
పరిష్కర్త: ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము.

125. చూ॥ ఆంధ్రకవి తరంగిణి - సంపుటము 2. పుట 240.

126. చూ। సిద్దేశ్వరచరిత్ర - ద్వితీయాశ్వాసము పుట 22.

దేవరాజీయము'ను పేరుతో చంపూకావ్యముగ రచించినవాడు కూచిమంచి జగ్గకవి (1720).

సిద్ధేశ్వరచరిత్రము కేవల ద్విపదరచన కాదు. ఇందు రెండు భాగములున్నవి. ద్విపదభాగము వచనభాగము అని. ద్విపదభాగము 3 ఆశ్వాసములు కలది. దీనిని మరల రెండుభాగములుగ విభజింపవచ్చును. ప్రథమభాగమున కైలాసనివాసి యగు శివుడు హనుమకొండయందు సిద్ధేశ్వరుడను నామముతో నవతరించి ప్రసిద్ధిగాంచుటను వర్ణింపబడినది. ఈ భాగమందలి శివపార్వతుల వివాహవర్ణనలందు సర్వప్పకవి ఆనాడును, ఈ నాడును కూడ కన్పించు చక్కని దేశీయాచారములను చిత్రించి యున్నాడు.[127] ఇందలిసిద్ధేశ్వరావిర్భావ కథాభాగమునుబట్టియే దీనికి సిద్ధేశ్వరమాహాత్మ్యమను పేరు సిద్ధించియుండవచ్చును.

ద్విపదలోని ద్వితీయభాగములో కాకతీయరాజుల వంశ చరిత్రయు, వచనభాగమున ప్రతాపరుద్రుని జీవితచరిత్రయు విపులముగా వర్ణింపబడినది. వచనభాగమునుబట్టి దీనికి 'ప్రతాప చరిత్ర'అను పేరుకూడకలిగియుండును. ఈవచనభాగము ప్రక్షిప్త భాగమై యుండవచ్చునని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారి అభిప్రాయము.

"The last chapter of the book, actually describing the life of Prathapa Rudra is written in prose. Evidently this part is an addition to the work, done by another writer to complete the scheme of Sarvappa."[128]

---

127. చూ॥ సిద్ధేశ్వరచరిత్ర ప్రథమాశ్వాసము - పుటలు 11-18.

128. చూ॥ సిద్ధేశ్వరచరిత్ర పీఠిక - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము

సిద్దేశ్వరచరిత్రయందు కాకతీయులనాటి రాజులగుణములు వారిపరిపాలనావిధానము, వారివీరవిహారము, ఆకాలపు సాంఘిక విశేషములు, మతములు, అచారములు, తటాక, దేవాలయ నిర్మాణములు, నీతిసంపద, వేషభాషలు, అభిరుచులు, సంప్రదాయములు - మున్నగు నంశములు విపులముగా గలవు. క్రీడాభిరామమువలె సిద్దేశ్వరచరిత్రకూడ విలువగల ప్రామాణిక సాంఘికజీవితము ప్రతిబింబింపజేయుగ్రంథము. వంశచరిత్రను వర్ణించు ద్విపదరచనలలో నిది అగ్రగణ్యమైనది.

## పల్నాటివీరచరిత్ర:

ఒక జాతియొక్క శౌర్యసాహసాదులను పురస్కరించుకొని జరిగిన చారిత్రక సంఘటనలు ప్రధానముగ వీరరసపరిప్లుతములు. ఇట్టి సంఘటనల నాధారముగ చేసికొని ప్రజలలో జాత్యభిమానమును, దేశభక్తిని, వీరత్వాదులను ఉద్దీపింపజేయు గేయరచనలు ప్రతిజాతియందును పుట్టుచుండును. ఇట్టి గేయరూప రచనలను వీరగీతము (Ballad) లందురు. ఇట్టి రచనలు జానపదులసాహిత్యమందే గాక, పండితసాహిత్యమందును నుండవచ్చును. ఇట్టి రచనలనుగూర్చి 'పల్నాటివీరచరిత్ర' (ద్వితీయముద్రణము) పీఠిక [129] లో నిట్లు కలదు.

"The Ballad is a special branch of Telugu literature and I have no information whether such a branch exists in the other Vernaculars of India or not. What ever may be the reason, such a branch does not evidently exist in Sanskrit although episodes of Vatsa-

---

129. Preface to veera charitra - Page 10-11.
పల్నాటివీరచరిత్ర_పరిష్కర్త: అక్కిరాజు ఉమాకాంతము
శ్రీరామ ముద్రాక్షరశాల. 1955. ద్వితీయ ముద్రణము.

raja and Vikramarka etc,are sufficiently inspiring. These ballads are recited before big audiences generally during moon-lit-nights with the necessary accompaniments and gestures and are semi-dramatic in nature. They resemble the vrittis mentioned by Bharata which may be considered as the germs of the developed Indian drama. Generally the purpose of the ballads is to create mainly reverence and admiration towards the heroic souls by a sort of narration appealing to the popular imagination and emotions. It is why poetic sublimity of high thought cannot be expected in it."

వీరగీతములను వాఙ్మయ శాఖయందు పల్నాటివీరచరిత్ర ప్రథమ గణ్యము. పల్నాటివీరచరిత్ర అను మంజరీద్విపదగ్రంథమును విశాలాంధ్రప్రచురణాలయమువారు సమగ్రముగా ముద్రించిరి.[130] దీనికి ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు చక్కని పీఠికను వెలయించిరి. ఈ ముద్రిత పల్నాటివీరచరిత్రమున 11 ప్రకరణములు కలవు. (1) అనుగురాజు పలనాటి సంపాదనము (2) పలనాటి రాజ్యవిభాగము (3) కోళ్ళపోరు; గోపన్నవిరుగు (4) అరణ్యవాసము (5) మందపోటు; లంకన్నవిరుగు (6) గురజాలయుద్ధము (7) అలరాజు రాయబారము (8) కల్లుప్రతిష్ఠ (9) బాలచంద్రుని యుద్ధము (10) కొమ్మరాజుయుద్ధము (11) బ్రహ్మన్నవిరుగు అనునవి. పలువురు వ్రాసిన ఈ పదకొండు ప్రకరణములలోను, తమ పేర్లు చెప్పకొన్న కవులు ముగ్గురుమాత్రమే. వారు శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ. కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధములను శ్రీనాథుడు రచించినట్లు ఆద్యంతములందును,

---

130. పల్నాటి వీరచరిత్ర - విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రథమ ముద్రణ 1961.

కోళ్ళపోరు; గోపన్నవిరుగును, మల్లయ వ్రాసినట్లు అవతారిక యందును, కొమ్మరాజుయుద్ధమును, కొండయ చెప్పినట్లు ఫలశ్రుతి యందును కలదు. మిగిలిన ఏడు ప్రకరణములలోను మొదటి రెండింటిని వ్రాసినకవి ఒక్కడే; కాని అతడెవరో తెలియదు,'' అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారు 'పల్నాటివీరచరిత్ర'– పీఠిక (పుట 32) లో వ్రాసిరి. దీనినిబట్టి పల్నాటివీరచరిత్రము సంపూర్ణముగా ఒక కవి చేతిమీదుగా సాగలేదనుట తెలియును.

''జనులెల్లభక్తిచే చదువుటకొరకు'' శ్రీనాథుడు 'మంజరీ ద్విపద' లో పల్నాటివీరచరిత్ర భాగమును చెప్పినాడు. పల్నాటి వీరచరిత్రభాగ రచనముచే కవిసార్వభౌముడు, విద్యాధికారి, యుగకర్తయునైన శ్రీనాథుడు అచ్చముగా ప్రజాకవియైనాడు. శివకవులుప్రారంభించిన ద్విపదకవితను చేపట్టి చరిత్రప్రధానమగు వీరగాథను రచించి యితర తెలుగుకవులలో మృగ్యమగు జాత్యభి మానమును ప్రదర్శించియున్నాడు.

పల్నాటివీరచరిత్ర స్వతంత్రరచన. తెలుగుదేశమున క్రీ.శ. 1181–82 మధ్యకాలమున జరిగిన పల్నాటియుద్ధమిందలి కథా వస్తువు. ఆంధ్రదేశ చరిత్రలో ఈ పల్నాటియుద్ధము ఆంధ్రుల బలపరాక్రమాదుల కొక రసోజ్జ్వలవ్యాఖ్యానము. భారతకథకును పల్నాటియుద్ధ కథకును పెక్కుపోలికలుండుటచే పల్నాటివీరచరి త్రకు పల్నాటిభారతమనియు వ్యవహారము కలదు. ఆర్యులకు భారతమెట్టిదో ఆంధ్రులకు పల్నాటివీరచరిత్రయట్టిది. పల్నాటి వీరచరిత్రయంతయు మహాభారతమునకు కొద్దిపాటి ప్రతిబింబ ముగా కన్పించును. ''యుద్ధతంత్రముల తనివి సనక భారతవీరులే మరల పలనాట నవతరించిరనియు, భారతగాథయే తెలుగుతన మలరించుకొని ఆంధ్రావనిపై రూపాంతరమందినదనియు కొంద

అందురు." 131 అని శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు తెల్పిరి.

| మహాభారత కథాంశములు: | పల్నాటివీరచరిత్రలోని సమానఘట్టములు: |
|---|---|
| (1) కౌరవపాండవులు అన్నదమ్ముల బిడ్డలు. | (1) నలగామ మలిదేవులు సవతుల బిడ్డలు. |
| (2) దాయభాగమునుగురించియే తగవు. | (2) ఇక్కడకూడ నంతియే. |
| (3) పాచికలతోనాడిన మాయాద్యూతము. | (3) కోళ్ళపోరాటము. |
| (4) అరణ్యాజ్ఞాతవాసము. | (4) మండలాదివలస. |
| (5) ఘోషయాత్ర. | (5) మందపోటు |
| (6) రాయబారములు విఫలమయ్యెను. విషప్రయోగమునుండి శ్రీకృష్ణుడు తప్పించుకొనెను. | (6) ఇక్కడకూడ నంతియే. విషప్రయోగముచే అలరాజు మరణించెను. |
| (7) యుద్ధమున, జూదమున, ధర్మపక్షపాతమున అజాతశత్రువగు ధర్మరాజు. | (7) బ్రహ్మనాయుడు ధర్మరాజునకుజోడు. బలమున భీష్మునికుద్ది. ఇతడు పలనాటి కృష్ణుడని కీర్తింపబడెను. |
| (8) శకుని కపట కుతంత్రములు | (8) నాయకురాలి నాగమ్మ కుట్రలు. |
| (9) కురుక్షేత్ర రణరంగము. | (9) కారెంపూడి కదనరంగము. |

131. చూ॥ తెలుగుఛందము - దేశిరచన - భారతి, నందన, ఫాల్గుణము

| | |
|---|---|
| (10) అభిమన్యుని యుద్ధము. | (10) బాలచంద్రుని యుద్ధము |
| (11) అభిమన్యుని యుద్ధమునకు దీవించి పంపిన వీరనారి ఉత్తర | (11) యుద్ధమునకు బాలచంద్రుని పంపిన మాంచాల |
| (12) పాంచాలులు భారతయుద్ధమున పోరుట | (12) కల్యాణ రాజులు పలనాటి యుద్ధమున పోరుట |
| (13) కురురాజ్యము ధర్మరాజునకు యుద్ధజయ లబ్ధి | (13) హతశేషుడైన నలగామునకు రాజ్యప్రాప్తి బ్రహ్మనాయునిఅనుగ్రహదత్తము. |

బొబ్బిలియుద్ధము, దేశింగురాజుకథ, కుమారరామునికథ, సర్వాయపాపనికథ - మున్నగు చారిత్రక పదకావ్యములను వ్రాసిన కవులు పలనాటివీరచరిత్ర పదకర్తలంతటి ప్రజ్ఞావంతులు కారు. ఈ కథలన్నియు పాడుచుండగా వినుచున్నంతవరకే మన కానందము, ఉద్వేగము కల్గును. కాని చదువబూనగా వానియందలి రచన అంతగా రుచింపదు. పలనాటివీరచరిత్రను పిచ్చుకుంట్లు పాడునపుడు మనకు భావోద్రేకము కలుగును. వానిని చదువునపుడుకూడ రసభావస్ఫోరకములు, ప్రౌఢ కావ్యోచితములైన పెక్కు సొగసులు — మనకు ప్రత్యక్షమగుచుండును. పాడుకొనుటకు మాత్రమే గాక పఠించుటకుకూడ యోగ్యమై యుండుట పల్నాటివీరచరిత్రకు చారిత్రకకథలలో అద్వితీయ ప్రశస్తివచ్చుటకు హేతువు.

"దేశికవితా శబ్దమును అన్నిట సార్థకముచేసిన కావ్యములలో పల్నాటివీరచరిత్ర మొదటిది; మేటి." అని ఆచార్య

పింగళి లక్ష్మీకాంతముగారు తెల్పిరి. వీనిలో ఇతివృత్తము, భాష, ఛందస్సు – మూడును దేశీయములై యున్నవి.

ఈ పల్నాటికథను శ్రీ ముదిగొండ వీరభద్రకవి (19 శతాబ్ది ఉత్తరార్ధము) 'వీరభాగవతము' ను పేర పద్యకావ్యముగా రచించెను.

పల్నాటివీరచరిత్ర వీరరసప్రధానమైన గ్రంథము. ఈ వీరము యుద్ధవీరము. బాలచంద్రుడు శత్రుభయంకరముగాపోరి రణరంగమున బలియగుట ఈగ్రంథములోని విషాదాంతఘట్టము. ఇందు రౌద్రబీభత్స భయానకములు అంగరసములు. కరుణము ఆనుషంగికము.

కోడిపందెము తెలుగువారి వినోదములలో ముఖ్యమైనది; ప్రాచీనమైనది. పల్నాటివీరచరిత్రలోని కోడిపందెము ఎంత స్వాభావికముగ, భావచిత్రీకరణముగ, మనోరంజకముగ వర్ణింపబడినదో పరికింపుడు.

"పోరుకు విడిచిన పుంజులు రెండు
పొంగుచు రెక్కలు పొరి పొరి నార్చి
కనుల నిప్పులు రాలు కైవడి నవి
ఉగ్రంపు దృష్టిని నొండొంటి చూచి
పలగిరు లదరంగ కూయుచు చేరి
ముక్కు ముక్కున చేర్చి మొనసి రోషమున
మెడ యీక లుబ్బగా మెడవంచి రెండు
ఉప్పరం బెగయుచు నురవడి తన్న
తన్నిన తూలక దట్టంపు గోళ్ళ
మిట్టి మీదికి సెగసి మీరుచు తన్ని
కరపంగ వచ్చిన గతి చూచి బరిని
వలయంబుగా వచ్చి వడి తన్నుటయును
చిరచిర తిరుగుచు చేరి యాలోన

ఉరవు ద్రేయగ చూచి యొక్కపై యుబ్బి
రెక్కల పెల్లార్చి రేగి మొత్తంగ
పెంధూళి యెగసియు పెంపగు చుండ
సంగ్రామ కేళికి సంతసం బంది
ఊకించి తన్నగా నురములు నాటి
రక్తంబు దొరగంగ రాగంబు నొంది
తన్నుట తాపట తమవ నొచ్చుటయు
తలపక మగటిమి తలకొని రెండు
తలపడె నట దేవతలు చోద్యపడగ
వృత్రాసురుండు దేవేంద్రుండు, మరల
వైరముల్ పొడమగా వాలి యా పగిది
రూపులు మార్చి యారూఢి విక్రములు
కయ్యంబు చేయంగ కణగిరో యనగ
పుట పుట డయ్యుట పొరలుట పడుట
ఘటితంబు లాదిగాగల చిత్ర గతుల
కంటికి వేడుకల్ కలిగింప."

—కోళ్ళపోరు. గోపన్న విరుగు-పుట 141–142. (విశాలాంధ్ర ప్రచురణ) ద్విపదపంక్తులు. 1570–1598.

ఇది నీరస ఘట్టమైనను చక్కని స్వాభావిక వర్ణనకుదాహరణము. ఇందు కవి భావనాశక్తి సన్నివేశకల్పన, కన్నులకు గట్టినట్లు మనోహరముగ వర్ణింపబడినది. కోడిపందెమును ఇంత విపుల ముగ వర్ణించుటచే కవి సంఘములో పరస్పరము కలతలు పెంచు కొనుచుండిన వారి తెలివితక్కువను బయలుపరచు చున్నాడని పించకపోదు.

కాటమరాజుకథ:

కాటమరాజుకథను శ్రీనాథుడు (15 శతాబ్ది) ద్విపదలో రచించినట్లు గుత్తునుకొండ భక్తవత్సలకవి తన పద్య కాటమ

రాజు కథావతారిక[132] లో తెల్పినాడు. శ్రీనాథుని ద్విపద కాటమ రాజుకథ అలభ్యము.

గంగుల పినయల్లయ (17 శతాబ్దివాడై యుండునని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అభిప్రాయము). "శ్రీనాథువచన పద్ధతిని" కాటమరాజుకథను రచించినానని గ్రంథావతారికలో తెల్పినాడు. ఈగ్రంథము ముద్రితము.[133] వచనపద్ధతి అనగా 'చెప్పినపద్ధతి' యని యర్థముచేసికొనవచ్చునని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'కాటమరాజుకథ' పీఠికలో తెల్పిరి. కాటమ రాజు కథావిషయమునుగూర్చి వారు ఇట్లు తెల్పినారు.

"This work is in colloquial language and has been written on the model of a prior work by Srina tha. A full sketch of this story is to be found in the 18 th volume of Brown's local records.[134]

గంగులపినమెల్లయ కాటమరాజుకథనుగూర్చి శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు. "ఇది తొలుత సరియైన ద్విపదరచనములోనుండి పామరపాఠకులవశమై చెడిపోయియుం డును."[135] కాటమరాజుకథ మంజరీద్విపద వికారరచనము. ఇది పాట పాడుకొనుట కెక్కువగా ననుకూలించు రచన.

---

132. చూ॥ "శ్రీనాథుండను కవిశ్రేష్ఠుండు ద్విపదగా రచియించెఁ గాటమరాజు చరిత" - పద్య కాటమరాజు కథ.

133. Govt. oriental Manuscripts Library Madras 1953.
పరిష్కర్త: వేటూరి ప్రభాకరశాస్త్రి. పీఠికాకర్త: శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ.

134. చూ॥ కాటమరాజుకథ - పీఠిక : సోమశేఖర శర్మ.

135. Descriptive catalogue of the Telugu Manuscrits.

కాటమరాజుకథ కనుబంధముగ భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షము తెచ్చుకథ, ఎఱ్ఱ గడ్డపాటి పోట్లాట - అనునవి ఈ ముద్రిత కాటమరాజుకథలో చేర్పబడినవి. భట్టు రాయబారము సుమారు 835 ద్విపదలలో సంభాషణరూపమున నుండి ఒక నాటకమువలె నున్నది. దీనికర్త యెవ్వరో తెలియదు. కోటపాటి తాటివృక్షము తెచ్చేకథలో సుమారు 720 ద్విపదలు గలవు. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో సుమారు 630 ద్విపదలుగలవు. ఇది అసంపూర్ణముగనున్నది.

కాటమరాజుకథకు యాదవభారతమని, గొల్లభారతమని పేర్లు. చారిత్రకుల దృష్టిలో ఇందు లోపములున్నను జనసామాన్యమున దీనికమితమగు ప్రచారముకలదు. జానపదుల సుత్సాహోద్వేగములను గొల్పునట్టి రచనకలది. ఇందలి ప్రధానఘట్టములు, రసవంతములగు పెక్కువిధానములను విస్తరించి ప్రత్యేక పదకావ్యములుగ తర్వాతికవులు తీర్చికొనినారు. వారు అజ్ఞాత పురుషులుగ నుండిపోయినను వారి రచనలు మాత్రము నేటికిని చిరస్థాయిగ నిలిచిపోయినవి. 'యాదవ శాస్త్రం యెద్దుమోత ప్రమాణ' మని చెప్పుదురు. యాదవచరిత్రలో కాటమరాజుకు సంబంధించిన వ్యక్తులందరిపేరిట తలకొకగాథ కలదు. వల్లురాజు యుద్ధము (ఆర్. నెం. 642. ప్రా. భా. మద్రాసు), పెద్దిరాజుకథ, పంచలింగాలకొండ యుద్ధము, ఆవులమేపు, భక్తిరన్నకథ, పోలురాజుకథ, బొల్లావు యుద్ధము, ఉత్తరకాండము, దక్షిణకాండము, కరియావులరాజు కథ, అగుమంచి కథ 136 - మొదలయిన గాథలన్నియు కాటమరాజుకథ ననుసరించి వెలువడిన

---

136. ముద్రితము (అసమగ్రము) - పరిశోధన. సంచికలు 6, 7, 8. ఫిబ్రవరి జూలై 1955. వేటూరి ఆనందమూర్తిగారు ప్రకటించిరి

మంజరీద్విపద ఛందోరచనలు. అగుమంచికథలో కథావస్తువల్ప మైనప్పటికి కవితాసామగ్రి యనల్పమైనది. "తెనుఁగుదనము పుక్కిలించు తీరుగల దేశిరచనయిది. పామరుల నోళ్ళలోఁబడి భ్రష్టమై లభించినదిగాని లేకున్న దీనిరచన లోకోత్తరముగ నుండును." [137] అని శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు తెల్పిరి.

కాటమరాజుకథలను మాదిగలలో నొక తెగవారగు కొమ్ముమ్మవారును, గొల్లలలో నొక తెగవారగు పికిలివారును ప్రచారము చేయుదురు. తెలంగాణమున ఎఱ్ఱగొల్లలును, మందుచ్చువారును, బీరన్నలవారును కాటమరాజుకథను చెప్పుదురు. ఈ కథలకు 'గొల్లసుద్దులని' పేరు.

నందుల కాటమరాజుకూడ కాటమరాజుకథను ద్విపదలో రచించినాడు. (చూ. ఆ. వా. సూ. పుట 94).

## అన్నమాచార్యచరిత్రము

ఇది సుప్రసిద్ధసంకీర్తనాచార్యుడగు తాళ్ళపాక అన్నమాచార్యుని జీవితచరిత్రను వర్ణించు ద్విపదగ్రంథము. ఇది ముద్రితము. [138] దీనిని అన్నమాచార్యుని మనుమడగు చిన్నన్న రచించెను. అపూర్వమగు ద్విపద అన్నమాచార్యచరిత్రను వెలికిదీసి వ్యాప్తిలోనికి తెచ్చిన ఖ్యాతి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిది. వారు 47 పుటలుగల అన్నమాచార్యచరిత్రకు 133 పుటలుగల పీఠికను వ్రాసినారు.

ఈ ద్విపదగ్రంథము జీవితచరిత్రయేయైనను చిన్నన్న తన తాతయని అతిశయోక్తులతోడను, నుత్కర్షతోడను రచనగావిం

---

137. చూ॥ 'అగుమంచికథ' – వ్యాసము. వేటూరి ఆనందమూర్తి. పరిశోధన సంపుటి 1. సంచిక 2. జూన్, జులై 1954.

138. తిరుపతి దేవస్థానము వారి ప్రచురణ. 1949.

పక సరియగు చారిత్రక సత్యము ననుసరించి రచించియుండుట గమనింపవచ్చును. చిన్నన్న రచితమగు అన్నమాచార్య చరిత్ర ద్విపదగ్రంథమునందే తాళ్లపాకవారి వంశక్రమము, అన్నమాచార్యుల జీవితచర్యలోని ప్రధానఘట్టములు విపులముగా తెలుపబడినవి. మత, పాండిత్య, కవితాప్రఖ్యాతిగన్న అన్నమాచార్యుని చరిత్రము, అతనిభక్తిప్రపత్తులు, వేదాంతవిషయములు మున్నగు వానిని గూర్చి సమగ్రముగా నెరుగుటకు ఈ ద్విపదగ్రంథము ఎంతేని ఉపకరించును. ఇందు సుమారు 570 ద్విపదలు గలవు. గ్రంథము శ్రీ వేంకటేశ్వరున కంకితము.

అన్నమాచార్యుడు శ్రీ వేంకటేశ్వరస్వామి నందకము (ఖడ్గము) అంశమున నవతరించెనని ప్రఖ్యాతి.[139] తాళ్లపాకవారు నందవరీక బ్రాహ్మణులైనను అన్నమాచార్యుని నాటినుండి వైష్ణవమతమును స్వీకరించిరి. అన్నమాచార్యుడు శఠకోపముని కడ సకల వేదాంతశాస్త్రములను అధ్యయనము గావించెను. అతడు ఆంధ్రవేదాంతమనుపేర యోగవైరాగ్య శృంగారమార్గములలో 32000 సంకీర్తనములను రచించెను.[140]

అన్నమాచార్యచరిత్రలోని ద్విపద రచనారీతి నెరుంగుటకు కొన్ని ద్విపదపంక్తులీక్రింద నుదహరింతము. అన్నమాచార్యుడుండిన పసుసగుంపు తిరుపతికొండ నెక్కుచు నిట్లు పాడెనట!...

"దండెలు శ్రుతిగూడి తాళ సంగతుల
దండి మద్దెలలు చిత్తరముగా మ్రోఁట
నానంద భాష్పము లడర నాగతుల
నానంద నందను నంకించి పాడి

139. చూ॥ అన్నమాచార్య చరిత్ర - పుట 10.

140. చూ॥ అన్నమాచార్య చరిత్ర - పుట 45.

తన్మయుఁ డగుచుఁ జిత్రపు నాట్యగతులఁ
జిన్మయు నందునే చిక్కి చొక్కుచును

........................ ..................

గోవింద గోవింద గోవింద యనుచు
నా వరుసనె నరహరి హరీ యనుచు
తిరుమలప్పను నాదు దీరక మున్న
వరము లప్పని మ్రొక్కి వర్ణించు వారి
నెరులందు రంగు వన్నెలు పిసాళించు

........................... ..........

పాళి రేఖల నిండు పట్టెనామములు

.......... .................... .......

కోనేటి రాయఁడె కొండల వాఁడె
కానిక రూకలఁ గనఁ జాలు వాడె
వరుస బంగారు పేడ వాఁడె తిమ్మప్ప
వరముల రాయడె వాడె తిమ్మప్ప
గొడ్డు రాలికి నైనఁ గొమరుల నొసగి
వడ్డి కాసులఁ గొనువాడె తిమ్మప్ప."

—అన్నమాచార్యచరిత్ర. పుట 13.

## అచ్యుతాభ్యుదయము:

అచ్యుతాభ్యుదయమును ద్విపదలో రఘునాథనాయకుడు (1614-1633 A. D.) రచించినట్లు అతని ద్విపద నలచరిత్ర అవతారికనుబట్టి తెలియుచున్నది. ద్విపద అచ్యుతాభ్యుదయము అలభ్యము.

దాక్షిణాత్యాంధ్ర యుగమునందే ఈ అభ్యుదయ కావ్యములు వెలసినవి. ఇందు మహాపురుషుల ఘనకార్యములు వర్ణింపబడును.

## రఘునాథనాయకాభ్యుదయము :

విజయరాఘవనాయకుడు తనతండ్రియగు రఘునాథనాయకుని జీవితచరిత్రను 'రఘునాథాభ్యుదయము' అను పేర ద్విపదలోరచించెను. ఈద్విపదగ్రంథము ముద్రితము.[141] ఇది మన్నారు రాజగోపాలస్వామి కంకితము.

రఘునాథనాయకాభ్యుదయము దాక్షిణాత్యాంధ్రనాయకరాజుల కాలమునాటి రాజజీవితమునకు దర్పణమువంటిది. ఇది రసదృష్టితో అంత ఉత్తమగ్రంథము కాకపోయినను చారిత్రకదృష్టితో మిక్కిలి ఉత్కృష్టమైనది. ప్రామాణికమైనది, "ఇందలి ఇతివృత్తము సామాన్యమయి తమిళదేశపు 'ఉలా' ప్రబంధపద్ధతి ననుసరించినది. ఒకవిధముగానిది తమిళసాహిత్యప్రభావమనదగు న"ని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు తెల్పియున్నారు.[142] ఉలా ప్రబంధము తమిళమున అతి పురాతనమైనది. ఇది దేవతల రథోత్సవమునకు, ప్రసిద్ధపురుషుల గజోత్సవమునకు సంబంధించిన వర్ణనలతోకూడినది. ఉత్సవము తమవీధిని సాగుచున్నపుడు దానిని చూచుట తటస్థించు సప్తవిధగణికలలో నొకవిధమునకు చెందిన కన్యక ప్రేమప్రకటన గాథకు సంబంధించినదిందలి ఇతివృత్తము.

రఘునాథనాయకాభ్యుదయము 3 ఆశ్వాసముల ద్విపదగ్రంథము. రఘునాథనాయకుడు పురవీధుల స్వారి వెడలినప్పటి వరకు గల వృత్తాంతము ప్రథమాశ్వాసమున వర్ణింపబడినది.

---

141. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య ప్రచురణాలయం. తంజావూరు సరస్వతీ మహల్. 30. నెం. 1951 సం॥ పరిష్కర్తలు: డా॥ నేలటూరి వేంకటరమణయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మ

142. చూ॥ రఘునాథనాయకాభ్యుదయ పీఠిక పుట 62.

స్వారి వెడలుట మొదలు శుకదూత్యమువరకుగల కథ ద్వితీయాశ్వాసమునగలదు. ఇక తృతీయాశ్వాసమున రఘునాథనాయకుని మద్యాహ్న భోజనాదిక వృత్త విశేషములు, శుకదౌత్యము, నాయికానాయకసమాగమము మొదలగు విషయములు తెలుపబడినవి. ఇందు నాయకుడు రఘునాథుడు. పురవీథులస్వారి వెడలుచుండ ఇతనిచూచి వలచిన పౌరసుందరి చిత్రరేఖయే ఈగ్రంథమున నాయిక. ఇట్లు రఘునాథనాయకుని ఒకనాటి వృత్తాంతము నిద్రలేచినది మొదలు రాత్రిపరుండబోవునంతవరకుగల వృత్తాంతమును విజయరాఘువుడు సందర్భోచితముగ పురవర్ణన, మన్మథోపాలంభణ—మున్నగు ప్రబంధకావ్యలక్షణములతో నొప్పునట్లు రచించినాడు. ఇందలి కోటవర్ణనము, ఓరుగంటి నగరమును సవిశేషముగ వర్ణించిన క్రీడాభిరామముతప్ప నిట్టి వర్ణనగల ఆంధ్రగ్రంథమే లేదని చెప్పవచ్చును.

విజయరాఘువునిది కుంటు గంటులేని మృదుమధురమైన శైలి. ఈ క్రింది ద్విపదలను పరిశీలింపుడు:

"చిలుక లేఁజీయట చెఱకట విల్లు
బళి బళీ తుమ్మెద శారట నారి
చెంగల్వ విరులట చికిలి వాలమ్ము
లంగంబు లేని వాఁడట యేటుకాఁడు
ఆయమ్మ లెవ్వారి యామమ్మ నాఁటె
నోయమ్మ యిటువంటి యూహాలు గలవె?"

—రఘునాథనాయకాభ్యుదయము — 2 వ ఆశ్వాసము పుట 42

ఇందలి పదములకూర్పు భావోద్వేగమున ధారాళముగ నడచినది; తెలుగుదనమును, సౌకుమార్యమును, లాలిత్యమును గలిగి దేశీయతతో నొప్పినది.

రఘునాథనాయకాభ్యుదయ పీఠికలో డా॥ నేలటూరి వేంకటరమణయ్యగారు వ్రాసిన ఈ క్రింది వాక్యములు గమనింపదగినవి.

"The real importance of the Raghunathanayakabhyudayamu lies not so much in its literary Value, it is a record of contemporary history. It contains a brief summary of the achivements of himself and his ancestors, besides much valuable information about the admiration, social and economic conditions, the routine of daily life of the court and many other things not known from other sources."

రఘునాథనాయకాభ్యుదయ కథనే విజయరాఘవుడుకొన్ని వచనములతో కలిపి యందలి ద్విపదపంక్తులనే నడుమనడుమ కథాసంవిధానమును కలుపుటకు అతుకులుగ పొందించి యక్షగానముగ రచించినాడు.

భేతాళచరిత్ర:

అన్నసముద్రము చినవీరయ్య సంస్కృతమున చెప్పిన దానికిది ద్విపదరూపమగు తెలుగు సేత. భేతాళచరిత్రయందు రేచెర్ల గోత్రుడగు రెడ్డివీరులలో ముఖ్యుడగు భేతాళరెడ్డి పరాక్రమము, ఆలయనిర్మాణము తెలుపబడినది. చారిత్రికసత్యములిందు వివరింపబడుటచే భేతాళచరిత్రను 'చారిత్రికము' గా పేర్కొనవచ్చును.

ఈ ద్విపద భేతాళచరిత్రను రచించినవాడు పిల్లలమర్రి బంగారు రంగప్ప (1770 A. D.) భేతాళచరిత్ర ద్విపదప్రతి లక్ష్మణరాయ పరిశోధకమండలి యందు కలదు.

పెద్దబొబ్బిలి మహారాజుకథ:

వీరరస పరిప్లుతమగు ఈ ద్విపదగ్రంథము అముద్రితము. (B. M. C. 14174. K. 51<(3). ప్రా. భా. మద్రాసు). దీనిని కాదూరి చెంగల్వరాజు వీరయ్య రచించెను.

## 10. చిత్రాఖ్యానములు:

మానవ సమాజమున కేనాడు తన యాంతరంగిక భావములు వ్యక్తీకరించుకొన గలుగు శక్తి కలిగెనో ఆనాడే కథలు కూడ జన్మించినవి. మనసునొవ్వకుండ బోధించుట, విసుగుదల కలుగకుండ నుపదేశించుట, కర్తవ్యముల నుచితరీతిని ప్రవర్తింప జేయుట - అను నుద్దేశ్యములకే ప్రథమమున కథలు చెప్పబడినవి. కాలక్రమమున అవి నాగరికతతోపాటు వృద్ధినొంది సాంఘిక రాజకీయములలో, నైతిక ధార్మిక బోధనలలో, విజ్ఞాన శాస్త్రములలో, కళలలో - స్థానము నాక్రమించుకొనినవి.

ప్రాచీనాంధ్ర వాఙ్మయమున కేతన (1255 A, D.) దశకుమారచరిత్ర అద్భుత రసోపేతమైన ప్రథమ కథామంజూష. జక్కన విక్రమార్కచరిత్ర, అనంతామాత్యుని భోజరాజీయము, వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమారచరిత్ర, కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక, కదిరీపతి శుకసప్తతి, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి - ఇత్యాది పద్య కథాకావ్యములు విశేష ప్రాచుర్యము నొందినవి. వీనిలో కొన్ని నీతిబోధకములు మరికొన్ని అద్భుత రస సమీకరణములు. ద్విపదలోకూడ విక్రమార్కుని కథవంటి సాహసగాథలు, ధర్మాంగదచరిత్రవంటిఆశ్చర్యకథలు, పతివ్రతాచరిత్రమను కథాసంకలనములు కలవు. ఈ ద్విపద చిత్రాఖ్యానములను ఈ క్రింద పేర్కొని పరిశీలింతము:

## పతివ్రతాచరిత్రము

పతివ్రతా చరిత్రము బహుకథాసంకలన ద్విపదగ్రంథము; ముద్రితము.[143] శైలినిబట్టి ఈ గ్రంథము ఇంచుమించు ప్రాచీన ప్రబంధ కాలమునకు తర్వాత రచింపబడియుండునని పీఠికాకర్త యగు శ్రీ టి. చంద్రశేఖరన్ గారూహించిరి. ఈద్విపదగ్రంథము కవి నామాది విషయముననే గాక కథలలోకూడ కొంతవరకు అసంపూర్ణముగనే ఉన్నది. ఇందు సుమారు 3900 ద్విపదలు కలవు. కృత్యవతరిణికలో డెబ్బది కథలున్నట్లు తెలియుచున్నది. కాని,

> "సరస పతివ్రతా చరితంబు నందు
> వరుస ముప్పది రెండవ కథ చెన్నొందె."

అని గ్రంథాంతములోని ద్విపదనుబట్టి ఇందు ముప్పదిరెండుకథలు మాత్రమే వర్ణింపబడి యున్నట్లు తెలియును. కాని ఈ ముద్రిత గ్రంథమునందు ఇరువదిఒక్కకథలుమాత్రమే ప్రకటింపబడినవి. తక్కిన పదునొకండు కథలనుగూర్చిన వివరములేవియు తెలియవు.

ఇందలి కథలన్నియు చిలుకనోటనుండి వెలువడినవే. ఈ చిలుక పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నములోని 'శచిముఖి' తో పోల్పదగినది. చిలుకనోటనుండి వెలువడినదగుటచే పతివ్రతా చరిత్ర కథాకథనముకూడ కదిరీపతి 'శుకసప్తతి' ననుసరించినదే యగుచున్నది. కాని కదిరీపతి శుకసప్తతి కేవలము శృంగార ప్రధానమైన కథలతో నిండినది. ఈ పతివ్రతా చరిత్రమందు పతివ్రతామ తల్లుల పునీతచరిత్రలు కూడ వర్ణింపబడినవి.

---

143. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యపుస్తక భాండాగార ప్రచురణ నెం, 60. పరిష్కర్త: టి. చంద్రశేఖరన్. 1958 సం॥

ఈ కథలను పెక్కు గ్రంథములనుండి గ్రహించి కవి ఒక చోట కూర్చినాడు. ఇందు కొన్నికథలు పురాణగాథా పరివర్తనములు. మరికొన్ని కవి స్వకపోల కల్పితములు. కొన్ని కాశీమజలీ ఫక్కికి చెందునట్టివి. కొన్ని తెలుగులోని చిత్రకథా కావ్యముల నుండి గ్రహింపబడినట్టివి. ఇట్లు బహుకథాగ్రంథములనుండి యేర్చి ఒకచో కూర్పబడినదీ పతివ్రతాచరిత్రము.

గ్రంథావతారికయు, అందలి పుష్పదంతునికథ భట్టసోమ దేవుని కథాసరిత్సాగరమందలిది. ''నీయెట్టి చూపునకుఁ గొంగఁ గానన్న కథ'' మహాభారతములోని ధర్మవ్యాధోపాఖ్యానము ననుసరించినదే. 'పతియనుమతి గాంచిన సతికథ' వంటిది భోజ రాజీయమున కలదు. 'సులోచన కథ' సింహాసనద్వాత్రింశతి లోనిదై యున్నది. 'కేయూర బాహుకథ', కేయూర బాహుచరిత్ర నుండి యుద్ధరింపబడినది. 'అరుంధతి', 'లోపాముద్ర' - మొదలగు వారి కథలు పురాణములనుండి గ్రహింపబడినవి. 'తెల్లవారకుండ శపించిన సాధ్వికథ' సుమతికథవంటిది. ఇట్టి కథ మార్కండేయ పురాణమునందును కలదు. ఈకథలోని దుర్వేధుడు కాశీఖండము లోని గుణనిధికిని, పాండురంగమాహాత్మ్యములోని నిగమశర్మ కును సైదోడు.

జనసామాన్యమున మిగుల ప్రసిద్ధిబడసిన 'చేపనవ్వినకథ' 'పులినిజంపినవానికిఁ బుత్రికనిచ్చు రాజుకథ' – మొదలగునవియు నిందు కొన్నికలవు.

ఇట్లు పతివ్రతా చరిత్రమునందలి కథలు ఉత్తమకథాసంవిధానముతో, రసవంతములై, శ్రవణపేయములై మనోహరము లయినవి.

అరుంధతీదేవి కథయందు ఇంద్రియనిగ్రహము యొక్క

ప్రభావము, సావిత్రి కథయందు స్త్రీకిగల మృత్యువుతోనైన నెదుర్కొను శక్తి, కాళిగుడిలోఁ బతిని వరించిన సతికథలో కొడుకు ప్రాణముకంటె సతికి మానమే ప్రాణమనునీతి, బుద్ధి కర్మముల కథలో కర్మముయొక్క అద్వితీయ శక్తి, లోపాముద్ర కథలో పడతికి పతితోడిదే లోకమనునాదర్శము, మానవతి కథయందు స్త్రీమానమునకురక్షకుడు పురుషుడా? లేక స్త్రీయా? యను సమస్యకు చక్కని సమాధానము; కిరాతసతి కథలో అన్ని దానములకంటె అన్నదానమునకుఁ గల వైశిష్ట్యము, ద్రౌపదీదేవి పూర్వజన్మకథలో ద్రౌపదిపంచవల్లభ యగుటలోఁగల రహస్యము చక్కగ నిరూపింపబడినవి. ఇట్లు ప్రతివ్రతా చరిత్రమునందలి కథలన్నియు లోకధర్మానుసరణములై లోకవ్యవహార సాధనభూతములై సంశయ విచ్ఛేదకములును సదుపదేశములును నైయున్నవి.

ఇందలి రచనారీతిని తెలిసికొనుటకు ఈ క్రింది ద్విపదలను పరిశీలింపుడు:

"ఆదిమబ్రహ్మ మనోంబుజాతమునఁ
బ్రాదుర్భవించె నే పరమ తపస్వి
కౌశిక బ్రహ్మర్షిఁ గావించె నేమ
హాశమాధికుని సత్యవచోనిరూఢి
యురగాధిపతి తాల్చు నురుభారమెల్ల
భరియించె నే మాని బ్రహ్మదండంబు
కలశజుండు వహించు గౌరవంబూని
తులకించె నే మహాత్ముని కమండలువు
మహనీయ మార్తాండ మండల ద్యుతులు
వహియించె నే మునీశ్వరు కావిపంచె
అట్టి వసిష్ఠ మహర్షి శేఖరుడు."

—పతివ్రతాచరిత్రము పుట 33.

కథారంభమునందే ద్విపదరచనలో కవి ఎంతటి ఉదాత్త శైలిని ప్రదర్శించినాడో పై ద్విపదలనుబట్టి గ్రహింపవచ్చును.

కారాణ వైరాగ్యరావు (1900 A. D.) కూడ పతివ్రతా చరిత్రమును ద్విపదలో రచించినట్లు తెలియుచున్నది. (చూ॥ ఆ. వా. సూ. పుట 105).

## విక్రమార్కుని కథలు:

విక్రమార్కుడు చారిత్రక పురుషుడు; వితరణ సాహసౌదర్యాది సద్గుణ విరాజితుడు. అతని సాహసకృత్యములను, అద్భుత కార్యములను తెల్పుకథలు తెలుగునాట జనసామాన్యమున బహుళవ్యాప్తిగాంచినవి. విక్రమార్కునికథలు సాహస గాథలు. అసాధ్యమైన ఒక కార్యమును నాయకుడు (ఇచట విక్రమార్కుడు) ఒక అద్భుత శక్తితో సాధించుట ఇందలి ప్రధానాంశము. ఇట్టి కథలలో అద్భుత రసస్ఫూర్తి అమితము. సాహస గాథలలో నాయకుడు అసామాన్య శక్తియుక్తుడై యుండుట సహజము.

జక్కన (15 శతాబ్ది) రచితమగు 8 ఆశ్వాసముల విక్రమార్క చరిత్రము, కొఱవి గోపరాజు (1430-1490) 12 ఆశ్వాసముల 'సింహాసనద్వాత్రింశకము' – తెలుగులో విక్రమార్కుని కథలను విపులముగా వర్ణించు చంపూకావ్యములు. వీని ననుసరించి పండిత పామర జనానురంజకముగ సులభశైలిలో విక్రమార్కుని కథలను పలువురు కవులు ద్విపదలో రచించినారు.

'కొండయ' పేరుతో 'విక్రమార్కునికథలు' అయిదాశ్వాసముల ద్విపదగ్రంథము కలదు. ఈ ద్విపదగ్రంథమముద్రితము (ఆర్. నెం. 1180, 1181. ప్రా. భా. మద్రాసు). దేవయామాత్యుని పుత్రుడగు పెద్దయమంత్రి ప్రేరణముచే కొండయ

'విక్రమార్కుని కథల' ను ద్విపదలో రచించి, తిరుపతి వేంకటే శ్వరున కంకితము చేసెను.

ఈ విక్రమార్కుని కథలను పార్వతికి శివుడు వినిపించినట్లు గ్రంథావతారికలోకలదు. ఇందు భోజునకు ముప్పది రెండు సాల భంజికలు విక్రమార్కుని సాహసకృత్యములను గూర్చి చెప్పిన కథలను కవి హృదయంగముగ జనసామాన్యమునకు సుబోధక మగునట్లుగ రచించినాడు.

> "సాలభంజిక భోజ సంవాదమునకు
> అలర ముప్పది రెండు (?) విక్రమార్కుని కథలు
> విన్నవించితి."

నని కవి గ్రంథాంతమునందు తెల్పెను.

కొండయ 'విక్రమార్కుని కథలు' గాక మరొక ద్విపద 'విక్రమార్కునికథల' గ్రంథము తంజావూరి సరస్వతీమహల్ లైబ్రరీయందు నెం. 357 కలదు. ఇందు కవి నామాదికములను గూర్చిన చర్చ కానరాదు.

> "అనఘాత్ముడగు విక్రమార్కుని కథలు
> మునుకొని చెప్పెద ముప్పదిరెండు."

అని గ్రంథారంభమునందు ముప్పదిరెండు కథలను చెప్పినట్లు కవి పేర్కొనెను. కాని వాస్తవముగా నిందు ఇరువది ఆరు కథలు మాత్రమే వర్ణింపబడినవి.

'ద్వాత్రింశత్సాల భంజికల కథలు' అనుపేరుతో మరొక ద్విపదగ్రంథము కలదు. ఇది అముద్రితము. (చూ॥ ఆ. సా. ప. భాం. అకారాద్యముద్రితగ్రంథ సూచిక II Part.) కవిపేరు తెలియదు. ఈ గ్రంథమునందు విక్రమార్కుని గూర్చిన కథలు ముప్పదిరెండు సాలభంజికలు భోజునికి చెప్పినట్లు కలదు.

## ధర్మాంగదచరిత్ర:

తెలుగులోని అద్భుత రసాత్మకములగు కథలలో ధర్మాంగదచరిత్ర ముఖ్యముగా పేర్కొనదగినది. అద్భుతరసప్రధాన కథలు అన్ని భాషలలోను, స్త్రీలను, బాలబాలికలను, జానపదులను ముగ్ధులను చేయును. ఇట్టి కథలనువిను జనసామాన్యమునకు కష్టములు కలకాలము కాపురముండవను నమ్మక మేర్పడును. ఎట్టి కష్టములయినను దైవానుగ్రహమువలన తొలగునను నభిప్రాయము కలిగించి జీవితమును ఆశాజ్యోతులతో వెలిగించును. జాతి కష్టనిష్ఠురముల కోర్చునట్టిదై, సుదృఢమైన వెన్నెముక కలదై కీర్తిసంపదల కాకరము కాగలదు. ఇట్టిరచనలలో మనసుయొక్క విశృంఖల విహారావధులు సూచితమగును.

ధర్మాంగదచరిత్రను బొమ్మకంటి నరసింహకవి ద్విపదలో రచించెను. ఈద్విపదగ్రంథము ముద్రితము.[144] గౌతముడహల్య కోరికపై ధర్మాంగదచరిత్రను చెప్పెను. సీత, ద్రౌపది, తార — మున్నగు పతివ్రతల మించెడు సాధ్వీమణి కథ ఇది.

ధర్మాంగదుడను రాజుకు సర్పాకారముతో నొక పుత్రుడుదయించెను. మంత్రికోరికపై, ఆపామును మనుష్యుడే అని లోకము నమ్మునట్లు పెంచి, పాముకు 'సత్యవతి' అను కన్యకను పెండ్లి చేసిరి. సత్యవతి అత్తవారింట ప్రవేశించినది.

"అత్తిల్లు సొచ్చిన యానాటి నుండి
నేటి పర్యంతంబు నే మగని కండ్ల
పాటించి చూచిన పట్టయిన లేదు."

అనిఆమె చింతించినది. అత్తను అడిగినచో,

---

144. పరిష్కర్త: శ్రీవిల్లిపుత్తూరు శఠగోపాలాచార్యులు. మాధవనివాస ముద్రాక్షరశాల. 1884 సం॥

"చిన్నదానవు నీవు సిగ్గగ్గ మాని
యెన్నడాడని మాట లది యేమటంచు
తిట్టునో కొట్టునో తెగువతో నన్ను
రట్టడి యని దొడ్డరాయడి చేసి."

అని జంకినది. తుదకు, చెలికత్తె ప్రోత్సాహముతో తన భర్తను చూపించుమని సత్యవతి అత్తను అడిగినది. అత్త ఆముగ్ధరాలితో,

"ఏమని చెప్పుదు నిందీవరాక్షి
భామ నే మిక్కిలి పాపాత్మురాల
నానోము ఫలమున నలిన గర్భుండు
పూని నా కడుపున భోగి పుట్టించె."

నని పామును చూపించినది. సత్యవతి మూర్ఛిల్లినది. ఆమె తన కర్మను తలపోయుచు,

"ఈ లోకమందు నన్నిట్టి బాములకు
ఏల పుట్టించెనో యీవిధి నన్ను
♦ ♦ ♦ ♦
ఏరీతి బ్రదుకుదు నేమి సేయుదును."

అని దుఃఖించినది.

"కుంటైన మొండైన గ్రుడ్డి వాడయిన
యెట్టి మగడయినను యేమరరాదు
అటుగాన మగడు పామైన గానిమ్ము
పతిభక్తి తోడుత పాలుబోయుచును
పోషించుకొనుచు భూముల జూచెదను."

అని తెగువచేసికొనినది. సత్యవతి పాముసే తన భర్తగాదలచి దానినొక బుట్టలో పెట్టుకొని తీర్థముల వెంబడి తిరుగుచు, తుదకు బ్రహ్మకుండములో దానిని కడుగగా పాము ఒక రాజకుమారుడయ్యెను. పిమ్మట దంపతులిరువురును సుఖముగానుండిరి.

ఈకథను హృదయంగమముగ, పామరజనసుబోధకముగ బొమ్మకంటి నరసింహము రచించినాడు.

ధర్మాంగదచరిత్రను పురుషోత్తమదాసుకవి (1800A.D.) కూడ ద్విపదలో రచించినట్లు తెలియుచున్నది. (చూ॥ ఆ. వా. సూ. పుట 93.)

ధర్మాంగదచరిత్రను 'పాముపాట' అను పేరుతో స్త్రీలు మిక్కిలి గారాబముతో పాడుకొందురు. దీనిని దాసరాజు అను భట్టరాజకవి పద్యకావ్యముగాను, ఈవూరినారాయణరాజు పదముగాను, వరదరాజకవి యక్షగానముగాను రచించినారు.

పరిశిష్ట ద్విపద రచనలు:

ద్విపద వాఙ్మయములోని రచనలన్నింటిని పదివర్గములుగ విభజించి పరిశీలించితిమి. ఈ పదివర్గములలో ఏ వర్గమునకును చేర్చనివి, చేరనటువంటివి మరికొన్ని ద్విపదరచనలుకలవు. వానిలోకొన్ని అలభ్యములును, కొన్ని అందుబాటులో లేనటువంటివియును అగుటచే వానినిగూర్చిన కథావిషయాది వివరణములు తెలియరావు. కాబట్టి పై పదివర్గములలో చేర్చని ద్విపద రచనలను పరిశిష్టములని ఈ క్రింద పేర్కొనబడినవి.

(1) ఆంధ్రవేదాంతము — తాళ్ళపాక పెదతిరుమలయ్య. గ్రంథము అలభ్యము.

(2) పాదుకాసహస్రము } — విజయరాఘవుడు.
(3) మోహినీవిలాసము }

"ఘనతరంబగు పాదుకాసహస్రంబెల్ల ద్విపదజేయు కళావతీతనూజ" అని కవి ప్రహ్లాదచరిత్రలో చెప్పిన వాక్యమాధారము. "అలమోహినీ విలాసాఖ్య ద్విపదకృతి నాటకంబొనరించు నలసమాన" — అని ప్రహ్లాదచరిత్రవాక్యము.

పై రెండు ద్విపదకృతులును అలభ్యములు.

(4) సాధ్వీజనధర్మము — కాకనూరి అప్పకవి (1656 A. D.)

చూ॥ అప్పకవీయము. అవతారిక — 'మహిత సాధ్వీజనౌఘ. ధర్మద్విపదము, — గ్రంథము అలభ్యము.

(5) సర్వేశ్వరద్విపద — పిండిము అప్పలస్వామి. చూ॥ ఆ. వా. సూ. పుట 221. ఆంధ్రగ్రంథమాల, మద్రాసు.

(6) సుజ్ఞానోపాఖ్యానము — గ్రంథకర్త: తోటా కోటయ్య. చూ॥ ఆ. వా. సూ, పుట 230.

(7) పుష్పహారము — కవి: కోదండరామయ్య. ఆ. వా. సూ. పుట 91.

(8) బ్రహ్మ ధర్మశిక్ష — కవి: మా. కృష్ణారావు. చూ। ఆ. వా. సూ. పుట 132.

(9) రామకుమారవిజయము — కవి: చిదంబరకవి. అముద్రితము (నెం. 2550. ప్రా. భా. మద్రాసు).

(10) శృతకీర్తిమహారాజుకథ - కవి: తెన్నరంగం పాన్నారిసూరి. చూ॥ ఆ. వా. సూ.

(11) దండకముక్తకము — దుర్భా బాలకృష్ణయ్య. చూ॥ ఆ. వా. సూ. పుట 84,

(12) సాధుజన లక్షణదీపిక — బత్తుల లక్ష్మయ్య. చూ॥ ఆ. వా. సూ. పుట 122.

(13) రత్నహారము — వేంకట పార్వతీశ్వర కవులు.

(14) మనుచరిత్ర — పూండ్ల వేంకటరమణయ్య (1900 A. D.) 1904 సం॥ ముద్రితమైనదట.

(15) గోపికాంశుకాపహారము — ప్రయాగ వేంకటాద్రి.

ప్రయాగ రామేశ్వరకవి తన గోపాలలీలాసుధాలహరిలో (అముద్రితము ఆర్. నెం. 407. ప్రా. భా: మద్రాసు) ''ప్రయాగ వేంకటాద్రీంద్రకృత గోపికాంశుకాపహార మనెడి ద్విపదకావ్య

మేను పద్యకావ్యం బనల్ప కల్పనలజేయదలచి'' అని చెప్పినాడు. గ్రంథము అలభ్యము.

(16) ధనాభిరామము } మటెంగంటిసింగరాచార్యుడు
(17) ప్రేమాభిరామము } (1600 A. D.)

"అలఘుప్రేమాభిరామ, ధనాభిరామ కావ్యములు జాతి వార్తలు గడలుకొనగ ద్విపదలుగఁ జేసితివి కవినృపతు లెన్న పూని షోడశ వత్సరంబులనె మొదల'' అని సీతాకల్యాణము (అముద్రితము ఆర్. నెం. 672. ప్రా. భా. మద్రాసు) లో చెప్ప బడినది. ఈ రెండు గ్రంథములును అలభ్యములు.

(18) అర్చిరాదిప్రబంధము—కవి: సింగరాచార్యులు(1700A. D.) వేల్పుకొండ నివాసి; ప్రతివాది భయంకరము నరసింహాచార్యు లకు శిష్యుడు. ఈ ద్విపదగ్రంథ ప్రతి హనుమకొండ పరిశోధక మండలియందు కలదని గో. క. సం. పుట 415 లో తెల్పబడినది.

(19) రామకృష్ణమాహాత్మ్యసార సంగ్రహము—కవి: అనంతరాజు సుబ్రహ్మణ్యకవి. చూ॥ ఆ. వా. సూ. పుట 167.

(20) కృష్ణకథామృతము-కవి: తురగా పురుషోత్తమశర్మ (1900A.D.) చూ॥ ఆ. వా. సూ. పుట 43,

(21) పిల్లనాయనారికథ — కవి: పిడుపర్తిబసవన. చూ॥ పిడుపర్తి సోమన పద్య బసవపురాణావతారిక. గ్రంథమలభ్యము.

(22) వరదోపాఖ్యానము — కవి: నరసింహ భాగవతులు. చూ॥ ఆ. వా. సూ. పుట 182

(23) త్రిపురారాతివిజయము—కవి: వల్లూరి హనుమంతకవి. చూ॥ నాగజిత్తీపరిణయము. (పద్యగ్రంథము. డి. నెం. 546. ప్రా. భా. మద్రాసు)- అవతారిక. గ్రంథము అలభ్యము.

(24) దశావతార చరిత్ర — కవిపేరు తెలియదు.

(25) బిల్హణచరిత్ర _ కవిపేరు తెలియదు. చూ॥ ఆ.వా.సూ. పుట 128.

(26) చిదానందమంజరి _ కవి: ఉమాపతికవి. చూ॥ ఆ. సా. ప. సంపుటము 6. సంచిక 55.

(27) ద్విపదశృంగారవర్ణనము - కవిపేరు తెలియదు. చూ॥ ఆ. సా. ప.

(28) నాగరకాండము _ కవి: చంద్రశేఖరకవి. చూ. ఆ. సా. ప.

(29) ప్రమథస్తోత్రము _ కవి: సన్యాసకవి. చూ॥ ఆ. సా. ప.

(30) రామధ్యానము - కవిపేరు తెలియదు.

(31) శివస్తోత్రము _ కవిపేరు తెలియదు.

(32) గణమాలిక _ కవిపేరు తెలియదు.

(33) వివేకసింధువు _ కవి: వేంకటకవి. అ. గ్రం. సూ. I Part పుట 7.

(34) భాగవతార్చనము - కవిపేరు తెలియదు. అ. గ్రం. సూ. I Part పుట 18.

(35) దమయంతీచరిత్రము _ కవిపేరు తెలియదు. ఆ. సా. ప. అ. గ్రంథసూచిక II Part.

36. కలియుగమంజరి:

దీని అముద్రితప్రతి తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీ (ఆర్. నెం. 295) యందు కలదు. గ్రంథకర్తపేరు గ్రంథములో కానరాదు. ఈ'కలియుగమంజరి'ని ద్విపదలో 'అప్పసుకవి' వ్రాసి యుండునని తంజావూరులైబ్రరీ పుస్తకములపట్టిక తయారుచేసిన వారు వ్రాసియున్నారు. (చూ॥ "A Deseriptive catalogue

of Telugu Manuscripts in Tanjore Maharaja Serfojis Sarasvati Mahal Library - P- 87. Andhra university Series No. 11.)

ఈ గ్రంథమునందు కలియుగధర్మములు వివరింపబడినవి. "కలియుగమహిమల కట్టడి చెప్పెద" నని కవి గ్రంథారంభమున తెల్పినాడు.

| | |
|---|---|
| (37) మలహణచరిత్రము | కవి– పోశెట్టి లింగనకవి. |
| (38) శంకరదాసమయ్యచరిత్రము | ఈ ద్విపదగ్రంథములు అలభ్య |
| (39) వీరసంగయ్యదేవ చరిత్రము | ములు. (చూ॥ నవచోళచరిత్ర |
| (40) శివప్రబోధము | అవతారిక). |



# ఐదవ ప్రకరణము:

## ద్విపదకవుల కవితారీతులు:

ఇంతవరకు ద్విపదరచనలపరిణామమును (చూ॥ మూడవ ప్రకరణము) ద్విపదకావ్యముల వర్గీకరణమును(చూ॥నాల్గవప్రకరణము) గురించిన పరిశీలనగావించితిమి. ఈ రెండు ప్రకరణములందు కవుల కాలాదికములకును, వారి కథావస్తువరణమునకును సంబంధించిన పరిశీలనయే ముఖ్యముగా జరిగినది. కవిత్వ పరామర్శ ఈ రెండు ప్రకరణములందు గావింపబడలేదు. కాని కొన్ని సామాన్య ద్విపదరచనలలోని కవితావిశేషములను గురించి ప్రసక్తాను ప్రసక్తముగ నాల్గవప్రకరణమున సంగ్రహముగా చెప్పబడినది, ప్రసిద్ధులు, ప్రౌఢులు, నగు ద్విపదకవుల కవితారీతులను అందు స్పృశింపలేదు. ఈ ప్రకరణమున అట్టి ద్విపదకవుల రచనలను ప్రత్యేకించి వాని యందలి కవితాశిల్పమును, కావ్యకళా విమర్శక దృష్టితో పరిశీలింతము.

### పాల్కురికి సోమనాథుడు:

పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యములు బసవపురాణ పండితారాధ్య చరిత్రలు – ముఖ్యముగా జన సామాన్యములో మతప్రచారముకొరకేరచింపబడినవి. అవి సామాన్యప్రజాదరణకు ఉద్దేశింపబడినవే; కేవల పండితాదరణకు కాదు. భాషావిషయ

మున ప్రౌఢత్వమును గూర్చుట సోమనాథుని సంకల్పము కాదు. కాని అతని ప్రజ్ఞాపాండిత్యములు, లోకజ్ఞత అక్కడక్కడ ఉద్రేక పూరిత సందర్భములందును, వర్ణనలందును, ప్రకటితములయినవి. కథాకల్పనమునందును, విషయ విన్యాసమునందును, భావప్రపంచమునందును, జాను తెనుగును, దేశీయతను ప్రదర్శించుటయందును అతని పద్ధతి స్వతంత్రమైనది. అయినను సోమనాథుడు కావ్య మర్యాదలతోపాటు ఆలంకారిక లక్షణములనుకూడ పాటింపక పోలేదు. పైగా కావ్యలక్షణ విషయమున సంస్కృతాలంకారికులను సవరించుచున్నట్లుగ పండితారాధ్యచరిత్రావతారికలో కావ్యలక్షణములను విపులముగా పేర్కొనినాడు. సోమనాథుడు కేవలము కవియేగాక స్వతంత్ర లాక్షణికుడును అనుటకు ఇది యొక ప్రబల నిదర్శనము.

ఉదా:

“సత్కృతి యన నూత్న సంగతి దనరఁ
దొమ్మిది రసములు దులుకాడు దాని
యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ
మగు నలంకారంబు లసలారు దాని
ద్విగుణార్థ భావముల్ దీటు కొనంగఁ
దేట తెనుంగున ద్విపద రచింతుఁ
* * * *
..................కావ్య ప్రౌఢి పేర్మి
నెట్టణ రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్య పద్యోదాత్త కృతులు
ద్విపదయు సమమ భావింప నెట్లనిన
సరళత సరణి ప్రసన్నత సెన్ను
పరిణతి గణపద పద్ధతి శబ్ద
శుద్ధి ప్రయోగ ప్రసిద్ధి గళా స

మృద్ధి నానుడి వడిమితి రతియర్థ
పుష్టి నైజము రసపుష్టి వినూత్న
సృష్టి విశేష్యవిశేషణ శ్లేష
సొంపు గుమారత వెంపు మాధుర్య
మింపు మృదుత్వంబు నింపోజ బుజువు
యమకంబు గమకంబు యతిగతి గార
కము పూరకము క్రియగాంతి విశ్రాంతి
రంగు బెడంగు మెఱుంగు సమాన
సంగతి యక్షర శయ్య సంఘటన
నిపుణత రసికత నెఱి సమాధాన
ముపమాన మవధాన ముత్ప్రేక్షలక్ష్య
లక్షణవ్యక్తి యలంకార యుక్తి
దక్షత సుమతి విచక్షత యనిన
జాతులు రచనా ప్రణీతులు గావ్య
నీతులు రీతులు నేతులుట్టంగ
వరకవుల్గొని యాడ వర్ణన కెక్క
ధరఁజెప్పఁ గృతియు నద్యత్కృతి గాక."

— పండితారాధ్యచరిత్ర - అవతారిక. పుటలు 17-20.

రాజశేఖరుడు కావ్యమీమాంసలో కావ్యహేతువులగు ప్రతిభావ్యుత్పత్తులను వివరించి, ప్రతిభను భావయిత్రి, కారయిత్రి- అని విభజించినాడు. వస్తుసందర్శనము భావయిత్రి; కావ్యసృష్టి కారయిత్రి. భావయిత్రి, కారయిత్రి మాత్రమే ఉదాత్త కవితా సృష్టికి కారణములు కాజాలవు. భావయిత్రికి, కారయిత్రికిమధ్య, 'సమాధి' ముఖ్యము. భావయిత్రి కారయిత్రికిముందు 'సమాధి' బద్ధమై యుండవలెను. 'సమాధి' కొరవడినకవితాసృష్టి ఉత్తమోత్తమము కాజాలదు. "Emotion recollected in tranquility is poetry" అని wordsworth నుడివియున్నాడు.

పాల్కురికి సోమనాథునకు, వస్తుసందర్శనమునకు కావలసిన ప్రతిభ, సాక్షాత్కరించుకొనిన దానిని అవగతము చేసికొనుటకు కావలసిన వేదవేదాంత పురాణాగమాది విషయ పరిజ్ఞాన సంపన్నమగు వ్యుత్పత్తి, అవగతము చేసికొనిన దానిని సృష్టించుటకు కావలసిన ఊష్మలత, ఆవేశములును సమృద్ధిగా గలవు. కాని అతని భావావేశము ఊష్మలతను, 'సమాధి' ని కప్పివేసినది. అతడు శివభక్తిచేమైమఱచి ఆవేశముతో తన్మయత్వమును పొందును. అట్టి సందర్భముల ఏకభావాశ్రితములయిన ద్విపదలు ఎడతెగక వందలకొలదిగ సాగుచుండును. "బసవాయనగవిన్నఁబానలొండేల..." [1] ఇత్యాదిగ సాగిపోవును. "అల్పాక్షరముల ననల్పార్థరచన" [2] సోమనాథుడు సంకల్పించిన రచనాశిల్పము. కాని భక్త్యావేశపరుడైన సోమనాథుని రచనలో ఈ సంకల్పసిద్ధి మృగ్యము. "అతని కవితాధార పరుగులెత్తునే కాని మందగమనము చేయదు. ఈ కవితావేశము భక్త్యుద్రేకము గలదై, గానప్రేరకమగుటచే తనివితీర వర్ణించిన గాని నాపుటకు సాధ్యము కాదు. దీనివలన కావ్యౌన్నత్యమునకు భంగమువచ్చినను అతడు లక్ష్యము చేయడు."

కొన్నియెడల సోమనాథుని ద్విపదరచన భావమునకు ఒక ప్రత్యేక సౌందర్యము చేకూర్చు శిల్పముతో నొప్పియుండును. ఈ క్రింది ద్విపదలను పరిశీలింపుడు:

"వడిఁబాఱు జలమున కొడలెల్లఁగాళ్లు; వడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోళ్లు
వడివీచు గాడ్పున కొడలెల్లఁ దలలు; వడిఁజేయు బసవ! నీ కొడలెల్ల భక్తి".

— బసవపురాణము — 2 ఆశ్వా. పుట 87.

---

1. చూ॥ బసవపురాణము: 2-వ ఆశ్వా. పుటలు 87—88.
2. చూ॥ బసవపురాణము: అవతారిక. పుట 9.

ఇవి బసవేశ్వరునిగూర్చి సోమనాథుడు భావప్లుతముగా పల్కిన పలుకులు. ఇందలి 'వడిబాఱుజలము' 'వడిఁగాలు చిచ్చు', 'వడి వీచుగాడ్పు'– వీని విషయముకన్న బసవన భక్తిభావము వైపే మనదృష్టి కేంద్రీకృతమగును. ఇవి కవి స్వవిషయమునందుకూడ సమన్వితములగును. ప్రతి పదమునను సోమనాథుని శివభక్తి పర వశత్వము గోచరించుచుండును.

సోమనాథుడు, వర్ణింపబడు విషయములను సవిస్తరముగా సంపూర్ణముగా, తనివితీరునట్లు వర్ణించును. 'రుద్రపశుపతి' యను నొక ముగ్ధభక్తుడు ఆదిపురాణమునందలి సముద్రమథనకథ నెవరో చదువుచుండ, నందు శివుడు విషమును మ్రింగెనను మాటనువిని, దాన శివునకేమిచేటు వాటిల్లెనోనని ఇట్లు పరితాపము చెందినాడు.

"విని యుల్కిపడి వీఁపు వితెగి 'హా! చెడితి;'
నని నేలఁబడి పొర్లి యక్కటా! నిన్ను
వెఱ్ఱిఁ జేసిరి గాక ! విశ్వేశ! యెట్టి
వెఱ్ఱి వారైనను విషము ద్రావుదురె."

– బ. పు. 3వ ఆశ్వా. పుటలు 146–147.

అని నాకొరకైనను విషము కుత్తుకనుండిఉమ్మివేయుమని చెప్పును. గౌరిని, ప్రమథులను, దేవతలను శివునిరక్షింపుడని వేడుకొనును. తుదకు తన ప్రాణములనువిడుతునని జలాంతరమునకురకబోవును. ఈ సందర్భమున అతని పరితాపవర్ణన ఎంతయో హృదయద్రావకముగ నున్నది. భావోద్రేకమును గల్గించు నిట్టిపట్టులే పాఠకుల తన్మయులను జేయును. తాళ్ళపాక చిన్నన్న తన పరమయోగి విలాసమున కులశేఖరయోగి కథలో విష్ణుభక్తిపరముగ నిట్లే పాత్రవర్ణన గావించియున్నాడు.[3]

---

3. చూ॥ పరమయోగి విలాసము. తృతీయాశ్వాసము. పుట 188.

పాల్కురికి సోమనాథుడు ప్రతిపాదించిన మతము పాక్షిక మైనను, అతని పాత్రసృష్టిమాత్రము సర్వజన సమాదరణీయ మని పలువురంగీకరింతురు. సోమనాథుని పాత్రలు సామాజిక జీవనమునకు సన్నిహితమైనవి. సాధారణ మానవ చిత్తప్రవృత్తులకు లోబడినవి. అతి సహజముగా ప్రవర్తించునవి. యదార్థ మానవ ప్రపంచమునకు చెంది సజీవములయినవి. అతని పాత్రలు మార్గ్యధీ మునకు, నిర్మలమగు నిశ్చలభక్తికి చక్కని దృష్టాంతము. పాత్ర లన్నిటిని అచ్చుపోసినట్లు ఒకే మాదిరిగ గాక ప్రత్యేక వ్యక్తిత్వముతో, వైవిధ్యముతో, చైతన్యము కల్గియుండునట్లు సోమనాథుడు చిత్రించినాడు. బసవపురాణములో శిశుభక్తులు, స్త్రీ భక్తులు, ముగ్ధభక్తులు; మూఢభక్తులు, మిండభక్తులు, మొండి భక్తులు, ప్రౌఢభక్తులు - మొదలగు శివభక్తులు కలరు. పాత్రల ముగ్ధత్వమును ప్రదర్శించుటలో సోమనాథుడు ప్రజ్ఞావంతుడు. గొడగూచి కథలో గొడగూచి తన తలిదండ్రుల వ్రతమును నెరవేర్చుటకై గుడికేగి కుంచెడు పాలు శివునికర్పించును. కొంత సేపు మరుగుననిల్చియుండి తిరిగివచ్చి చూడగా పాలు అట్లేయుండినవి. శివుడు తాను తెచ్చిన పాలు ఆరగింపమిచే ఆ శిశువు భయాందోళనలను కవి, చదువరుల మైమరపించునట్లు ఇట్లువర్ణించినాడు:

"పాలేల యారగింపవు లింగమూర్తి
కాచుట సాలదో కమ్మవల్వమినో
ప్రాంచియో వితిగానో పడుచ నేననియొ?
ప్రొద్దెక్కనోయొండెంబొగయువట్చెడినో?
బుద్ధి పుట్టదొనెయ్యి వోయకుండితినో ?
కడువేడియో నీరు గలసిన వనియొ ?
యొడవాద్యములు లేకయే నె తెచ్చిననో ?

చాలవో యివి యాలపాలు గావనియొ ?

*　　*　　*　　*

నిక్కంపుటాకలి నీకు లేదేని
గ్రుక్కఁడైనను గొని చిక్కించునాకుఁ

*　　*　　*　　*

యిత్తఱి శిశువుండ నెట్టు లంటేని
పొత్తున నైనను నెత్తి త్రావుదము
పిన్నపన్నారులు సిన్ని బొమ్మలును
నిన్ని గూడడుకులు నెన్నేనిఁబండ్లు
నాకెల్లి మావారునలిఁ దెత్తురపుడు
నీకు నిచ్చెదఁగాని నీయాన! త్రావు
పాలును జల్లారెఁ బలుకవు దోడ
నేలయాలింగ ! నన్నేఁ చెదవనుచుఁ
బాప యీశ్వరునకుఁ బలుమాఱు మ్రొక్కుఁ
గోపించు భంగించుఁ గుప్పించునఱచుఁ
గటకట వాపోవు గరములు విఱచుఁ
దటతట నేలతోఁ దాఁకించుఁ గాళ్లు
ధారుణిఁబడి బయల్దన్నుచు నేడ్చుఁ
గోరదిక్కును జూచుమాఱారిఁ జూచు
బుజ్జగించును వెడ్లు బుడ్లును బెట్టు
నిజ్జీవి క్రియఁబడు నివ్వెఱఁగందు
నెప్పటి యట్లేడ్చు నెలుఁగత్తి పిలుచుఁ
దొప్పనఁబడుఁ గోరఁదొలఁ గంగనూకు
వెఱచి ముందఱఁ బెట్టు మఱిపలుమాఱు
నెఱఁగుఁ బాదంబుల కెట్లు ద్రావమిని
నిట్లైనఁగాని పాలేఁ ద్రావననవు
మట్టవు మూర్కొన వట్టె యున్నవియుఁ
నీ వారగింపమి మావారు విన్నఁ
జావనడ్తురు నను సంశయంబేల

తనకు నెప్పుడుఁ జావు దప్పదు మగిడి
చన నిచ్చుటనె చత్తు సరివోదు."

—బ. పు. 3 వ ఆశ్వా. పుటలు 161—163.

శిశుభక్తురాలగు గొడగూచి ముగ్ధత్వమునకు తగిన భావములను కవి పొందుపరచినాడు. భావస్ఫురణమునకు తగిన జాతీయపదములు మనోహరముగా నిచట కూర్పబడినవి. ఇట్టిముగ్ధభావనల సొంపుకు ముగ్ధుడైకాబోలు ధూర్జటికవి తన కాళహస్తిమాహాత్మ్యములోని తిన్నని ముగ్ధత్వమును వర్ణించు సందర్భమున సోమనాథు ననుసరించినట్లు తోచును. సామాన్యపాత్రల చిత్తప్రవృత్తులను, బాహ్యచేష్టలను భావించి భాషారూపమున ప్రత్యక్షీకరించుటలో సోమనాథునిమించిన మరొక తెలుగుకవి లేడనుటలో అతిశయోక్తి లేదు.

వస్తుస్వరూప సాక్షాత్కారమే శ్రవ్య కావ్యములందలి వర్ణనలకు ప్రయోజనము. నాటకములలో ప్రయోగావసరమున వస్తుసాక్షాత్కరణ కల్గును. ఈ ప్రాశస్త్యమును సాధింపదలచియే శ్రవ్యకావ్యరచయిత వర్ణనలను చేయును. కథాసందర్భమునకు తగినట్లు వస్తువర్ణనగావించి తన్మూలమున కథాగమనమున కనుకూలమగు వాతావరణమును సృష్టించి కథనునడుపుటలో సోమనాథుడు అగ్రగణ్యుడు.

చంద్రోదయ వర్ణన:

"మల సంహరుడు జటామకుటంబుమీఁద
నిలిపియు నాకందు నెటఁబుచ్చలేఁడు
భక్తులపాద సంస్పర్శ నంబునను
వ్యక్తిగా నిర్మలత్వంబు జొందుదును
అని యాత్మఁదలపోసి యరుదెంచుమాడ్కి
వనజారి పాఙ్ముఖంబున నుదయించె."

—బ. పు. 3 వ ఆశ్వా. పుట 140.

బసవని భక్తిమహిమనుగూర్చి చెప్పునపుడు పై వర్ణన చేయబడి నది. ఇది భక్తిరస పోషకమై, ఔచితీరుచిరమై, కథాసందర్భమునకు తగినట్లు మేళవింపబడి యున్నది. శివుడు విషమును కంఠమున నిలుపగా బసవడు తాను విషమారగించి, ఇతర శైవభక్తుల నారగింప జేసి జీర్ణింప జేసినాడు. చంద్రోదయమును ఈ విషయములో సోమనాథుడు మనోహరముగ, ఔచితీపరముగ, సందర్భానుగుణముగ జోడించి వర్ణించినాడు.

అచేతనమగు ప్రకృతిని వర్ణించుటకన్న చేతనారూపమగు ప్రకృతిని వర్ణించుటకు కవికి ఎక్కువ ప్రజ్ఞ అవసరము. అందును తిర్యక్కుల సహజ చేష్టలను, కన్నులకు గట్టినట్లు వర్ణించి, పాఠకులను మెప్పించుటకు అసాధారణప్రజ్ఞ కవి కుండవలెను. 'భవి జనదర్శన స్పర్శనాలాప వివిధదానాదాన విషయదూరగుడ''[4] నని ప్రతిజ్ఞ చేసికొని, తెరలు కట్టిన పల్లకినెక్కి తిరిగినను సోమనాథుడు ప్రకృతిలో అతి సామాన్యములని తృణీకరింపబడిన వానినికూడ నిశితముగ పరిశీలించి అద్భుతముగ వర్ణించియుండుట అతని ప్రతిభకు మరొక తార్కాణము. ముసిడి చౌడయ్య కథలోని వృషభవర్ణన ఈ క్రిందిది.

"నిలిచి నిట్టించి ఘుణిల్లుణిల్లనఁగ
నలరుచు అంకెలందండవైచుచును
వాలమల్లార్చుచుఁగాలఁ ద్రవ్వుచును
నేలఁ గోరాడుచు నీడ పర్కుచును
నుడువీధి కెగయుచు నొడలు వెంపుచును
వడిగొని పఱచుచు నిడుజంగలిడుచుఁ
దగిలి గద్దించుచుఁ దలఁకుచుమాతి
యిగిలించికొని మొగంబెత్తి చూచుచును

4. చూ॥ పండితారాధ్య చరిత్ర - దీక్షాప్రకరణము. పుట 15.

జిఱుపెండ వెట్టుచుఁ జిఱులువోడ్చుచును
గుఱుజంగలిడుచు దిక్కులు సూచికొనుచు
గెలఁకులఁదన్నుచుఁ గ్రేళ్ళు వాఱుచును
బులుగఱచుమియుచుఁ మలఁగినాకుచును
బోరననెగయుచు బొంగుచు గొమ్ము
లొరగించుచు మలయుచు వంగికొనుచు
నూఁకరల్వెట్టుచు నురవడింపుచును
మూఁకకు నెగయుచు మస్సుముస్సనుచు."

—బ. పు. 5వ ఆశ్వా. పుటలు 374-375.

♦ ♦ ♦ ♦

"తొలికోడి కనువిచ్చి నిలిచి మైవెంచి
జలజల ఱెక్కలు సడలించి నీల్గి
గ్రక్కునగాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలు సక్కొల్పి కడుపు
వెక్కించి మెడసాచిఁ నిక్కిమిన్ సూచి
కుక్కుటో కోయని కూయక మున్న."

—పండితారాధ్యచరిత్ర — పురాతనప్రకరణము పుట 262.

ఇందు తెల్లవారు ఝూమున కూయు కోడియొక్క వివిధావయవ విక్షేపముల వైఖరిపొల్లుపోకుండ సోమనాథుడు వర్ణించియున్నాడు.

వృషభవర్ణన, కోడికూతవర్ణనలు స్వాభావికములై, అప్రయత్న పూర్వకములై భావప్రవాహము నెక్కడ కుంటువడకుండ రచింపబడినవి. ఈ వర్ణనలను బట్టి కవికిగల సూక్ష్మమైన కవితా దృష్టి గాంచవచ్చును. సోమనాథుడు భక్తియందు తన్మయత్వము చెందిన కవితావేశపరుడగుటచేతను, గొప్ప పండితుడై కవితా మర్మమెరిగినవాడగుడచేతను నేది వర్ణించినను సరసములై, సవిస్తరముగా, సంపూర్ణముగా. కన్నులకు గట్టినట్లు, కృత్రిమములుగ దోచక యుండును.

చిత్తరువుల లిఖించినట్లు పాత్రముల రూపవర్ణన మొనర్చి, వానిని చదువరుల హృదయఫలకములందు చిత్రించు నేర్పు సోమనాథునికి మిక్కుటముగా కలదు. సోమనాథుడు వస్తువర్ణనలో అంగప్రత్యంగములను విపులముగా వర్ణించును. అతడు బాహ్యాకార రేకలను బహుస్వభావసిద్ధముగా చిత్రించును. మాదిరాజయ్య కథలో శివుని గొల్ల వేషవర్ణనము ఇందుకు చక్కని దృష్టాంతము.

"బలుపు వ్రేళ్ళును మెద్దుపాదముల్ గుజ్జు
చిఱుతొడలును దొప్ప చెవులును బరడు
ప్రక్కలు బీరనరములును జిదక
ముక్కును ముడిబొమల్ మొగి దోనికడుపుఁ
బొక్కిళ్ళు వోయిన చెక్కిళ్ళు వలుద
బొక్కి బొమ్మును బెద్దనిక్కిన మెడయుఁ
బల్లమీసములు నేర్పడు కాయకన్నుఁ
బిల్లిగడ్డంబును నల్లనిమేనుఁ
బ్రాఁకు వట్టిన పండ్లు బ్రద్దచేతులును
వీఁకగాళ్ళును నడ్డి వీపును దనర
ములుగ త్తియుచ్చుఁ గోకలుఁజూఁడుఁ గొడుపు
మొలతిత్తి నిడిదొడ్డ మొలకచ్చ గట్టి
గాలిదప్పుపు వెండ్రుకల్ దూలియాడ
నీలవెట్టుచు నుత్కమెఱ్ఱఁ జూచుచును
గుక్కలఁబిలుచుచు టక్కవెట్టుచును
నెక్కొన నొరగాల నిలుచుచుఁ జనుచు
గొడ్డలి బరిగమ్మి గూటిపండయును
దుడ్డు గోలయుబట్టి తొడిఁదొడిఁ గొన్ని
మేకపిల్లలఁ దనచాఁకిట నిఱికి
వీకదబ్బర వాట్ల విసరివ్రేయుచును
గొన్ని మేకల రొప్పికొని వచ్చితమ్మ
నున్నకాయలు రాల్చియును నంతఁబోక."

— బ. పు. 3 వ ఆశ్వా. పుటలు 224-225.

సోమనాథుడు, గొల్లలవేషాదికములను, పరికరములను తెల్పుటలో గొల్లల వ్యవహారములోని పదజాలమునే గ్రహించి యున్నాడు. ఇందువలన వర్ణవకొక సహజత్వము సిద్ధించుటయే గాక సోమనాథుని భాషాపదపరిశీలన వ్యక్తమగు చున్నది. పండితభాషను పామరభాషను రెంటిని వశపరచుకొనినవాడు సోమనాథుడు. తన కావ్యభాషకు దేశీయతను ఈ విధముగ కూడ ఆపాదించినాడు. పండితారాధ్య చరిత్రమున కుమారపాల ఘూర్జరుని కథ (పుట 367) లో జూదపు పరిభాషకలదు. ఈ పరి భాషనే నాచనసోముడు తన ఉత్తరహరివంశమున గ్రహించి నాడని చెప్పవచ్చును.

ఒక విషయమును నొక్కి చెప్పవలసి వచ్చినపుడు సోమ నాథుడనోన్న ఉపమానములను వాడును. తేడర దాసయ్యకథలో సర్వమున శర్వుడుకలడను విషయమును ప్రతిపాదించుటకు సోమ నాథుడు వాడిన ఉపమానపరంపర చూడుడు:

"నూవుల లోపలి నూనియ యట్ల
భావింపc గాష్ఠంబు పావకునట్లు
పూని పాషాణంబులో నినుమట్లు
తా నేత్రముల లోని తద్రూప మట్ల
యలవడc బాలలోపల నేయియట్ల
జలకుంభములలోని చంద్రుని యట్ల
వెలుcగు నద్దంబులోపలి నీడ యట్ల
తలcపc బూసలలోని దారంబునట్ల
ఘటపటాదులలోని గగనంబునట్ల
పటికంపు శిలలోని భావంబునట్ల
వెలయబీజములోని వృక్షంబు నట్ల
నలరు శబ్దంబులోపలి యర్థమట్ల

పర్వతంబులలోని ప్రతిశబ్దమట్ల
సర్వంబు నందును శర్వుండు నట్ల."

—బ. పు. 6వ ఆశ్వా. పుటలు 432—433.

సామాన్యప్రజల కుద్దేశించిన రచనయగుటచే సోమనాథు డిట్లుపమానపరంపరను వాడినాడు. ఇట్లే ఉత్ప్రేక్ష, (చూ॥ పం. చ. పుటలు 353; 393), అతిశయోక్తి (చూ॥ పం. చ. పుటలు 209; 219), రూపకము (చూ॥ పం. చ. పుటలు 183; పర్వత ప్రకరణము 231), స్వభావోక్తి (చూ॥ పం. చ. మహిమ ప్ర. పుటలు 4; 38)—మున్నగు వానిని విశేషముగ అర్థవంతముగ వాడినాడు. ఒకటిరెండుపమానములనువాడినచో పామరులకు అసందిగ్ధముగా చెప్పబడిన విషయములు హృదయఫలకమున హత్తుకొనవు. ఇట్లే విషయము పాఠకుని మనస్సునకు లెస్సగా హత్తించుటకు, వారికందు మూలముగ రసావేశము కలుగుటకు సోమనాథుడు సమానార్థకములగు పదములనే మార్చిమార్చి ప్రయోగించినాడు. ఇది సోమనాథుని 'నూత్నసంగతి' ని, కళాసౌందర్యప్రతిభను, భాషా పాటవమును వ్యక్తపరచును.

సోమనాథుడు పండితారాధ్యచరిత్రమున శ్లేషయమకానుప్రాసాది నానాముఖ కవితా వైచిత్ర్యమును ప్రదర్శించినాడు. శ్లేషరచన కుదాహరణము:

"ఈ తపస్వునకు విధియెట్టిదో శ్రుతుల
జాతమా, యరసియో చూపుమాయంచు,
నోనారికేలంబ, యీనారి గురుల
యానారి మదిసెట్లు గార నేరమికిని,
శోకంబులేనియ శోకంబయేన
శోకిగా నేర్తునో కో కర్మమడఁచి
యోఘనసారంబ యీఘనాఘంబు

మోఘంబుసేయుఁ గ్రియాఘంబుగలదె
నాచంద మిట్లయ్యెనో చందనంబ
యే చందమును గాదయేమి సేయుదును
భ్రమియింపు చున్నయో భ్రమరమా యిట్లు
భ్రమియింపుచున్న నాభ్రమ లెట్లు వాయు
నో కూయుఁ గోకిలా యొడఁబడిగాగ
నాకూయి యడగునే యేకాలమైన."

—పం. చ. పురాతన ప్రకరణము, పుట 426.

ఈ శ్లేష ప్రశ్నరూపమున నుండుటచే సౌందర్యావహమైనది. కవితాకళలో శిల్పనైపుణి మెరయింపదలచియే ఇట్టి శ్లేషలను పండితారాధ్యచరిత్రమున అక్కడక్కడ నుపయోగించినాడు. (చూ॥ పర్వతప్రకరణము పుట 293). ప్రబంధపోకడలతో నొప్పు ఈ శ్లేషలు సోమనాథునికి తర్వాతి ప్రబంధములలో ప్రాముఖ్యమును బడసినవి. పండితారాధ్యచరిత్రలోని పర్వతవర్ణనము (పుట 392), శివరాత్రిజాగరవర్ణన (పుటలు 419-422)- ఇత్యాదులు ప్రౌఢప్రబంధ రీతిని వర్ణింపబడినవి.

సోమనాథుడు, "నవరస రసికత భువిని బేర్కొన్న శివకవి వరుల చిత్తంబులలర" బసవపురాణమును రచించినానని తెల్పినాడు. "ప్రస్తుతింపగ సద్భక్తి విస్ఫురణ బ్రస్తుతికెక్కిన బసవని చరిత" అనుటచే బసవపురాణము భక్తిప్రధానమని తాత్పర్యము. అయినను నిందు నవరసములకు యథోచితముగ తావొసంగబడినది. ఈ నవరసములను సోమనాథుడు వీరశైవ భక్తి ప్రాయముగజేసి వర్ణించినాడు.

భక్తి రసత్వయోగ్యత కలదనుట సర్వాంగీ కార్యమగు విషయము కాదు. "రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః భావః ప్రోక్తః"—అని ప్రాచీన సిద్ధాంతము. అనగా దేవతా

విషయకమగు రతియు, వ్యభిచారులును భావమని చెప్పబడును. కనుకనే కాబోలు ధనంజయు, హేమచంద్ర, మమ్మటాది ప్రాచీనాలంకారికు లనేకులు భక్తిని భావమాత్రముగనే పరిగణించినారు. భాగవతాది పురాణశ్రవణ సమయమున ననుభవింపబడు భక్తి రసమేల కాదను ప్రశ్న జగన్నాథ పండితుడు లేవనెత్తెను. ఉజ్జ్వల నీలమణి కర్తయగు రూపగోస్వామి, 'భగవద్భక్తి రసాయన' కర్తయగు మధుసూదన సరస్వతి – వీరిరువురును భక్తిని రసమాత్రముగనేగాక రసరాజముగా నిరూపించినారు. ఇతర దేవతావిషయకమగు రతి భావమే యైనను పరమాత్మస్వరూప శ్రీకృష్ణరతిపరమానందమునకు తీసికొనిపోవునని మధుసూదన సరస్వతి తెల్పినాడు. "భక్తి రసమునకు స్థాయిభావము దైవ విషయికమగు రతి. విభావములు భగవచ్చరిత్రలు. భగవత్ స్మరణ విరహాద్యనుభవములందు కలుగు రోమాంచాశ్రు పాతాదులు అనుభావములు. హర్ష నిర్వేదశంకాదులు వ్యభిచారులు".[5]

వీరశైవులు శివునికై ఎట్టి త్యాగమునైనను అవలీలగాఁ జేయగల సమర్థులు. అందు వారి భక్తి తన్మయత్వ మెంతయో ఆవేశయుతమైన ఉత్సాహమంత ఇమిడియున్నది. బసవపురాణము – భక్తివీరస్ఫూర్తి అధికముగా గల గ్రంథము. వీరశైవ మతోద్ధారకుడగు బసవన జీవితము మతతత్త్వ నిరూపణార్థ ప్రధానమై నడచినను, భక్త్యావేశముగల్గు ఘట్టములందు మాత్రము పఠితకు రసాస్వాదన భాగ్యము కల్గుచున్నది. అదియును పెక్కుచోట్ల వస్తు వ్యంగ్య ప్రధానముగనే గోచరించును.

5. చూ॥ కావ్యాలంకార సంగ్రహము: 3-వ ఆశ్వా. పుట 304. వివరణకర్త - శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి ద్వితీయ ముద్రణము 1959.

పండితారాధ్య చరిత్రలో గురుభక్తాండారి కథ[6]లో మిండ భక్తుల శృంగారమును, రతిశాస్త్రరహస్యములను, సుందరసం బెన్నజన్మాదిచరిత్రకథ[7]లో కరుణరసమును, ఈకథలోనే భయానకము[8]ను సోమనాథుడు ఔచిత్యముతో హృదయాకర్షముగ చక్కగా పరిపోషించినాడు. సోమనాథుని ద్విపద కవిత్వమును గూర్చి శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారిట్లు తెల్పియున్నారు. "బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు రెండును నెక్కడచూచిన నక్కడ నవరసములు పొంగి పొరలిపోవునంతటి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పబడినవి. హిమవద్భూధర గుహాగ్రముల నుండి యనర్గళముగా దుమికి వచ్చెడు గంగా ప్రవాహముంబోలె నీ మహామహుని కవిత్వము పాఠకుల మనంబుల నానందపూరమున నోలలాడించుచుండును. భక్తశిరోమణి యగు పోతన్న భక్తి పారవశ్యపు కవిత్వమునకును, కవిసార్వభౌముడగు శ్రీనాథమహాకవి నుడికారముల గడుసుతనంపు చిన్నెలకును, కర్ణాటరాజ్య రమానాథుడు నాంధ్రభోజుడు నాంధ్ర కవియునగు శ్రీకృష్ణదేవరాయ మహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుతవర్ణన పటిష్ఠములగు సందర్భములకును, దీనికిదానికని యేల ఇంతదనుక మనయాంధ్ర సారస్వతమునఁగల హృద్యములగు; రసవద్వర్ణనోదంచితములగు కావ్యపు మెఱుఁగుల కన్నిటికిని, ఈ రెండు ద్విపద కావ్యములే మార్గదర్శకములై రాజిల్లినవి యనుటలో నేమియును సందియములేదు".[9]

6. చూ॥ పురాతన ప్రకరణము. పుట 332 - 336.
7. చూ॥ మహిమ ప్రకరణము. పుట 156 - 157.
8. చూ॥ మహిమ ప్రకరణము. పుట 126 - 127.
9. 'ద్విపద కవిత్వము' - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.
ఆంధ్రపత్రిక 10-వ సంవత్సరాది సంచిక పుట 199, సం॥ 1919-20.

చౌర్యము, ద్యూతము, విటత్వము, రసవాదము, సంగీత శాస్త్రము, చతుర్వేదములు, షట్శాస్త్రములు, అష్టాదశపురాణములు, చతుఃషష్టికళలు, విద్యలు. కావ్యనాటకాలంకార శాస్త్రములు, కవితామర్మములు, వివిధ వేదాంతశాఖలు, భాష్యములు, వివిధ మతసిద్ధాంతములు, బహుభాషలు, అనేక దేశసాంఘికాచారములు, నానావిధాహార విహార వేషవైఖరులు, లోకవ్యవహారములు—మున్నగు అనేకాంశములను సోమనాథుడు సందర్భోచితముగా వర్ణించినాడు. ఇట్టి పట్టులందాతని సర్వంకష సర్వజ్ఞత్వము బోధపడును. సోమనాథుడు ప్రజ్ఞాపాండిత్యములు గల కవిశ్రేష్ఠుడు. ఈతని పాండిత్యమంతయు వీరశైవమునకు ప్రామాణ్యమును గూర్చుటకు, బహుమత వాదఖండనమునకు నుపయోగపడినది. ఈ క్రింది ద్విపదలలోని సోమనాథుని గంభీరశైలిని గమనింపుడు.

“గరిడిచొక్కిన యంకకాఁడునుఁ బోలె
నెడవిడి వడ్డ మదేభంబుఁ బోలె
వడిమృగంబులఁ గన్న వ్యాధుండుబోలె
బగఱగన్ పంతంబు బంటునుబోలె
వగనొందు పసిగన్న వ్యాఘ్రంబుఁబోలెఁ
నాసురవృత్తిఁ గోపాటోప చిత్తుఁ
డై సమయుల సమయాధముఁ జూచి
యెక్కడి వైదికుం? డెక్కడి బౌద్ధుఁ?
డెక్కడి వైష్ణవుం? డెక్కడి జోగి?
యెక్కడి చార్వాకు? డెక్కడి సాంఖ్యు?
డెక్కడి వేదాంతి? యెక్కడి కర్మి?



యుర్వీశు పరివార మూర్వీశు బంట్లు
నుర్వీశు ప్రజలును నున్నవారెల్ల

నిందుఁ దానభయనన్నెద్ది? వినంగ
నిందుఁ సభాపతి యెవ్వఁడౌననగ."

— పం. చ. వాదప్రకరణము. పుటలు 520—522

పాల్కురికి సోమనాథుని భాషాకవితాప్రభావము తిక్కన, నాచనసోమన, శ్రీనాథాది మహాకవులలో కూడ కన్పించును. బసవపురాణములోని సిరియాళ చరిత్రము శ్రీనాథుని హరవిలాసములోని చిఱుతొండనంబి కథకు ప్రతిరూపము. ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యములోని తిన్నని కథ బసవపురాణములోని కన్నప్ప కథ కనుకరణమే. అందిచ్చు, పశు (సు) పరించు, పథము, సడిసన్నవాడు, మఱాకులో, కన్నాకు, తమమయము, కొత్తడి - మొదలగువానిని తిక్కన సోమనాథుని నుండి గ్రహించి యుండును. సోమనాథుడు వాడిన జాతీయములు, సామెతలు, పలుకుబడులతీరులు తిక్కన రచనలందును కన్పించును. "బెండ్లు తేలెడిగాక పేరేటనైన గుండ్లు తేలునె" అని సోమనాథుడు ప్రయోగించి నట్లే "గుండ్లుదేలి బెండ్లు మునింగినట్లయ్యె" అని తిక్కన వాడినాడు. ఇట్లు అప్రయత్నముగా సోమనాథుని పలుకుబడి తిక్కనపై పడినది. "ఇల మంగలమున ప్రేలులు సిట్లుగొన్న, పొలుపున ధరణిఁ జుక్కలు ద్రెళ్ళిపడియె" అను ద్విపదపంక్తుల ననుసరించియే నాచన సోమన "మంగలములోని ప్రేలాలఁ మాడ్కిఁ జుక్క లిక్క డక్కడఁబడ" అని రచించియుండును.

"బసవలింగము కృతిపతియటె; కృతియు
రవికతఁ బండితారాధ్య చరిత్ర
మటె, పాల్కురికి సోమనార్యుడు సుకవియటె."

— పం. చ. దీక్షాప్రకరణము. పుట 22.

అను సోమనాథుని ద్విపదననుసరించి 'పలికెడిది భాగవతమట...'

అని పోతన రచించియుండును. పోతనరచించిన 'మందార మక రంద మాధుర్యమునఁ దేలు...'' అను పద్యము సోమనాథుని ద్విపద రచన కనుకరణమేయని చెప్పబడుచున్నది.

''నల్లవో భామల యుల్లంబు లెఱిఁగి
గొల్లవాఁడైనను గోరునే కవయ
నొల్లని వెలయాలి నొల్లని నృపతి
నొల్లనిచెలిఁబాయ నొల్లఁడేనియు

—పం. చ. పురాతనప్రకరణము. పుట 339

అను సోమనాథుని ద్విపదల ననుసరించియే

''ఒల్లని సతి, నొల్లని పతి
నొల్లని చెలికాని, విడువనొల్లని వాఁడే
గొల్లండు గాక ధరలో
గొల్లండును గొల్లఁడవునె గుణముగ సుమతీ''

అని సుమతిశతక కారుడగు బద్దెన రచించియుండును. ఇట్లు సోమనాథునియెడ పూజ్యభావమున తర్వాతి కవులు అతనిరచన లను నెడనెడ ననుసరించినారు.

### గోన బుద్ధభూపతి - కట్టా వరదరాజు:

తెలుగువాఙ్మయమున పాల్కురికి సోమనాథుడు ద్విపదకు సృష్టికర్త కాగా తన్మహనీయస్థితికి మూలమై నిలిచినవాడు గోన బుద్ధభూపతి అని విమర్శకుల అభిప్రాయము. ప్రతిభావ్యుత్పత్తు లందు సోమనాథుడే మేటి కాని అతని కవిత స్వమతోత్కర్షతో డను, పరమతనిందతోను బ్రాహ్మణనిందతోను నిండియుండుటచే విశ్వజనీనతను కొంతవరకు పొందలేకపోయినది. మరియు భాషా ఛందోలక్షణాదులందును సోమనాథుడు అతిస్వతంత్రుడై, పండిత లోకమునకు ప్రీతిగాని లక్షణోల్లంఘనమును చేసినట్లు భవికవులు

భావించిరి. ఈదోషములను కొంతవరకు సరిదిద్ది ద్విపదకవితకు భవికవిజనసమ్మతిని చేకూర్పయత్నించినవాడు గోన బుద్ధారెడ్డి. ఈ ప్రయత్నమున అతడు సఫలుఁడయ్యెననుటకు లాక్షణికులుఅతనిని ద్విపదకు ప్రామాణికునిగ గుర్తించుటయు నిదర్శనము. మఱియు తర్వాత వెలసిన ద్విపదరచనలలోను అతని ప్రభావముండుటయు మరొకముఖ్య విశేషము. సోమనాథుని ద్విపదరచనలు స్వతంత్రములు; అనువాదములుకావు. గోన బుద్ధారెడ్డిరచన అనువాదమైనను అనువాద స్వాతంత్ర్యముతో నొప్పినది. అతని రచన సర్వజనాంగీకారము నొందుటకు నిదియునొక కారణము కావచ్చును. అతడుపాటించిన అనువాదస్వాతంత్ర్యము ముఖ్యముగా రంగనాథ రామాయణమునందలి దేశీయతను ప్రతిబింబింపజేయునది. గోన బుద్ధారెడ్డికి నాలుగువందలసంవత్సరముల తర్వాత వెలసిన మరొక రాజకవి కట్టా వరదరాజు ద్విపదరామాయణమును రచించెను. రంగనాథ వరదరాజరామాయణముల రెండింటికిని మూలము వాల్మీకిరామాయణమగుటచేతను, రెండును ద్విపదరూపములో నుండుటచేతను, తద్రచయిత లిద్దరును రాజకవులగుటచేతను వీనినిపరస్పరమును, మూలముతోను పోల్చి వారి ద్విపద కవితా విశేషములను పరిశీలించుట సమంజసము.

రంగనాథరామాయణము పురాణమార్గమున, కథాకథన ప్రధానముగ, దేశీయపద బాహుళ్యముగ, సర్వజన సుబోధకముగ రచింపబడి కవితాశిల్పమును, పారాయణ యోగ్యతను కల్గియున్నది. ఇది మూలమునకు యథానువాదము కాదు. ఇక వరదరాజ రామాయణము వాల్మీకిరామాయణమునకు యథామాతృకము. ఈ విషయము రెండు గ్రంథములను పోల్చిచూచిన స్పష్టమగును. ఈ రెంటిలో కథావస్తువునకు ఉపాఖ్యాన

ములకు సంబంధించిన సాదృశ్యభేదములు ఇంతకుపూర్వమే వివరింపబడినవి. (చూ॥ నాల్గవ ప్రకరణము ).

కట్టా వరదరాజు (1630 A. D.) కృష్ణదేవరాయల యుగము తర్వాతివాడగుటచే అతని కవితలో ప్రబంధ కవితా ప్రభావము కొంత కన్పించును. ఈ కారణమువలననే వరదరాజ రామాయణమున కావ్యకళాంశములకు సంబంధించిన సంభాషణాత్మక రచన, జాతివార్తాచమత్కారము, వర్ణనాచాతుర్యము, సాంఘికాంశముల చిత్రీకరణము—మున్నగు అంశములు రంగనాథరామాయణములోకన్న ఎక్కువ ప్రాముఖ్యమువహించినవి.

రంగనాథరామాయణ, కట్టా వరదరాజ రామాయణములోని కొన్ని సమాన ఘట్టములను గైకొని పరిశీలించినచో పై విషయము స్పష్టమగును.

ఇంద్రజిత్తు రెండవమారుయుద్ధమును రంగనాథ రామాయణకర్త కథాకథన ప్రధానముగ సామాన్యముగనే వర్ణించినాడు:

"ఆ సమయంబున నా దానవుండు
భాసురంబుగఁ దన ప్రభఁ గాననీక
యా దివి నుండి దివ్యాస్త్రంబు లేయ
నా దానవుని దెస కగచరు లెగసి
యుగములు వైవంగ నవిద్రుంచి గుండె
లగలించి పెక్కండ్రఁ నవనిపైఁ గూల్చి
వేగంబె యొక్కొక్క విషమ బాణమున
వేసురఁ దొమ్మండ్ర నేడ్గుర నేసె;
మఱియును గడిమిమై మర్కటేశ్వరులు
నెఱయంగ గిరి ధరణీ జంబులెత్తి
యా యింద్ర జిత్తుపై నడరింప నతఁడు

సాయకంబుల వానఁ జతురుఁడై త్రుంచి
పదియు నెన్మిది తీవ్ర బాణంబులేసె
మదమెల్లఁ జెడ గంధ మాదనుఁ; గడిమి
దీపింప నలుఁ దొమ్మిదిట రూపుమాపె;
నేపార మైందుని నేడింటనొంచెఁ;
గదిసి పంచకమున గజుఁబొలియించెఁ;
బదియింట భల్లూక పతిఁ గూలనేసె;

♦ ♦ ♦ ♦

శరభు నేడింటను శతబలిఁ బదిట
సరి నెన్మిదిట హరు సన్నాదు మూఁట
నరుదు గాఁ దక్కిన యఖిల యూథపుల
వర దివ్య శస్త్రాస్త్ర వర్షంబు గురిసి.''

— రంగా. రా. యుద్ధ. కాం. పుట. 437 (రాయలప్రతి)

ఈ సన్నివేశమునే వరదరాజు యిట్లు వర్ణించినాడు.

''అసురేంద్ర సుతుడు బ్రహ్మాస్త్ర ప్రభావ
లసమాన తేజోవిలాసియై లాసి
నెఱయించు నొక చోట నీల మేఘములు
గురియించు నొక చోట ఘోరాస్త్ర వృష్టి
మలయించు నొకచోట మంచు పెందెరలు
పొలయించు నొకచోట భుగభుగ బొగలు
వినిపించు నొక చోట విలునారి మ్రోత
కనిపించు నొక చోట కాంచన రథము
చెలగించు నొక చోట సింహనాదములు
నెలకొల్పు నొక చోట నేమికాధ్వనులు
నడరించు నొకచోట హయ హేషితములు
జడియించు నొక చోట శస్త్రులు వైచి
వినిపించు నొక చోట విలుకేల బూని

ననముంచు నొకచోట నాకృతిఁ జూపి
యీవేల నెలయించె నింద్రజిత్తుండు."

— వరదరాజ రామాయణము. యుద్ధ. కాం. పుట 353

పై వర్ణనలో కవి భావవిస్తృతి, రచనా చమత్కృతిని పాటించి కన్నులకు మిరుమిట్లుగొల్పునట్లు మనోహరముగ ఇంద్రజిత్తు యొక్క అస్త్రవిద్యానైపుణ్యమును వర్ణించియున్నాడు.

రంగనాథ రామాయణమునందలి వర్ణనలుచాలవరకు కథాగతికి పెనవేసుకొనియే యుండును. ఇందు వర్ణనలకొరకు కథ ఆగిపోయి మరుగుపడదు. కథాగతిని మనోహరముగ నడిపించుట కొరకై వర్ణనలు ఇందు ఆవశ్యకములయినట్లు తోచును. ఇవి తెచ్చి పెట్టుకొనినట్లుండవు. ఉదాహరణమునకు ఋశ్యమూక వర్ణనము:

"త్రైలోక్య విభులైన తమరాకఁ జూచి
యాలోన మదిఁ బొంగి యానందమంది
యనయంబు నొప్పెడు నశ్రుపూరంబు
లన సెల యేఱుల నలరెడు దాని

నిల మేరు మందర హిమశైల పతుల
నలి మీఱ నగియెడి నగవులో యనగ
సాంద్రంబులై యుండి చదల దీపించు
చంద్ర కాంతోపలచ్ఛాయల దాని

సరసి జాసనుఁడు భూచక్రంబు మీదఁ
బరగఁ బర్వతరాజ్య పట్టంబు గట్టి
శిరసునఁ బెట్టిన సేసఁ బ్రాలనఁగ
నురుశృంగములఁ జుక్కలొప్పెడిదాని

నురుభీతిఁదనుఁ జొచ్చి యున్న సుగ్రీవుఁ
బరిభవించిన వాలిపై మండుచుండు

గతిసూర్య కాంతముల్ గనకన మండ
నతుల ప్రతాపోగ్రమై యొప్పుదాని



చింతామణులు నెందు( జెడని పెన్నిధులు
సంతానతరువులు సరినొప్పుదాని"

– రంగ. రా. అరణ్య. కాం. పుట 195.

ఈ వర్ణన మనోహరమై కథాసందర్భముతో పూర్తిగా ఇమిడియున్నది. పాత్రలయెడ ప్రకృతి సానుభూతిని ప్రకటించునట్లు చిత్రింపబడినది. ఈసందర్భమున వరదరాజరామాయణమునందలి ఋష్యమూక వర్ణన సంస్కృత సమాసములతోను, అనుప్రాసములతోను వర్ణింపబడినది:

"అలవోక మాత్ర నిరస్తశోకంబు
దివిజ భూమీద రాంతి ప్రవేశకంబు
అపహృతాధ్వన్య శ్రమాతిరేకంబు
తపనేందు గణమణి స్థగితలోకంబు
అమరాపగా కృతాత్మాభిషేకంబు
యమదూత గదితనమోనువాకంబు
సారసినీ చరచ్చక్రవాకంబు
తీరవనీ సముత్తీర్ణపైకంబు
కందరాంతర విశంకట వనోకంబు
సందీప్త శృంగానుషంగ నాకంబు
వేలాచరిష్ణు గంధేభ పాకంబు
తాలాదిరసముత్కట వనీకంబు
ఋషికన్యకా కలావృత ప్రలాకంబు
విషయలోలాసర ద్విషదభీకంబు
వాలి సంప్రాప్త భావవ్యళీకంబు
కాలాచరిత మోని గణవరాకంబు

ప్రతి పన్నయతి పుణ్యఫల విపాకంబు
శ్రుత ఋష్యనీకంబు ఋష్యమూకంబు."

— వ. రా. అరణ్య. కాం. పుట 271.

వరదరాజు రచన ఊహా వైచిత్ర్యముచే చమత్కార మును గొల్పుచున్నది. రంగనాథ రామాయణములోని వర్ణన కేవలము ఊహామాత్రమే కాదు. భావోన్మీలితముచే పరిపుష్టమైనది. పరిశీలనానురక్తి దానికి పరివేషము. జడపదార్థమగు ఋష్యమూకమునకు ప్రాణిధర్మమారోపించి రంగనాథరామాయణకర్త వర్ణించినాడు.

గోన బుద్ధారెడ్డి, మూలములో లేకున్నను తన రంగనాథ రామాయణమున గౌతమాశ్రమ వర్ణన[10]ను పది ద్విపదలలో గావించినాడు. వరదరాజరామాయణమున ఈ గౌతమాశ్రమ వర్ణన కానరాదు.

మహేంద్రాద్రిని చేరి, సీతనుగూర్చి రాముడు విరహము నొందుటను రంగనాథరామాయణకర్త కథాంశముతో సాయం సంధ్యాది వర్ణన[11]ను జోడించి మనోహరముగ యుక్తివైచిత్ర్యలతో, రసవంతముగ రచించినాడు. ఈ సందర్భమున వరదరాజు సామాన్యముగనే వర్ణించినాడు. ప్రకృతివర్ణనలు ఈసందర్భమున వరదరాజు రామాయణమున కానరావు.

రంగనాథరామాయణము 'దేశి' కవిత్వమును వెల్లివిరియింపజేసినను దానికి సమకాలిక సంస్కృత కవితావిధాన సంపర్కము కొంచెము సోకినదని చెప్పవచ్చును.

---

10. చూ॥ రంగనాథరామాయణము. బాలకాండము. పుట 49.

11. చూ॥ రంగనాథరామాయణము. యుద్ధకాండము పుటలు 288-289

ఈ చంద్రోదయవర్ణన చూడుడు:

“వరకళాయలి సీమ వలరాజుమామ
పొలుపొందు కలువల పోరానివిందు
కలసిన జక్కవ కవఁబాపుమందు
పాలవెల్లినిద్రచ్చి పడసినవెన్న
శూలియాఁదల పువ్వు చుక్కల నవ్వు
నెఱిచకోరములకు నెలనెల పంట
యలివేది విరహుల నుడికించుమంట
గగనంబు తొడవు దొంగల గుండెదిగులు
నొగినబ్ధిఁ బొంగించు నూఱటపట్టి
హరిహర బ్రహ్మల యానంద సృష్టి
సరసిజరిపుఁడైన చంద్రుఁడు వొడిచె.”

-రంగ. రా. యుద్ధకాండము. పుట 317.

పై చంద్రోదయవర్ణనలో సరళమైన కూర్పు, అలతియలతి లలితపదముల నుడికారపు సొంపు గుర్తింపవచ్చును.

భావప్రధానమైన శబ్దమును నిర్ణయించుకొని దానిని సన్నివేశయోగ్యముగ ప్రయోగించుట కవి ప్రతిభకు నిదర్శనము. అదియే శాశ్వతానందమును గూర్చు కవిత్వమునకు పునాది. రామాయణమున వాలివధ ఒక రాజకీయపుటెత్తు. ధర్మనిష్ఠాగరిష్ఠుడగు రామునియొక్క బాణముచే వాలి నేలకొరిగినపుడు, తార రామునిగూర్చి నిట్లు వాపోయినది:

“జననాథ యీవాలిఁ జంప నేమిటికి
మెఱసినిన్నిటు సేయ మీ తండ్రితోడఁ
గలహపెనే రఘురామ గణుతింపవాలి?
వెరవున నీరాజ్య విభవంబుగొన్న
భరతుఁడే రఘురామ పరికింపవాలి?

చెన్నటిరైయె నీదేవిఁ జెఱగొని చనిన
దనుజుఁడే రఘురామ దలపోయవాలి?
వాలి నకారణ వైరంబు పూని
యేలయ్య తెగటార్చి తిబ్బంగిఁబేర్చి?
నీయట్టి సుకృతికి నీయట్టి పతికి
నీయట్టి కారుణ్య నిధికిట్లు దగునె?
జనకజతోఁగూడ జనియెనే యెఱుక?
ఘనమైన విరహాగ్నిఁ గ్రాఁగనే యెఱుక?
భూమీశ! నేడు నాపుణ్య మిట్లయ్యె
నేమిసేయుదు నింక నేమందు విధికి?
నీవాలి నెడఁబాసి యేనుండఁజాల
దేవనన్నును బట్టి దెగటార్పవయ్య."

— రంగ. రా. కిష్కింధాకాండము. పుట 219.

ఇందలి ప్రతివాక్యమందును, ప్రతిశబ్దమునందును, ప్రతి అక్షరము నందును, ఆర్తితో, ఆవేశముతో, స్త్రీహృదయము ప్రతిబింబించినది. ఇందొక్క అవాచ్యవచనములేదు "నీయట్టి సుకృతికి", "నీయట్టి కారుణ్యనిధికి", "నీయట్టిపతికి" ఇట్టిపని తగునా? అని తార రామునిప్రశ్నించి ఆత్మపరిశోధనమున కవకాశము కల్పించుచున్నది. శ్రీరాముడు భార్యావియోగము నందున్నాడు. తానును భర్తృవియోగమును కల్పించినాడు. ధర్మరక్షణమునకు కంకణము గట్టినాడు. నిరపరాధియగు వాలినిసంహరించి తానపరాధియైనాడు! అందులకే 'నీయట్టిసుకృతికి, నీయట్టిపతికి' – అను పలుకులకంతటి వాడి చేకూరినది. ఆ యాదర్శపతీత్వమును, ఆ సుకృతమును, ఉగ్గడించుట కిదియాసమయము! అనరాని, వినరాని పలుకులతో నేమిపని?

ఈ సందర్భమున వరదరాజరామాయణమునందలి రచన

అంత హృదయాకర్షముగ లేదు.[12] నన్నివేశానుగతమగు భావాను కూల రచనాశిల్పముకూడ రంగనాథరామాయణము నందువలె నిందు తీక్ష్ణముగను, ధారాళముగను గోచరింపదు.

వాలి భార్యయగు తార రాముని శపించినట్లు భాస్కర రామాయణమునందు కలదు.[13] మూలమునను, రంగనాథ, వరదరాజ రామాయణములందీ విషయము లేదు.

రంగనాథరామాయణము రసోద్బోధకములగు పదజాల ముతో, కావ్యమునకు జీవితప్రాయమగు నౌచిత్యముతో, కన్నులకు గట్టినట్లు చిత్రించు పాత్రల మనోభావవ్యక్తీకరణతో మనోహరముగ నొప్పినది. అయోధ్యాకాండమునందు రాముని వనవాసము నర్థించు పట్టపుదేవియగు కైకేయిని దశరథుడు ఆక్రోశించు సందర్భము గమనింపుడు:

"కోమలి! కేకయకులమునఁబుట్టి
యీమాట లాడ నీ కెట్లాడనోరు?
నడవులపాలు గమ్మని రాముఁద్రోవ
నెడపకతొల్లి నీ కెగ్గేమిసేసెఁ?"
గౌసల్యకంటెనిన్ ఘనతగా జూచు;
నీ సేవలోనరించు; నీ పంపు సేయు;
నటువంటి సుగుణాఢ్యుడైన శ్రీరాము
నెటువలెఁ బొమ్మంటివే దయమాలి?
యడవుల కతని నీవంపు మటన్న
నెడనూచిచూచి, నేనెట్లు పొమ్మందు?
నా మహాత్ముని రాము నడవులకనిచి

12. చూ॥ వరదరాజరామాయణము. కిష్కింధాకాండము. పుటలు 375-376. ద్వి.పం. 2403-2444.

13. చూ॥ భాస్కరరామాయణము. కిష్కింధాకాండము. పుట 225. పద్యము 305. వావిళ్ళ ప్రతి. 1953 సం॥.

యీమేనఁ బ్రాణంబు లెట్లు నిల్పుదును ?
నృపపుత్రివని నిన్ను నెమ్మిగైకొంటిఁ
జపలలోచన కాలసర్పంబ వైతి."

— రంగ. రా. అయోధ్య. కాం. పుట 93.

దీనికి మూలమగు వాల్మీకిరామాయణములోని శ్లోకములీక్రిందివి:

"నృశంసే! దుష్టచారిత్రే! కులస్యాస్యవినాశిని!
కిం కృతం తవరామేణ? పాపే పాపం మయాపినా
సదా తే జననీ తుల్యాం వృత్తిం వహతి రాఘవః
తస్యైవత్వ మనర్థాయ కిం నిమిత్త మిహోద్యతా
త్వం మయాత్మ వినాశార్థం భవనం స్వం ప్రవేశితా
అవిజ్ఞానాన్నృప సుతా వ్యాళీ తీక్ష్ణవిషాయథా."

దీనికి వరదరాజు ద్విపదరూపమగు తెలుగు సేత ఈ క్రిందిది:

"ఏమురాముఁడు నీవ నెగ్గైనకార్య
మేమి చేసితి యిట్టులేల నావిషము
చిమకుచు వంశనాశని వైతినీవు
వనితరామునిఁ జూచి వనితలంబునకుఁ
బొమ్మను తలఁపెట్లు వొడమవిషంబు
గ్రుమ్మరింపుచు త్రాచు క్రొదమయుంబోలి
యున్న నిన్నెఱుఁగక నుంచితి నమ్మి
యిన్నాళ్ళు సతివని యింటిలోపలను
కౌసల్యమారుగాఁ గనునిన్నురాముఁ
డీసెఱుంగడు తమ్ములెడ నొక్కనాడు
సకలలోకహిత ప్రచారునాసుతుని
నకట!యే కొఱత సేయంగ నిట్టులంటి."

— వరద. రా. అయోధ్య. కాం. పుటలు 293—294.

ఇది మూలవిధేయముగ నేనున్నది. మూలములో రాముని దివ్యత్వ మంతగా చెప్పియుండలేదు. అతడొక లక్ష్యభూతుడైన రాజ

పుత్రుడుగా, మానవోత్తముడుగా చిత్రింపబడినాడు. ఈ విషయమున కనుగుణముగనే వరదరాజు ''సకలలోక హితప్రచారు నా సుతుని'' అని దశరథునినోట చెప్పించినాడు. కాని రంగనాథ రామాయణమున రాముని దేవతాంశము మిక్కిలి యెత్తిచెప్ప బడినది. దశరథుని నోటనే 'ఆమహాత్మునిరాము' నని రంగనాథ రామాయణకర్త పల్కించినాడు. ఈ సన్నివేశమునుబట్టి రంగనాథరామాయణము వరదరాజ రామాయణము వలె మూలవిధేయము కాదని తెలియును.

ప్రతినాయకుడగు రావణుని లోకభీరుడగు శూరుడుగానే గాక గుణగ్రహణపారీణునిగ, మహోదారునిగ రంగనాథరామాయణకర్త వర్ణించినాడు. కావ్యశిల్ప ధర్మమునుబట్టి చూచినను నాయకునివలె ప్రతినాయకుడును ఉత్తమమూర్తియైయుండుటయే సమంజసముగాని, నీచప్రకృతియగుట తగదు'' అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు రంగనాథ రామాయణ పీఠికలో వ్రాసియున్నారు. రామునిపై పగపూనినరావణుడు రాముని ధనుర్విద్యా కౌశలమును నిట్లు కీర్తించినాడు:

''నల్లవో రఘురామ! నయనాభిరామ!
విల్లు విద్య గురువ వీరావతార!
కరశర లాఘవ క్రమ కళా నిపుణ
స్ఫుర దురు చాప సంశోషిత కృపణ
భుజసార దృఢ ముష్టి భువన విఖ్యాత
విజితరిపు వ్రాత విజయ సమేత
మానవ రాజ కుమార కంఠీర
వానవ్య దివ్య శస్త్రాస్త్ర సంపన్న
స్ఫార ఘోరాక్షయ బాణ తూణీర
వీరాగ్ర గణ్యయో విశ్వ శరణ్య

బాపురే! రామ భూపాల! లోకముల
నీపాటి విలుకాడు నేర్పునే కలుగ
పాటించి పురములపైఁ బడ హరుని
ఏ టొప్పు నిందునీ యే టొప్పుఁ గాన''.

—రంగ. రా. యుద్ధ. కాం. పుట 356.

ప్రతినాయకునిచే ప్రశంసల నందుకొన్న నాయకుని విలువిద్యా పాటవ మెట్టిదో! పగవారినీరీతి పంతంబువిడిచి' పొగడరాదని మందలించినవారి కతడిచ్చిన సమాధానమిది, ''మేటిశూరుల పెంపు మెచ్చంగవలదె'' అని. ఇట్లే తక్కిన దైత్యులందరును శ్రీరాముని మాహాత్మ్యమును వినుతించినట్లు రంగనాథ రామాయణకర్త వర్ణించినాడు. కట్టా వరదరాజ రామాయణములో దైత్యుల గుణ గణములను ప్రశంసించి నట్లుగాని, వారినోట రాముని మాహాత్మ్యమును గూర్చి చెప్పినట్లుగాని కానరాదు. పాత్రపోషణలో వరదరాజ రామాయణము మూలమును బోలియే యున్నట్లు తోచును. కాని రంగనాథ రామాయణమునందు వలె పాత్రపోషణ విషయమున మూలమునకు మెరుగు దెచ్చు నట్లు వర్ణింపబడి యుండలేదు.

ఋశ్యశృంగుడు వేశ్యలను చూచి విపరీతముగ భావించు సన్నివేశమును వాల్మీకి తన రామాయణమునందు గంభీరముగా మితవాక్కులతో వర్ణించినాడు. ఈ సందర్భమున రంగనాథ రామాయణమున మూలములో లేని చక్కని మృదు హాస్యము పోషింపబడినది. ఇందు మూలము నందలి ఆర్షత్వము తగ్గినను కావ్య గౌరవము మాత్రము హెచ్చినది.

రంగనాథ రామాయణమునందు ఋశ్యశృంగుడు వేశ్యలను గాంచి నంతనే,

"చన్నుల పేరడ్గి చన్నుల మీద
నున్న హారములకు నుద్దేశ మడిగి
మాకుఁ గొమ్మొక్కటి మస్తకమ్మునను
మీకుఁ గొమ్ములు రెండు మెఱసె రొమ్మునను



కని విని యెఱుఁగ మిక్కానన భూమి
మునులకు నీ వేషములు గలవొక్క
యెక్కడి మును"

— రంగ. రా. బాలకాండము. పుట 12.

లని ప్రశ్నించినాడు.

బాహ్య ప్రపంచముతో నేమాత్రమును సంబంధము లేక అడవులలో పుట్టి పెరిగిన ఋశ్యశృంగునికి వేశ్యల వేషభూషణములు మొదట నాకర్షించినవి. ఋశ్యశృంగుని అమాయక భావములు, మాటలు, ప్రవర్తన మృదు హాస్యమున కనువుగ రంగనాథ రామాయణమున చిత్రీకరింప బడినది.

ఇక వరదరాజరామాయణమునందు, వేశ్యలు హావభావ విలాసప్రదర్శనలతో ఋశ్యశృంగుని కడకు వచ్చినపుడు అతడు వారిని మునులని తలచి, లేచి వినయపూర్వకముగా నమస్కరించి, ఆతిథ్యమిచ్చును. తన వృత్తాంతమును వారికి వినిపించి, వారివృత్తాంతమును వినగోరెను. ఇట్లు వరదరాజరామాయణమునందు ఋశ్యశృంగునికి వేశ్యలకును సంభాషణము[14] ఆతిథ్య మర్యాదలతో సాగినది. పిమ్మట వేశ్యలువిలాసవిభ్రమచాతుర్యాదుల నెరపి అతనికి వలపు జాడల నెరిగింతురు. ఋశ్యశృంగునికిని వేశ్యలకును కొంత పరిచయ మేర్పడినతర్వాతనే అతడు వారి స్తన

---

14. చూ॥ వరదరాజ రామాయణము - బాలకాండము. పుటలు 46-47.
ద్వి. పం. 1123-1130.

వస్త్రాదులను గూర్చి పృచ్ఛించినట్లు వరదరాజ రామాయణము నందు వర్ణితము. ఇందలి రచన ఇది.

"పూను మీ శివలింగముల కేల లేవు?
పాన వట్టము లంచు పాలిండ్లు నివురు
తుమ్మెద గుంపులఁ దోలెద ననుచు
కొమ్మన నుదుట ముంగురు లంటి త్రోచు
వేలిమి బొంగ్లెంత వింతాయె ననుచు
తేలిక కస్తూరి తిలకముల్ మెచ్చు
స్వాదుగా గమగమ వలచు నెచ్చోటి
బూదియో యని గందవొడి కేల నంట
యీ వింత మండి త్రాళ్లెక్కడి వనుచు
తా వేఁడు మేఖలా దామముల్ చూచి
యే సీమ పటికంబు లిట్లుండు ననుచు
గాసిల వజ్రాల కడియముల్ ద్రిప్పు
నే చెటులనుఁ బుట్టు నీ వల్కలంబు
లీ చాయ నవి వల్వ లెగ నెత్తి చూచు
మంచివె రుద్రాక్ష మాలిక లనుచు
కాంచి నీలపు గురుల్ కన్నుల నద్దు
రాక మించఁగ నుత్తరీయంబు లందు
చౌక మండలువు లుంచితి రంచునవ్వు
చిగురాకులాయివి చిదు ముద మనుచు
తొగరుఁ గెమ్మోవు లందుక గిల్లఁజూచు"

—వరద. రా. బాల. కాం॥ పుటలు 48-49, ద్వి. పం. 1165-1184.

రచనా విధానమున ఈ సన్నివేశము నందలి ద్విపదలు మనోహరముగ నున్నను రంగనాథ రామాయణ ద్విపదలతో పోల్చి చూచినపుడు ఇందు మృదు హాస్య పరిపోషణము, అమాయక భావ వ్యక్తీకరణముపట్ల కవిదృష్టి కేంద్రీకరించి యున్నట్లు కానరాదు. ఋశ్యశృంగుడు కేవలము అమాయిక ప్రకృతిగల

వాడని నమ్మినపుడు రంగనాథ రామాయణము నందలి రచన ఎక్కువగా ఆకర్షించును. సామాన్యదృష్టికి వరదరాజరామాయణములోని వర్ణనలు మెప్పు బడయును. హాస్యమును చిత్రించుటలోను గోన బుద్ధారెడ్డి వరదరాజులకు కొంత భేదము లేకపోలేదు. శూర్పణఖ శ్రీరాముని చూచి,

"తనముద్దు మొగము నాతని ముద్దు మొగము
తన మహోదరము నాతని తనూదరము
తన గొప్ప కన్ను లాతని గొప్ప కన్ను
లెన, యంచుఁ దన కితఁడే తగు"

— రంగ. రా. అరణ్యా. కాం. పుట 158.

నని మొగము చేటంతగా చేసికొని ముసిముసి నవ్వులచే నతని సమీపించి నిట్లు పల్కినది:

"నీ రూపు రేఖలన్నియు సరిచూచి
కూరిమి నీకు నాకును దగునంచుఁ
గామించి వచ్చితిఁ; గడు నొప్పు రూపుఁ
గామించి నప్పుడే కైకొన నేర్తు;
నెందైనఁ జన నేర్తు; నే వస్తువైనఁ
బొందుగాఁ దే నేర్తు; భోగింప నేర్తు;
నున్నది యేల ? నా యొప్పు భావింపు
నన్నుఁ బాణి గ్రహణంబు గావింపు"

— రంగ. రా. అరణ్యా. కాం. పుట 159.

శూర్పణఖ కోర్కెకు నవ్వి రాముడు 'కొంత హాస్యము సేయ' దలచి,

"వాఁడె నా తమ్ముడు వరసత్త్వ ధనుఁడు
వాఁడు నా కంటెను వర రూప ధరుఁడు,
తన కొక్క చక్కని తరలాయ తాక్షి

నను శూలమతిని నిత్యముఁ గోరుఁ; గాన
నినుఁ బొందఁ డాతఁడు నేర్చు; నీవరుగు"

— రంగ. రా. అరణ్య, కాం. పుట 159.

మని ఆమెను లక్ష్మణుని కడకు పంపినాడు. అతడును,

"నీ తరి తీపును నీ మురిపెంబు
భాతి నింకొక సారి పరికించె నేని
సీత నొల్లక నిన్నుఁ జెందు రాఘవుడు"

అని రాముని దగ్గరకే పొమ్మని ఆమెను తిరిగి పంపును. ఇట్లు శూర్పణఖ రాముని దగ్గరకు, లక్ష్మణుని కడకు,

"మఱి మన్మథుని సూత్ర మహిమచే దిరుగు
తెలి బొమ్మ యోయనఁ దిరిగెఁ బేరాస"

అన్యోన్య విరస వాక్యములకు కోపించి శూర్పణఖ మృత్యువువలె అట్టహాసముచేసి సీతను మ్రింగబూనినది. అప్పుడు "దీనిమేలము చాలు" శిక్షింపుమని రాముడు లక్ష్మణు నాజ్ఞాపించెను.

"పడఁతి! నీకింత కోపంబేల గమ్మ
కడ ముట్ట నీ కోర్కిఁ గావింతు నిపుడె"

అని లక్ష్మణుడు పల్కగా శూర్పణఖ ఉప్పొంగి అతని దగ్గరకు వచ్చినది. లక్ష్మణుడు దాని ముక్కు చెవులను పట్టి "యేసీమ సరసమో యిది" అని శూర్పణఖ అడుగగ నతడు "మా సీమ సరసమోమగువరో" యనుచు "జేయొడ్డి వలచి వచ్చినఁ జెవుల్ ముక్కు పోయె" నను సామెతను పుట్టించి, ముక్కును చెవులను మొదలంట కోసెను.

పై సన్నివేశము హాస్యరస భూయిష్ఠముగ నున్నది. కట్టా

వరదరాజ రామాయణ కర్త ఈ సన్నివేశమును ఇంతటి హాస్య రసాభినివేశముతో వర్ణింపలేదు.[15] అతని రచన మామూలు ధోరణిలోనే మూలవిధేయముగనే నడచినది. రంగనాథ రామాయణ కర్త ఇచట మృదు హాస్యమును పరిపోషించినాడు.

విశ్వామిత్రుని సమక్షమున రామ లక్ష్మణులకు శతానందుడు మేనకా విశ్వామిత్రుల శృంగార ఘట్టమును చెప్పెను. ఈ సందర్భమున వాల్మీకి మేనకా విశ్వామిత్రుల శృంగారమును మితముగా, సరసముగా, ఔచితీ పరిపోషకముగ, సందర్భమునకు తగినట్లు వర్ణించినాడు. విశ్వామిత్రుని ముందు మేనక దీప్తించిన విధమును గోనబుద్ధారెడ్డి తన రామాయణమున ఇట్లు చిత్రించినాడు:

"లలిత యౌవన కళా లావణ్య గణ్య
జల కేళిఁ దేల నా సతి జాలు కొప్పుఁ
జికిలి చూపులు నునుఁ జెక్కులు ముద్దు
మొకము గెంపుల మోవి మొలక నవ్వులును
బొంగారు కుచ కుంభములుఁ బదార్వన్నె
బంగారు పొడిరాలు బాహుమూలములుఁ
జిన్నారి నూఁగారు సింగంపుఁ గౌనుఁ
బొన్నపూ పొక్కిలి బొదలెడు పిఱుఁదు
లూరుల తీరు నోరూరఁ గాఁ జూచి పేరు
వాఁడి మరుండు పెళపెళ నార్వ
ధ్యానంబు మానంబుఁ దపము బోకార్చి
మేనఁగళల్ గ్రమ్మ మేనకఁ జూచి"

— రంగ. రా. బాలకాండము. పుట 60.

---

15. చూ॥ వరదరాజ రామాయణము. అరణ్య కాండము. పుటలు: 62–68. 2–వ సంపుటము,

ఇది చక్కని శయ్యాసౌభాగ్యముతో శృంగార మయముగా నొప్పిన మనోహర రచన మైనను సందర్భానుగుణముగ, ఔచితీ వంతముగ నున్నట్లు కన్పించదు. ఈ పట్టున మూల రచనయే మెరుగుగా నున్నది. కటా వరదరాజ రామాయణము నందు ఈ సందర్భము నందలి శృంగారవర్ణన మరింతపెంచి రచింప బడినది 16.

సీతారాముల వివాహ సంస్కారము యొక్క వైదికత్వ మునే వాల్మీకి నొక్కి చెప్పినాడు. రంగనాథ రామాయణకర్త లౌకిక భావములతో దేశీయాచార వ్యవహారములతో సీతా రాముల వివాహ ఘట్టమును వర్ణనాత్మకముగ రచించెను. సీతా రాముల పాణిగ్రహణ సందర్భమున వారిపరస్పర శృంగారావలో కనములను బుద్ధారెడ్డి ఇట్లు వర్ణించినాడు:

"అంతట సముహూర్తమని తెరదీయఁ
గాంత సెమ్మోము మున్ గనుఁగొని యలరె
రాముని కనుఁగవ రాకాసుధాంశు
గోమున నలరెడు కుముదంబు లనఁగ,
భామ చూపులు నిల్చెఁ బతి పాద యుగళిఁ
దామరపైఁ దేటి తండంబు లనఁగ;
నింతి లావణ్యాబ్ధి కెదురెక్కు మీన
సంతానమై రామ చంద్రు చూపడరె
వరదేహ కాంతి ప్రవాహ మధ్యమునఁ
దరుణి చూపులు పద్మ దళములై క్రాలె;
సతి చూపుఁ బతి చూపు సరసతఁ జూపు
రతిచూపు రతి మనోరమణుని రూపు

16. కట్టా వరదరాజ రామాయణము. బాలకాండము. పుటలు 188-189. ప్రథమ సంపుటము.

నెలసి నొండొరు మేను వెలుఁగ రాకుండ
గళలంటఁ దాఁకిన గతిఁ గొంత సేపు
వెలసె"

—రంగ. రా. బాలకాండము. పుట 75.

ఇందు నాయికానాయకుల ముగ్ధశృంగారావలోకనములలోని సుకుమారసూక్ష్మ భావనలు దేశీయానుగుణముగ చక్కని అలంకారములతో మనోజ్ఞముగ వర్ణింపబడినవి.

ఈ సందర్భమున వరదరాజ రామాయణము నందలి రచన గమనింపుడు:

"తెర వంప శ్రీరాము దృష్టి యా సీత
చిరునవ్వు సెమ్మోము శృంగార మనెడు
కొలను లోపలఁ బాదు కొను పుండరీక
దళములో యనఁగ నెంతయు వికసిల్లె
సిగ్గరి యగు నేల చేడియ పట్టి
యగ్గలికనుఁ జూచు నపుడు శ్రీరాము
లావణ్య జలధి నల్లనె దాఁటు మీల
కైవడి నందమై కనుపట్టెఁ జూపు
యిరువురు నొండొరు లిటు జూచు నపుడు
సరసాను రాగ వీక్షణము లొప్పమరె
అటుచూచి యిటుఁజూచి యతనుండు వైచు
చటుల సవ్యాసవ్య శరములో యనగ"

—వరద. రా. బాలకాండము. పుట 224.

వాల్మీకి రామాయణమునకు యథామాతృకమగు కట్టా వరదరాజ రామాయణమునందు మూలములో లేకున్నను సీతా వివాహ సందర్భమున దేశీయాచారములను, తన కాలమునాటి సాంఘిక పరిస్థితులను రంగనాథ రామాయణము కంటె విపుల

ముగా వర్ణించినాడు. వరదరాజ రామాయణమున కూడ రంగ నాథ రామాయణమునందువలె 'కల్యాణవేది' నమర్చబడినది. 'తెఱమఱుగు' తడవ బడినది. సుముహూర్తమని తెరతీయుట, వధూవరులొండొరులశృంగారవీక్షణములు, తలంబ్రాలు, లాజహోమము, మునుల దీవనలు, పుష్పవృష్టి, ఆట పాటలు— మొదలగు వానితో సీతారాముల పెండ్లి వైభవముగా జరిగినట్లు ఈగ్రంథములందు వర్ణింపబడినది. మంగళసూత్ర ధారణ ప్రశంస వరదరాజ రామాయణమునందు కలదు:

అయోధ్యా కాండమున భరతుని కుశలప్రశ్నము చేయు సందర్భమున రాముడు అతనికి రాజనీతి సాంబంధికములగు విషయములను తెల్పును. ఇచట రంగనాథ రామాయణమున సుమారు ఇరువది నాల్గు ద్విపదలలో రాజనీతి సంబంధ విషయ ములు సామాన్యముగనే వర్ణింపబడినవి. ఈ సందర్భమున కట్టా వరదరాజ రామాయణమున దాదాపు నూట ఇరవై ఎని మిది ద్విపదలలో విపులముగా రాజనీతి చర్చ గావింప బడినది. గోన బుద్ధారెడ్డి, వరదరాజు - ఇరువురును రాజ కవులే. కాని రాజనీతి, రాజ కార్యములను చెప్పవలసినచోట వరదరాజు విపు లముగా చెప్పెను. ఈ అయోధ్యా కాండముననే శ్రీరామునికి భరతునికి జరిగిన సంభాషణమును సరసముగా, రసోచితముగా, నాటకీయానుగుణముగా, వర్ణనాత్మకముగా వరదరాజు చిత్రించి నాడు. ఇది అతని వర్ణనా చాతుర్యమునకు, సంభాషణా నైపు ణికి ప్రబల నిదర్శనము. రంగనాథ రామాయణమున ఈ ఘట్ట ము చాల సంక్షిప్తముగా నున్నది; పైగా కథాకథన పద్ధతియే ఇందు ముఖ్యముగా గోచరించును.

వరదరాజ రామాయణమున రాజనీతికి సంబంధించిన

సంభాషణలు స్వానుభవములో కూడియుండి, జాతివార్తా చమత్కారములతో నొప్పి యుండును.

"పదము లర్థంబులు భావముల్గతుల
పదశయ్య లర్థ సౌభాగ్యముల్ యతులు
రసములు గుంభనల్ ప్రాస సంగులు
నసమాన రీతుల నన్నియు గలుగ"

రామాయణమును రచింతునని కావ్యావతారికలో గోనబుద్ధారెడ్డి తెల్పినాడు. ఈ విషయమునే "అసమాన లలిత శబ్దార్థ సంగతుల", "పరగ నలంకార భావనల్‌నిండ", అని అతడు ప్రతి కాండాంతములందును మరలమరల నుద్ఘాటించినాడు. రంగనాథ రామాయణము గోనబుద్ధారెడ్డి, గ్రంథములో పేర్కొని నట్లే చక్కని శయ్యాసౌభాగ్యమును, అర్థ గాంభీర్యమును, రసభావానుకూల రచనాశిల్పమును, అలంకారములను కల్గియున్నది.

బుద్ధారెడ్డి తెలుగు పదముల కూర్పు యెంత రమ్యముగ నుండునో సంస్కృత శబ్దముల కూర్పును అంత రమణీయముగనే నుండును. ఆంధ్ర పదముల కూర్పున కుదాహరణము:

"వ్రతములఁ గడు డస్సి వనటులఁ గ్రుస్సి
యతి దుఃఖమునఁ గుంది యలఁ తలఁ గుంది
విపులాశ్రువుల దోఁగి విరహాగ్నిఁ గ్రాఁగి
కపట వృత్తులఁ జిక్కి కడుముట్ట గ్రుక్కి
జీవంబుపై రోసి చెలువంబుఁ బాసి
యావిధి మది దూఱి యలసత మీఱి
చెక్కిటఁ జెయిసేర్చి చింతల కోర్చి
దిక్కులేమిఁ దలంచి ధృతి దూరడించి"
యనరశ్మి వాడిన యొఱఁ దీగె వోలె......

—రంగ. రా. సుందర కాండము. పుట 250.

సంస్కృత పదముల కుదాహరణము :

"నూత్న శృంగార మనోహర గార
రత్న వితర్దికా రమణీయ హీర
రంగవల్లీ వార రంజిత ద్వార
రంగద్ధ్వజోదార రమ్య పటీర......"

—రంగ, రా. కిష్కింధా కాండము. పుట 221.

రాముడు కిష్కింధలో సుగ్రీవుడు చూపిన నగలనుచూచి

"మున్నుగా నగలను మున్నీట మునిఁగి
కన్నీట నాసొమ్ము కసటెల్లఁ గడిగి"

నాడట. ఎంత చక్కని భావము!

కడు వృద్ధురాలగు కైకేసి 'నరసన బొమలు',

"వెన్నెల రసమున విదలించి తివిచి
మిన్నేటి నురువున మెఱుఁగిడ్డ కరణి"

నున్నవట. ఆమె ఎంతటి వృద్ధురాలోకదా! ఆమె వార్ధక్య విషయమును కవితలో రంగరించి ఎంత చక్కగ తెలిపినాడో గోన బుద్ధారెడ్డి కవి! ఇట్లే రంగనాథ రామాయణము నందు పెక్కుచోట్ల పెక్కు వాక్యములచే సమర్థింప వలసిన అర్థమును ఒక దృష్టాంతము చేతనే, భావ వర్ణనచేతనే, లోకోక్తి చేతనే సాధితమై అర్థ సంపద సొంపు గూర్చు చున్నది. రంగనాథ రామాయణము నందలి కవిత్వ విశేషములను గూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారిట్లు తెల్పియున్నారు[17]. "ఈ గ్రంథమున రసపరి ప్లుతములైన పట్టు లనేకములున్నవి. కవి చాతుర్యమించు మించుగ ప్రతి పుటలోను గానఁ బడును, ప్రతి చరణమును గమ్మ యచ్చునఁ దీసినట్లుండును. ఉక్తి ప్రత్యుక్తి వైచిత్రి, సంభాషణ చాతురి పాఠక హృదయము నలరించు

17. చూ॥ రంగనాథ రామాయణ పీఠిక పుట 38. రాయలు ప్రతి,

చుండును. ద్విపద రచన యొక్కొక్కప్పుడు శరత్కాల స్రవంతి వలె మంద గమనముతోఁ బోవుచు, నొక్కొక్కప్పుడు వర్షాకాలపు నదీ ప్రవాహము వలెఁ బరువులు వారుచు, నుఱికలు వెట్టుచు, సుళ్లు తిరుగుచు రసభావానుకూలముగ వివిధగతులతో, వివిధ రీతులతో నర్తనము చేయుచు నడచినది. యుద్ధకేళిలోని వివిధములైన యొడ్డనములు, లాగులు, అలవులు అన్నియు యుద్ధకాండ రచనలో నున్నవి''.

కట్టా వరదరాజు తన రామాయణమును,

"...............అందమై తేట
పుట్టంగ నవరసంబులు పిచ్చిలంగ
జల్లి మాటలు: నపశబ్దముల్, జజ్జ
టల్లికల్, పావలం దలుకఁ బల్కులును
పునరుక్తములు, వట్టి పూదెలు కాకఁ
దెనుఁగు లీఁచలును సందిగ్ధముల్ ప్రాలు
మాలికల్ కటువులే మఱపులు కొసరు
లాలంబములు వెఱ్ఱి యతక డంబులును
చాయ లెత్తుట లర్థచౌర్యముల్ పెట్టు
జాయలు లేక లక్షణ సమ్మతముఁగ
నందమై సుకవులౌ రాయన చెవుల
విందుగాఁ గపురంబు వెదచల్లి నట్ల
ధ్వనులు వ్యంగ్యములు వింతలు వాసనలును
మినుకులు జిగిబిగి మెరవడుల్ జాతి
వార్తలు నుపమలు వర్ణనాంశములు
మూర్తి మద్వాక్యముల్ ముద్దులు చూప
నొకమాటకన్న వేఱొక మాట వింత
యొక పాదమున కన్న నొకపాద మొఱపు
నొక దళంబునకన్న నొక దళంబంద

మొక యుత్తరము మించ నొక యుత్తరంబు
వెలయగ ద్విపదఁ గావిం"

చినానని గ్రంథావతారికలో తెల్పినాడు. ఇచట వరదరాజు రచనలోని కవితా గుణములు తెల్ప బడినవి.

కవిత్వమున చెవి కింపును గొల్పు శబ్ద విన్యాస మొక గుణము. శాబ్దికములగు శ్రుతి, లయ, ఆవృత్తి గుణములు శ్రోతల నాకర్షింప జేయును. వరదరాజు అంత్యాను ప్రాసలను, పదమధ్యాను ప్రాసలను, ద్విప్రాసలను పాటించి ద్విపద రచనలో రచనా చమత్కృతిని వెలయింప జేసినాడు.

ఉదాహరణమునకు :

"రథ గజ హయ భట వ్రాత నిశ్శంక
పృథు గోపురాగ్ర కుంభిథ హారిణాంక
పౌలస్త్య దోర్దండ బలబిరుదాంక
సాలగుప్తి నిరస్త శాత వాతంక
పర బలోపల శౌరిభట శౌర్య టంక
శరధి వేలా వనాంచ త్కలా వింక
లలిత శృంగారా కలంక యాలంక"

—వరద. రా. సుందర కాండము. పుట 15. (3 సంపుటము)
ఇట్లే తక్కిన ప్రాసలకు సుందర కాండములో ఉదాహరణము లనేకము కలవు. వరదరాజు ద్విపద రచనలో శాబ్దిక చమత్కృతినే గాక,

"సీతంబు తోఁక వీనికి నాస్తిగాన
నిజముగాఁ తోఁక వీనికి నాస్తి చేసి"

—వరద. రా. సుందరా కాండము. ద్వి. పం. 4106-7.
ఇత్యాదిగ శ్లేషలను కూడ ప్రయోగించినాడు.

## మడికి సింగన.

మడికిసింగన కృతమగు ద్విపద భాగవత దశమ స్కంధము పోతన పద్య భాగవతమునకు కొంత పూర్వమే రచితమైనది. భాగవతములో దశమస్కంధము రసవంతమైన భాగము. మడికి సింగన ద్విపద భాగవత దశమ స్కంధానువాదరచన నన్నయాదుల మార్గమువలె స్వతంత్రానువాదమే. "సలలిత రస భావశబ్ద గుంభనల" శ్రీకృష్ణుని లీలలను వీనుల విందుగ రచింతునని కవి గ్రంథావతారికలో తెల్పినాడు.

సింగన వర్ణించిన రుక్మిణీ సౌందర్య వర్ణన:

"ఉచ్చిత పండ్లతో నుల్లసం బాడు
నచ్చప లాక్షికి నంగుష్ట చయము
పదన ఖద్యోతుల నుపచరించు నెలవుఁ
గదియ మౌక్తికములుఁ గట్టి నట్లుండు
తనరు గచ్చప నిధిద్వయ మింతి పాద
వనజాతముల మీఁద వ్రాలెనో యనగ;
గమన జాడ్యము శుభాకరమును నగుచుఁ
గమనీయ లీల మీగాళ్లొప్పు సతికి;
పగడంపుఁ దీగెల పంక్తులో యనగ
మగువకు నొప్పారు మడిమల తీరు"

— ద్విపద భాగవత దశమ స్కంధము. పుట 72.

ఈ వర్ణన ప్రబంధ ఫక్కిలో ప్రౌఢముగా నడచినది. లక్ష్మీదేవి అవతారమే యగు రుక్మిణీదేవి సౌందర్య వర్ణనలో కవి సందర్భోచితముగ స్తోత్ర సాహిత్య ఫక్కిని పాటించి వర్ణించినాడు. పాదాది కేశాంతము వరకు రుక్మిణి ప్రత్యంగ వర్ణన చేసినాడు. ఇది కవియొక్క భక్తి తత్త్వమును తెలియ జేయును. దేవతలను వర్ణించుపట్ల నఖసిగ పర్యంతము వర్ణించుట ఒక సంప్రదాయము.

రుక్మిణీ దేవి కడనుండి శ్రీకృష్ణుని దగ్గరకు పోయిన భూసురుడు తన రాయబారమును నడపిన తీరును సింగన ఉచితములగు పల్కులతో, పరిశీలనానుగుణముగ, వివరణాత్మకముగ, నేర్పుతో నిట్లు వర్ణించినాడు.

"అనఘాత్మ! భీష్మకుండను విదర్భేశు
తనయ రుక్మిణియును ధవళాయతాక్షి
తనుమధ్య యుత్ఫుల్ల తామరసాక్షి
గరుడ కిన్నర యక్ష గంధర్వ సతులు
దొరయ లేరా యింతిలో నీడుఁ బోల్ప."

—ద్వి. భా. కల్యాణకాండ. పుట 66.

అని ప్రారంభముననే రుక్మిణి నామ వంశాదికమును తెల్పినాడు. దీనిచే యాదవాన్వయ వంశ మణియగు కృష్ణుని వరించుట కామె యోగ్యురాలను నభిప్రాయమును వెల్లడించి నట్లయినది. పిమ్మట రుక్మిణి తనుపిలాసవిభ్రమాదులను భూసురుడు మృదువుగా, క్లుప్తముగా తెల్పినాడు. దేవకన్యలతో కూడ నీడు పోల్పగా రానిది రుక్మిణి లావణ్యమని చెప్పుటచే దక్షిణ నాయకుడగు శ్రీకృష్ణుని చిత్తము నాకర్షింపబడు ననుటలో సందేహము లేదు. అటు పిమ్మట,

"దేవర సౌభాగ్య దివ్య వర్తనలు
వావిరి జనులెల్ల వర్ణింపు చుండ
విని పుష్ప ధన్వుని విషమ బాణములు
యనవొందఁ దనువున నట నాటుట యును
చిత్తంబులో నీదు చెలువైన మూర్తి
చిత్తరు వొత్తిన చెలువంబుఁ దోపఁ
జింతించు వెఱఁగందు చేష్టలు మఱచు
నంత కంతకు నిన్ను నభిమతి సేయు

విరహాగ్ని శిఖఁ గ్రాఁగు వెలవెల నగుచు
పరులెత్తినట్లు పల్కరు చిన్నఁబోవు"

అని గుణవంతుడగు శ్రీ కృష్ణునియందు ఆమెకుగల బద్ధానురాగమును ఉదాత్తముగ, మితముగానే వివరించినాడు. అట్లు శ్రీ కృష్ణుని వరించిన రుక్మిణిని,

"ప్రాభవంబునఁ జైద్యపతి పెండ్లియాడ
నెల్లుండి చనుదెంచు టెఱిఁగి యా యింతి
యెల్ల విధంబుల నిది నీకుఁ జెప్పి
పుత్తెర వచ్చితి పుండరీకాక్ష."

అని కృష్ణుని విరోధియగు శిశుపాలుడు ఆమెను పెండ్లాడుటకు నిశ్చయించుకొన్నందువలన తన రాకకు ముఖ్య కారణమని భూసురుడు నొక్కి చెప్పినాడు. చివరకు,

"చిత్తంబులో నొండు చింతింప నేల
ఆ భామ నిజ భార్యయై యుండునట్టి
సౌభాగ్య మెవరికి సమకూరు? నీవు
నా రుక్మిణి బ్బంగి నాసలు సేయు
కారుణ్యమూర్తివి కమలాక్ష! నిన్నుఁ
గదిసి నీ దరహాస కౌముదిఁ గ్రోల
ముదిత నేత్ర చకోరములు చేరఁ గోరు
నలవడి నీ ప్రయాణాంబువు లోనఁ
గలకంఠి చాతకి కడు వేడ్క సేయు
నీవెటులైనను నేచిన వేడ్క
నా వెలందుక నేలుటది నీకు నొప్పు
నిను నమ్మి యుండిన నెలతుక నొకఁడు
కొనిపోవగాఁ జూడ గూడునే నీకు?"

— కల్యాణ కాండ. పుట 67.

అని శ్రీ కృష్ణునిలోని సంశయ బుద్ధిని తొలగించుటకు భూసురుడు

నేర్పుతో ప్రవర్తించినాడు. "ఆ భామ నిజ భార్యయైయుండు నట్టి సౌభాగ్య మెవరికి సమకూరు? నని ప్రశ్నించి రుక్మిణి యెడ అతనిలో ఉత్సాహమును, మరులును రేకెత్తించినాడు. తన్ను నమ్మిన స్త్రీని, రక్షించుట కర్తవ్యమని శ్రీకృష్ణున కుద్బోధించెను. అందువలన ఆప్తులైన వారిని కాపాడుటయే గాక విరోధిపైకూడ పగదీర్చుకొనుట కవకాశము కల్గునని సూచించినాడు. ఇట్లు ఈ సన్నివేశమను భావప్రధానముగా, పరిశీలనానురక్తితో, ఉదాత్తముగ, ఔచితీ పరిపోషకము, రసవంతము నగు వర్ణనా చాతుర్యముతో మడికి సింగన రచించినాడు.

ఈ సందర్భమున రుక్మిణి సౌందర్యమును వర్ణించుచు బమ్మెర పోతన రచించిన పద్యమిది:

సీ॥ "పల్లవ వైభవా స్పదములు పదములు
కనక రంభాతిరస్కారు లూరు
లరుణ ప్రభా మనోహరములు కరములు
కంబు సౌందర్య మంగళము గళము
మహిత భావాభావ మధ్యంబు మధ్యంబు
చక్షు రుత్సవ దాయి చన్నుదోయి
పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు
జితమత్త మధురకశ్రేణి వేణి

ఆ॥ భావజా శుగముల ప్రాపులు చూపులు
కుసుమ శరుని వింటి కోపులు బొమలు
చిత్త లోపణములు చెలువ భాషణములు
జలజ నయన ముఖము చంద్ర సఖము"

—దశమ స్కంధము. పూర్వభాగము. పుట 929. ప. 1715.

ఈ వర్ణనలో శబ్ద చమత్కారము గోచరించును. రుక్మిణి

బాహ్య సౌందర్య వర్ణనకు ఎక్కువ ప్రాధాన్య మీయబడి రచిత మయినది. ఇందు రసధార నిర్వహణ పలుచబడినది. దూత్యము చేయబోయిన బ్రాహ్మణుడు ఇట్లు రుక్మిణీదేవి అంగ ప్రత్యంగ వర్ణనము చేయుట ఉచితముగా నుండునా? అని ప్రశ్నించు కొన్నపుడు పోతన భాగవతము నందలి రచన అంత ఉచితముగా లేదు. ఈ సందర్భమున మడికి సింగన ద్విపద రచనయే స్వాభావికమై, చతుర సంభాషణోచితమై, ఉచితజ్ఞతతో ఇంపును పెంపును కూర్చుచున్నది. ఈ ఘట్టమున పోతన పద్యము శబ్ద చమత్కృతి ప్రధానము కాగా సింగన ద్విపదలు భావ సౌందర్య శోభితములు.

శ్రీకృష్ణుని రూపును వర్ణించు ఈ క్రింది ద్విపదలు చిత్రకారుల కుంచెకు రసాయనమై శ్రీకృష్ణుని రూప చిత్రణకు ప్రోత్స హించు చున్నట్లున్నది.

"నల్లనిమే నున్నతమైన యురము
నెల్ల దమ్ముల మించు తెలిగన్ను గవయు
నెరిజడ చోళ్లెము నిటల రేఖయును
చిరునవ్వు మోమును జేత వేణువును
పాయక జిగిమించు పసిండి చేలయును
దలఁబురి పె నవు కదంబ మంజరియు
ధళధళ వెలిఁగెడు దంత దీధితియుఁ
గలరూపు మోమున గట్టి నట్లుండు."

"ఇట్లు వివిధములైన మనోహర వర్ణనలతోను, ఇంపును గూర్చు స్వభావోక్తులతోను, చక్కని తెనుఁగు నడకతోను, నాతి దీర్ఘములగు మధురమైన సమాసములతోను శ్రీకృష్ణుని చరిత్రను మడికి సింగన ద్విపదబద్ధము గావించినాడు. భాగవత

దశమస్కంధమును సింగన మాట్లాడు చలన చిత్రము భంగి పాఠకుల దృష్టి పథమునకు ప్రదర్శించినాడు" [18].

మడికి సింగన ద్విపద భాగవత దశమస్కంధము సమగ్రముగా లభింపక పోవుట ఆంధ్రుల దురదృష్టము.

## గౌరన.

గౌరన ద్విపద కవితకు దివ్యమైన గౌరవమును సముపార్జింప జేసినవాడు. ద్విపదకావ్య ప్రవర్తకత్వమున ఇతడు ప్రథమాచార్యుడు కాకపోయినను, వాని నిర్వహణలో ప్రధానుడు; ద్విపద వాఙ్మయచరిత్రలో అద్వితీయస్థాన మాక్రమించినవాడు. గౌరన సులభమైన ద్విపదను చేపట్టి, వ్యర్థమైన పదాడంబరమును వీడి, దానిలోనే ప్రజ్ఞా పాండిత్య వైభవమును ప్రదర్శించినాడు. అతని కవిత్వపు పోకడలు తర్వాతి ద్విపద కావ్య కవులకే గాక పద్య ప్రబంధ కవులకును అనుకార్యమైనవి.

'నవనాథ చరిత్రము' గౌరన తొలిరచన. ఇందు

"సరస సాహిత్య లక్షణ వివేకముల
సురుచిర మధుర వచో విలాసముల...
..................నలవడ్డవాడు"

అని అవతారికలో గౌరన చెప్పుకొనియున్నాడు. ఈబిరుదు ఇతని రెండవ రచన యగు 'హరిశ్చంద్రోపాఖ్యానము' నందును పేర్కొన బడినది.

"సరస సాహిత్య లక్షణ విచక్షుడ"నని హరిశ్చంద్రోపాఖ్యానావ తారిక లోను. "చతుర సామాన్య లక్షణ చక్రవర్తి [19]"అని అందే మరొకచోటను గౌరన చెప్పుకొనినాడు.

---

18. చూ॥ ద్విపద భాగవతము (దశమస్కంధము) - పీఠిక - మహాదేవ శాస్త్రి.

19. చూ॥ హరిశ్చంద్రోపాఖ్యానము, ద్వితీయ భాగము పుట 487.

ఈ బిరుదు హరిశ్చంద్రోపాఖ్యానము నందే సార్థకమగు చున్నది. ఇది కథా కౌశలము, వర్ణనా రామణీయకము, సజీవపాత్ర నిర్మాణ శిల్ప చాతురి గల రసవంతమైన స్వతంత్ర ప్రబంధము.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమును,

"హరిశ్చంద్ర విభుపుణ్య చరితఁ
గవితా చమత్కృతిఁ గాంచి హర్షించి
కవులందఱును శిరః కంపంబు సేయఁ
బచరించి వీనుల పండువు గాఁగ
రచియింతు 20"

నని చెప్పి రచించినాడు. "గౌరన కవిత్వము నాతి కఠినమై పండిత పామరులకు సువేద్యముగా నున్నది. మృదు మధుర మైన శైలి. కవనము కదళీ పాకము" 21 అని శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారు తెల్పియున్నారు. గౌరన కవితలో సంస్కృత పదబాహుళ్య రచన కొన్ని పట్టులందును, సమసంస్కృ తాంధ్ర పదములతో కూడిన రచన మరికొన్ని తావులందును, తెలుగు నుడి కారపు మెరుగులు గలిగిన రచనలు కొన్ని తావులందును కనిపించును. సంస్కృత పద భూయిష్ఠ రచన కేవల పాండిత్య ప్రకర్షతో కాక కవితా శిల్ప దృష్టితోనే గావింపబడినది. ఉ.దా:

"మందార మంజరీ మంజు మరంద
నంద దిందిందిర నందనా రామ
కమనీయ వికసిత కనకార వింద
కమలినీ తటలతా గార లతాంత
రచిత శయ్యా తల రతిరయ గళిత

20. హరిశ్చంద్రోపాఖ్యానము. అవతారిక ప్రథమ భాగము పుట 5.
21. చూ॥ 'గౌరన కవిత్వము' - శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తి. భారతి ప్రమాది సంవత్సరము - శ్రావణ మాసము.

కచభగ సురపుర గణికాకపోల
కలిత ఘర్మోదక కణగణ మిళిత
మలయ సమీర కోమల కంపితాగ్ర
మహిత చిత్రధ్వజ మాలా సహస్ర
సహిత చింతామణి సౌధ పాళికల."

—హరిశ్చంద్రోపాఖ్యానము-ప్రథమభాగము, పుటలు 133-134

హరిశ్చంద్రోపాఖ్యానమున అనుప్రాసానుక్రమణికములగు శాబ్దిక చమత్కృతిక పదముల కూర్పు చాల తక్కువ.

"సుందరి గాదిది సొబగు రాయంచ
యంచ గాదిది నడపారు క్రొమ్మించు
మించు గాదిది రాచ మెచ్చుల ప్రతిమ
ప్రతిమ గాదిది పచ్చి పగడంబు లతిక"

— హరిశ్చ. ద్వితీయ. భా. ద్వి, పం. 358-68.

అని గౌరన ఒక చోట మాత్రమే ముక్తపదగ్రస్తమును వాడినాడు.

గాన మాధుర్యము, అర్థ సౌలభ్యము, రసోచితపద ప్రయోగము, భావ గాంభీర్యము, శబ్దమార్దవము, పదముల పొదుపు — మున్నగునవి ఉత్తమ శైలికి ప్రధాన గుణములు.

గౌరన శైలియందొక ముఖ్యవిశేషము కలదు. అతడుపయోగించు పదజాలము భావానుగుణ్యమై యుండి కేవలము శబ్దధ్వనుల చేతనే ఆయాభావములను స్ఫురింపజేయు శిల్పముతో నొప్పియుండును. హరిశ్చంద్రుడు, చంద్రమతిని తెగ వ్రేయుటకు తన ఖడ్గమును తీయు పద్ధతి ఇది:

"చండ మార్తాండ దుస్సహ దుర్నిరీక్ష
మండల ప్రభలతో మార్కొని మండు
మెఱుఁగులు గ్రంబుగా మిన్నులఁ బర్వ
నొరవాయఁ బెఱికి మహోగ్రతఁ బూని"

— హరిశ్చ. ద్వి. భా. పుట 451.

ఇందు హరిశ్చంద్రుడు ఖడ్గము తీయుట ప్రధానాంశము. దీని నుండి గౌరన శబ్ద విన్యాసముతో కూడిన విశిష్ట భావార్థమును స్ఫురింప జేయుచున్నాడు. భావావేశమునకుతోడు సమాస కల్పనము కూడ ఔచితీ వంత మయినది. 'ఇందులో మొదట నుపయోగించిన బిందు పూర్వక 'ండ' కారము ఖడ్గము యొక్క తీక్ష్ణత్వమును తెల్పును. తర్వాతి రేఫము కర్మయొక్క క్రూరత్వమును వ్యక్త పరచును'.

విశ్వామిత్రుని కోప మెట్లు ప్రత్యక్ష మగు చున్నదో చూడుడు:

"నుఱుములు మనిబొమల్ ముడిపాటుగదురఁ
జుఱచులు నిప్పుల శుల నుప్పతిల్ల
బొటపొట చెమట మైఁ బొడమ నాసికయుఁ
బుటపుట గటములుఁ బొరిపొరి నదర
మొగమున జేవురు మురువు నటింప
భుగభుగ నిగుడు నూర్పుల పొగ లెగయఁ
గటకటఁబడి యొడుగఱచి హుమ్మనుచు"

— హరిశ్చ. ప్ర. భా: పుట 115.

ధ్వన్యనుకరణ శబ్ద ప్రయోగముల వలన ఇచట విశిష్ట భావార్థ ములను గౌరన స్ఫురింపజేసినాడు. 'ఇందు మొదట నుపయోగిం

చిన శకట రేఫము కోపమును, తరువాతి 'ట' కారము ఉద్వేగ రభసములను తెలియ జేయుచున్నవి'.

వర్ష వర్ణన కూడ నిట్టి శిల్పముతోనే గావించి యున్నాడు.

"ఫాలలోచన తీవ్ర పావక శిఖలఁ
బొగిలెడు దిగధీశ పురములనెల్ల
నెగసి భుగుల్లను నెఱమంటలనఁగ
మెఱుపులు దళదళ మెఱువకమున్నె
యుఱుములుఁ బెళబెళనుటిమె నయ్యుఱుము
లట మిన్నుదల మ్రోయునంతకమున్నె
పెటపెట పెటలి పెచ్చిడుగులు వడియెఁ
బిడుగులు నుఱుములుఁ బృథులవేగమునఁ
బడఁబడవడగండ్లు వడియె నెల్లెడల
వడగండ్ల కంటెను వాన మున్నాడి
కడవల జలము లొక్కట నంచినట్లు
బోరనఁ గురియ నద్భుతమైన వాన"

— హరిశ్చ. ప్ర. భా. పుటలు 200–201.

గౌరన కవిత్వము నందు వాస్తవికత (Realism) ఎక్కువ. అతిశయోక్తుల జోలికి పోక గౌరన స్వభావోక్తులతో సమృద్ధిగ సరసముగ సన్నివేశాదులను వర్ణించును. స్మశానములోని భయంకర పరిస్థితిని వర్ణించునపుడును, కాలకౌశికుడు అప్పు లెగవేయు పద్ధతులను తెల్పు సందర్భమునను కలహాకంఠి కలహ వృత్తిని, గయ్యాళి తనమును చిత్రించు నపుడును, లోహితునికై చంద్రమతి ఏడ్చు సన్నివేశ మందును – మున్నగు వానియందు గౌరన వాస్తవికతను ఎక్కువగా పాటించినాడు. ఈ వాస్తవికతను గౌరన భావద్యోతకములైన పదముల చేతను, చక్కని

ఉపమాలంకారముల చేతను ఇనుమడింప జేసినాడు.

"బలు రాహు ముఖమున బడి కాంతిదప్పి
జలద రించెడు బాల శశిరేఖవోలె"

— హరిశ్చ. ద్వి. భా. పుట 384.

ఇది కాలకౌశికునింట ఊడిగము చేయుచుండు చంద్రమతి దీనావస్థను సూచించుచున్నది. ఈ ఉపమానము కొంత అసంగతముగా నున్నట్లు తోచును. గ్రహణము పూర్ణచంద్రునకే గాని బాల చంద్రునికి సంభవింపదు కదా! గౌరన కవితా వేశములో ఈ అసంగతమును గుర్తింపక పోయి యుండును.

ఇక చంద్రమతి ఏడ్చు పద్ధతి యిది:

"మెఱుగు ముత్యంబుల మ్రింగు మీనమ్ము
అఱుగక వెస గ్రక్క బట్టి చందమున
బలుమాఱు గ్రమ్మెడి బాష్ప బిందువులు"

చంద్రమతి కంటినుండి భాష్పములు దొరగుట మీనములు ముత్యములను గ్రక్కినట్లున్నదట! ఇందు ముత్యబాష్ప సాదృశ్యము మాత్రమేగాక మీన నేత్ర సామ్యమును, సామాన్య సౌకుమార్యమును వ్యక్తమగు చున్నది. ఇట్లు భావస్ఫోరకములగు ఉపమానముల నెన్నిటినో గౌరన తన ద్విపద గ్రంథములందు సందర్భాను గుణముగ వాడినాడు.

నాటక రచయితకన్న కావ్య రచయితకు పాత్ర పోషణము నందు సంపూర్ణమగు దృష్టియు, దానిని నిర్వహించు సదుపాయము నుండును. వర్ణనాత్మక పద్ధతి యైనచో పాత్రల అభినయాదులను సంపూర్ణముగ వర్ణింప వచ్చును. అందువలన పాత్రల శీలస్వభావాదులు మనకన్నులకు కట్టినట్లు చిత్రింపబడును; ఉన్నతమైన భావములు నిగూఢములు గాక స్పష్టముగానుండును.

స్వభావోన్మీలన చాతుర్యమునందు గౌరన అందెవేసిన చేయి. అతని పాత్రలు కృత్రిమములు గాక సజీవము లయినవి. తిక్కనవలె నితడు కథలోని పాత్రల వర్ణనమును తక్కిన పాత్రలచే చేయించును.

లోహితుడు చంద్రమతితో కాలకౌశికు ననుసరించు నపు డతనిని చూచి 'పుణ్యాభామిను' లను మాటలు ఎంత హృద్యముగా నున్నవో చూడుడు:

"వెన్న ముద్దకు రూపు వెట్టిన మాడ్కి
నున్న మెత్తని మేను నొప్పెడివాడు
యెన్నడు నెండ గన్నెరుగని శిశువు
కన్నుల ముత్యాలు గారనేడ్చెడిని
నే చెల్ల నోయమ్మ యీ చక్కనన్న
రాజ తేజము గల రత్నాల పెట్టె
నడవ నెట్లోర్చునో నాముద్దు జిలుక
కడుపు జుఱుక్కనుఁ గన్నవారికిని

— హరిశ్చ. ద్వి. భా. పుట 321.

ఈ సన్నివేశము మానవ హృదయమును ద్రవింప జేయునది. అప్పటి లోహితుని స్థితి అచటి వారలకు 'కడుపు చురుక్కన్న' దనుటలో ఆశ్చర్యముండునా! 'ఇందు వెన్నముద్దకు రూపువెట్టు' 'ముత్యాలు గాఱ నేడ్చుట' — అనునవి భావ స్ఫోరకములు:

చంద్రమతి దావాగ్ని కాహుతి కాబోవు నపుడు ఆమెను వెంబడించిన లోహితుని బాల్యచేష్టలను కవియెంత స్వాభావికముగా చిత్రించి నాడో గనుడు.

"అమ్మమ్మ నీ వీపు డగ్గిలో నుఱుక
సమ్మదం బొదవంగఁ జనియెద వేని

వత్తు నేనును నన్ను వదలక తిగచు
యెత్తికొమ్మనుచుఁ బెల్లెసగు దైన్యమునఁ
గిరుపచుఁ జిన్ని కెంగేల బైగొంగు
గదియించి బుడిబుడి కన్నీరుదెచ్చి
మోహమేర్పడఁ గచంబుల మోమురాచు
లోహితాస్యునిఁ జూచి లోలోనపొక్కి-
యక్కున గదియించి యాదలనిమిరి
చెక్కిలినొక్కి యాచిన్నారి బొజ్జ
బుడికి చక్కిలిగింత పుచ్చి కన్నీరు
దుడిచి ముద్దుల చుంచు దువ్వి మూర్కొనుచు"

— హరిశ్చం. ప్ర. భా. పుటలు 217-218.

ఇందు బాలుడును, అమాయకుడును నగు లోహితుడు తానును వచ్చెదనని మారాము చేయుట, తల్లి వానిని బుజ్జగించుట — అను అంశములను స్వభావాను గుణముగ పాత్రల మనోగత భావములు ప్రస్ఫుటీకరించునట్లు సహజత్వ ముట్టిపడునట్లు నేర్పుతో గౌరన చిత్రీకరించినాడు.

ఆంధ్ర కావ్యములలో హాస్యరస పోషణము చాలతక్కువ. నవనాథ చరిత్రలోని వంచక పురోహితుని కథలోను, హరిశ్చంద్రోపాఖ్యాన మందలి కాల కౌశిక, కలహకంఠి వృత్తాంతములందును గౌరన చక్కని చిక్కని హాస్యమును పోషించినాడు. నాటి తెలుగు కవులలో గౌరనవలె నింతటి హాస్య రసాభినివేశ కౌశలమును ప్రదర్శించిన వారు లేరనియే చెప్పవచ్చును.

వికృత రూప దర్శనమునను, వికృత వచశ్శ్రవణము వలనను, వికృతపు చేష్టల మూలమునను హాస్యము జనించును. ఈ

మూడు లక్షణముల హాస్యమును గౌరన తన రచనలలో చిత్రించి యున్నాడు.

వంచక పురోహితుని ఆకారవర్ణన:

"పొడవైన పెనుబొల్లి బొట్టును మొదలఁ
బెడసి రాలుచునున్న వెడతల నరల
దులిచిన సికయు సందులఁబాఁకు వట్టి
బలుపు గప్పిన గొగ్గిపండ్లను బిట్టు
పడికి కంపె సఁగెడి బడబాకివోరు
బెడసు చెవులుఁ గుఱుపీఁచు గడ్డమును
బరుసు మీసముఁ జెక్కుపైఁ బులిపిరియు
నులుకు బొడ్డును మేననొదవిన దద్దుఁ
బిల్లి కన్నులు బల్లపెరిఁగిన కడుపు
గిల్లచూపులుఁ జారగిరికొన్న బొచ్చు
బొలిబొట్టు గూనివీఁపును బుఱ్ఱముక్కుఁ
గలుకును మెడమీఁది కంతియు నీచ
బోయిన పిఱుఁదును బస్తుదోవతియు
దాయ జంకనిడిన దర్భసంబెలయుఁ
గోలయుఁ గుఱుమెట్లు గోటుగును ముఱికి
పేలికెయును ముళ్లుబెట్టిన జంధ్య
ములును బంచాంగంబు ముష్టియుఁ జిల్లు
లొలసిన కరకత్తియును నలవడగ"

—నవనాథ చరిత్ర. తృతీయాశ్వాసము పుట 149.

కాల కౌశికుని ఆకార సామ్య మీ క్రిందిది:

"అడిగిన ధాన్యంబు లవి వేలు వేలు
ముడిచిన బట్టలు మూపుపై ప్రేలఁ

దోలు నస్థులఁజిక్కి తూగాడు మేనుఁ
బేలురాలెడు సిగ పెడతలఁ గణితి
పిల్లికన్నులఁ గుఱు పీచు మీసములు
నుల్లిగడ్డంబు నత్యుగ్ర దృష్టియును
దళమైన పట్టెవర్ధనములు వ్రేళ్ళ
నులిచిన దర్భలు నుదుటిపై బొరును
నొరుగు నోరును వెలికుఱికిన పండ్లు
యరవి దోవతియును పంచాంగంబు ముష్టిఁ
బరఁగిన కరతిత్తి పత్రాల సంచి
యొరిగిన గొడుగును నుసిరాలు కోల......"

— హరిశ్చ. ద్వి. భా. పుట 281.

కాల కౌశికుడు దూరముగ నుండగనే పురజనులు 'అదెవచ్చె నడపీనుగ'ని తొలగి పోవుదురట. హరిశ్చంద్రుడు 'ఆతని జన్నిదముల గనుగొని విప్రుడుగా బోలు'' ననుకొని నాడు. ఇట్లే కలహకంఠి ఆకార వర్ణనలోను గౌరన వికారమంత నొకచో మూర్తీభవించినట్లు వర్ణించి యున్నాడు.

"మెదుక పట్టినతల మెడగండమాల
నుదుటి మీఁదటి సుడి నులిగొన్న బొమలు
బుఱ్ఱముక్కును లొట్టబోయిన గన్ను
వెట్టిచూపును దెగ్రేలాడు చెవులు
మిడిపండ్లు చెక్కిలిమీఁది పుల్పిరియుఁ
బడ్రేలు చన్నులు బడబాకి నోరు
రోటుపోయిన చెయ్యి ఱొమ్ముకుపరము
వాటుఁగాలును ఱోలువలెనున్న నడుము
బద్దుపిక్కలు నంటబలసిన తొడలు
మొద్దుపాదంబులు ముడిఁగిన వ్రేళ్లఁ
గఱుకు నల్లని మేను............"

— హరిశ్చ. ద్వి. భా. పుట 334–335.

నవనాథచరిత్రలో, మందసములోనుండు ఎలుగు బంటును రాజపుత్రికయే యని భ్రమించి వంచకపురోహితుడు చేసిన సంభాషణమును, చేష్టలును హాస్యరస పరిపోషకములు.

పురోహితుడు తన సుగుణ సంపద నిట్లు యేకరువు పెట్టినాడు:

"జాతిగాఁ గొక్కోక శాస్త్రమంతయును
విన్నాడ నందుల విధమునఁ గవయ
పన్న లతాంగి నీకోడినవాడ
వృద్ధని చూచితివేని కామంబు
బుద్ధిఁ బోలింపంగ ముదుకకు ఘనము
వామాక్షి నావిటత్వము జాణతనము
నామాట నమ్మవే నాభార్యనడుగు
మభినవ మన్మథుండనుచు నెల్లపుడు
సభవారు వొగడు నాచక్కదనంబు
భామలు కోరి తప్పక చూచిరేనిఁ
గాముని మదిలోనఁ గాసుకఁగొనరు"

—నవనాథ చరిత్ర. 3వ ఆశ్వా. పుటలు 154-155.

సంతోషము కల్గినపుడు వంచకపురోహితుని చేష్టలివి:

"సాము చేయుచు మల్లసరచుచుఁ గోల
వేమారు విసరుచు విస్తూప మెసఁగఁ
బనసలు చెప్పుచు బ్రమసి పాఱుచును
గునియుచుఁ జప్పట్లుగొట్టి యాడుచును
వెగ్గలంబుగ నోరువిప్పి నవ్వుచును
వగుకోతికి శివము వచ్చిన రీతి
కనుఁగొని హాస్యంబుగా వికారంబు
లొనరించి ....................................."

—నవనాథ చరిత్ర. 3వ ఆశ్వా. పుట 150.

ఇట్లే వంచకపురోహితుని సంతోషాతిశయమును గౌరన చాల వరకు పెంచినాడు. అతి సంతోషియైన పురోహితునిచేత గౌరన 'గోవింద గంతులు' కూడ కొన్ని వేయించినాడు.

"మా వేడుకింతట మానదు మీకు
గోవింద గంతులు కొన్ని వేసెదము
అనుచు ధోవతి మొలనంట బిగించి
తన మాటలటు వెట్టి తమకంబు నిగుడ
మడమలు పిఱుఁదున మాటిమాటికిని
వడిఁదాఁక నందందవడిఁ బొట్టగదల
ముఖము చెమర్ప నూడ్పులు సందడింప
శిఖ మిట్టిపడ వలచేదోరమూడ
నహుతల మెఱవ జంధ్యంబులు ద్రెవ్వఁ
బెడకచ్చవిడ మల్లిపెద్దికి మూఁడు
పప్పుకూచికి నాల్గు భాస్కరుకైదు
అప్పల కాఱు జంధ్యాల కేశవునకుఁ
బది కుప్పిగంతులే భళుకుఁ బదాఱు

.....................................

గూడ ముప్పదిరెండు గోవింద గంతు
లీడేర నేసితి నింకోప ననుచు".

— నవనాథ చరిత్ర. ౩వ ఆశ్వా. పుట 150-151.

నక్షత్రకుడు లంచము తీసుకొని తన పక్షము తీర్పుచెప్పి నపుడు కాలకౌశికుడు గంతులేసిన విధమిది:

"వెక్కిరించుచుఁ గోలవిసరుచు నోరు
వెక్కసంబుగ విచ్చి పెడనవ్వునవ్వి
గంతులు వైచుచుఁ గరతాళగతుల
నంతంత నాడుచు నంతటఁబోక
పడుచులార్వఁగఁ జుట్టుఁ బరువులు వాఱి

కడఁగి చూచెడివారిఁ గదలఁ దోలుచును
బలు విస్వరంబులఁ బనసలు గొన్ని
చెలఁగి త్రెప్పలుమీఁదఁ జిలుకఁ జెప్పుచును
జెనఁటిగోఁతికి వీర్ల శివమెత్తినట్ల
కనుకనిఁబెక్క వికారముల్ సేయు"

—హరిశ్చ. ద్వి. భా. పుటలు 310-311.

కలహకంఠి తనపరాక్రమును గూర్చి యిట్లు ఉద్ఘాటించినది.

"నన్నెఱుంగదు గాక నాపేరు తెలియ
విన్న మృత్యువుకైన వెరవేఁకి వచ్చుఁ
గదలినేఁ రోఁకలి గైకొన్న వలనఁ
గడలుచు రీవాడ గరిత లందఱును
నాపాడ గాంచిన నగరంబు వడఁకు"

—హరిశ్చ. ద్వి. భా. పుట 343.

ఈమె తన సౌందర్యమును గూర్చి:

"బాపురె యనుకొనఁ బనిలేదు గాక
రూపింప నాకంటె రూపసి కలదె"

—హరిశ్చ. ద్వి. భా: పుట 333.

అని ప్రగల్భములు పల్కినది. ఈ పల్కులలో హాస్యము వెల్లి విరియుచున్నది. శంకరకవి, శరభకవి-మొదలగు తరువాతి కవులు గౌరనను పెక్కు విషయములలో ననుకరించినను, హాస్య రసమును చిత్రింపలేక ఈ ఘట్టమును కొలది మాత్రముగనే పట్టి చూచి వదలి పెట్టినారు.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానములో మంచివెన్నెలవంటి 'మందహాసము', 'వెడనవ్వు' 'లేనవ్వు' మున్నగు నవ్వులనువర్ణించి నాడు. గౌరన విశేషముగా ప్రచారములోనికి తెచ్చినది 'పక పకనవ్వు'.

గౌరన, ఒకనిగూర్చి హేళనగా చెప్పవలసివచ్చినపుడు అందుకు సంబంధించిన పేర్ల నన్నింటిని ఒక మాలగా నొకచో కూర్చును. కాలకౌశిక, కలహకంఠి వర్ణనలలో ఈ విషయము గమనింప వచ్చును. హరిశ్చంద్రుడు పనిచేయలేడని చెప్పు సందర్భమున వీరబాహు డిట్లనెను:

"ఒక విచారముమాను నొదవె నీరాజు
సుకవాసి పనిపంద చూపు గుఱ్ఱంబు
మామిడిక్రింద సోమరి మేదకుండు
భూమి తుంటరి యెనుపోతుపై వాన
ముండరి చల్ల చప్పుడు గోడ చేర్పు
చండి పోతనుసట్టి జాడ నున్నాడు."

— హరిశ్చ. ద్వి. భా. పుటలు 368–369.

ఇందలి మాటలన్నియు ఇంచుమించు నొకే అర్థము గలవే. అయినను నివి అర్థశాస్త్రముకు గాక రచనాశిల్పముకొరకే ఉపయోగింపబడినవి.

ఇట్లు పదప్రయోగనైపుణియందును, నాటకోచిత రచనము నందును, భావౌన్నత్యమునందును, మానవమానసిక తత్వవివరణము నందును – గౌరన తన ప్రజ్ఞను వెల్లడించియున్నాడు. అతనికిగల 'సరస సాహిత్య లక్షణవిచక్షణు' డను బిరుదు వీనిచే సార్థక మగు చున్నది. గౌరన తర్వాత హరిశ్చంద్రుని కథ రచించిన వారిలో అతని ననుసరింపనివారు లేరు. ఆ విషయ మింకొకచోట చర్చింతము. ద్విపద వాఙ్మయమున గౌరనకు అసాధారణస్థానము కలదు.

## తాళ్లపాక చిన్నన్న.

ద్విపదకవిత్వమునకు పేరుపొందిన మహాకవులలో తాళ్లపాక చిన్నన్న యొకడు. "చిన్నన్న ద్విపద కెఱుఁగును" అని చాటూక్తి. అష్టమహిషీకల్యాణము, పరమయోగి విలాసము, ఉషాకల్యాణము, అన్నమాచార్య చరిత్ర-వీనిని చిన్నన్న ద్విపదలో రచించినాడు. ద్విపదకవిత్వమునకు ప్రథమాచార్యుడగు పాల్కురికి సోమనాథుని ద్విపదలక్షణములకు భిన్నముగా చిన్నన్న ద్విపదకు సమగ్ర లక్షణమేర్పరచి నిష్కృష్టముగానిర్వచించెను. (చూ॥ మూడవ ప్రకరణము.)

చిన్నన్న, తన తొలి ద్విపదకృతియగు అష్టమహిషీ కల్యాణమున,

"..............కావ్యంబుఁ జెప్పి
యెనలేని శ్రీ వేంకటేశు మెప్పించి
సకలంబు నెఱుఁగ నసాధార ణాంక
దినము లోననె వేయి ద్విపద లింపొంద
వినుత వర్ణనలతోడ విరచించు వాఁడఁ
గవి శిరః కంప యోగ్యప్రలి ద్విపద
నవ బిరుదాంకుండ".

— అష్టమహిషీ కల్యాణము. అవతారిక పుట 6.

నని చెప్పుకొనినాడు. ఇతడు శ్రీ వేంకటేశ్వర పదసేవచే కవిత్వమును బడసి నాడట. ఇతడు తన కవితా గుణములను అష్టమహిషీ కల్యాణావతారికలో నిట్లు తెల్పియున్నాడు:

"..............అలఘు శబ్దార్థ
సారసరీతి రస ప్రభావముగఁ
గులికి కస్తురి వీణెఁ గోసిన కరణిఁ
దెలి కప్పురపుఁ గ్రోవి దెఱచిన సరణి

విరవాది పొట్లంబు విడిచిన మాడ్కిఁ
బరిమళించుచు గవుల్ బలిబలి యనఁగఁ
గవిత చెప్పిన సులక్షణునిఁ గవీంద్రుఁ
డవునందురే నేర్పినట్లు చెప్పెదను".

— అ. క. అవతారిక పుట 8.

'ద్విపద విఖ్యాతి చెలంగ', 'చమత్కృతి సంఘటింపఁ జతుర శృంగార వాచాప్రౌఢి మెఱసి' ద్విపదలో అష్టమహిషీ కల్యాణమును చిన్నన్న రచించినాడు.

చిన్నన్న మంచి భావనాపటిమ కలవాడు. ఈ భావనా పటిమ అనేకవిధముల అతని కవితలో ద్యోతకమగును. పరమ యోగి విలాసములో బీభత్సమగు యుద్ధభూమిని కళాత్మకముగా భావించి రామణీయకముగ వర్ణించిన విధమును గమనింపుడు:

"దొఱఁగు రక్తంబులు తోయపూరములు
శరము లండజము లాస్యములు తామరలు
కనుగవల్ తొగలు మీగాళ్ళు తాబేళ్ళు
మినుకారు నెరికురుల్ మిండ తుమ్మెదలు
కరటి తుండములు నక్రములు కంఠములు
దరములు చామరల్ తరచైన నాచు
ఘన శతాంగములు వక్రములు చక్రములు
పునుకలు వరహంసములు గాఁగ నొప్పు".

— చూ॥ పరమయోగి విలాసము. 6వ ఆశ్వా. పుట 392.
ద్వి. పం. 9264–72.

ఇట్టి వర్ణన సామాన్యకవులు చేయలేరు. ఎందులకనగా బీభత్స ఘట్టమును మనోజ్ఞముగా నూహించి వర్ణించుట సామాన్యకవుల కలవిగాని విద్య. ఇట్టి వర్ణనలవలన చిన్నన్న లోకజ్ఞత, ఆత్మీ

యత వ్యక్తమగును. ఇట్టిది ముఖ్యముగా తిక్కన వర్ణనలలో గోచరించుచుండును.

పాత్రోచితములగు మాటల ప్రయోగించుట, సన్నివేశమును కన్నులకుగట్టినట్లు సాక్షాత్కరింపజేయుట, లలితభావములను మానవహృదయమునకు నాటునట్లుచేయుట-ఇవిచిన్నన్న కవితలో గమనింపవలసిన ముఖ్యాంశములు. కారాగృహ ప్రవేశముచేయు ఉషానిరుద్ధులను చూచి అక్కడి అంగనలు దైన్యముతో ననిన మాటలివి:

"బిగువు టందియలకు బెగడు పాదముల
నిగళ భారములాన నేర్తువే యింతి
విదిత సౌధములోన విసుగు, నీవిప్పు
డొదుగుచు జెరనుండ నోపుదే లేమ
తలిరుల సజ్జకు తాళని మేను
యిలమీద బవళింప నెట్లోర్తు వబల
లలన! నీముఖ కమలమునకై వచ్చి
బలిమిని రాజషట్పద మెట్లు జిక్కె
వనిత! నీ కరపల్లవములకై వచ్చి
పెనుబంది నీరాజ పికమెట్లు జిక్కె
వగువ! నీ యధర బింబమునకై వచ్చి
సొగసైన యీరాజ శుకమెట్లు జిక్కె
ఏణలోచన! మిమ్ము నింతగా జేయు
బాణు నందునో దంచ బాణు దిట్టుదునో".

—ఉషాకల్యాణము. ప్రథమ భాగము. పుట 48-49.

ఇందు ఉషానిరుద్ధుల సుకుమార దేహత్వము, వారి గాఢానురాగమును కథలోని ఇతరపాత్రలముఖమున తెల్పబడినది. అట్టి సుకుమార దేహుల "నింతగాజేయు" ననుటలో విశిష్టభావస్ఫోరకమగు నర్థమందిమిడి యున్నది. ఈసన్నివేశము మానవహృదయ

ముల కొకవిధమగు కదలికను కల్గించునది. 'రాజషట్పదము' 'రాజపికము' 'రాజశుకము'-అని అనిరుద్ధుని ఎడ ప్రయోగించుట సాభిప్రాయ మైనది. చిన్నన్న ద్విపదరచనలోని ఎత్తుగడకు, శైలికి, గాంభీర్యమునకు, ఉదాత్తతకు - నిది చక్కని ఉదాహరణము.

చిన్నన్నద్విపదగ్రంథములలో అక్కడక్కడ మేలుకొలుపు ద్విపదలవంటివి పల్లవితో నొప్పి అపూర్వ గానమాధుర్యమును రచించునట్టివి కొన్ని గలవు. శ్రీరంగనాథుని యోగనిద్రనుండి మేల్కొల్పు సందర్భమున,

"సారెదిఁ బ్రాబోధ కీస్తుతిఁ బాడఁ దొడఁగిఁ
రమణ బింబం బుదయాద్రిమై నిలిచెఁ
బలపల వేగి వీడ్వడ మబ్బు లడఁగె
నలరుచుఁ బూఁదేనియల సోనగురిసెఁ
బాలించి కరుణ చొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగ శాయి! మేల్కొనవె
* * *
వ్రేపల్లె గోవుల వేణునాదంబు
లేపారె రవళించి వృషభ సంతతుల
గాటంపు మేతల గబ్బుల మీఱెఁ
దేఁటి దాఁటుల మ్రోత దెసలఁ బెల్లొదవెఁ
బాలించి కరుణచొప్పడ యోగనిద్రఁ
జాలించి శ్రీరంగ శాయి! మేల్కొనవె
* * * * ".

— చూ॥ పరమయోగి విలాసము 5వ ఆశ్వా. పుటలు 363-365
ద్వి. పం. 8591-8656.

ఇట్లు "పాలించి కరుణ చొప్పడ యోగనిద్రఁ జాలించి శ్రీ రంగ శాయి! మేల్కొనవె" అను పల్లవితో సుమారు ముప్పదిద్విపదలలో ఈ మేలుకొలుపులు కీర్తనలవలె గానమాధుర్యముతో

నొప్పియున్నవి. చిన్నన్న గాయకుఁడనుటకు అతఁడు రచించిన సంకీర్తనము లేవియు నేఁడు కానరావు. కాని పై ద్విపదలు అతని సంకీర్తనములు లేనికొరతను తీర్చుచున్నవి. గానమాధుర్యము అర్థసౌలభ్యము, నవరసోచితపదప్రయోగము, సహజ గాంభీర్యము శబ్దమార్దవము ఈద్విపదలలో కన్పించును. ఇవి ఉత్తమ శైలికి ప్రధాన గుణములు. ఈ మేల్కొలుపులు శ్రవణ పేయములై 'మేల్కొనవె' అను అక్షరములను క్రమముగా పాడిచి వినిపించురీతిని ఆరోహణస్వరములతో పాడిచి మెలకువను తెప్పించును. వీనిగతిసరళము కాదు. ఇందలి త్రిపుటలయగూడ హెచ్చరికను కల్పించునదియే.

అష్టమహిషీకల్యాణమున చిన్నన్న శృంగారరస వైవిధ్యమును ప్రదర్శించినాఁడు. అతనిదెక్కువగా మధురభక్తి సంప్రదాయము. భగవంతునే పరమప్రాప్యుఁడైన ప్రియునిగావలచి ఉపాసించుటయే మధురభక్తిపరమార్థము.

కృష్ణ సంబంధమైన భక్తి శృంగారముల భావబాంధవ్యమును చిన్నన్న అష్టమహిషీ కల్యాణమున గోపికలు కృష్ణునికై పరితపించు ఘట్టమున నిరూపించినాఁడు. ఇది నిసర్గమధురమును, మనోహరమును నయినది:

"కానతారముం గోప కాంతలా శౌరిఁ
గానక చెగడి మేఘముఁ బాసి దెసల
నూవిన మెఱుపుల యొఱపుఁ గైకొనుచు
విరహ తాపాంబుధి వెలువడు జాడ
లరసి యాతని నామమను తెప్పఁ జేరి
పన్నీటి చెమ్మచేఁ బదనైన యొక్క
తిన్నని కస్తూరి తిన్నె నెన్నడుమ
కమలా కుచాగ్ర సంగతి పాదకముల

కమల చిహ్నంబుల గలిగి యేర్పడిన
యడుగులఁ గాంచి కృష్ణాయంచు నతని
నుడువుచుఁ గదిసి కన్నుల నొత్తికొనుచు

*  *  *  *

ననురాగ వల్లికల నఁగ నొప్పుచును
బెనగొన్న గురిగింజ పేరు లల్లాడఁ
బరమ యోగీంద్రుల భాతి గోవింద
పరచింత సేయుచుఁ బరచింత లుడిగి
సకల శరీరి యీశ్వరు నూపచేసి "

— అష్టమహిషీ కల్యాణము. 2వ ఆశ్వా. పుటలు 98-99.
ద్వి. పం. 2552-2576.

ఈద్విపదలు చమత్కృతితో, చతురశృంగారయుక్తముగ, కృష్ణభక్తితో రచింపబడి కవియొక్క ఆత్మీయతను చాటుచున్నవి. ఈ మధురభక్తిసంప్రదాయము తాళ్లపాకకవులలో విశేషముగా కన్పించుచుండును.

ద్వారకానగర వర్ణన సందర్భమున చిన్నన్న ప్రదర్శించిన సంస్కృత సమాససంఘటితమును తిలకింపుడు ;

" సార కస్తూరికా సహిత నీహార
నీర కర్పూర వర్ణిత కాంతి జాల
హార కల్పిత గృహానేకాంశ విజిత
తారక వేష్టతో దార సముద్ర
హారక కమలా కరాంచిత హంస
కీర కదంబ సంకీర్ణ సౌధాగ్ర
చారక గగనాధ్వ చారక వ్యూహ
దారక నమ్మహా ద్వారకఁ గాంచి "

— అష్టమహిషీ కల్యాణము. 4వ ఆశ్వా. పుట 183.

చిన్నన్న ప్రబంధోచితములగు పెక్కువర్ణనలను తనద్విపద గ్రంథములందు అవకాశము లభించినచోట్ల వర్ణించినాడు. అతడుస్త్రీవర్ణనను ఆపాదమస్తకముగ పెక్కుతావులందుచేసినాడు.

కుక్కుటనగర కామినీసౌందర్యవర్ణన:

"గప్పులై యొప్పులై కళుకులై తేట
చొప్పులై గొప్పులై సొగయు గొప్పులును
గళుకులై బెళుకులై కలువ పూసోగ
ములుకులై తళుకులై మొనయుకన్నులును
సోగలై బాగులై సొలపులై సిరుల
ప్రోగులై వాగులై పొలుచు మోములును
గావులై తావులై కండ చెక్కరల
ప్రోవులై ఠీవులై పొలుచు మోములను
గట్టులై గుట్టులై కాముని పసిడి
జెట్టులై చెట్టులై చెలఁగు పాలిండ్లు
జినుఁగులై పెనగులై నట్టి కౌనులును
గెంపులై సొంపులై కెందమ్మి చాయ
నింపులై యింపులై నిగుడు హస్తములు
నినుపులై నునుపులై నెఱయు దిబ్బలను
వనుపులై పెనుపులై యను వొందు కటులు
ననుకులై మినుకులై యపరంజి పసులు
కనుకులై మనుకులై యొప్పు నూరువులుఁ
బొలుపులై సొలుపులై పూవిల్తు వాలు
మెలుపులై వలపులై మించు పాదములు"

—చూ॥ పరమయోగివిలాసము. 3వ ఆశ్వా. పుట 151-152. ఇందు 'గప్పులై యొప్పులై', 'చొప్పులై గొప్పులై'-మున్నగు జంటపదములకూర్పు పలురీతుల ద్విపదపాద ప్రథమమునందు ప్రయోగింపబడినది. ఇది ఒక విధమగు శబ్దచమత్కృతి. ప్రతిపాదింప నెంచిన స్త్రీసౌందర్యమను విషయమును పాఠకుల మన

స్సులకు లెస్సగా హత్తుకొని అందు మూలమున రసానుభవము కలుగుటకీశబ్దచమత్కృతి తోడ్పడుచున్నది. కాని ఇందు రసానుభవమునకన్న కేవల శబ్దపటాటోపమే ఎక్కువ. ఇదికవిత్వమున కందచందములను, తళుకుబెళుకులను కల్గించును. దీనిని భాషా సౌభాగ్య కళాసౌందర్య ద్యోతకముగా పలువురు భావింతురు. ఇట్టి శాబ్దికచమత్కార వర్ణనలు చిన్నన్న ద్విపద గ్రంథములలో చాలాచోట్ల కన్పించును. పరమయోగివిలాసములోని కాంచీపురనగర కామినీ విలాస సౌందర్యవర్ణన[22], వైకుంఠనగర వర్ణన[23], కాంచీనగరవర్ణన,[24] కుక్కుటనగర వర్ణన[25] మున్నగునవి తెలుగు ప్రబంధములందలి పురవర్ణనలను బోలినట్టివే. ఈ ద్విపద గ్రంథమందలి ఉద్యానవనవర్ణన[26], ఋతువర్ణనలు[27] మున్నగునవి ప్రౌఢములై ప్రబంధరచనలను తలపించుచుండును.

బాణుడు యుద్ధమునకు బయలుదేరుటను చిన్నన్న ధ్వన్యనుకరణ పదప్రయోగముతో నిట్లు వర్ణించినాడు:

"ఘుమఘుమ యని వార్ధి ఘూర్ణిలి కలఁగ
ధమధమయని మ్రోయుడ మరువు ద్రిప్పి
పెటపెటయని శైల బృందముల్ పగుల
గిటగిటయని పండ్లు గీటుచు గనలి"

— ఉషాకల్యాణము. ద్వితీయభాగము. పుట 76.

చిన్నన్న ద్విపద రచనచే పలువుర కాదర్శపురుషుడైనాడు. అతని ద్విపదల ననుసరించి తర్వాతి ద్విపదకవులు గ్రంథ

---

22. ద్విపద పరమయోగి విలాసము. 1వ ఆశ్వా. పుట 26-27.
23. ,, ,, పుట 9-10.
24. ,, 1వ ఆశ్వా. పుట 27-28.
25. ,, 3వ ఆశ్వా. పుట 149-152.
26. ,, ,, పుట 198-199.
27. ,, 3వ ఆశ్వా. పుట 199-200.

రచన చేసినారు. ద్విపద కవిత్వమునందలి సారళ్యమును, ఉదాత్తతను, శైలీ వైవిధ్యమును చిన్నన్న తన ద్విపద గ్రంథములందు చక్కగా నిరూపించియున్నాడు. "చిన్నన్న ద్విపద కెఱుగును" అను వాక్యము అతనిపట్ల సార్థకమయినది.

## దోనూరి కోనేరు నాథకవి:

దోనూరి కోనేరునాథకవి 'విలసిత సాహిత్య విశ్రాంతిమంతుడు'; 'వివిధాష్ట భాషా కవిత్వధుర్యుండు', 'కవి సార్వభౌమ విఖ్యాత పదుండు'. ప్రబంధ యుగములో వెలసిన ఈకవి తెలుగున సుబోధకముగను, సంగ్రహముగను, భాగవత ద్వాదశ స్కంధ కథలను ఆరాశ్వాసములలో 'బాలభాగవత' మను చంపూ ప్రబంధముగ రచించి, ఆపిదప అతడేదానిని ద్విపదలో వెలయించెను. ఇతడు ఈ రెండు బాలభాగవతములందును పోతనను స్మరింపలేదు. మొదట చంపువుగ రచించిన బాలభాగవతమునే కోనేరునాథకవి మరల ద్విపదలో రచించుటకు కారణము కృతిపతుల కోరిక లేగాక అతనికిగల ద్విపదాభిమానమును వ్యక్తపరచును. ఇతని ద్విపదలను అప్పకవి మున్నగు లాక్షణికులుకూడ ప్రామాణికముగ గ్రహించిరి. ఇందు ప్రబంధలక్షణము లనేకములు కలవు.

"లాలితంబై రమ్య లక్షణంబైన
బాల భాగవత ప్రబంధంబు"

అని కోనేరునాథకవి గ్రంథాంతమున తెల్పినాడు.

"కడుబ్రయాసమున దుష్కవితలుగూర్చి
యెడపక సభ నార్యులెల్ల జాయనంగ
చదివి తారొక వంక జపచప నగుచు

మెడలెడు సుకవుల మేలువాక్యముల
నరశి రాజులు మెచ్చునట్లుగా నెపుడు
దెరువులు వెపైడు ధీరచిత్తులకు
సుకవుల కింపులు గూడ ధీర్ఘాయు
వసు దిలంబగు గాత యనుచు దీవింతు
అని తలపోన గూడునట్లుగా సుకవి
జన మతాచారంబు చక్కనొనర్చి"

ఈ బాలభాగవతమును రచించినానని కోనేరునాథకవి గ్రంథారంభమున తెల్పినాడు.

బాలభాగవతమునకు, సంస్కృతభాగవతమునకు, పోతన భాగవతమునకు కథలో అంతగా భేదములేదు. తత్త్వోపదేశమునందే అవి వేరుపడుచున్నవి. వేదాంత విషయములను ప్రతిపాదించుచోట్ల కోనేరునాథకవి విశిష్టాద్వైత సంప్రదాయములనే విశేషముగా ప్రతిపాదించును. ధృవోపాఖ్యానము, నృసింహావతారఘట్టము, పురంజనోపాఖ్యానము, దక్షాధ్వరధ్వంసము, వామనావతారము - మున్నగు ఘట్టములందు అతని విశిష్టాద్వైత మీమాంస తత్త్వము గోచరించును. 'వాసుదేవమయబ్రహ్మము, శేష శేషిత్వము' - మున్నగు ప్రయోగములట్టివి. తత్త్వోపదేశమందు భక్తిప్రపత్తులు లేక ముక్తి కలుగనేరదనునది విశిష్టాద్వైత తత్త్వసారాంశము. దీనిని కోనేరునాథకవి అవకాశము లభించినచోట్ల అన్నిటనుచేర్చి తన రచనను సాగించినాడు.

ద్విపద బాలభాగవతమునందలి వర్ణనలు చమత్కృతి గల్గి, ప్రౌఢములై యున్నవి. శబ్ద చమత్కృతి, ఆలంకారిక శైలి కోనేరునాథకవి వర్ణనలలో కన్పించును. ఉదాహరణమునకు:

వనవర్ణన :

"పచరించు కన్నుల పండువు నెలమి
నచటనై శ్రీయ సంబను నుపవనము
పల్లవ విలసన పదము గాకయును
బల్లవ విలస నాస్పద మనఁ బరగి
విలసిత మధుపాయి వికృతినాఁ బరగి"

—ద్వి. బా. భా. అముద్రితము (డి. నెం. 972. ప్రా. భా).

గంగానదీ వర్ణన :

"కమలాధి వాసవా కమనీయ యగుచుఁ
గమల లోచనుని వక్షస్స్థలి వోలె
నమల కంకణ యుక్త హంసక యగుచు
నమరఁ గైసేసిన యతివయ పోలె
మరక కచ్ఛపయోగ మానిత యగుచు
బ్రకటింప గిన్నర పతి విడువోలె
బహుపుణ్య జనగణ ప్రచుర సంచార
మహితయై కైలాస మహియునుం బోలె
అతి నుతోదార పాత్రాధారచార
తత శాలయై రాజధానియ పోలె
హరి రోక రోహిత వ్యాకీర్ణయగుచు
శిరుల మించిన వన శ్రేణియ పోలె..."

—ప్రథమాశ్వాసము

కోనేరునాథకవి మొదట రచించిన పద్య బాలభాగవత మును, దాని రూపాంతరమనదగు ద్విపద బాలభాగవతమును పోల్చిచూచిన కొన్ని ఘట్టములు ద్విపద బాలభాగవతములోనే అధికకవితా శిల్పమును కల్గియున్నట్లు గమనింప వచ్చును.

పద్యబాలభాగవతములో వరహావతార ఘట్టము బహుళ క్లుప్తముగ వర్ణింప బడినది.

"అనుపమలీల నీకరణి యజ్ఞవరాహము వర్ధితాంగమై
వననిధిసొచ్చి యందెదురువచ్చిన యా కనకాక్షనామ దై
త్యుని వధియించి (కోరమున) నుర్విజలంబుల మీఁదికెత్తి చ
క్కన నిలిపెన్ సుస్థిరముగా ధరణీధర నామమేర్పడన్"

— పద్య బాలభాగవతము, 2వ ఆశ్వా. పుట 91.

ఇచట వరహావతారము సంగ్రహముగా, కథాకథన పద్ధతిని రచితమయినది. దీనిని కోనేరునాథకవి తన ద్విపద బాలభాగవతములో విపులముగా, రచనాశిల్పముతో వర్ణించినతీరు ఇట్టిది:

"దాతయు మునులు నీతడే హరి యనుచు
చేతులెత్తి నుతింప శీఘ్రంబె పెరిగి
ఘనతరభంగ సంఘాత సంఘట్ట
కనదుగ్ర ఘుమఘుమాకార వర్ణితము
భూర్భువ స్వర్ణామ భువనవిస్తార
గర్భీకృత ప్రవేశ ప్రగల్భంబు
ఫణిగణ ఫూత్కృతి ప్రహతి విభ్రాంత
గణనీయ బలమహాగ్రాహ సంకులము
పరివహ పవనఝుంపా సముద్గమిత
గురుతర డిండీర కూటవిపణము
రభస విద్రావిత ప్రకట తత్కాల
సభయ మహార్లోక జనసంకరంబు
నైయుండి నారాయణాశ్రయత్వమున
బాయక సజ్జనభావంబు పోలె
త్యక్త గోత్రానుకూలాచార మహిమ
సక్తమై దుష్టప్రచారంబ పోలె
సరయాశు గాపాత చలిత కీలాల
భరమయి కదన భూభాగంబ పోలె

లోకత్రయా క్రాంతి లోలుపంబగుచు
వైకుంఠు డుబ్బ తావ్యవహ్యతి వోలె
తేజోవిశేషంబు తిలకింపజొచ్చి
జగతీతలము కోర జక్కఁగా నెత్తి
యగణిత శక్తి మహోయుక్తి నిలిపె ”

— ద్వి. బా. భా. ద్వితీయాశ్వాసము.

ఇది పద్య బాలభాగవత రచనకంటె ఆలంకారిక శైలితోనొప్పి, విపులీకరింపఁబడి ప్రౌఢమైనది. పద్య బాలభాగవతమే నేడు ముద్రితమైయున్నది. కాని ఏ కారణముచేతనో ద్విపద బాల భాగవతము ఇంకను సంపూర్ణముగా ముద్రితముకా లేదు. నృసింహావతార సందర్భము నందలి రచన :

“ పరివహ పవన ఝుంపా కంపితాబ్ధి
సరభస నిర్ఘోష శంక దలిర్ప
చటుల సంకర్షణాస్యప్రభూతాగ్ని
చిటచిటారవ మహోర్జిత శేఖమెగయ
వర్ణిత పుష్కలావర్తకాంబుధర
కర్ణభిద్గర్జా ప్రకారంబు నెగడ
కుహనాముఖ క్రోధ కుటిల కంఠోర్ద
బహుల ఘుర్ఘారశబ్ద పద్ధతి దోప
ఘటిత నిర్ఘాత ప్రకంపిత ధరణి
పటుతర నిర్ఘోష పరిపాటు నిగుడ
బ్రహ్మాండభాండంబు పగిలెనో యనుచు
బ్రహ్మాది నిర్జరుల్ భయమంది వణక
పెట పెటమని వేగ బ్రదిలి కంబంబు
పట పట వ్రయ్యలై పగులనా నడుమ
కహ కహ ధ్వనులు వెగ్గలముగా గంఠ
కుహరాంతరంబున ఘోరముల్ గాగ

సడిలని యట్టుహాసములచే జగము
పిడుగులచే బోలె బెగడొంది పడక
కన్నుల విస్ఫులింగ ప్రకరంబు
లన్నిట జొరజొర మనగూడి పడియ
సుడియు నిట్టూర్పులు సురసురం దవిలి
కెడసె దైత్యులు ప్రేలగింజలై ప్రేల
చక్కగా నిక్కిన సుటులు మేఘముల
దక్కక తాకి రంధ్రములు గావింప
కుటిలాక్షి దుర్దర్శగోధి విటంక
ఘటిత భ్రుకుటికా వికారంబుతోడ
ధళ ధళమనియెడు దంష్ట్రిల నడుమ
గళయెక్కి సారెకు గదలింపబడుచు
ఆ రక్తమైన జింహాగ్రంబుచేత
తేరి చూడగరాని తెరనోరితోడ
సవిశేషముగ నిక్కి చక్కగా బిగియు
నవశంఖ సదృశ కర్ణంబులతోడ
ఆకంఠ కలిత నరాకృతి యగుట
నాకంఠ లలిత భూషావలితోడ
అంగులియ్యక కంకణాది కాభరణ
సంగత దోర్దండ శతములతోడ
దితి సూను దేహధాత్రీధర క్షితికి
పతి వ్రజయైన నఖావళితోడ
నిగనిగమను నఖనికరంబు రుచులు
ధగధగమను పదద్వంద్వంబుతోడ
కొడుకు దండ్రిని గనుంగొనగనొక్కటనె
తడయక కరుణ రౌద్రరసంబు లేచి
యిరుదిక్కులకు బోవు హృదయంబుతోడ
సేవకాభయదాయి శ్రీ నరసింహు
డావిర్భవించె నత్యద్భుతం బొదవ”

— ద్వి. బా. భా. తృతీయాశ్వాసము.

ఈ వర్ణనలో కోనేరునాథకవి శబ్దశక్తిని భావానుగుణముగ నుపయోగించి రసోచితమైన శిల్పమును శైలియందు సాధించినాడు. పద్య బాలభాగవతమునందును (చూ॥ 3వ ఆశ్వా. పుట 241. ప. 390-391) ఇట్టి వర్ణనే గాపించి యున్నాడు.

దక్షుడు, శివుని ద్వేషించు కథాభాగమున,

ఉదా :— పద్య బాలభాగవతములో,

తే॥ హరుడు ననుగాంచి ప్రత్యుద్గమాభివంద
నములొనర్పక యున్నవాఁడమరులార
యల్లుఁడే యాతఁడే మామనగుట యెట్లు
పెరిగనో బొజ్జ యితనికి గరువమునను

చం॥ వినయవిహీనుఁడైన (యవివేకి) ని భిక్షునకీవిరూపలో
చనునకు నాతనూజ నతిసాధ్వి నెఱుంగక యేత్రయిక్ష జతు
ర్ధనకును బోలెనిచ్చితి బుదుల్మనులియ్య శివుణ్ శివుండనణ్
జనునెయితండుయోగ్యుడెప్రశస్తసమస్తమఖాంశభాక్కుగాన్"

— పద్య. బా. భా. 2వ ఆశ్వా. పుట. 108. ప. 134-135.

అని కలదు. ఈ భావములనే ద్విపద బాలభాగతములో నిట్లు పొందుపరచినాడు.

"ఇందఱు ననుఁగాంచి యెదురేఁగుదెంచి
వందనంబులొనర్చి వర్తింపఁ గనియుఁ
గంటిరే మునులు! ముక్కంటి తానిచట
నొంటిమైఁ గదలకయున్న చందంబు
గరువంబుతో నన్నుఁగని లేవకున్నఁ
బెరిఁగనే బొజ్జ? తాఁబెద్దవాఁడగునె?
ఏమామనే? నాకు నీతఁడల్లుండె?
కలము మాటలకు సాకూలి కాఁపురము
పలుగూడు నడత రూపముచూడ రోఁత
ఎక్కడు ముడి గిబ్బ యెమ్ములు సొమ్ము

కక్కురంబగు తోలు కట్టెడు వలువ
పునక కంచము కాటిబూదియ పూఁత
ధనమును నహీయుండు తావది సున్న
పుట్టువు దెలియదెప్పుడు నొంటిగొట్టు
పెట్టువోఁతలు మందు ప్రియము దూరంబు
ఈపిశాచంబుల యేలిక కకట!
నాపట్టి నిచ్చితి నాకర్మవశత
శ్రుతిఁ జతుర్ధనకు నేర్పటగాదె తెలిసి
యితనికి నాబిడ్డనిచ్చుట దెలియ"

ఈ సందర్భమున పోతన భాగవతములోని పద్యములివి :

"పరికింప నితడు దిక్పాలయశోహాని
కరుఁడీ క్రియాశూన్యపరుని చేత
గర మొప్ప సజ్జనాచరిత మార్గము దూషి
తంబయ్యె నెన్నగతత్రపుండు
మహిత సావిత్రీ సమాననను సాధ్విన
స్మత్తనూజను మృగశాబనేత్ర
ననల భూసుర బంధుజన సమక్షమునను
ర్కటలోచనుడు గరగ్రహణమర్థిఁ
తే॥ జేసి తాశిష్యభావంబుఁ జెందుటాత్మఁ
దలఁచి ప్రత్యుద్గతాభివందనము లెలమి
నడుపకుండిన మానని నన్నుఁ గన్న
నోరిమాటకుఁ దనకేమి గోరవోరె
సీ॥ అనయంబు లుప్తక్రియా కలాపుఁడు మాన
హీనుడు మర్యాదలేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుడు దిగం
బరుడు భూతప్రేత పరివృతుండు

దామస ప్రమథ భూతములకు నాథుండు
భూతిలిప్తుండస్థి భూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్ట
హృదయుఁ డుగ్రుడును బరేత భూని
తే॥ కేతనుడు వితతప్రస్తకేశుఁ డశుచి
యయిన తనకొక్క శివనామ మనుప్రవాద
గలిగెఁగాని యశివుఁడని కానకెఱిగి
యెఱిగి వేదంబు శూద్రునకిచ్చినటులు"
— భాగవతము, చతుర్థ స్కంధము. పుట 260.
ప. 42, 43 — (రామాఅండ్ కో ప్రచురణ.)

వ్యాసరచిత సంస్కృత భాగవతములో,

"ఏష మే శిష్యతాం ప్రాప్తః, యన్మేదు హితురగ్రహీత్
పాణిం విప్రాగ్ని ముఖత, స్సావిత్ర్యా ఇవసాధువత్
గృహీత్వా మృగశాబాక్ష్యాః పాణిం మర్కటలోచనః
ప్రత్యుత్థానాభి వాదార్హే వాచాప్య కృతనోచితమ్
లుప్తక్రియా యాశుచయే మానినే భిన్న సేతవే
అనిచ్ఛన్నప్యదాం బాలాం శూద్రాయే వోశతీంగిరమ్
ప్రేతావాసేషు ఘోరేషు భూతైః ప్రేతగణైర్వృతః
అటత్యున్మత్త వన్నగ్నోవ్యుప్తకా శోహసన్ రుదన్
చితాభస్మకృతస్నానః ప్రేతస్రఙ్నస్థి భూషణః
శివాపదే శోహ్యాశివోమత్తో మత్తజనప్రియః
తస్మా ఉన్మత్తనాథాయ నష్టశౌచాయ దుర్హృదే
దత్తాబత మయా సాధ్వీచోదితో పరమేష్ఠినా"

పై వానియందు పరిశీలింప దగినది మూలమునకు సరిగా 'తుచ' తప్పకుండ భాషాంతరీకరణము జరిగినదా? లేదా? అను

విషయముకాదు. పోతన పద్య భాగవత రచనకంటె బాలభాగ వతమునందలి రచన పండితులకేగాక పామర జనులకుసైత మింపు గొల్పు పదజాలముతో ముద్దులు మూటగట్టుచు, ఔచితీవంత ముగ చదువరుల నాకర్షించుచున్నది. రచనా శిల్పమందుగాని, భావ ప్రపూర్ణత యందుగాని, శైలీ విషయమునగాని, ఉక్తి వైచిత్రి విషయమునగాని - ఏ విషయమునందైనను కోనేరునాథ కవి రచన పోతన రచనకు తీసిపోలేదు. బాలభాగవతమునందలి పద్య రచనముకంటెను ద్విపద రచనమే మిన్నగానుండి పండిత పామర జనాకర్షముగ నున్నది. ఇట్లే ఎన్నో ఉదాహరణము లను చూపవచ్చును. ద్విపద బాలభాగవత రచన ఔచితీ పరి పోషకముగ రసవంతమైనదని చెప్పుటవలన పోతన భాగవత మును న్యూనపరచినట్లు భావింపరాదు. కొన్ని విషయములలో పోతనకవిత సర్వజనుల నాకర్షించుచున్నది. కవి సార్వభౌము డును, ఉద్దండ పండితుడుననగు కోనేరునాథకవి ద్విపద బాల భాగవతమును రచించుటచే ద్విపద కవిత్వమున కానాడు కవి లోకమునగల ఆదరణము వ్యక్తమగుచున్నది.

### బట్టేపాటి తిమ్మయ.

కవిత్రయ భారతమునకు యథోచితానుసరణముగా వెల సినది ద్విపద భారతము. ఈ ద్విపదభారతమును తిమ్మయ, బాలసరస్వతి, సోమన - అను మరొక కవిత్రయము రచించెను. వీరిలో 'తిమ్మయ నన్నయబట్టువంటివాడు'. తిమ్మయ ఆదిపర్వము మొదలు ద్రోణపర్వాంతము వరకుగల ఏడు పర్వములలో ఒక్క సభాపర్వముతప్ప తక్కిన ఆరింటిని రచించెను. "ఒక్కొక్క యెడ, మూలానుసరణములో నన్నయకంటె తిమ్మయయే విశృంఖలముగా విహరించె నేమోయనియు తోచును" అని

ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు 'ద్విపద భారతము' - పీఠికలో తెల్పియున్నారు.

తిమ్మయ, తన కప్రస్తుతములని తోచిన కథలను కథాంశములను మూలముననున్నను సరే నామమాత్రముగ నైనను స్మరింపలేదు. సూచ్యార్థ సూచనగా భారత కథను ప్రస్థావించినాడు. దుర్వాహమైన శాస్త్ర ప్రసంగములను, వేదాంతవిషయములను విసుగు గొల్పించక అవసర మున్నంతవరకే వర్ణించినాడు. వ్యాసభారతమున, నన్నయ భారతమున లేకున్నను సముద్ర మథనమునకు మూలకారణముగ, ఔచితీ పరిపోషకముగ మూలమునకు మెరుగు దెచ్చునట్టి, దుర్వాసశ్శాపవృత్తాంతము'ను తిమ్మయ తనభారతమున కల్పించినాడు. దుర్వాసశ్శాప వృత్తాంత కథలో తిమ్మయ ప్రదర్శించిన కవితా శిల్పము మెచ్చదగినది.

ఐరావతారూఢుడగు ఇంద్రునికి దుర్వాసముని ప్రేమతో మందార పుష్పమాలను ఇచ్చినాడు. అతడును దానిని స్వీకరించి ఐరావత కంఠమునందు వేసెను. పుష్ప వాసనలకు తుమ్మెదలు చీకటి గుంపులట్లు చుట్టుముట్టగా ఐరావతము గాసిలియలసి,

"చయ్యన నాదిగ్గజము కరాగ్రమున
నయ్యలరుల దండ నవలీల నొడిసి
మెరయుచు నెలతేటి మొత్తంబులెల్లఁ
బఱచి దిక్కులఁ బటాపంచలై చెదర
బిట్టుగా నింగికి బిరబిరఁ ద్రిప్పి
యిట్టి చందమున సురేంద్రుని లక్ష్మి
భ్రమణంబులతో నేలపాలగు నేఁడు
కొమరువో నన్నట్లు కుంభిని వైచి

మండి గాఢత దంత మండలిఁ గ్రిమ్మి
తొండంబుచే వెండి తోడనే యెత్తి
యొక్క కాలునఁ ద్రొక్కి యుద్ధతిఁ ద్రుంచి
చిక్కగా నలి నలి చిద్రుపలై దొరఁగఁ
బటుభంగి నిలఁ బెట్టి పదములఁ బ్రామి
చటులత రూపనాశంబు గావించి'' నది.

— ద్విపద భారతము ఆదిపర్వము. పుట 23.

ఏనుగు చేష్టలను స్వాభావికముగ, భావప్రధానముగ కవి వర్ణించినాడు. ఈ సంఘటనుగాంచి ఉగ్రుడైన దుర్వాసుడు ఇంద్రుని ఇట్లు శపించెను.

''ఓరి మదాంధ నీయున్నతైశ్వర్య
కారణంబున నీవు గారవంబొదవ
నేను దీవించి నీకిచ్చిన యట్టి
మానిత పుష్పదామంబు గైకొనక
కలిమిమై నిలఁ గల్పకంబులు పెక్కు
గలవని మదిలోని కండగర్వమునఁ
గడు వెల్లిదంబునఁ గరటి పంథమున
నిడితిమి యే నీవు నింత యల్పుడవె

....................................

ఏనల్గిచూచిన నీక్షణంబునను
బూని పలాద్రులు పొడిపొడై రాలు
రవిశశితారకాగ్రహ సమూహంబు
లవలీల నిర్మూలతమై నేలవ్రాలు
గలగి గుల్లలు నిసుకయును శేషించి
జలనిధులేడు శోషత నొంది యుండు

....................................

పుడమిలోఁ గలిగిన భూరి కోపంబు

వడఁగట్టి దెచ్చినవాఁడ నేననిన
నీవెంతవాఁడవు! నీబలం బెంత
దేవతావలి యెంత! త్రిజగంబు లెంత!

...............................

నిలమీఁద బడినట్టి యీపూలదండ
నలఁగిన గతి నీవు నల్గుదు సొంపేది
మాననీయుల నవమానంబొనర్పఁ
గానీవ మహితమై కడు హెచ్చియున్న
భవదీయ రాజ్య సంపదలు నీభూరి
వివిధ పరిచ్ఛేద విభవంబులెల్ల
జడనిధిలోన నాశ్చర్యంబు గాఁగఁ
బడుఁగాక ''

— ద్వి. భా. ఆ. ప. పుటలు 24–26.

తత్ఫలితముగ అమరలోకము పతనమైనది. సముద్రములో అమర లోక సంపదలు కూలినవి గనుక సముద్రమథన మవసరమైనది. ఈ సన్నివేశమును తిమ్మయ సముద్రమథనమునకు పూర్వరంగ మున పొందుపరచుటచే ఔచితీ పరిపోషకమైనది. ఇందుతిమ్మయ సంభాషణచాతురి, ఉక్తి వైచిత్రి, ద్యోతకమగుచున్నది.

సముద్రమథన వృత్తాంత ఘట్టమున దేవదానవులకు పొత్తు కుదుర్చుటకై రాయబారము నడపిన బృహస్పతి దైత్యులతో పల్కిన పల్కులివి.

''అమర వల్లభుడు మీయందతిలోఁడ
సముచితముగఁ గూడి చరియింపఁ దలచి
పవిపాణి మీతోడఁ బలుకుమన్నట్టి
వివరంబు చెప్పెద, వినుడు మీరెల్ల:
'తాము మేమును నన్నదమ్ములమయ్యు
నీమాడ్కి నన్యోన్య మీసుగా నేల!

జగతి నేఁప్రొద్దొ గోచారాన మనకు
జగడంబు వచ్చినఁ జను నెపాయంగ!
నుభయవాదులముఁ గూడుండిన మనకుఁ
ద్రిభువనంబుల నెదిరింపఁగఁ గలరె!
యొనరంగ మనమెల్ల నొక్కటై దివిజ
దనుజ భటాళిచేఁ దడయక యిపుడు
తోయధి మథియింప దొఱకును నమృత
మాయమృతముఁ ద్రావునంతనె మనము
చావును; దెవులును, జరయును, నెవ్వి
భావింపఁగారాక భాసిల్లఁగలము
మాయెగ్గులేమియు మదిలోన నిడక
యీయెడ మీరెల్ల నీకార్యమునకు

.. .................... ................... ......

కించిత్తు మేలును గీడును లేదు!
పంచుక యనుభవింపఁగఁ గీర్తి గలుగు"

— ద్వి. భా. ఆ. ప. పుటలు 40_41.

ఈ ఘట్టము వ్యాసభారతమందు, నన్నయ భారతమునందును లేదు. ఇది తిమ్మయ ప్రతిభను వ్యక్తీకరించు సంభాషణాత్మకము, సరసమును నగు సన్నివేశము. దేవదానవులు ఆజన్మ విరోధులు. అట్టివారికి సముద్ర మథనమను కార్యసాఫల్యము కొరకు దేవగురువగు బృహస్పతి మైత్రిని చేకూర్చుటకు పాటుపడిన సన్నివేశమిది. కార్యవాదియగు బృహస్పతి దైత్యనాథుల కడ ఓర్పు, నేర్పు, సమయోచిత సల్లాపమును ప్రదర్శించినాడు. బృహస్పతి ఈ ఉపన్యాసములో తిమ్మయ ప్రదర్శించిన లోకజ్ఞత, వాక్య నిపుణత, సంభాషణ చాతుర్యము - మున్నగునవి ప్రశంసాపాత్రములు. ఇందలి పలుకు బడుల పొంకము నిసర్గ రమణీ

యమై. స్వాభావికమై, సుబోధకమై, హృదయాకర్షముగ కవి సంభాషణ చాతుర్యమును వెల్లడించుచున్నది. తిమ్మయయొక్క సంభాషణాత్మక శైలికిది ఒక తార్కాణమగుచున్నది.

తిమ్మయ, (1550-1600) ప్రబంధకవిత పరమోచ్చదశ నొందిన కాలము వాడగుటచే అతని కవితాశైలిలోను, వర్ణనల లోను ప్రబంధకవితాభిరుచులు మిక్కుటముగా గోచరించును.

నన్నయ భారతములో పాండురాజు వేటకు బయలుదేరె నని ఒక్కమాటలో తెల్పినాడు. తిమ్మయ, పాండురాజుకడకు కిరాతులరాక, వేట వర్ణన[28] — మున్నగు వానిని విపులముగా సుమారు డెబ్బదియైదు ద్విపదలలో ప్రబంధోచిత రీతిని వర్ణించి నాడు. ఈ సందర్భము నందలి తిమ్మయ వర్ణించిన వేటవర్ణన శృంగార శాకుంతలము, మనుచరిత్రలోని వేటవర్ణనలను బోలి యున్నది.

యయాతిచరిత్రలో దేవయాని వసంతవనవిహారమును నన్నయ ఒక్క పద్యములోనే వర్ణించినాడు. తిమ్మయ ద్విపద భారతమున సుమారు పదునెనిమిది ద్విపదలలో విపులముగా దేవ యాని వసంతవన విహారమును[29] వర్ణించినాడు. ఇట్టి వర్ణనలు సర్వ ప్రబంధములందును సామాన్యముగ గోచరించునట్టివే.

ఉపరిచరవసువృత్తాంతమున మూల భారతములో లేకు న్నను తిమ్మయ శుక్తిమతి విలాసవిభ్రమాదులను మానవ మాన సిక తత్త్వ వివరణాత్మకముగ వసుచరిత్ర కారునికి ప్రతిరూ పాంతరముగా చిత్రించినాడు[30].

---

28. చూ॥ ద్విపదభారతము, ఆదిపర్వము - 4 వ ఆశ్వా. పుటలు 198 - 204
29. చూ॥ ద్విపదభారతము, ఆదిపర్వము - 2 వ ఆశ్వా. పుటలు 126 - 127
30. చూ॥ ద్విపదభారతము, ఆదిపర్వము - 2 వ ఆశ్వా. పుటలు 101 - 102

తిమ్మయ తన ద్విపదభారతమున సర్వ ప్రబంధ సామాన్యములగు వర్ణనలను గ్రహించినాడు. తిమ్మయ ఈ ప్రబంధోచిత వర్ణనలు సహజత్వముతో నొప్పి ఇంపును పెంపును కూర్చు నట్టివి; లోకజ్ఞతను, మానవమానసిక స్వభావాదులను చక్కగా వ్యక్తీకరించునట్టివి; ద్విపద కవిత్వమునకు గల గౌరవమును. సౌకుమార్యమును, సహజత్వమును నినుమడింప జేయునట్టివి.

తిమ్మయ కవిత్వము జాతీయోక్తులతో నొప్పి పండిత పామర హృదయాకర్షముగ రచింపబడి, కొన్నిచోటుల నన్నయ తిక్కనల ప్రక్కకికూడ వన్నెబెట్ట చాలియుండును.

పాండవులు అజ్ఞాతవాసమున కుపక్రమించు సందర్భమున అంతవరకు తమతో కలసిమెలసి తమకష్టముల పంచుకొనిన బ్రాహ్మణబృందము దగ్గర సెలవు తీసికొను సందర్భము నందలి ద్విపద పంక్తులు :

"ఓమహాత్మకులార! యోపుణ్యులార!
ఓమహీసురులార! యుగ్రాటవులకు
మామీదఁ గృపగల్గి మముఁగూడివచ్చి
యలమి సేయగరాని యలజళ్లకోర్చి
కలసియుండితి రింతకాలంబు దనుక
నింక గోప్యములేల నేఁడాది మాకు
శంకింప నొకచోటి కరుగంగవలయు
రాయిడి పుట్టించి రారాజు మరల
కీయవస్థలు దెచ్చు టెఱుఁగరే మీరు ?
వాఁడింక నజ్ఞాతవాసంబు వలనఁ
బోడిమి మము రోయఁబుత్తెంచు జనుల
మీరు మేమొకచోట మెలఁగఁగాఁ జనదు

మీరింక మముఁబాసి మీతోవఁ జనుడు
ఏకాలమున మిమ్ము నెడసి పోనీక
చేకూఱఁ బరిచర్య సేయలేదయ్యె"

—ద్వి. భా. విరాటపర్వము. ప్రథమాశ్వాసము: పుటలు 2-3

ఈ సందర్భమున తిక్కన భారతమందలి విరాటపర్వములోని పద్యమిది:

సీ॥ తెల్లంబుగాదె మీకెల్ల సుయోధను
చేసిన కటిలవిచేష్టితంబు
లకట మాతో మీరు నడవుల నిడుములఁ
బొందితిరొక భంగిఁ బోయెగాల
మిది పదమూఁడగు నేడు మాకజ్ఞాత
వాసంబు సఱపంగ వలయునిందు
ధార్తరాష్ట్రులు సూతతనయ సౌబలులును
జెలుపనవేతురు చిన్నసన్న

ఆ॥ యెఱిఁగిరేని చాల నెగ్గువాటిల్లున
ట్లగుట మమ్మునింక నతిరహస్య
వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరి
యింపుఁడని యనుగ్రహింపవలయు

— తిక్కన భారతము. విరాటపర్వము. 1వ ఆశ్వా, ప. 47.
(వావిళ్ల ప్రతి)

మరొక ఉదాహరణము. అర్జునుడు ఉత్తర గోగ్రహణమునందు దేవదత్తమును పూరించి నప్పటి పరిణామ విశేషములివి:

తిమ్మయ ద్విపద రచన:

"ఆమహారవమున నంబోధిగలఁగె
హేమాద్రి శిఖరంబు లిటిటువడియె
అద్రిజ భీతిల్లి హరుఁ గౌగిలించె

నిద్రమేల్కని శౌరి నింగికైచూచె
బలభేది వెఱచి గీష్పతివంకఁ గాంచె
లలిఁబద్మభవుఁడు కాలము నెన్నఁజొచ్చె
ఉత్తరుండును మూర్ఛనొరగెను హరులుఁ
నెత్తిన లేవలేకిల మీఁదఁబడియె"

— ద్వి. భా. విరాటపర్వము. 4వ ఆశ్వా. పుట 220.

ఈ సందర్భమున తిక్కన పద్యరచన:

"కలగందోదధి సప్తకంబు గిరివర్గంబెల్ల నూటాడె సం
చలతంబొందె వసుంధరా వలయమాశాచక్ర మల్లాడెఁ గొం
దలమంచెందిరి దిగ్గజేంద్రులు పట్టణము పాతాళంబు ఘూర్ణిల్లెనా
కులమయ్యెన్ గ్రహతారకా కులముసంక్షోభించె నవ్వేధయున్"

— తిక్కన భారతము. విరాటపర్వము. 4వ ఆశ్వా. ప. 172.

పై ఉదాహరణములలో కవిత్వము, భావ ప్రపూర్ణత, శైలి, ఉక్తి వైచిత్రి - మున్నగు వానిని పరిశీలించిన, ద్విపద రచన పండిత పామరుల నాకర్షించును. తిక్కన రచన బుద్ధి గమ్యమై శిల్ప ప్రధానమై జనసామాన్యమున కందుబాటులో లేనట్లు కానవగును.

## శ్రేష్టలూరి వేంకటార్యుడు:

తెలుగున వెలసిన వేంకటాచలమాహాత్మ్య గ్రంథములలో శ్రేష్టలూరి వేంకటార్య రచితమగు 'శ్రీనివాస విలాససేవధి' యే మొట్టమొదటిది. వేంకటార్యుడు శ్రీనివాసవిలాస సేవధిని ఒక మహాకావ్యముగా, ప్రౌఢవర్ణనలతో, రస భావబంధురముగ ధారాళమైన శైలితో రూపొందించినాడు.

"ద్విపద లోపలకెల్లఁ దలివిడిగాన
ద్విపదఁ గాదెలుఁగునఁ దేట గావించు"

— అవతారిక. పుట 7.

మని కృతిభర్తయగు శ్రీనివాసుడు కలలో కవితో చెప్పినట. వేంకటార్యుడు తన కవిత్వ గుణముల నిట్లు తెల్పినాడు :

"ఘటియించి తగు నలంకారముల్ మెరయ
చటులార్థ కల్పనల్ శబ్ద సందర్భ
మెరపొంద మాధుర్య ముల్లసిల్లగను
వరుస పద్దెనిమిది వర్ణనల్ గులుక
నతుల శృంగార వీరాద్భుతరసము
లతిశయింపగ విభావాదిభావములు
భావుక భావసంభావ్యత నలర
గావించి పటు మహాకావ్య లక్షణము
వెలయ దెనుంగున ద్విపద కావ్యముగ
నల వేంకటాద్రి మాహాత్మ్యమింపొంద
శ్రీనివాస విలాస సేవధి యనగ
భూనుత విఖ్యాతి పొసగ సల్పెదను"

— అవతారిక పుట 7.

వేంకటేశ్వరస్వామి తిరునాళ్లు ముగిసిననాటి రాత్రివర్ణనము, మరునాటి సూర్యోదయ వర్ణనమును గమనింపుడు :

"ఆరేయి..............................
తిరునాళ్ళఁ గనుటఁ జెందిన ప్రసన్నతను
మురియుచు దిగ్వధూముఖ పాళిదనరె
పొడుపు గట్టను సౌధమును గయిసేయ
నిడిన దీపంబన నినుఁడుదయించె
తిరు వెంకటేశ్వరు తిరునాళ్ళకెనయ
నరుణమండల మను నందెచేఁబూర్వ

హారిదబ్జ ముఖి కుంకుమాసారములను
ధరణిజ విటపాళి దగుల వసంత
మొరపురం జెల్లెనా నురువనాగ్రముల
నెరయ కెంజాయల నీరెండయడరె

నరుణా తపద్యుతినందు కారాకు
తరుణపల్లవముగాఁ దలఁచి కోయిలలు
నొక్కి త్రుంచగలేక నుసివినం జూచి
పక్కున నగియె నాపద్మంబులలరె"

* * * *

— శ్రీనివాస విలాససేవధి. 2వ ఆశ్వా. పుట 167-168.

ఈ సూర్యోదయ వర్ణన కథా సందర్భముతో చక్కగా నతుకబడి భావనా చమత్కార ప్రధానమై ప్రబంధరీతికి లక్ష్యమగుచున్నది. పాత్రలయెడ ప్రకృతి సానుభూతి తెలుపుటను ఈవర్ణనలలో సూచితమైయున్నది. ఇట్లే ప్రథమాశ్వాసమున సముద్రవర్ణన, వైకుంఠపురవర్ణన, వేంకటాచలవర్ణన, ద్వితీయాశ్వాసమున గ్రీష్మాది ఋతువర్ణన, స్వయంవర్ణన, తృతీయాశ్వాసమున సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణన. జలకేళివర్ణన, అహల్యకై ఇంద్రునకును, పద్మావతికినై శ్రీనివాసునకు కలిగిన విరహవర్ణన — ఇత్యాది వర్ణనలు ఈ గ్రంథమున చక్కని భావములతో కథాగతికి సందర్భానుగుణముగ ప్రౌఢరీతిని సాగినవి.

చతుర్థాశ్వాసములో వేంకటగిరి పాపైకదాహకము అను అర్థమును వ్యక్తపరచుటకు మాధవ సోమయాజికథ తెలుపబడినది. మాధవసోమయాజికథ చాలావరకు కాశీఖండములోని గుణనిధి కథను, పాండురంగ మాహాత్మ్యములోని నిగమశర్మోపాఖ్యానమును బోలియున్నది.

వేంకటార్యుని యుద్ధవర్ణన చూడుడు:

"రథమును రథము సారథిని సారథియు
రథికుండు రథికుండు రౌతును రౌతు
తురగంబు తురగంబు దొరయును దొరయు
కరియును కరియు గింకరుడు గింకరుడు
నొండొంటి కైదువు లొరయుచు మెఱయ
మెండు భండన మంట మింట నచ్చరలు
తన వల్లభుడు వీఁడుఁ తన విటుడితఁడు
తన నాయకుడు వీడు తన పతి యితఁడు
తన భుజంగుడు వీఁడు తన విభుడితఁడు
తన పల్లవుఁడు వీఁడు తన ప్రియుఁడితడు
తన రమణుఁడు వీడు తన కాంతుఁడితఁడు
ననుచుఁ గోర్కొనుచు నయ్యని జూచుచుండ"

—శ్రీనివాసవిలాస సేవధి. 3వ ఆశ్వా. పుట 145.

ఇందు రచనాచమత్కృతి గోచరించును. ఈ యుద్ధవర్ణన నన్నెచోడుని కుమారసంభవము (11వ ఆశ్వాసము) నందలి యుద్ధవర్ణనను బోలియున్నది.

అలివేలు మంగమ్మ తన భర్తయగు శ్రీనివాసుని ద్వితీయ వివాహసందర్భమున అతనికి తలయంటిన విధమిది:

"కాంతుని కపుడ శింగారంబెసంగ
బంగారు గిన్నె సంపంగి నూనెఁదెచ్చి
మాంగల్య వాద్యముల్ మలసి మ్రోయంగఁ
దగిన పేరటాండ్రు ధవళముల్ బాడ
సుగుణకాముని సతుల్ సారిది సేసలిడ
పలుకుచుఁ దాని కుంకుమ గంధములను
నలుఁగులుఁ బెట్టి తిన్నఁగఁ దాళగతులఁ
గంకణంబులుఁ ఘల్లుఘల్లనఁ గాంచి
కింకిణుల్ మెరయుచు కెరలి నటింపఁ

జిగిపిఱుందున వేణి చిందులు ద్రొక్క
వగమీఁది హారముల్ వరుసనాడంగ
ముంగర ముత్యంబు మోవి నర్తింప
ముంగురులును ఫాలమునఁ దాండవింప
చిరుచెమటలు మేనఁ జెలువుఁ గుల్కంగ
హరువుగాఁ దలయంటె నద్భుతలీల"

— శ్రీనివాస విలాస సేవధి - 5వ ఆశ్వా. పుట 295-296.

ఇది సామాన్యస్త్రీలు చేయలేనిపని. అలిమేలు మంగమ్మ తన భర్త ద్వితీయ వివాహసందర్భమున అతనికి తలంటి సింగారించిన దని వర్ణించుటలో వేంకటార్యుడు మానవ మానసిక తత్త్వ వివరణదృష్టితో రచన సాగించలేదు. కేవలము రచనాశిల్పముతో శాబ్దిక చమత్కృతినే ఈ సన్నివేశమున పాటించి రచించినాడు. భావసృష్టి, అర్థదృష్టికంటెనుకూడ శబ్దపుష్టియే వేంకటార్యుని రచనలో ప్రాముఖ్యము పొందియుండుట గమనింపవచ్చును.

తిరునాళ్లకు నానాదేశములనుండివచ్చు జనసమూహమును, వారి భక్త్యుత్సాహములను, నడకతీరులను వేంకటార్యుడు ఇట్లు వర్ణించినాడు:

"చోళ ద్రమిళ పాండ్య సూరసేనాంధ్ర
మాళవ కర్ణాట మగధ సౌవీర
* * * *
నరవాహన తురంగ నాగ శతాంగ
* * * *
దగనధిరూఢులై దవ్వని సొలయ
కగణిత సంతోషమడరంగ మదిని
తడయ కెంతయు భక్తిఁ దగవచ్చువారు
కడువస్తువులు కానుకలు దెచ్చువారు

నడుగడుగు దండమటు బెట్టువారు
నెడపక తల బంగరిల గట్టువారు
నోటితాళములఁ బూనుక వచ్చువారు
వాటమై తాళముల్ వాయించువారు
చప్పిడి భుజియించి జరిగెడువారు
చప్పరంబుల పూని చనుదెంచువారు
తమ్మటంబులు బెట్టు దాటించువారు
ముమ్మరమ్ముగ వాద్యములు మ్రోయువారు
గోవింద బెట్టుచు గునుకువారలును
శీవిస్తోత్రములు పఠించువారలును
పటుమతి హరికథల్ బలుకువారలును
కథవిని హర్షించి కథ మెచ్చువారు
కథకునకు ధనంబు కరమిచ్చువారు
రథములపై తమ రమణులనుంచి
పథికులెడల బరాబరి సేయువారు

* * * *

గాముజగంబులఁగల జీవులెల్ల
స్వామికి గణుతియ్య చనుదెంచు పగిది
వేగజీవుల ధాత వెసనారుబోయ
లాగునవెందు తొలగ దొబ్బరాక
యరుదెంచి "

— శ్రీనివాసవిలాససేవధి. 3 వ ఆశ్వా. పుట 161-163.

ఈ తిరుపతి యాత్రీకుల సందడి నేడును ఇట్లే కలదు. ఈ వర్ణన పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణమునందు శ్రీ శైలమున కరుదెంచు 'పరుస జనుల' నడకల వర్ణనకు ప్రతిద్వంది గా నున్నది.

ఇట్లు వేంకటార్యుని ద్విపద రచన శబ్దపుష్టితో, ఆలంకారిక శైలితో, ప్రౌఢ ప్రబంధ వర్ణనలతో, నొప్పి తెలుగు దనమును కలిగి కావ్యలక్షణములను కల్గియున్నది. తెలుగులో

వేంకటాచల మాహాత్మ్య కథలన్నియు దీని తర్వాత వెలసినవే.

ఒక్కొక్క శతాబ్దములో వెలసిన ద్విపద రచయితలలో ప్రసిద్ధులు, ప్రౌఢకవులు అయిన వారి కవితాశిల్పమును గూర్చి ఈ ప్రకరణమున సోదాహరణముగ పరిశీలించితిమి. చంపూ కావ్యములను రచించిన ప్రౌఢకవుల కున్నంతటి ప్రతిభావ్యుత్ప త్తులుగల ద్విపద కవులును కొందరుకలరనుట అతిశయోక్తి కాదు. పాల్కురికి సోమనాథుడు, గోనబుద్ధ భూపతి, మడికి సింగన, గౌరన, చిన్నన్న, కట్టావరదరాజు – మున్నగువారు ఇందులకు దృష్టాంతములని ఈ ప్రకరణమున నిరూపింప బడినది. మొదట చంపూకావ్యములను రచించి తర్వాత ద్విపద రచనలను చేపట్టిన కవులు కొందరు కలరు. ఉదాహరణమునకు మడికి సింగన, శ్రీనాథుడు, పిడుపర్తి సోమన, దోనూరి కోనేరునాథుడు, కట్టా వరదరాజు–మున్నగువారు. అట్టి ఈ కవుల ప్రతిభా వ్యుత్పత్తులు కవితా శిల్పము ద్విపద రచనల మూలమున సంపూర్ణముగ వ్యక్తమగుచున్నదనియు తెలిసికొంటిమి. సంస్కృత రచనల కనువాదములగు చంపూకావ్యములలో తెలుగు కవులు సామా న్యముగ పాటించిన స్వతంత్రానువాద విధానమునే ద్విపద కవు లును తమ అనువాదములందు పాటించి యున్నారు. ఒక విధ ముగ అనువాద స్వాతంత్ర్యమును చంపూకవులకన్న ద్విపద కవులే ఎక్కువగ ప్రదర్శించి యున్నారనియు గ్రహించితిమి. కావ్యాలంకార శాస్త్ర నియమములను ద్విపద కవులును చంపూ కవులవలె పాటించియున్నారు. భాషాసాహిత్య మతములందు విప్లవ వాదియైన పాల్కురికి సోమనాథుడు సంస్కృతాలంకారి కుల నియమములను గుర్తించుటయే గాక మరికొన్నిటిని ఎక్కు వగ ఏర్పరచుకొని యుండుట గమనింప దగియున్నది.

వస్త్వైక్య విషయమున తెలుగు ప్రబంధములకు సాటియనదగు ద్విపద రచనలును కలవు. ఈ అంశమునకు హరిశ్చంద్రోపాఖ్యానము, నలచరిత్ర, సారంగధర చరిత్ర—మున్నగునవి దృష్టాంతము. పాత్రపోషణయందు ప్రబంధములలోని వైవిధ్యముద్విపదరచనలలో కానవగును. మరియు ద్విపద కావ్యములందు వివిధ వర్గములకు, వృత్తులకు, జాతులకు చెందిన పాత్రలు అతి సహజముగ చిత్రింపబడియున్నారు. రసదృష్టితో పరిశీలించిన చంపూకావ్యములలోగల వైవిధ్యము ద్విపద రచనలలోను కలదు. సుభద్రా కల్యాణము, అష్టమహిషీ కల్యాణము, ఉషాకల్యాణము, శశిరేఖా పరిణయము, గంగా వివాహము—మున్నగు ద్విపద కల్యాణప్రబంధములందు శృంగారము ప్రధాన రసమనియు, గ్రహించితిమి. వీరరస ప్రధానములగు ద్విపద రచనలు — పల్నాటి వీరచరిత్ర, ఖేతాళచరిత్ర, సౌగంధిక ప్రసవాప హరణము—మున్నగునవి. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము సత్యవీర ప్రధాన రచన. సారంగధర చరిత్ర, నలచరిత్ర, పురూరవోపాఖ్యానము — మున్నగునవి కరుణరస ప్రధానములైన ద్విపద రచనలు. ధర్మాంగద చరిత్ర అద్భుత రసమంగి. శాంతరస ప్రధానమైన ద్విపద రచనకు 'కపోత వాక్యము'ను పేర్కొన వచ్చును. హాస్య, బీభత్స, భయానకాది రసములు ద్విపద కావ్యములలో సందర్భోచితముగ అంగ రసములుగ పోషింపబడియున్నవి. భక్తిని కావ్యరసముగ నిరూపింప దలచుకొనిన తెలుగు చంపూకావ్యములకన్న బసవపురాణము, శృంగారమంజరి, చక్రవాళమంజరి, పరమయోగి విలాసము, విష్ణుభక్త చరిత్రము, భల్లాణ చరిత్ర, సిరియాళచరిత్ర—మున్నగు ద్విపద రచనలు ఎక్కువగ నుపకరించును. యమ

కాను ప్రాసాది శబ్దాలంకారములు, శ్లేషాది అర్థాలంకారముల రచనలందును ద్విపద రచయితలు చంపూ కవులవలె అభిమానమును చూపియున్నారు. (చూ॥ పరమయోగివిలాసము, కట్టా వరదరాజ రామాయణము మొదలగునవి). అష్టాదశ వర్ణన నియమమును ప్రబంధ కవులవలె ద్విపదకవులు పాటింపక పోయినను, అట్టివర్ణనలు సందర్భోచితముగ ద్విపద కవులుకూడ తమ రచనలందు కావించి యున్నారనియు ఈ ప్రకరణమున గ్రహించితిమి. ద్విపద కావ్యముల కొన్నిటికి కవితాశిల్ప విషయకముగ ఇట్టిబహుముఖ ప్రాధాన్యముండుట వలననే తర్వాతికవులు కొందరు వానిని పద్యకావ్యములుగ పరివర్తనము గావించి యున్నారు. పద్య పరివర్తనములు పొందిన ద్విపద రచనలను గూర్చి ఆరవప్రకరణమున పరిశీలింతము.



# ఆరవ ప్రకరణము

## ద్విపద రచనలు - పరివర్తనములు:

ప్రాచీనాంధ్ర సాహిత్యమున వెలసిన కావ్యప్రబంధాది చంపూరచనలు సామాన్యముగ సంస్కృత రచనలకు అనువాదములో లేక అనుసరణములో. తెలుగునుండి అన్యభాషలలోనికి అనువదితములయిన చంపూరచనలు ఒకటిరెండుకన్న ఎక్కువ లేవు. ద్విపదప్రక్రియలో స్వతంత్రములు, అనువాదములు కానివి అనదగిన రచనలు కొన్నికలవు. తెలుగు ద్విపదరచనలుకొన్ని ఇతర భాషలలోనికి భాషాంతరీకరణములు పొందియుండుటయు వాని గుణాతిశయమునకొక తార్కాణము. అట్టి రచనలు,

1. బసవపురాణము :సంస్కృతానువాదము – 'బసవేశ విజయము' – కర్త: శంకరారాధ్యులు.

కర్ణాట భాషానువాదములు .

(1) కన్నడ బసవపురాణము – కర్త. భీమకవి (1369) భీమకవి తనగ్రంథమునకు తెలుగు బసవపురాణమే మూలమని గ్రంథావతారికలో తెల్పినాడు. భామినీషట్పదులలో ఈ బసవ పురాణము రచిత మయినది.

(2) మహాబసవరాజ చరితము లేక సింగిరాజపురాణము దీని కర్త. సింగిరాజు (1500)

(3) బసవరాజ విజయము (వృషభేంద్ర విజయము)–ఈ చంపూకావ్యకర్త – షడక్షరకవి (1655).

తమిళబసవపురాణము:– 'గురుబసవా' అండ్ కంపెని లిమిటెడ్, చెన్నపురి. ప్రమోదూత సంవత్సర మకరమాస మందు ప్రకటితము. (1931 జనవరి) ఈతమిళబసవపురాణ గ్రంథ రచయితనుగూర్చిన వివరములు తెలియవు. ఇది శ్రీ నాగిశెట్టి గారి విపులవ్యాఖ్యతో ప్రకటితమైనది. తమిళ బసవపురాణమున తెలుగు ద్విపద బసవపురాణ కర్తయగు పాల్కురికి సోమనాథుడు, కన్నడ బసవపురాణ కర్తయగు భీమకవి బహుధా ప్రశంసింప బడినారు.

2. పండితారాధ్య చరిత్ర:

సంస్కృతాను వాదము – కర్త. గురురాజకవి (1430)

కర్ణాట భాషాను వాదములు:

(1) ఆరాధ్య చరిత్రము:

కర్త. నీలకంఠాచార్యుడు (1485)

(2) గురుభక్తి ఆండారు చరిత్ర:

కర్త. వ్రాసభూషణ పెమ్మిశెట్టి (1650)

3. చోక్కనాథ చరిత్రము:

సంస్కృతానువాదము:– శివలీలార్ణవము.

(22 సర్గలు) – నీలకంఠదీక్షితకవి.

4. రంగనాథ రామాయణము – ఇటీవల హిందీలోనికి పరివర్తితమైనదని తెలియుచున్నది.

తెలుగు చంపూకావ్యములు ఒకటిరెండు ద్విపదలోనికి పరివర్తితములయినవి. (ద్విపదభారతము, ద్విపదబాలభాగవతము మొదలగునవి.) ఇట్టి ద్విపద పరివర్తనములకన్న ద్విపదరచనలు

ఎక్కువగ చంపూరూపమున పరివర్తితములై యున్నవి. ఇట్టిపద్య రూప పరివర్తనములివి: (1) బసవపురాణము, (2) పండితారాధ్య చరిత్ర, (3) హరిశ్చంద్రోపాఖ్యానము, (4) ప్రభులింగ లీలలు, (5) పరమయోగి విలాసము, (6) కృష్ణార్జున సంవాదము.

ద్విపద కావ్యములుగ వీనికి మొదటకలిగిన ప్రచార ప్రఖ్యాతులే తర్వాతి కాలమున పద్యపరివర్తనములకు దోహదము కల్గించియుండును. పై ద్విపదరచనలకు వాని పద్యరూప పరివర్తనములకు రచనా విషయమునగల భేదసాదృశ్యములను ఈ ప్రకరణమున పరిశీలింతము.

### పండితారాధ్యచరిత్ర - పరివర్తనములు.

(1) సోమనాథుని ద్విపద పండితారాధ్యచరిత్రను శ్రీనాథుడు పద్యరూపమున పరివర్తింపజేసెను.

"జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థ సార సంగ్రహ
మగునా యారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్."

— శృంగార నైషధము—అవతారిక. పుట 5. ప, 14.

కాని గ్రంథము నేడు కానరాదు.

(2) ద్విపద పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణమును 'శ్రీశైలఖండము'ను 6 ఆశ్వాసముల పద్యకావ్యముగ నాగులూటి శేషనాథుడు (16వ శతాబ్దికి పూర్వపువాడు) రచించినాడు[1]. ఇందు పర్వత ప్రకరణములోని ద్విపదభావములన్నియు పద్యరూపము దాల్చినవి.

---

(1) చూ॥ 'ప్రాచీనాంధ్ర కవులు' - నాగులూటి శేషనాథుడు - నిడుదవోలు వెంకటరావు. భారతి సంపుటి - 15. సంచిక 1.

బసవపురాణము — పరివర్తనములు :

పాల్కురికి సోమనాథునికి ఆరుతరముల తరువాతివాడును, అతని శిష్యపరంపరలోని వాడును, వీరశైవ మతాభిమానియు నగు పిడుపర్తి సోమన ద్విపద బసవపురాణమును పద్యరూపమున పరివర్తించియున్నాడు. పద్య బసవపురాణము సోమనాథుని ద్విపద బసవపురాణమునకు యథానువాద మనదగినరచన. మూలమునందలి విషయము, భావము, వర్ణనలు, పలుకుబడులు, సామెతలు, జాతీయములు—వీనిలో దేనినిగాని జారవిడువకుండ సంగ్రహముగా పద్యకావ్యమును పిడుపర్తి సోమన తీర్చిదిద్దినాడు. అనేక ద్విపదలను ఆయాభాగములందలి పద్యములలో నిమిడ్చికూడ రచించియున్నాడు. ఇది ద్విపదబసవపురాణ పఠనావసరమున కలుగుసందేహములకు నివృత్తిసాధనము. ఇది సంగ్రహముగా నున్నను మూలమునకు వ్యాఖ్యానమువంటిది. పాల్కురికి సోమనాథుని గ్రంథములను వ్యాప్తిలోనికి తెచ్చుట, వీరశైవ మతమును ప్రచారముచేయుట — అను విషయములే పిడుపర్తి సోమనాథుని రచనకు ప్రధాన కారణములు :

"సోముఁడేమి చెప్పె సోమేశు ద్విపదలే
పెట్టి పద్యములుగఁ బెనఁచెనంచు
నన్యు లనగ వలదు నాయయ్య శిష్యులి
మగుట మనకుఁ జెల్లు నవియు నిలుప."

— పద్య బసవపురాణము—అవతారిక. పద్యము 17.

* * * * *

నీవును సోమేశుని ద్విప
దావళి యర్థములు చేయు మందుల యర్థం
బావంతయు దిగ వీడక
యేవియు మున్నందు లేని విడక కుమారా !"

అని తనతండ్రి కోరికప్రకారము పిడుపర్తి సోమన పాల్కురికి సోమనాథుని కంకితముగా, అతని పల్కులనే పద్యరూపమున పల్కినాడు. మూలరచయితయెడగల భక్తిగౌరవములే పిడుపర్తి సోమన రచనలో అంతటి సంపూర్ణానుకరణము సిద్ధించి యుండుటకు హేతువు.

పాల్కురికి సోమనాథుని ద్విపదలను యథాతథముగ పిడుపర్తి సోమన పద్యములలో కూర్చినాడు. ఇద్దరి రచనలను పరిశీలించిన ఈ విషయము స్పష్టమగును.

పాల్కురికి సోమనాథుని బసవపురాణములో, బసవని చూచుటకు పురస్త్రీలు వచ్చినప్పటి రచన మానవప్రకృతి వర్ణనమున కనువుగ స్వభావసుందరముగ, జాతీయోక్తులతో మనోహరమైనది. ఈ ద్విపదలందలి జాతీయములను దిద్ద మనసొప్పక వృత్తముల కొదగక కాబోలు ఈపట్టునట్లే పిడుపర్తి సోమన ద్విపదనుబోలిన 'రగడ'గా మార్చుకొని మూలములోని మాధుర్యమును, సొగసును సంరక్షించినాడు. వీని కుదాహరణము లీ క్రిందివి:

పాల్కురికి సోమనాథుని ద్విపద రచన

'చూడఁగ వచ్చెద సుదతి! నే' ననుచు
'వేడుక చెలిపక వేగర' మ్మనుచు
'గాలి దొసగు గాక! క్రమ్మఱు' మనుచు
'నేలమ్మ! వచ్చిన నేమిసీ' కనుచు
'నీకాళ్ళ నడచెద నేకాంత!' యనుచు
'బతిగన్న సైఁచునే పఁడతి! ని' న్ననుచుఁ
'బతిగని యెల్లైనఁ బదర ని' మ్మనుచు
'బసవన్నఁ జూడక పడఁతి! పో' ననుచు
'ముసుఁగిడి వేగరాముడియక' యనుచు

'దోఁకొని పోయిన దోసమే' యనుచు
'మూక లోనికిఁ బోవ ముగవీ' వనుచు
'దిక్కులు చూడక చక్కధ్రర' మ్మనుచు
'నెక్కడి తెరువమ్మ! యింతి! నీ' కనుచు
'మానిని! బసవన్న మహిమ యి' దనుచు
'మానుగా భక్తుల మఱచూత' మనుచు
'నిట్టి సందడి గలదే యెందు' ననుచుఁ
'దట్టాడ కిటువేగ తరుణి! ర' మ్మనుచుఁ
'గంటివే బసవయ్యఁ గమలాయతాక్షి!'
'గంటినే మోక్షంబుఁ గంటిఁగా' కనుచు
'జూచితే! పోదమా సుకుమారి!' యనుచుఁ
'జూచుచుండఁగఁ బోవసాగయునే' యనుచు
......................................"

— చూ॥ ద్వి. బ. పు. 2వ ఆశ్వా. పుటలు 64-65.

పిడుపర్తి సోమన పద్యబసవపురాణములోని రగడ రచన:

"వేడుకఁ జెలఁపక విసవిస నన్నిటఁ
గూడఁగ రమ్మా కొమ్మరో పిమ్మటఁ
గాలిదోసఁగు గా కమరల నేనని
నేలదోసఁగు నేనే వచ్చిన నన
నెవ్వరు రాకుండేఁ జనియెద దన
నవ్వని వెంటన నడిచెద నే నన
నేకత మొకతెవు నేఁగుము దీవన
నీకాళ్ళనె నేనిదొ నడచెద ననఁ
బతి గన్నను నినుఁ బఱపడె యనవుడు
బతి బఱచిన గతిఁ బడియెద నిప్పుడు
బసవనిఁ జూడక పడతిరో పో ననఁ
దోఁకొని పోయిన దోసమె యనుచును
బోకుము కలకయి పొలతిరో యనుచును

దిక్కులు చూడక తెలవ రమ్మనుచు
నెక్కడ రవమే యింతి నీకనుచు
వీఁడే బసవఁడు వెలఁదిరో యనుచును
వాఁడె చూడు కులవర్ధనుడంచును
నిత్తరి సందడి యెందుకు బడనుచుఁ
దత్తర పడకవె తరుణి రమ్మనుచుఁ
గంటివె బసవుని గమలాక్షీయన
గంటినె మోక్షము గంటిగా కనుచు!
జూచితిఁ గద పద సుదతి యటన్నను
జూచిచూచి పో సుందరి యనుచును
.................................."

— చూ॥ 2వ ఆశ్వా. పుట 45-46. ప. 17

ద్విపద బసవ పురాణమున చివర 'బోయలకథ'లో, బోయల అభియోగముపై బసవన కాలకూటమునువండి భక్తుల కందరకును వడ్డించును. భక్తులందరును దానిని పాయసమువలె త్రాగి సుఖింతురు. ఈ సందర్భమున పాల్కురికి సోమనాథుడు అపూర్వముగా ఎన్నోరీతులుగ వడ్డించుటను విపులముగా 64 ద్విపదపంక్తులలో తెలుగు పలుకుబడులు, తెలుగు జాతీయత ప్రతిబింబితమగునట్లు వర్ణించియున్నాడు.

(చూ॥ బ. పు. 7వ ఆశ్వా. పుటలు 552-555.)

సోమనాథుని ద్విపదరచన:

"తమ్మయ్య కడుపారఁ దడవకు మనుచు
నిమ్మాటికిని మిక్కిలింకఁడే ననుచు
నోయన సడలింపు మెడ్డాణ మనుచు
నీయాన నాపొట్ట నిండెరా యనుచుఁ
గడుపు దిగ్గడిని నీల్గకుము నీవనుచుఁ

గడుపు వెర్గినఁ దెత్తుగా కేమి యనుచు
నయ్యకుఁ దల మున్కలయ్యెఁ బొమ్మనుచు
నియ్యయ్య కింతటి నేమయ్యె ననుచు
నిది పెద్ద గాదువో యీయయ్య కనుచు
వదలింపు కట్టిన వలువ నీ వనుచుఁ

* * *

దల యూఁపులకు రాకు తండ్రి! నీవనుచు
వలె నటె మాతోడ వాగ్వాద మనుచుఁ
గడుపుదామా యయ్య వడసెరా యనుచు
బడుగు మాట లవేల బంతిలో ననుచు

* * * *

నోయయ్య తెత్తునా నొక్కింత యనుచు
నాయయ్య చాలురా నాకింక ననుచుఁ
ద్రేన్పక పోదునే దేవ! యేననుచుఁ
ద్రేన్పగ నైనను దెలిపి లేదనుచుఁ
బళ్లెరంబలుఁగులు వాఱెరా యనుచుఁ
బెల్లు వడ్డించితి వ్రేలెదమనుచు
నొలుకఁ బోయకు మఱి యోయయ్య! యనుచు

* * *

జుఱ్ఱుజుఱ్ఱునఁ గొని సాగయుచు గఱ్ఱు
గుఱ్ఱునఁ ద్రేన్చుచుఁ గాళ్లు సాఁచుచును
నిక్కుచు నీల్గుచు నక్కిలింపుచును
జొక్కుచు సోలుచుఁ జక్కిలింపుచును
నక్కిలి పడి ఱెప్పలల్ల మోడ్చుచును
గుక్కిళ్లు మ్రింగుచుఁ గుత్తుక బంటిఁ
గ్రోలుచు నలరుచుఁ గ్రాలుచు నాత్మ
సోలుచు సుఖవార్ధిఁ దేలుచు వేడ్క
వ్రాలుచు మెఱయుచు వక్షంబులందు
నోలిఁబళ్లెరము దిక్కయ్యన మరలి

చూచుచు నించుకించుక పుచ్చికొనుచు
లేచుచుఁ జెలఁగుచు లీలఁదలిర్ప
నాడుచుఁ గప్పెరలఱచేత నొలయఁ
బాడుచు నుఱుకుచుఁ బరువువెట్టుచును
* * * *
లొండొరు లొడియుచు నుబ్బియార్చుచును''

ఈ ద్విపద పలుకులనల్లే పిడుపర్తిసోమన తన పద్యబసవ పురాణములో ద్విపదరూపాంతరమనదగు రగడగా మలచుకొని చక్కగా 56 పంక్తులలో ననువదించియున్నాడు. (చూ॥ పద్య. బ. పు. 7వ ఆశ్వా, పుటలు 336-338. ప. 267).

పిడుపర్తిసోమన రగడ రచన :

''ధర్మయ చాలిక దలుముకు మనుచును
కర్మములకుఁ గాని కదే యనుచును
మెల్లన నడలుపు మేడెబనుచును
గొల్లగ నిప్పుడు కుందుకో కనుచుఁ
గడుపు పెరుఁగు నీల్లకు మీదనుచును
గడుపు పెరిగినను గఱవే యనుచును
అయ్యకుఁ దలమును కెయ్యఁ బొమ్మనుచు
నియ్యవె యింక నేమయ్యె ననుచును
నిదియెక్కడుగాఁ దీయకనుచును
మానుడు సరసము మాతో ననుచును
* * * *
బెల్లుగ నిండెను బ్రేలెదవనుచు
నొలుకకు మొలుకకు మోయయ్య యనుచు
నొలికిన బసవనికుండుఁగా కనుచుఁ
* * * *
జాఱువారిని గని జాఱిచూపుచును
గఱునఁ దేర్చిపుచుఁ గాళ్ళ చూఁపుచును

నిక్కుచు నీల్గుచు నక్కిలింపుచును
బొక్కుచుఁ బొలుచుచుఁ బుక్కిలింపుచును
రెక్కించుక కనురెప్పలు మూయుచు
గ్రక్కనఁ మింగుచు గంతులు వేయుచు

* * * *

నోసపరి నుబ్బగనోయని యార్చుచు
నసమ శరారి మహత్త్వము దీర్చుచు"

నాట్యనిమిత్తండికథలో శివుడు తాండవనృత్యము చేయు నప్పటి యాకృతిని సోమనాథుడు, వర్ణితవస్తువును కనులయెదుట సాక్షాత్కరించునట్లు ద్విపదలలో వర్ణించినాడు:

"నొందంగఁ బాదాగ్రమూఁది నటింపఁ
గ్రిందటి కూర్మంబు గిజిగిజి గాఁగ
మహిత జటాచ్ఛటావిహతి నజాండ
బహుల కటాహంబు వటియలు గాఁగ
సురకిరీట విఘాతనోద్వృత్తిఁ జేసి
పారిఁదత్త్వ సందోహములు వెల్లగిలఁగఁ
దాండవోద్ధతిఁ జేసి ధరియింపఁబడిన
దండిఫణీంద్రుండు దలరిరోఁజంగ
నిటురోఁజుచున్న ఫణీంద్రు నూర్పులకు
స్ఫుటఫాలనేత్రాగ్ని భుగులన నెగయ
వడిసెగసెడి నేత్రవహ్ని రోచులకు
జడలపైఁ జంద్రుఁ డాసగమును గరఁగఁ
గలయ సుధా నూతి గరఁగిన కతన
బలువడి నమృతంబు దలడిగి పటువఁ"

—ద్వి. బ. పు. శివ ఆశ్వా. పుటలు 178–179.

ఈ సందర్భమున పిడుపర్తి సోమనాథుని పద్యానువాదమును పరికింపుడు :

"పాండుగఁ బ్రమదం బూఁదినఁ
గ్రింద జరత్కచ్ఛపంబు గిజగిజలాడన్
గ్రందు గజటపటు హతినర
వింద భవాండంబు సత్వవిసరముదుగ్రింగన్
వడినాడన్ భూషణఫణి
కడురోఁజన్నేత్రవహ్ని కనల జడలపై
ముడిచిన క్రొన్నెల కరఁగినఁ
దడయక యయ్యమృతధార తలఁదగ బాఱన్

— పద్య. బ. పు. 3వ ఆశ్వా. పుట 113. ప.241; 242.

ఇట్లే పిడుపర్తిసోమన పద్యబసవపురాణమంతయు పాల్కురికి సోమనాథుని ద్విపద బసవపురాణమునకు యథానువాదమని చూపింపవచ్చును. ఇందు ప్రతిపద్యానువాదము, ప్రతిపాదానువాదము మాత్రమేగాక ప్రత్యక్షరానువాదముకూడ కొన్నిచోట్ల వెలసినది. దీనిని 'మక్కికిమక్కి'అని వ్యవహరింతురు. ఇందు కవి బ్రదుకు చాల అస్వతంత్రము. పిడుపర్తి సోమన మూలగ్రంథకర్తయగు పాల్కురికి సోమనాథునికి పదదాసుడు. అతని యడుగులనే నడుచును. అతడుచూచినట్లే చూచును. అతడు పల్కినట్లే పల్కును. ఇందు అతి విధేయతవలన మాటకు మాటకు పేర్చుటమాత్రము జరిగినది కాని అదిసుందరమైన రచనగా రూపొందలేదు.

పాల్కురికి సోమనాథుని ద్విపదబసవపురాణమునే మూల విధేయముగ ఏడాశ్వాసముల పద్యకావ్యముగ వెలయించిన మరొకకవి మహాదేవకవి. ఇతడు పదునెనిమిదవ శతాబ్దాంతమున పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున నుండినవాడు. మహాదేవ

కవి పద్యబసవపురాణము అముద్రితము. (చూ॥ ఆర్. నెం. 359 ప్రా. భా. మద్రాసు). ఇది వస్తువిషయమునను, కథాక్రమ విషయమునను, ద్విపద బసవపురాణము ననుసరించినది. అడయారు దివ్యజ్ఞాన సమాజమువారి పుస్తక భాండాగారమున నీ కావ్యమునకు సంపూర్ణ తాళపత్రప్రతి (32. బి. 14) కలదు. మహాదేవకవి కవితావిషయమున పిడుపర్తి సోమనాథునివలెగాక, తనఅసమాన పాండిత్యమును, కవితానైపుణ్యమును, ప్రదర్శించి సమగ్రముగా పద్యబసవపురాణమును రచించినాడు. మహాదేవ కవి పిడుపర్తి సోమనాథుని రచనమును పేర్కొనలేదు. అతడు సోమనాథుని గ్రంథమునే తు. చ. తప్పక అనుసరించినట్లు తెలియుచున్నది. మహాదేవకవి పద్య బసవపురాణావతారికలో నిట్లు కలదు.

"సొరిది పాలకురికి సోమనారాధ్యాఖి,
దాన వీరశైవధనుడు మున్ను
ద్విపదకావ్యముగను దెనుఁగున రచియించె,
బసవసత్పురాణమసదృశముగ"
ఈబసవేశు చరిత్రము
నాబుద్ధిప్రేరక త్రినయన కృపాదృ
ష్టాబద్ధవాక్య సరణిని
నేబాగుగఁ బద్య కావ్యనిర్మితి సేతున్"

— ప. 85; 86.

మహాదేవకవి రచన ప్రౌఢమన దగినది. చతుర్విధ కవిత లల్లగలనేర్పు తనకు కలదనియు నాతడు చాటి యున్నాడు.

పాల్కురికి సోమనాథుని బసవపురాణము నాధారముగ చేసికొని 'బసవవిజయము'ను పేర ద్విపదలో నాగనారాధ్యుడు

రచించెను. ఈ ద్విపదగ్రంథము ననుసరించియే తుమ్మలపల్లి నాగభూషణకవి పద్యబసవ విజయమును' (ఆర్. నెం. 316 ప్రా. భా. మద్రాసు) రచించెను: ఈ బసవవిజయములు రెండును బసవనచరిత్రలో నేవో కొన్ని ఘట్టములను వర్ణించినవేకాని పాల్కురికి సోమనాథుని ద్విపద గ్రంథము ననుసరించి, పిడుపర్తి సోమనాథకవి, మహాదేవకవి గ్రంథములవలెసమగ్రముగా రచింపబడినవి కావు.

పాల్కురికి సోమనాథుని ద్విపదరచనలకు తర్వాతి కవులు పద్యానువాదములు గావించి యుండుట అతని ద్విపద రచనలకు తెలుగు సాహిత్యమున గల విశిష్టతయే ప్రధాన కారణము.

## ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానము - పరివర్తనములు.

తెలుగు కవులను మిక్కిలి ఆకర్షించిన రసవంతములగు కథలలో హరిశ్చంద్రోపాఖ్యానమొకటి. తెలుగులో గౌరనద్విపద హరిశ్చంద్రోపాఖ్యానమే మొదటిది. తెలుగులోని తక్కిన అన్ని సాహిత్య ప్రక్రియలలోని హరిశ్చంద్రోపాఖ్యాన కథలకిదియే మూలము. కథావస్తువులోని రామణీయకము, దానిని నేర్పుతో తీర్చిదిద్దిన గౌరన చాతుర్యము – తర్వాతి తెలుగు కవుల నాకర్షించినవి.

కొంచె మించుమించు ఒకేకాలమందుండిన (1550-1600) శంకరకవి, శరభకవి, మల్లారెడ్డి, రామరాజభూషణుడు – అను కవులు గౌరన ద్విపద హరిశ్చంద్రకథను గైకొని స్వీయకావ్యములను రచించియున్నారు. వీరిలో శంకరకవి, శరభకవి రచనలు మాత్రమే గౌరన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానమునకు ప్రత్యక్ష పరివర్తనము లనదగిన రచనలు.

హరిశ్చంద్రకథను పద్యకావ్యముగ రచించినవారిలో ప్రథముడు శంకరకవి. అతని హరిశ్చంద్రోపాఖ్యానము ముద్రితము[2]. అయిదాశ్వాసములు గలది. హరిశ్చంద్రోపాఖ్యానములలో గౌరనకృతి తర్వాత ఇతనికావ్యమే రసవంతమై విపులప్రచారము నొందియున్నది.

గౌరన హరిశ్చంద్రలో పూర్వోత్తర భాగములుకలసి మొత్తము 2736 ద్విపదలుకలవు. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమందలి గద్యపద్యములసంఖ్య 1037. శంకరకవి గౌరన హరిశ్చంద్ర ద్విపదననుకరించి రచించినను, అతని హరిశ్చంద్రోపాఖ్యానమునందు కొలదిమార్పులు లేకపోలేదు.

నక్షత్రకుడు లక్షమాడలు లంచముతీసికొని చంద్రమతితో కూడ లోహితాస్యుని కాలకౌశికున కీయవలెనని తీర్పుచెప్పినట్లు గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమునందు కలదు[3]. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమున నక్షత్రకుడు లంచము తీసికొనకుండగనే, తీర్పుచెప్పెదనని పిలువని పేరంటముగావచ్చి, ముందుగా పుత్రునికి విలువ చెప్పలేదు గనుక తల్లి వెంట పంపవలయునని చెప్పెను[4].

గౌరన కృతిలో హరిశ్చంద్రుడు, చంద్రమతిని నరుకబోవుచుండ విశ్వామిత్రుడువచ్చియు వారింపలేక,

"బొంకించునాసలఁ బోవిడి మాని
బొంకంబుచెడి తలపోయుచు నుండ"

—ద్వి. హరిశ్చ. ద్వి. భా. పుట 456. ద్వి. పం. 2588-89.

అని కలదు.

---

2. హరిశ్చంద్రోపాఖ్యానము - శంకరకవి.
కొండపల్లి వీరవెంకయ్య, కాకినాడ ముద్రాక్షరశాల, 1930.

3. గౌరనహరిశ్చంద్రద్విపద- ద్వితీయభాగము, పుట 308 ద్వి.పం. 774-775

4. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము- 4వ ఆశ్వా. పుట 88 ప. 136; 138

ఈ సందర్భమున శంకరకవి పద్యగ్రంథమునందు విశ్వామిత్రుడు "హరిశ్చంద్ర నరేంద్రుని నిత్యసత్య ప్రభావంబునకు నత్యాశ్చర్యంబునునొంది మృషావాదింజేయుదునను తలంపును ద్రించి తపోవనంబునకుంజనియె[5]". మరల నతడు శంకరుడు ప్రత్యక్షమైన తర్వాతనే హరిశ్చంద్రుని కడకువచ్చెను.

పై రెండు చిన్నమార్పులుతప్ప మిగిలిన కథానిర్వహణలో శంకరకవి గౌరననే ననుసరించినాడు.

శంకరకవి గౌరన ద్విపదకావ్యమును ముందుంచుకొని కొలది మార్పులతో గద్య పద్యాత్మకముగమార్చి రచించినాడా? అనిపించును. మూలములోని భావనలే, పల్కులే అడుగడుగునను శంకరకవి గ్రంథములో కనపడుచుండును. రెండుగ్రంథములలోని సమాన ఘట్టములను పరిశీలించిన ఈ విషయము ప్రస్ఫుటమగును.

గౌరన ద్విపద పంక్తులివి:

"దారితప్పెనో, కాక ధవళాక్షికిప్పు
డీరీతి కౌశికు నింద్రజాలంబొ
వా తప్పితినొ చేతివడి దప్పచనెనొ
చూత మీతోయ మీచోద్య మీలీల
నసివోవవచ్చు నా యసివోక యనుచు
వెసఁబూన్చి మఱియును వ్రేయఁ జూచుటయు"

— ద్వి. భా. పుట 457. ద్వి. పం. 2604-2609.

ఈ సందర్భమునందలి శంకరకవి పద్యములు మూలము ననుకరించిన తీరును గమనింపుడు :

---

5. శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము - 5వ అశ్వా. పుట 119. ప. 166.

"దారితప్పెనో గంటి యీ తమ్మికంటి
శీలమెట్టిదో కాక కౌశిక మునీంద్రు
జాలమో మదుభజాళక్తి దూలి చనెనో
పొంగి యింకొక్కమాటు ప్రేయంగ వలయు.
అసిపోవగ వచ్చునె నా
యసిపోవకయంచు మిగుల నాగ్రహ లీలం
గొసరక మఱియును హుమ్మని
యసమగతింబూని ప్రేయు నా సమయమునన్"

— పంచమాశ్వాసము. పుట 119. ప. 168; 169.

గౌరన ద్విపద రచన:

"తలపోయ నొకపాద తలమన నేల
కలయంగ నిఖిలాంగ కంబులు నొచ్చె
— ప్ర, భా. పుట 118; ద్వి. పం. 1094-95.

ఈ ద్విపదలకు శంకరకవి పద్యానువాదమిది:

"ఒకపాక మనగ నేటికి
సకలాంగంబులును నొచ్చె......"

— ద్వితీయాశ్వాసము పుట 46. ప. 148.

ఇంద్రసభలో వసిష్ఠునెదిరించి విశ్వామిత్రుడు మాట్లాడిన సందర్భమున - గౌరన ఇట్లువర్ణించినాడు:

"అక్కజంబుగ నబ్ధి నాపోశనముగ
గ్రుక్కగొన్నట్టి యా కుంభజుఁ డుండఁ
బన్నగ ధరున కేర్పడ నటికాలఁ
గన్నుఁ జూపినయట్టి గౌతముఁ డుండ
నలిన నాభుని జగన్నాథు మునందు
నలిగి తన్నిన యట్టి యా భృగుఁడుండ

దృష్టించి బ్రహ్మాది దేవత లెఱుఁగ
సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసినయట్టి
యేనుండఁ దక్కన యీ మునులుండఁ
బూని నీ వెంతయుఁ బ్రోడయ పోలె
నాకేశు తోడ ముచ్చాడి పల్కితివి,''

- ప్ర. భా. పుట 33-34; ద్వి. పం. 207-218.

దీనిని శంకరకవి అనుకరించిన విధమిట్టిది :

సీ॥ ''ఎవ్వాఁడు వింధ్యాచలేంద్రంబు గర్వంబు
సర్వంబు నడచె నిర్జరులు మెచ్చ
నెవ్వాడు సక్రోధ హేతువీక్షణ నింద్రు
నొడలెల్ల గన్నులై యుండఁ జేసె
నెవ్వాఁడు వేదంబు లేర్పాటు గావించి
యన్నియుఁ గ్రమమొప్ప నచ్చు కట్టె
నెవ్వాఁడు హైమవతీశుతో నెదిరించి
గర్వించి యలుకాలఁ గన్నుఁ జూపె
నట్టి కుంభజ గౌతమ వ్యాస భృగువు
లుండ బ్రహ్మీభవించి యఖండ గరిమఁ
దనకు నేనుండ వెండియుఁ దక్కనట్టి
యమ్మునీశ్వరులుండ నీకేల పెనఁగ.''

—ప్రథమాశ్వాసము. పుట 20 ప. 83.

**మాయాకురంగము** హరిశ్చంద్రు నెలయించు సందర్భమున గౌరన ద్విపద రచన:

''బెదరి పట్టీక తప్పించి బిట్టెగసి
చెరలాడు జిఱుకొట్టు చెలఁగి పేరంబుఁ
దిరుగుఁ బర్విడుఁ దీఁగె దీసిన రీతి

గిరగిర మైఁ ద్రిప్పఁ గెరలు నల్లడల
ఖురముల నాదలఁ గోఁకి కేడించు
బరుల తీటకుఁ దరు పంక్తితో నొరయు
మరిగిన గతిఁ జేరి మలయు నంతంత
నెతిఁ గల్వరేకులు నెఱపిన పోల్కి
వెఱపునఁ దననీ వీక్షించి దాఁటుఁ
గురుచ వాలము ద్రిప్పఁ గొమ్ముల బయలు;
జిఱిమి చిత్రములుగాఁ జిమ్మనీ రీతి.''

— ప్ర. భా. పుట 70-71; ద్వి. పం. 604-615.

దీని ననుసరించిన శంకరకవి రచనఇది :

''చేయాక కుప్పించి చివ్వన దాఁటుచుఁ
గొమ్ములచే బయల్చిమ్ము కొనుచు
బిత్తరంబులు గాఁగ బేరెము ల్వాఱుచు
మరిగిన కైవడి మాలసి కొనుచుఁ
గసవుపోఁచలు కసిగాట్టుగాఁ గొఱుకుచు
వివృతాస్యమాన జాఱ విడుచుకొనుచు
రిక్కరిక్కనఁ దోఁకద్రిప్పి జాడించుచు
ఖురపుటంబులఁ దలఁగోఁకు కొనుచు
నిగిడి పాఱుచునంతంత నిలువఁ బడుచు
నొడలి కండూతికై చెట్ల నొరసి కొనుచు
నుదరి యొక్కెడ మిన్నక బెదరి పడుచుఁ
గువలయేశ్వరు నెలయించు కొనుచు నరిగె''

— ద్వితీయాశ్వాసము. పుట 35. ప. 49.

ఇట్లు ఇంచుమించుగా గౌరన అడుగులకు మడుగులొత్తి రచించినను శంకరకవి తన వ్యక్తిత్వమును మాత్రము కోల్పో లేదు. శంకరకవి ప్రతిభ, కవిత్వమందాతనిస్వతంత్రత గ్రంథమునందక్కడక్కడ కనిపించకపోదు. కావ్యాదిలో శంకరకవి తనకవిత్వమునుగూర్చి ఇట్లు తెల్పినాడు :

"వడియునుబ్రాసము స్వైదపవాఁడు ప్రబంధము పూని యేమిచె
ప్పెడి నగుఁబాటగు న్సుకవి బృందముముందట మాటలాడు వెం
బడినవి తమ్ముఁ దామె సులభస్థితిలో నుచిత స్థలంబులన్
బడిబడి వచ్చినిల్చి బహుభంగులఁ ద్రోవలఁ జూపసండినన్."

— హరిశ్చంద్రోపాఖ్యానము. అవతారిక. ప, 15.

శంకరకవి కవిత్వములో తొట్రుపాటుగాని, కుంటువడుటగాని కన్పించదు.

హరిశ్చంద్రుడు వేటకు వెడలునపుడు గౌరన వేటను సామాన్యముగ, అతిక్లుప్తముగ వర్ణించియున్నాడు[6]. ఈ సందర్భమున శంకరకవి ద్వితీయాశ్వాసమునందు 1-28 పద్యముల వరకును విపులముగా వేటవర్ణనను గావించెను. 'కొదమసింగముఁ బోలు కుక్కలఁ దెచ్చి' అనిమాత్రమే గౌరన తనద్విపదగ్రంథమునందు తెల్పినాడు. ఇచట శంకరకవి రాజాస్థానమునుండి వేటలను బాగుగా నెఱిగినవాడగుటచే కాబోలు తనగ్రంథమున వేటలో నుపయోగించు కుక్కలపేర్లను, డేగలపేర్లను, వేటకాండ్రను విపులముగా చిత్రముగా వర్ణించియున్నాడు.

"వేట మాణిక్య ముపకారి వెండిగుండు
వాయు వేగంబు వెతిపుచ్చ కాయగరుడఁ
డడవి పోతుల రాజు చిత్రాంగి బొండు
మల్లె యన నొప్పు పెక్కు నామముల వాని."

— ద్వితీయాశ్వాసము. పుట 30. ప. 3.

"సాళువము గిడ్డ లగుడు వేసడము కురుజు
బాజు జలకట్టె జాలియవైల యాణుజు

6. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము - ప్రథమ భాగము. పుట 58.

నోరనంబును నాదిగా బేరు వడిన
వేట డేగల గిఱికొన విడిచి కడిమి.''

—ద్వితీయాశ్వాసము. పుట 32. ప. 22.

ఇట్టి పేర్లతో కూడిన పద్యములు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు శృంగార శాకుంతలములోను, మనుచరిత్రాది ప్రబంధములందును కన్పట్టుచున్నవి.

శంకరకవి తనగ్రంథమున చాలచోట్ల పాత్రలు నాటకము నందువలె సంపూర్ణమైనపద్యములతో సంభాషించునట్లు రచించి నాడు. సంభాషణలు మారవలసివచ్చినపుడు అతడు చిన్నపద్యములచేనైనను, వచనముచేనైనను సూచించును. సంభాషణలు సరసములై పాత్రోచితముగా సాగుచుండును.

హరిశ్చంద్రోపాఖ్యానమున స్మశానదృశ్యము కఠోరహృదయమునకుకూడ కదలికను కలిగించునది. ఈసందర్భమున హరిశ్చంద్రుడు, చంద్రమతి దీనాలాపముల నాలకించి, చనిపోయిన బాలుడు లోహితుడేమోయని శంకించును. కాని ధీరుడగు హరిశ్చంద్రుడు గాంభీర్యమునువహించి బయటపడడు. మంగళసూత్ర వృత్తాంతముచే చంద్రమతి తనభర్తను గుర్తించును. ఆమె వెంటనే గుండెనిబ్బరములేక శోకించిన విధమిట్టిది:

గౌరన రచన:

''......................హా నాథ!
సతత దయాలోల సత్యసంశీల
హా హరిశ్చంద్ర రావయ్య నీ పుత్రు
లోహితాస్యునిఁ బద్మలోచనుఁ జూడు
మందు నీ తొడలపై ముదమున నిద్రఁ
జెందిన గతి నేడు చిత్తంబు పొక్కఁ

బన్నిన చితిమీఁదఁ బడి దీర్ఘ నిద్ర
నున్నాడు మేల్కాంచఁ డొకమఱియైన."

— ద్వి. భా. పుట 424; ద్వి. పం. 2193-2200.

ఈ సందర్భమున శంకరకవి చిన్నపద్యములోనే గొప్పభావము నిమిడ్చియున్నాడు.

"ఓ హరిశ్చంద్ర నీపుత్రు లోహితాస్యుఁ
జేరి చూడుము మున్ను నీ యూరు పీఠి
నిద్రఁ జెందిన కైవడి నేఁడు దీర్ఘ
నిద్ర వోవుచు నున్న నిర్నిద్ర తేజ."

— 5వ ఆశ్వా. పుట, 112. ప. 98.

భర్తను పేరుతో సంబోధించుటచేతను, పుత్రుని నామముతో నుదాహరించుటచేతను రాజునకతని పూర్వవైభవమును స్మరింపజేయుచున్నది. తర్వాతిపాదములో హరిశ్చంద్రునకు పూర్వపరిచిత ప్రేమఘట్టముతో ప్రస్తుత దీనావస్థనుబోల్చి రాజాతఃకరణములోని శోకాగ్నిని రగుల్కొలుపుచున్నది. ఇట్లు సందర్భమునకుతగినట్లు పాత్రోచితముగ భాషాభావములను కవి ఇందుకూర్చినాడు. శంకరకవి ఈ ఘట్టమున మూలములోని భావమును చక్కగా పఠనయోగ్యత యొప్పునట్లు వ్యక్తపరచినాడు.

చిన్నచిన్నమాటలతోనే విశిష్టభావార్థమును గారనసాధించును. భావౌన్నత్యమును ప్రకటింపవలసినచోట్ల శంకరకవి దీర్ఘసమాసములను యుపయోగించును. లోహితాస్యుని మరణమునకై చంద్రమతి నిట్లు దుఃఖించినది:

"అకటా చేరెడు నేలకుం దగడె సప్తాంభోధి వేష్టి భవ
త్సకల ద్వీప కలాప భూప మకుటాంచత్పద్మ రాగోజ్జ్వల

ప్రకటానర్గళ నిర్గళత్క్రరణ శుంభ త్ప్రదు డైనట్టి రా
జకుమారుండని యేడ్చె గన్నుగవ నశ్రుకుల్యాల్వాలై పాఱగన్''

— 5వ ఆశ్వా. పుట 110: ప. 86.

"చంద్రమతి, రాజపత్ని గావున నేమో, కుమారునికింబలె తనకును నూపిరాడకుండఁ బ్రాణాయామము జేయుచు నీదీర్ఘసమాసములో నేడ్చినద''[7]ని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఈ పద్యమును పేర్కొనుచు విమర్శించిరి. పై పద్యమున చంద్రమతి దుఃఖించుట ప్రధానవిషయము. దీర్ఘసంస్కృత సమాసము ఈ సందర్భమందలి శోకరస నిర్వహణమున పటుత్వము కల్గించదు. దీనితో రస ధారనిర్వహణ పలుచబడుచున్నది. హృదయమునకు సూటిగా రసస్యందియగుట యిందు కానరాదు. ఈ సందర్భమున గౌరస రచనయే హృద్యముగానున్నది.

"సకల దీవుల నేలు జనపతి పుత్రుఁ
డకట చేరెఁడు నేల కర్హుండు గాఁడె."

— ద్వి. భా. పుట 421-ద్వి. పం. 2159-60.

కాటిలో చంద్రమతినిచూచి హరిశ్చంద్రుని సంబోధన ప్రసంగము సందర్భోచితముగ నున్నది[8]. ఈ సందర్భమున "కుదురు మెఱుంగు నిబ్బరపు గుబ్బలపై నయనాంబుపూరముల్ చెదరక నేలయేడ్చెదవు''[9] అను శంకరకవి పద్యమునందలి హరిశ్చంద్రుని ప్రసంగము అతని శీలమునకు భంగకరముగానున్నది. ఈ పద్యమునకు కర్త లేడు, పూర్వాపర సందర్భములలో నిది సరి

---

7. చూ॥ కవిత్వ తత్త్వ విచారము. పుట 19. ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ 1947.

8. ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానము. ద్వితీయ భాగము. పుట 422

9. 5వ ఆశ్వా. పుట 111; ప. 87.

పడదు. ఈ పద్యము రామరాజభూషణుని హరిశ్చంద్రోపాఖ్యానమునందును కలదు. కావున ఈ పద్యము నెవరో హరిశ్చంద్రోపాఖ్యానమునుండి శంకరకవి గ్రంథమున జొనిపియుందురని శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారు అభిప్రాయపడిరి[10].

## ప్రభులింగలీల - పరివర్తనము.

పిడుపర్తి సోమన ద్విపద ప్రభులింగలీలను పిడుపర్తి బసవప్ప ( 1525 - 1550 ) పద్యకావ్యముగా పరివర్తింపజేసియున్నాడు[11]. పిడుపర్తి బసవప్ప, పిడుపర్తి సోమన తమ్ముడగు పాలనార్యునిపుత్రుడు. అతడు మూలగ్రంథమగు ద్విపద ప్రభులింగలీలను చాలవరకు అనుసరించినను కొన్నికొన్నిచోట్ల స్వతంత్రముగా రచించిన ఘట్టములును అతని పద్య ప్రభులింగలీలలో లేకపోలేదు. బసవప్పకవి ప్రభులింగలీలను పద్యానువాదము చేయుటకు హేతువు ద్విపద ప్రభులింగలీలను వ్యాప్తిగావించి తన్మూలమున వీరశైవ మతాభిమానమును పండితలోకమున చాటుటయే.

అక్కమహాదేవి యౌవనప్రాప్తి వర్ణనా సందర్భమున సోమన ద్విపదరచనఇది :

---

10. చూ॥ శంకర కవి - మల్లారెడ్డి - వ్యాసము. భారతి. ప్రమాది సంవత్సరము. మార్గశీర్ష మాసము.
11. పద్య ప్రభులింగలీల - అవతారికలో (ముద్రితము శ్రీ రాజరాజేశ్వరి నికేతన ముద్రాక్షరశాల. మద్రాసు. 1923.)

"ఆ సోమ గురుండు ద్విపదగ
జేసిన ప్రభులింగ లీల క్షితి వెలయంగా
నాసక్తి పద్య కావ్యము
భాసుర గతి పాలనార్య బసవన చేసెన్."

"ఆ మహాదేవికి నలరె బాల్యంబు
కోమలం బైనట్టి కొమరు ప్రాయమున
నీలకంఠుని భక్తి నెగడెనో యనఁగ
బాలిక కచములు బారడే సయ్యె;
హరునిఁ జూచెడి వేడ్క యధికమై నట్లు
కరియాన మొగమెల్ల కన్నులై దోఁచె:
ప్రమథేశుఁ బూజింప రతి హెచ్చెననఁగ
ప్రమద హస్తంబు లబ్జంబులం బోలె;
జ్ఞాన వైరాగ్యముల్ సమకూరె ననఁగ
మానినీ మణి కుచ మండలి చెలఁగె;
అతి సూక్ష్మ విజ్ఞప్తి యలవడె ననఁగ
నతివ మధ్యంబు చిదాకాశ మయ్యె
గురుభక్తి కింతయు గురుతయ్యె ననఁగ
వరనితంబము గౌరవము వహించె;
మనసు చంచల వృత్తి మానిచె ననఁగ
వనజాక్షి నెన్నడ వడి మందమయ్యె."

— ద్వితీయాశ్వాసము. పదియవగతి పుట 63.

ఇందు కవి భక్తిజ్ఞాన వైరాగ్యములను చక్కగా రూపకల్పన చేసినాడు. ఇది పాల్కురికి సోమనాథుని ద్విపద బసవపురాణము నందలి బసవన, బాల్యవర్ణనమున యౌవనప్రాప్తి వర్ణ ననుబోలి యున్నది. ఈ ద్విపదలను సంపూర్ణముగ ననుకరించియే పిడుపర్తి బసవప్ప పద్యముల నిట్లు కూర్చినాడు:

క॥ "ఆయక్క మహాదేవియు
నా యెడ బాల్యంబు గడిపి యంతట గొమరుం
బ్రాయమున నుల్లసిల్లెను
కాయజు పట్టంబు భద్రగజమో యనగన్."

సీ॥ నీల కంధరు భక్తి నెగడెనో యనగను
బాలిక వెంట్రుక ల్బారెడయ్యె;

హరుని గన్గొను వేడ్క నధికమై యున్నట్లు
కన్నియ మోమెల్ల కన్నులయ్యె;
ప్రమథేశు బూజింప రతి హెచ్చెనో యన
ప్రమద హస్తంబు లజ్జంబు లయ్యె;
జ్ఞాన వైరాగ్యముల్సమ కూడెనోయన
కాంత కుచంబులు ఘనములయ్యె
గీ॥ లలన కతి సూక్ష్మ విజ్ఞప్తి గలిగె ననఁగ
కడగి నడు మంతయును చిదాకాశ మయ్యె;
మనసు చంచల వర్తన మాన్చె ననఁగ
మగువ యానంబు మిక్కిలి మందమయ్యె."

మాయ'యొక్క శైశవవర్ణన. పిడుపర్తి సోమన ద్విపదరచన:

"పటుతర ప్రేమనా బాలిక మాయ
గనువిచ్చి చూతురు కనుమూయ లేక
మనసుల దలతురు మరువరా రూపు
నక్కునఁ జేర్చుదు రదలంగ నీరు
పక్కలో నిడుదురు బాసిపోలేరు
మాయగాకిది యేడ మనబిడ్డ యనుచు
మాయ పేరిడియె నమ్మమకార నృపతి."

—1వ ఆశ్వా. 3వ గతి. పుట 21.

ద్విపదలో క్లుప్తముగా వర్ణింపబడిన ఈమాయ శైశవవర్ణనను బసవప్పకవి విపులముగా, స్వాభావికముగ, భావప్రధానముగా పద్యీకరించినాడు:

సీ॥ కనువిచ్చి చూతురు కను మూయ్యగా లేరు
మనసున దలఁతురు మరువరెందు
నక్కునఁ జేర్చుదు రలిగి పోనియ్యరు
పక్కలో నిడుకొని పాయలేరు
దాదులు చన్నిచ్చి తల యంటి నీరార్చి
తడి యొత్తి వెన్నను గ్గిడుదు రెపుడు

కన్నుల కాటుక చెన్నారగాఁ బెట్టి
భూతి బొట్టిడి చల్వ పొత్తి బరచి

గీ॥ యెలమి, పవళింపగాఁ జేసి యెలుఁగులెత్తి
సుదతులందరు జోకొట్టి జోలబాడి
గట్టి బంగారు గొలుసుల గట్టినట్టి
తొట్టి యూతురు నిద్దుర పట్టుదనక.

ఆ॥ తల్లి చంకనుండి తండ్రిపైఁ బడిమెడ
బిగ్గఁ గౌఁగలించు బెట్టు ముద్దు
అందియలును మువ్వలందంద మ్రోయంగ
పుడమి మీఁద తప్పటడుగు లిడుచు.

క॥ బంగారు రావిరేఖలు
నుంగరములు పశిడి గొండ్లు నొత్తుల దండల్
సంగతి మేన జలంగగ
బ్రాంగణముల నాడు చుండు బడచుల తోడన్

క॥ ఈ రీతిఁ జెలగు సుతమమ
కారుడు వీక్షించి మాయగాకిది బిడ్డా
గూరయ నని తొలి జన్మము
పేరేపఁగ మాయ పేరు బెట్టిరి యంతన్"

ఇట్లు బసవప్పకవి మూలమునకు మెరుగుదెచ్చు ఔచితీ పరిపోషకములగు సన్నివేశములను మరింతపెంచి హృదయంగమముగా రచించినాడు. రచనా విషయమున మూలమునకంటె బసవప్ప గ్రంథమే మెరుగు.

పిడుపర్తి సోమన ద్విపద ప్రభులింగలీల జనసామాన్యమునుద్దేశించి రచింపబడినదై యుండును. అందలి రచన ప్రౌఢము కాదు. పాల్కురికి సోమనాథుని గురువుగాభావించి సోమన అతని రచనలను అనేకచోట్ల అనుకరించినాడు. ఒకేపోలికకు అనేక ఉపమానములను గూర్చుట కుదాహరణము. శైవేతరుడగు

'ఉడుతడిరాజు'ను అక్కమహాదేవి వివాహమాడక నిరాకరించిన సందర్భము:

"అర్కతేజము గూబ కనువుగానట్లు
మూగకు మాటలింపులు గాని యట్లు
ఈగకు సౌరభ్య మింపుగానట్లు
కోపికి శాంతంబు గూడనియట్లు
పాపికి పుణ్యంబు ఫలియింపనట్లు
ముక్కిడి కద్దంబు మురువు గానట్లు
కుక్కకు టెంకాయ గూడని యట్లు
రోగి కౌషధంబు రుచియింపనట్లు
నాగ కంకణు భక్తి నరపాల మణికి
ననుమతి గాకున్న నా మహాదేవి
కిని వానికిని బొందు కీలూడి పడియె"

— 2వ ఆశ్వా. 10వ గతి. పుట 67.

రచనా విషయమున బసవప్పగ్రంథము కొంత ప్రౌఢమైనది. బసవప్పకవి తర్వాత ద్విపద ప్రభులింగలీలను కొచ్చెర్ల కోటరామకవి పద్యరూపమున రచించెను. కొచ్చెర్ల కోటరామకవి పద్య ప్రభులింగలీల (అముద్రితముఆర్. నెం. 2130. ప్రా. భా. మద్రాసు) అవతారికలో,

"ఇరువ దేను గతుల నెసగిన ద్విపద కా
వ్యంబు పద్య కావ్య పద్ధతులను
గమణ తోడ నట్లు రచియింతు"

నని కవి తెల్పియున్నాడు. నడకుదుటి రామకవి (1821-1887), తలగాన నీలకంఠకవి మున్నగువారుకూడ ప్రభులింగలీలను పద్యరూపమున వెలయించినారు. వీరందరును అర్వాచీన కాలమునకు చెందినవారే.

## పరమయోగివిలాసము – పరివర్తనము.

వైష్ణవ యోగులగు పన్నిద్దరాళ్వారుల చరిత్రను, వైష్ణవ మతవ్యాప్తి గావించిన రామానుజాచార్యాదుల చరిత్రలను తెలుపు తొలి తెనుగుగ్రంథము తాళ్లపాక చిన్నన్న రచితమగు ద్విపద పరమయోగి విలాసమే. ఈద్విపదగ్రంథము వైష్ణవమత దృష్టిచేతనేగాక సారస్వత దృష్టినికూడ విశిష్టమైనది.

తాళ్లపాక చిన్నన్న ద్విపద పరమయోగివిలాసము ననుసరించి సమగ్రముగా, సంగ్రహముగా 5ఆశ్వాసములచంపూగ్రంథముగ[12] సిద్ధిరాజు తిమ్మరాజు (1564 A. D.) రచించియున్నాడు. చిన్నన్న ద్విపదగ్రంథము 8 ఆశ్వాసములలోను 12755 ద్విపదలు కలవు. సిద్ధిరాజు తిమ్మభూపతి పద్య పరమయోగివిలాసము గద్యపద్యముల సంఖ్య సుమారు 1387. పరమయోగులలో నొకడగు విప్రనారాయణుని కథను చదలువాడ మల్లన (1585 A. D.) విప్రనారాయణచరిత్రము[13] అను పేరుతో 5 ఆశ్వాసముల ప్రబంధముగను, వైజయంతీవిలాసము[14] అను పేరున సారంగుతమ్మయ (1600 A.D.) 4 ఆశ్వాసముల పద్య ప్రబంధముగను ప్రత్యేకముగా రచించి యున్నారు. తాళ్లపాక చిన్నన్న, సిద్ధిరాజు తిమ్మభూపతి, చదలువాడ మల్లన, సారంగు తమ్మయ – ఈ నల్వురును ఇంచుమించు సమకాలికులే.

---

12. ముద్రితము. శ్రీ సుజనరంజనీ ముద్రాక్షర శాల - కాకినాడ. పోతాప్రగడ బ్రహ్మానందరావు గారిచే ముద్రింపబడి, కవితా పత్రికాధిపతులచే ప్రకటింపబడినది.

13. ముద్రితము. ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రకాశితము–1. కాకినాడ 1938. రెండవ కూర్పు.

14. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ మదార్సు 1909 (Scholars Edition).

కాని ద్విపద పరమయోగి విలాసమే తొలుత వెలసిన రచన. అధునాతనుడగు పిడుగు వేంకటకవికూడ విప్రనారాయణచరిత్రను 3 ఆశ్వాసముల పద్యప్రబంధముగా రచించినాడు.

చిన్నన్న, తిమ్మభూపతి గ్రంథములలో కథావస్తువు ఒకటే. రెండుగ్రంథములందును కథాప్రణాళికయు అభేదముగ నేయున్నది. కాని కథోన్మీలనము విషయమున మాత్రము కొంత భేదమున్నది. పద్యకావ్యములో కథ మూలముకంటె సంగ్రహముగా నున్నది. పద్యపరమయోగి విలాసమునందు భక్తిరసము ప్రధానము. అందు వర్ణనలు అంతగా లేవు. చిన్నన్న ద్విపద పరమయోగి విలాసము వైష్ణవాచార విధేయముగ వర్ణితమైనది. ముఖ్యముగ వస్తువర్ణనలోను, భావవర్ణనలోను వైష్ణవాచార విధులను వర్ణించుట లోను ఇత్యాదిగ ద్విపద కావ్యము పెంపుచెందినది. చిన్నన్న ద్విపద గ్రంథములోని ఆశ్వాస విభజనము కథాగతిని చక్కగా వ్యక్తీకరించును. గ్రంథాశ్వాస విభజన విషయమున తిమ్మ భూపతి చిన్నన్నను అనుసరించినట్లు కానరాదు.

ద్విపద పరమయోగివిలాసమున భక్తిసారయోగి శేష శాయిని మేల్కొల్పినవిధము వర్ణింపబడినది. ఇది భక్తుడు భగ వంతుని మేల్కొల్పునపుడు చేయు విన్నపమువంటిది. ఇట్టివిన్న పములు వైష్ణవ సాహిత్యమందంతటను వెల్లివిరియుచునేయుండును. చిన్నన్న ద్విపద రచన :

> "ఘనతరంబైన చక్రము కేల బూని
> చెనటి రక్కసులఁ ద్రుంచిన బడలికయొ
> జలరాశిఁ జొచ్చి రాక్షసుల గీటడంచి
> చెలఁగి వేదములు దెచ్చిన బడలికయొ
> క్షీరసింధువు మథించియుఁ గ్రుంగకుండ

జేరి మందరము మోచిన బడలికయొ
ముఖదంత కోరకమున జగత్త్రియము
నిఖిల భారంబు నానిన బడలికయొ
పైకొన్న యుక్కు కంబముఁ గొనగోళ్ళ
జేకొని వ్రక్కలించిన బడలికయొ
జగము లీరేడును చక్కని యడుగు
చిగురుటాకునఁ గొలిచిన బడలికయొ
గండ గొడ్డట రాజ కంఠనాళములు
చెండి చెండాడి వైచిన బడలికయొ
దండకా వనమున దనుజ వర్గంబుఁ
జెండి వైచుచుఁ జరించిన బడలికయొ
కౌరవాధిపునితోఁ గనలి తత్పురము
సీరాగ్రమునఁ బెకల్చిన బడలికయొ
యలవి మీఱంగ గోపాంగనా మణుల
చెలువంపు రతులఁ దేల్చిన బడలికయొ
మేలిమి తురగంబు మీఁదట నెక్కి
లీలవయ్యాళిఁ దోలిన బడలికయొ
నాయెట నాతోడ నింతయుఁ దెలియ
మాయన్న యెఱిఁగింపుమా."

—ద్వి. ప. వి. 2వ ఆశ్వా. పుటలు 102-103,
ద్వి. పం 2423-2446.

ఈ సందర్భమున తిమ్మభూపతి పద్యమును పరిశీలింపుడు:

'నిగమ చోరకుని ఖండించిన యలఁతయో
యబ్ధిలో గిరిమోచి నట్టి యలఁతో
తెగి హిరణ్యాక్షు మర్దించిన యలఁతయో
యతని సోదరుఁ జంపినట్టి యలఁతో
గుజ్జు రూపునను మేన్గొలిపిన యలఁతయో
యడవి రాజులఁ జెండి నట్టి యలఁతో

తోడరి రావణు తల ద్రుంచిన యలంతయో
యమున నాగటఁ గ్రుచ్చి నట్టి యలంతో
గోప కాంతుల రతిపెనంపవల యలంతో
యలఖలధ్వంసచింతఁ బాటిలినయలంతో
యలఘు కృపతో నిమిత్తంబు దెలుపుమయ్య
నీవు పవళించుటకును నో దేవదేవ! ''

— పద్య పరమయోగివిలాసము, 2 ఆశ్వా, ప. 104.

పై రచనలు రెండును విష్ణువు లీలావతార విశేషములను వర్ణించినను వాని నిర్వహణలో కవుల దృక్పథములు భిన్నము అని తెలియుచున్నది. చిన్నన్న ద్విపద రచన వైష్ణవాచార విధేయముగనే వర్ణితమైనది. ఇందు భక్త్యావేశము అంతప్రస్ఫుటముకాదు. తిమ్మభూపతి పద్యమునందు భక్తిపారవశ్యము తీక్ష్ణముగను, ధారాళముగను వర్ణింపబడినది. ద్విపద రచనలోని 'బడలికయొ' పద్యరచనలోని 'అలంతయో' — అను నక్షరములు క్రమముగా పాడిచి వినిపించురీతిని ఆరోహణస్వరములతో పాడిచి మెళుకువను తెప్పించును. ద్విపద, సీసపద్య నడకలో అయిదేసి మాత్రల గణములే యెక్కువగా గన్పించుచున్నవి. ఇందు ద్విపదలలోని 'బడలికయొ'కంటె సీసపద్యములోని 'అలతయో' అను మాట అడుగడుగునకు వెంటనే ప్రదర్శించుచు భగవంతుని తట్టి లేపుచున్నట్లుగనున్నది. ద్విపదపాదములందలి గతిఅంత సరళము కాదు ఇచట పద్యరచన హృద్యమై శ్రవణపేయముగ నున్నది. తిమ్మభూపతి రచన సంగ్రహమైనది. చిన్నన్న వైష్ణవాచార విధేయముగ వర్ణింపగా తిమ్మభూపతి భక్తి ప్రధానముగనే వర్ణించియున్నాడు.

గోదాదేవి కోరికపై విష్ణుచిత్తుడు చెప్పిన శ్రీవేంకటేశ్వరుడు, మొదలు నూటయెనిమిది తిరుపతులందు వెలసిన శ్రీరంగ

నాథుని అర్చావతార మూర్తులను, వాహనాదులను, విహారా దులను, తన్మాహాత్మ్య వైభవములను చక్కగా, వైష్ణవాచార విధేయముగ, వివరణాత్మకముగ స్వానుభవ పూర్వకముగ కన్నులకు గట్టినట్లు సుమారు 200 ద్విపదలలో చిన్నన్న వర్ణించినాడు. (చూ. ద్వి. ప. యో. వి. 5వ ఆశ్వా. పుటలు 322_340). ఈ ద్విపదలలోని విషయములు సంస్కృతవృత్తముల కొదగవని తలంచి కాకోలు తిమ్మభూపతి, ద్విపద భేదమగు 'ద్విరదగతిరగడ' లో-సుమారు 196 పంక్తులలో-స్వామి అర్చావతార మూర్త్యా దులను వర్ణించి మూలములోని సొగసును సంరక్షించినాడు. (చూ॥ పద్యపరమ. యో. వి. 4వ ఆశ్వా. పుటలు 149-156; ప.71)

ద్విపద పరమయోగి విలాసమున వేశ్యలు తొలుతచూచి నప్పటి విప్రనారాయణుని దేహశోభావర్ణన మిట్లుకలదు.

"కమలాప్త బింబంబు గతినొప్పు వాని
బాలేందు చాయల బదిరెండు వగల
డాలించు నూర్ధ్వ పుండ్రంబుల వాని
గాత్రంబు మై నొప్పు గలుగు వైఢూర్య
సూత్రంబు గతి బ్రహ్మ సూత్రంబు వాని
నొప్పు చందురుని రాహువు డాసినట్లు
కప్పారు నిడువాలు గడ్డంబువాని
మొలకొత్తు ముత్తెంపు మోసుల కరణిఁ
దళుకొత్తు శుభ్రదంతముల వానిఁ
దవిలి మల్లియ చాలు తావికై కదిసి
బవరిఁ జుట్టిన యట్టి భ్రమరాలి కరణి
సవరణి తులసి పూసల దండతోడఁ
గవగూడి హరినీల కాంతి గేలించు
తమ్మి పూసల పేరు తనరు నైజంపు
సొమ్ముగా సవరించి చూపట్టు వాని

నదన గావేరి తోయంబులఁ గాల్వ
మొదల బంటిని ముంచి ముంచి పోయుచును
దడయక వచ్చి గుద్దలిఁ గొని తొంటి
మడవ మార్చుచు మాఱు మడవ దీర్చుచును
ద్రవ్వంగ వలయుచోఁ ద్రవ్వి యందంద
పువ్వుఁ జెట్టులకెల్ల బోది సేయుచును
ఆరామ కృత్యంబు లాచరింపుచును
జీరికిందము లెక్క సేయని వాని
శౌరి కైంకర్య సంపక్తు శ్రీ విప్ర
నారాయణుని గాంచి.''

— ద్వి.ప.యో.వి. 4వ ఆశ్వా. పుటలు 232-233.
ద్వి. పం. 5534-58.

ఈ సందర్భమున తిమ్మభూపతి పద్య పరమయోగివిలాసములోని వర్ణనఇది:

''కాయము చేష్టపుష్పవన కార్య విధానము నంద పల్కు నా
రాయణ నామ కీర్తనము నంద తలంపుల వర్తనంబుల
త్మీయత వాసుదేవ పదచింతన లీలల యందకాని తా
నేయెడ నెందునుం బరగనీక ప్రవర్తిలు యోగి పుంగవున్.''

— పద్య. ప. యో. వి. 3వ ఆశ్వా. ప. 195.

పై రెండువర్ణనలను పరిశీలించిన తెలియనగు సారాంశ మిది: ద్విపదలో విప్రనారాయణుని యోగి వేషము వైష్ణవాచార విధేయముగ భావనాత్మకముగ తేటతెలుగు పలుకుబడులతో విపులముగ వర్ణితమైనది. 'ఊర్ధ్వపుండ్రము'లతో నొప్పి, 'బ్రహ్మ సూత్రము' తో 'తులసిపూసలదండ', 'తమ్మిపూసలపేరు'తన 'నైజంపు సొమ్ముగా' ధరించిన 'శౌరి కైంకర్యసంసక్తు'డగు విప్ర నారాయణుని వేషవర్ణన వైష్ణవాచార విధేయతను వ్యక్తపర

చును. ఈ వర్ణన తిమ్మభూపతిగ్రంథమునందు విస్మరింపబడినది. శౌరికైంకర్యాసక్తుడగు విప్రనారాయణునికాయక వ్రతమును గూర్చి ద్విపదలో వివరముగా తెల్పబడినది. ఇదికూడ వైష్ణవాంశమునే వెల్లడించును. పనిలో నిమగ్నుడైయున్నందు వలననే వేశ్యలరాకను విప్రనారాయణుడు గమనింపలేదని చెప్పుట సరిగానున్నది. ఈసందర్భమున తిమ్మభూపతిరచన సంగ్రహముగా విప్రనారాయణుని భక్తిభావమును ఎక్కువగా వెల్లడించును. అతని కాయము, చేష్టలు-పుష్పవనకార్యమునందే వినియోగింపబడినవట. 'తలంపు' 'వర్తనము' 'నారాయణనామకీర్తనము'నందును 'లక్ష్మీయుతవాసుదేవపదచింతనలీలల'యందునునిమగ్నమైయున్నదట, భక్తిపారవశ్యుడగు యోగిపుంగవుని వేశ్యలు చూచినట్లు తిమ్మభూపతి తనగ్రంథమునందు వర్ణించినాడు. చిన్నన్నరచన వర్ణనాత్మకమై, వైష్ణవాచార విధేయముగనుండగ, తిమ్మభూపతిరచన సంగ్రహముగ, కథాకథన పద్ధతిని, భక్తి ప్రధానమైయున్నది.

### కృష్ణార్జునసంవాదము-పరివర్తనములు:

కృష్ణార్జున సంవాదము 'గయోపాఖ్యాన'కథ. ఈకథను తెలిపిన తొలి తెలుఁగు గ్రంథము నాదిండ్ల గోపన రచితమగు ద్విపద కృష్ణార్జున సంవాదము. ఈద్విపద కృష్ణార్జున సంవాదము ననుసరించి వెలిచేరు వెంకటరామప్రధాని, కస్తూరి రంగకవి, ఓబయకవి, రామయామాత్యుడు, వెల్లంటి సుబ్బయామాత్యుడు —మొదలగువారు చంపూకావ్యములుగ రచించియుండుట గోపన మంత్రి ద్విపదకావ్య వ్యాప్తిని సూచించును. వీనిలో రామయామాత్యుని కృష్ణార్జున సంవాదము 2 ఆశ్వాసములుకలది. ఇందు

వర్ణన లెక్కువగానున్నవి. వెల్లంటి సుబ్బయార్యుని పద్యకృష్ణార్జున సంవాదము 5 ఆశ్వాసములుకలది. ఇందలివర్ణనలు ప్రౌఢ పరిపాకముతో నొప్పినవి. ఈ రామయామాత్యుడు, సుబ్బయార్యుడు 18వ శతాబ్ది పూర్వార్థమున నుండెడివారని తెలియుచున్నది.

కృష్ణార్జునులకు వాగ్వాదము జరిగినట్లు ద్విపద కావ్యమునందు లేదు. కాని వెల్లంటి సుబ్బయార్యుడు, రామయామాత్యుని చంపూగ్రంథముల రెండింటియందును ద్వంద్వయుద్ధముకొంత జరిగినతర్వాత కృష్ణార్జునులిరువురికి సంవాదము జరిగినట్లు వర్ణింపబడినది.

ద్విపదకావ్యమునందు అర్జునుడుగాక దుర్యోధనుడు కృష్ణునధిక్షేపించినట్లుకలదు. ఈ సంవర్భమునందలి ద్విపద పంక్తులివి:

"కోపింప గోపాల కులమూక గాదు
చూపట్టు ప్రతిభట స్తోమంబు గాని
విన గోపికా గీత వినతులు గావు
తనరిన హయహేషి తంబులు గాని
సరిసెక్క గేలికా చలములు గావు
సరభస మత్తకుంజరములు గాని
మెట్ట గాళియ ఫణి మేనిది కాదు
దట్టంపు రథ సముత్కారములు గాని
మలయ బృందావన మార్గంబు గాదు
బలువైన సంగ్రామ పద్ధతి గాని
గోపాల నీకేల ఘోర యుద్ధంబు
భూపాలుడవు గావు పొమ్మని యేసె."

— ద్వి. కృష్ణార్జున సంవాదము, పుట 51.

ఈమాటలు దుర్యోధనునిచే ననిపించుట యుచితముగా నుండునని గోపనమంత్రిభావించి ఇట్లురచించి యుండును. ఇందలి శైలి సరళమై, సుబోధకముగనున్నది. ద్విపదకావ్యమునందువలె వెల్లంటి సుబ్బయార్యుని గ్రంథమునందును అర్జునుడుగాక దుర్యోధనుడే కృష్ణు నధిక్షేపించినట్లున్నది. రామయామాత్యుని చంపూగ్రంథములో అర్జునుడే కృష్ణునధిక్షేపించినట్లు కలదు.

ఈ ప్రకరణమున ఇంతవరకు పరిశీలించిన ద్విపదగ్రంథములేగాక అనంతవ్రతకథ, శతకంఠరామాయణము, మైరావణచరిత్ర, శ్రీరంగ మాహాత్మ్యము, గంగావివాహము,—మున్నగు వానినికూడ కొందరు పద్యకావ్యములుగ పరివర్తించియున్నారు. ఆపద్య పరివర్తనములుకొన్ని అలభ్యములగుటచేతను, మరికొన్ని రచనావిషయమున ద్విపదగ్రంథములకంటె చాల పేలవముగ నుండుటచేతను వానినిగూర్చి ఈ ప్రకరణమున చర్చింపలేదు, అనంతవ్రతకథ, పండితారాధ్యచరిత్ర—మున్నగు పద్యపరివర్తనములు అలభ్యములు.



# ఏడవ ప్రకరణము

## ద్విపద రచనలు - సాంఘిక చరిత్ర :

సాహిత్య రచనలు సామాన్యముగ సమకాలిక సాంఘిక జీవితమునకు ప్రతిబింబములు. ఒకజాతియొక్క సాంఘిక రాజకీయాది చరిత్రనిర్మాణమునకు శాసనాది సాక్ష్యములేగాక కవుల కావ్యములును ఎక్కువ తోడ్పడును.

"A nation's literature is not a miscellaneous collection of books which happen to have been written in the same tongue or within a certain geographical area. It is the Progressive revelation, age by age, of such nation's mind and character[1]." అని W. H. Hudson మహాశయుడు నుడివియున్నాడు.

కవి సంఘజీవి. భావాంబరవీధిలో ఎంత విహరించినను అతడు సంఘము నధిగమించి పోలేడుకదా! కేవలము పౌరాణికము, దివ్యమునయిన కథావస్తువుగ్రహించి రచింపబడిన రచనలలోకూడ కొద్దిగనో, గొప్పగనో సమకాలిక సాంఘికవిశేషములు వ్యక్తమగుచుండును. తెలుగు దేశపు సాంఘిక జీవిత చరిత్రను నిర్మించుటకు నన్నయ కాలమునుండి వెలసిన తెలుగు

---

1. చూ॥ An Introduction to the Study of Literature - Page 32.

రచనలు కొంతవరకు ఉపకరించుచున్నవి. 'మార్గ' పద్ధతికి చెంది చంపూపద్ధతిని తెలుగులో రచింపబడిన పురాణ కావ్య ప్రబంధాది రచనలు చాలవరకు సంస్కృతానువాదము లగుటచే వాని యందు దేశీయమైన సాంఘిక జీవిత విశేషాదులు ఎక్కువగా వర్ణింపబడలేదు. 'మార్గ' సంప్రదాయ ప్రియులగు కవులకు 'దేశి' మీద మక్కువతక్కువ. 'దేశి' సంప్రదాయప్రియులగు కవులలో ద్విపద రచయితలే ముఖ్యులు. కావుననే ద్విపదరచనలలో భాష, ఇతివృత్తము, భావములు, వర్ణనలు, అచారవ్యవహారములు, వేష భాషలు,— మొదలగు వానికి సంబంధించిన 'దేశి' తనము నిండి యున్నది. ద్విపదకవులు సంస్కృతమునుండి అనువాదములు చేసినను చంపూకావ్యకవులకన్న ఎక్కువ స్వాతంత్ర్యమును చూపి యుండుట ఇదివరకే తెలిసికొంటిమి. ఈ స్వాతంత్ర్యము చాల వరకు తెలుగువారి ఆచారవ్యవహారములకు వేషభాషలకు జాతీయతకు సంబంధించినట్టిదే. ఈ కారణముననే ఆంధ్రుల సాంఘిక జీవితచరిత్ర రచనకు చంపూకావ్యములకన్న ద్విపదరచనలే ఎక్కువగా నుపకరించుచున్నవి. తెలుగుసాహిత్యములో చంపూ కావ్య ప్రబంధములలో ప్రతిబింబితమైనసాంఘిక జీవితవిశేషాదులన్నియు ద్విపద రచనలయందును ప్రతిబింబితములై యున్నవి, కాని ద్విపద రచనలలో ప్రతిబింబితములయిన వన్నియు ఆయా కాలములందు వెలువడిన చంపూకావ్యప్రబంధములలో లేవనిన అతిశయోక్తి కాదు.

ఈ ప్రకరణమున ఆంధ్రదేశపు సాంఘికజీవితచరిత్రకు ముఖ్యాధారములగు ద్విపదగ్రంథములను మాత్రమే గ్రహించి వాని మూలమున మాత్రమే తెలియదగు సాంఘిక జీవితవిశేషాదులను సంగ్రహముగా పరిశీలింతము.

## పాల్కురికి సోమనాథుని ద్విపద రచనలు - సాంఘికజీవిత విశేషములు :



పాల్కురికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు—ముఖ్యముగ రెండవది—క్రీ.శ. 12, 13 శతాబ్దముల కాలమునాటి ఆంధ్రదేశమును గూర్చిన అనేక వివరములకు గని వంటిది. వీనియందు సోమనాథుడు ప్రదర్శించిన లోకజ్ఞత, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులు నిరుపమానములు. సోమనాథుడు ఈ ద్విపదగ్రంథములందు సమకాలపు తెలుగు ప్రజాజీవితమును చక్కగా సమృద్ధిగా ప్రదర్శించినాడు. "దేశిమార్గములను దేశీయములుగా" రచించిన కుమారసంభవకర్తకూడ తెలుగు ప్రజల సాంఘికజీవితవిశేషములకు ఎక్కువప్రాధాన్యమీయలేదు.

### ఆటపాటలు; వినోదములు :

క్రీ.శ. 12, 13 శతాబ్దములలో తెలుగు దేశమునందలి బాలురు ఆడుకొనుచుండిన 'ఆట' లెట్టివని తెలిసికొనుటకు పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రయే (చూ; పం. చ. సకలేశ్వర మాదిరాజయ్యకథ. పుట 460) ఆధారము. ఆకాలమున ఈక్రింది ఆటలు ప్రచారమందుండినవి.

'రాగుంజు పోగుంజులాట'; 'కుందెన గుడిగుడి గుంజంబులాట'; 'అప్పల విందులయాట'; 'చప్పట్లు'; 'సరిగుంజులాట'; 'సేరబొంతలయాట'; 'సిట్లపోట్లాట'; 'గోరంటలాట'. 'దాగుడుమూతలాట'; 'దిగుదిగు దిక్కొనునాట'.

### నాట్యభేదములు :

కాకతీయుల కాలమున నృత్యశిల్పములు ఉచ్ఛస్థితియందుండెనని ఆ కాలమునందలి మైలాంబ పానుగల్లు శాసనము,

జాయపల చేబ్రోలు, మాల్కాపుర ఇత్యాది శాసనములలోని నాట్యకళాంశముల ప్రశంసలను బట్టియు, రామప్ప దేవాలయములనుబట్టి విదితమగును. ఈ కాలముననే (క్రీ. శ. 1253-54) 'నృత్తరత్నావళి' అనునాట్యశాస్త్రము సంస్కృతములో రచింపబడినది. పండితారాధ్య చరిత్రమందలి పర్వత ప్రకరణములో నృత్యకళకు సంబంధించిన శాస్త్రీయ సాంకేతిక పదజాలము కలదు, నృత్తరత్నావళిలో వర్ణింపబడినజానపదములును, ప్రాంతీయములునైన నృత్యవర్ణనముల ననుసరించిన జానపద నృత్యవైఖరులుకూడ అందుకలవు. ఇవి అప్పటి శైవసంప్రదాయమందు నృత్యకళకుండిన విశిష్టవ్యాప్తిని సూచించును.

పండితారాధ్య చరిత్రమందాకాలమున ప్రజారంజకములుగా నుండిన దేశినృత్యము లీక్రిందివి. (చూ. పర్వత ప్రకరణము. పుట 434-436).

'వెడయాట'; 'చిందు'; 'కోడంగియాట'; 'పేరణి'; ప్రమథగణముల చేష్టితములనువర్ణించు బహునాటకములు, బహురూపులు; 'వెడ్డంగము'; 'అమరాంగనల నృత్యానుకరణములు; పక్షులఆటలు; గడాటలు; (దొమ్మరాటలు); భారతాదికథల ఛాయాచిత్ర ప్రదర్శనములు; బొమ్మలాటలు; పగటివేషములు:

బసవపురాణమున బసవని వివాహఘట్టమున (చూ. బ, పు. 1వ అశ్వా. పుట 50) నృత్యవర్ణన కలదు. 'కోలాటము'; 'పాత్ర'; 'గొండ్లి'; 'పేరణి';—అను నృత్యభేదములను సోమనాథుడు పేర్కొనెను. తర్వాత 'ఆనంద గీతములు'; 'శంకర గీతములు'—మున్నగు 'జతిగీతము'లను ప్రస్తావించెను.

## సంగీత సంప్రదాయములు:

బసవపురాణములోని సకలేశ్వర మాదిరాజయ్యకథలోను

(చూ. బ. పు. 3వ ఆశ్వా పుట 207-210) పండితారాధ్య చరిత్రలోని పర్వతప్రకరణము (పుటలు 437-462) లోను సంగీత శాస్త్ర విశేషాదులను సోమనాథుడు విపులముగా వివరించినాడు. అవి సోమనాథుని కాలమునాటికి తెలుగుదేశములో ప్రాచుర్యములో నున్న సంగీత సంప్రదాయములను వ్యక్తపరచును. ఈ కాలమున దేశీయగాన పద్ధతులకుకూడ లక్షణనిర్ణయము పండితాదరణము లభించినదని తెలియుచున్నది. పాల్కురికి సోమనాథుడు వాడిన సంగీతమునకు సంబంధించిన పారిభాషికపదములు లక్ష్యలక్షణములులేని పట్టి పట్టీలు. వానికి సంబంధించిన వివరణములు ఈనాటి సంగీత లక్షణగ్రంథములలో గాని, చివరకు సమకాలిక గ్రంథములగు శార్‌ఙ్గదేవుని సంగీతరత్నాకరములోగాని దొరకవు.

పర్వతప్రకరణములో (పుట. 442-457) శివుని బహువిధ చరిత్రములను నాటకము లాడుటను వర్ణించిన తర్వాత సోమనాథుడు, 'బ్రహ్మవీణ'; 'కైలాసవీణ'; 'సారంగవీణ'; 'కూర్మవీణ'; 'ఆకాశవీణ'; 'రావణవీణ'; 'గౌరివీణ'; 'గాంధర్వవీణ'; 'బాణవీణ', 'కాశ్యపవీణ'; 'స్వయంభువీణ'; 'భుజంగవీణ'; 'భోజవీణ'; 'కిన్నరవీణ'; 'త్రిసరివీణ'; 'సరస్వతివీణ'; 'మొల్లవీణ, 'మనోరథవీణ' సరధగణనాధవీణ'; 'కౌమారవీణ'; ,అణివాణి'; రావణహస్తము'; 'తిపిరి' 'సకనె'; ,వళి'; 'విచిత్రక'; 'నట'; సాగరిక'; 'గుంభిక'; 'విపంచిక'; 'సరవీణ'; 'వరవాదివీణ; 'మల్లరి'; 'కోలాప్టి'; 'సర్వమండలము'; 'ఘోషావతి'; 'ఔదుంబరి'; 'తంత్రిసాగరము'; 'అంబుజవీణ'; అను వీణముల జాబితాను, 'గీతానుగతము'; 'ఉభయానుగము'; 'ముఖవీణానుగము'; ద్రుతానుగము'; అను తంత్రులను, 'జన్యజనక, 'విరచనలను' (ఇవి వీణలపై ప్రయోయించు సంగీతప్రక్రియలు) — 'కరణికలు'

దండి, చిత్రము, మృదువు; లలి, మాధుర్యము, ఉల్లసము, సయతాణము, మొగచాళము, సుకళ, హయతాణము, దళహరము, సారణము, బొట్టవణిక, తిరువు, వర్తి, తాళపట్టె, కర్తరి అనునవి; సమహస్తము, స్సైరణము, పదము–ఇత్యాది 40 భేదములగు 'బంధము' లను, చంచుపుట, గచ్చపుట, షడ్గీత, ఉత్పుట, మోచిత. సమతాళ, సత్రచ్ఛేద–అను 'సప్తతాళము' లను; 'ఎగ'; 'బొంబడ'; 'ఎడ'; 'వాడ'; 'గారు'; 'హడక', 'బంధకరణ':–ఇత్యాది 'సప్తవింశతి శుద్ధతాళము'లను, 'ఖండితతర', 'అవఖండ', 'కంకాళ', 'ఖండిత', 'చండకి' 'ఖండవర్ణ', 'అవిఘూర్ణిత'; – ఇత్యాది 'అష్టోత్తర శతతాళభేదము' లను; 'ఆలాపము'; 'హేలనము'; 'వ్యాప్తి'; 'బెడంగు'; 'చాలన'; 'సుళికె'; 'ఇంపు'; 'ఒణువు'; 'జరము';'తిరువు'; 'జయ'; 'సొంపు'; సెవణ'; అనుజయు; కొంకు, వుణవుాణ: పళి, భజవణ; 'వహాణి'; 'సహ్యాంగు' 'శవహాణి' 'అధరవహాణి';అను 'గతిభేదము' లను; స, రి, గ, మ, ప, ధ, ని'–అను 'అక్షరము'లను ; ఆరోహి, 'అవరోహి' చక్రవాళ, సంపద, ప్రవ్యక్త, సువ్యక, లాలిత'- అను సప్తాలాపము'లను, 'జాతివాస, విజాతివాస, కుమారవాస–ఇత్యాది 'అష్టాదశ వాసనాదము'లను; 'షడ్జము, ఋషభము' గాంధారి, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము'–అను 'సప్త గ్రామము'లను; 'సకళ, గూఢ, నిష్కళ' సంహృత, నావళి, మధుర, ఏకాక్షరి, భృంగి, జాతి, పరేంగిత, పూర్వవాస, రంజక, అలంకారిణిని, రేణుక, ప్రస్తవాసి, లలిత, స్వరవాపి. భాషాగ్ని, నర్తకి; నాపూర్ణ, ప్రచ్ఛన్న, సర్వవ్యాపి'– అను 'శ్రుతుల'ను; దీర్ఘలాలిత, దీర్ఘిక–ఇత్యాది 21 'గమకము'లను; 'కంపితము' స్ఫురితము, లీనము, త్రిభిన్నోత్తర, సప్తధా, ఆంధోళితాహతము

సూక్తకలనము—అను 'ప్రత్యేక గమకము'లను; శ్రీరాగము, ఆంధోళి, చిత్రాంగి, లలిత, సార, గౌళి, శంకరాభరణ—ఇత్యాది 108 'రాగము'లను; 'జంబళనారాట, మిశ్ర; కావుళ, ధ్వని'—అను నారాట కావుళ ధ్వనులను; 'జయ' ఉజ్జయ—అను 'సం' వాచకము'లను; 'హాయి, సుహాయి, గాణాయి, గూఢాయి, గాఢాయి, వాయి, దేణాయి, బహుళాయి, బడియాయి, నిబిడాయి, బాడాయి, దీడాయి;— అను 'అనువాచకము' లను 'షట్స్వాదు, సప్తస్వాదు, అష్టావళి, నవస్వాదు, సరసమాయాయి'—అను 'జయపంచకము'ను; 'దేహావళి, మదావళి, కంఠావళి' — అను జయత్రయమును; 'విజయస్థానకము, వళిగ, అంతరము, ఉప్పరవట్ట, మందరణ, వాళ, సర్వగత, భంగాస్థానము, గమళాయి, నాభిగతి, ఉదరగతి, కంఠగతి—అను 'తిరువుల'ను; వరిహారిసక్కట, సరిశాగవహణి—ఇత్యాది 'వహణుల'ను; 'లలిత, గాఢ, గాఢలలిత, బాచ్చలలిత, — ఇత్యాది 'విశుద్ధతాయములను'; సెవణ, సుద్ధి; పూరణ, రంగు, సోమరక్తజిగి, గమళ—మొదలగు 'సాళగతాళగతు'లను; నాగావతి, నందావతి—మొదలగు 'ఆళతు'లను; 'అంగరాగము, గీతాంగ రేఖ, రంగశోభ, ముఖరాగము, తతము, వితతము, నిలయము, సుమారు 50 నాట్యభేదములను; చతుర్విధ, 'వక్త్రవిభమము'లను; సప్తవిధ భ్రూలతానటనమును; షడ్వింశతి క్రమ చతురంకితమును; షడ్విధనాపాల సత్కుంచితము, దశవిధ కర్ణావధానము; సుగతి, సమభంగి, త్రిభంగి- మొదలగు వింశతి అంగహారములు, ఇరువది రెండు'తానకము'లు, చౌషష్టి 'హస్తములు, ఏడుభ్రమరులు, నూరుఅలంకారములను, పదమూడు శిరోభేదములను, ముప్పది రెండు దండనములను—మున్నగుసంగీతశాస్త్ర పరిభాషను సోమనా

థుడు కుప్పలుతిప్పలుగా వర్ణించినాడు.

ఆంధ్రవాఙ్మయమున తొలుత యక్షాది నేపథ్యములతోడి ఆటపాటలప్రసక్తి పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణమున కన్పించును. శ్రీశైలయాత్ర శివరాత్రి జాగరణ సందర్భమున యాత్రికుల వినోదకాలక్షేపములను వర్ణించుచు సోమనాథుడు,

"ఆదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు,
విధమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడ నట్లాడు."

— పం. చం, పర్వత ప్రకరణము. పుట 436.

వారిని పేర్కొనినాడు. యక్షగాన ప్రసక్తిని, ఆ కాలమునందు జనసామాన్యమున వ్యాప్తిలోనుండు పదములు, గీతములు—మున్నగువానిని తెలిసికొనుటకు పాల్కురికి సోమనాథుని ద్విపద గ్రంథములే అధారమగుచున్నవి.

పాల్కురికి సోమనాథుని రచనలు ఒకవిధముగా విజ్ఞాన సర్వస్వ మనదగినవి. ఆకాలమందు చెట్లు చేమలకు, మూలికలకు, పండ్లుపత్రిరిలకు, సంబంధించిన పేర్ల పట్టీలు పండితారాధ్యచరిత్ర పర్వత ప్రకరణమున (చూ, పుటలు 355-358) చాలకలవు. వానిలో ఎక్కువ తెలుగుమాటలుండుట మరొకవిశేషము.

పసిపిల్లల స్నానము:

బసవపురాణములోని బెజ్జమహాదేవికథలో బెజ్జమహాదేవి పరమేశుని 'తనయునిగాభావించి' 'తొంగిళ్లపైనిడి', 'అభ్యంజనంబు' గావించు విధమును సోమనాథుడు సహజముగా వర్ణించినాడు. ఇది సోమనాథుని కాలమునాటి పసిపిల్లలకు తల్లులు స్నానము

చేయించు విధమును తెలిసికొనుటకాధారమగుచున్నది.

"ముక్కొత్తుఁ జెక్కొత్తు ముక్కున్నుఁ బులుము
నొక్కొత్తుఁ గడుపొత్తు నటవీఁపు నివురుఁ
బెరుఁ గంగ వలెనని తరుణి వీడ్వడఁగఁ
జరణము ల్కరణములుఁ జాఁగంగఁ దిగుచు
నలుఁగులు నలుచు నర్మిలి గట్టి పెట్టి
జలములు వీఁపునఁ జలుచు నంతంత
వెగచి బెగడ కండ వెన్ను ద్రేయుచును
నొగి మస్తకమున నీరొత్తు దోయిటను
వదనంబు సాచ్చునో యుదకంబు లనుచు
నదుముఁ బొట్టను నోరి కడ్డంబు వట్టుఁ
జెన్నుగాఁ బసుపార్చి చేయు మజ్జనము
గన్నులుఁ జెవులును గాఁడంగ నూఁదు
నంగిటి ముల్లొత్తు నందంద వ్రేల
దొంగిళ్ళఁ గార్నీరు దోనెత్తి మిడుచు
బడఁతిచే నీరఁదూపొడిచి బొట్టిడును
మడఁది యంగుష్టంబు మన్నింత మెదిచి
కడవ నంటిన యట్టి పిడుక విభూతి
యడరఁ బుత్త్రిని నొసలారంగఁ బూయు
నెత్తు గ్రుంగెడు నని యెత్తంగ వెఱచి
..............................
గాటుక యిడు మూఁడు గన్నులఁ గలయఁ."

—ద్వి, బ. పు. 3వ ఆశ్వా, పుటలు 153-154.

వేషభాషలు:

దోనమయ్య శ్రీశైలయాత్ర పోవుచుండినపుడు దారిలో అతనికి కనపడిన అనేకులను, అనేక వేషధారులను—జంగమకోట్లు, వృద్ధతపోధనులు, మిండజంగములు, శీలవంతులు, విరక్తులు,

శివయోగులు, అభ్యాసయోగులు, పుణ్యాంగనలు, జోగులు, పిచ్చుకుంటులు, చెంచులు—ఎందరినో ఈసందర్భమున సోమనాథుడు ఆయావ్యక్తుల వేషభాషలను తనివితీర వర్ణించి మనకానాటి ప్రజల వేషభాషలను కన్నులకు గట్టినట్లు చిత్రించినాడు.

జంగమకోట్లు 'పాడవగు సంబువులు', 'పసిడిగొడగులు' 'పావలు', 'వాగెల పాదరక్షలు'ను 'కఱకంచుకావులు'ను. 'నలిపొత్తి పచ్చడములను, 'గాపీనములు'ను. ధరించి' పలుచనిజోడు కుప్పసములు' పూని పట్టువస్త్రములను వలెవాటుగా వేసికొని కుప్పసము'ల మీాద 'పటికముసరంబు' ధరించి 'కావిపచ్చడములు కావిదుప్పట్లు, తావుమంజిల్లుఖండంబు దోఁపులఁను, చల్లడాల్ దట్టి పచ్చడములును, రత్నకంబళులును; వెలిపొత్తి పచ్చడములు, బూరవడములు, పట్టుపచ్చడములు' వెలిపట్టు పైఁబెట్టువఁన్నగు వానినిదాల్చి, మెల్లని నడకతో, మృదుభాషణములతో నడచి రట. (చూ.పం,చ. పర్వత ప్రకరణము. పుట 307-314)

ఆంధ్ర దేశము పరుసబంతులు గట్టి నిట్లు పాడిరి :

"నల్లవో! నల్లవో! నగరాజ రాజ!
మల్లయా! మల్లయా! మహనీయ తేజ!
పరమ పాతక కోట్లు భస్మమై తూలు
సిరిగిరి మల్లన్నఁ శరణన్న జాలు;
రాఁబోవ నెంత దూరంబైన నడువ
నేఁబోదు మల్లయ్య నేఁటేట గొలువఁ."

..............................

—పర్వత ప్రకరణము. పుట 374.

కన్నడ పరుస నడక యిట్టిది;

"వన్నని కర్ణాట భాష పొంగముగ
నజగమ దేవయ్య! బిజమాడి రయ్య;

నిజభావ దేవయ్య! నీవిత్తబన్ని,
యల్లమ దేవయ్య! యెత్తలో హోది?
బల్లద దేవయ్య! బన్నిరి నీవు;"

..........................................................

* * * *

ముందె హోగలు బేడ మందితా హొల్ల
హిందె నిల్లలు బేడ యిరువుదు భయవు
ఉలుకదె నిల్లదె హొందాగి నమ్మ
బలదల్లి కెలదల్లి బన్ని బన్నెనుత

* * * *

కేళుత్త, భక్తరం హేళుత్త, మహిమె
సాళుత్త, సమయగళ్ బీళుత్త, తమక
పేళుత్త, మందియొళ్ మాళుత్త, నెరహి
తిళియుత్త, మందియొళ్ నుళియుత్త, ప్రియవు

* * * *

ఇట్లు కన్నడదేశమునుండి వచ్చినయాత్రీకులు మాట్లాడుభాషను పండితారాధ్యచరిత్ర పర్వత ప్రకరణమున వాడినాడు. ఇట్లే ఆరెదేశపు భాషారీతులను తెల్పినాడు.

"మాగరషాలె వకో మఝు బాపహ్మణత
భాగవతే వటె భక్తతే హ్మణత
చరలింగ గురులింగ శంభూనో హ్మణత
పురవర కెతిదూర పర హోతె హ్మణత

* * * *

— ప. ప్ర. పుటలు 381-387.

అరువదేశ యాత్రీకుల భాష:

'అరులు గిరితి యెన్నె యరనే పిరానె
చిరిగిరి నిలయనే చివనె యాణ్డవనె
అంగమాలుందానె యాయిరుంద వనె
మంగయర్ పాంగనే మల్లికార్జుననె
యానున క్కడియనే నఖిల నాయకనె



—ప. ప్ర. పుట 388.

గీర్వాణభాష:

''నాయాతి పరిష దాయాహి సఖిత్వ
మాయామి సన్మార్గ మతిరభసేన
ఆత పక్లాంతాస్మి, హా మనోరమణ!
ఏత దేవహిపుర మిందీవరాక్షి!
దృష్టిం విశిష్టాం నిధేహి ప్రమోద
మిష్ట దాయిని సదా హేకర భోరు!
శ్రాంతాసికిం సఖి! శైలత లేఘు!



—ప. ప్ర. పుట 389-390.

ఇట్లే మాళవ, కాశ్మీర, మాగధ, సింధు, గౌళ, తురుష్క, కొంకణ, శూరసేన, బంగాళ, కాంభోజ, పాండ్య, ఘూర్జర, కళింగ బర్బర, సింహళిక, కరహాట, సౌరాష్ట్ర, లాట—మున్నగు దేశములవారు మాట్లాడు సహజభాషలను సోమనాథుడు పండితారాధ్యచరిత్రయందు పేర్కొనినాడు.

బసవపురాణములో సకలేశ్వర మాదిరాజయ్యకథలో శివుని గొల్లనివేషమును వర్ణించు సందర్భమున సోమనాథుడు తన కాలమందుండిన గొల్లవాని వేషవర్ణనను, వర్ణించినతీఱిట్టిది.

'పలుపుఱ్ఱేళ్లును, మొద్దుపాదములు, గుజ్జు చిఱుతొడలును, దొప్పచెవులును, బొక్కిఁబోయిన చెక్కిళ్లు, బొక్కిఁబోయిన ముక్కును, నిక్కిన మెడయు, బల్లమీసములు, పిల్లిగడ్డమును, నల్లని మేనును, నడ్డివీపును' కల్గినగొల్లడొకడు 'ముచ్చుగత్తి, యుచ్చుఁగోకలుఁ జూడుఁగోడుపు, మొలతిత్తి'' నిడి, 'దొడ్డమొలకచ్చగట్టి గాలిదప్పపువెంట్రుకల్ దూలియాడ నీలవెట్టుచు, గుక్కలఁ బిలుచుచు, గొడ్డలిబరిగమ్మి-గూటికుండయును, దుడ్డుఁ గోలయు', బట్టి, కొన్ని మేకపిల్లల చంకనిరికించుకొని, కొన్ని మేకల రొప్పికొనివచ్చి తుమ్మనున్న కాయల రాల్చెనట. (చూ. బ. పు పుట224-225).

బసవపురాణమున మడివాలు మాచయ్యకథలో చాకలి, కుమ్మరి, జాలరి, వడ్రంగి, కనుమరి, నగసాలి, శబరుడు, వేటేడు, వెండీడు, బోయ=మున్నగు వృత్తులవారిని, వారివృత్తులను సోమనాథుడువర్ణించినాడు. (చూ. బ. పు. 4వ ఆశ్వా. పుటలు 237-238) శంకరదాసికథలో బొంతలకుట్టి జీవించువారి వృత్తిని సోమనాథుడు పేర్కొనెను.

పాల్కురికిసోమనాథుడు తనకాలమందుండిన బట్టలపేర్లను ఇట్లు తెల్పినాడు.

"వెంజావళియు, జయరంజియు, మంచు
పుంజంబు, మణిపట్టు, భూతిలకంబు,
శ్రీవన్నియయు, మహాచీని, చీనియును,
భావజ తిలకంబు, పచ్చని పట్టు,
రాయశేఖరమును, రాయవల్లభము,
వాయుమేఘము, గజవాళంబు, గండ
వడము, గావులు, సరిపట్టును, సంస
పడియు, వీణావళి, పల్లడ దట్టి
వారణాసియు, జీవ వాయు, గొందొగరు,

గౌరిగనయమును, క్షీరోదకంబు,
పట్టును, రత్నంబు పట్టును, సంకు
పట్టును, మరకత పట్టు, పొంబట్టు,
నెఱపట్టు, వెలిపట్టు, నేత్రంబు పట్టు
మఱి తవరాజంబు, మాందోళిరవియుఁ
జంద్రా తపంబును, సాంధ్యరాగంబు,
నింద్ర నీలంబు, మహేంద్ర భూషణము,
సన్న నడంచును, శరధియు, మేఘ
వన్నెయు, రుద్రాక్షవన్నె, కాంభోజి.
పులిగోరు పట్టును, భూపతి, రుద్రి
తిలకంబు, సరిపట్టు, మలయజ సిరియు,
గొలని మేఘము, గజావళి, హయావళియు,
వలిపంబు, సరిగమ్మి, తెలుపు, దివ్యాంబ
రంబును, నుదయ రాగంబు, దేవాంబ
రంబు, పాత్రియు, గుజరాత్రంబు పట్టు."

— బ. పు. 3వ ఆశ్వా. పుటలు 127-128.

—మొదలగు వస్త్రవిశేషములను తెలిపియున్నాడు. దీనివలన కాకతీయుల కాలములో ఎన్నివిధములగు వస్త్రములు తయారగుచుండెడివో మనకు బసవపురాణము మూలమున తెలియుచున్నది.

ఆకాలపు సామాన్య ప్రజలుకూడ ధరించుచుండిన ఆభరణములపేర్లు పండితారాధ్యచరిత్ర (పర్వతప్రకరణము. పుట312) వలన తెలియుచున్నది.

'రాగికుండలములు', 'రాగినందులు', 'రాగినూలులు ; 'రాగికంటెలు'; 'రాగిదండలు'; 'రాగిజన్నిదములు'; 'రాగి యుత్తెరలు'; 'కొక్కెరలు'; 'పాలెలు'; 'సరిపెణలు'; 'సేవళములు'; 'కీలుకొలుకులు'; 'రాగికీర్తిముఖములు'; 'అందెలు'; 'రాగికటకములు'; రాగిపదకములు'; 'రాగిబడ్డియాణములు'; 'కటిసూత్ర

ములు'; ''కంచుమట్టెలు, ఉంగరములు, వల్దయూరులు, నల్ల గాజులు, తగిరపుకడియములు, పచ్చగాజుపూసలు, సంకుపూసలు, నల్లపూసలబన్నసరము''(చూ. దీక్షా ప్రకరణము. పుట 133-134) మున్నగు సామాన్యజనుల ఆభరణ విశేషములను సోమనాథుడు తెల్పియున్నాడు.

ఆకాలమున సామాన్యప్రజలు ఈక్రింది పాత్రలను నీరు నింపుటకు వాడుచున్నట్లు పండితారాధ్య చరిత్ర (పర్వత ప్రకరణము. పుట 354) వలన తెలియుచున్నది.

''ఉత్తిలములు; పోకపొత్తులు; గల్లతిత్తులు; రాగినిండెలు; పేరుపులు; కుండలు; కలంతులు; గుళ్ళగోరలు; గిండులు; కమండలములు; గరిగల్లు; బటువులు; కావళ్లు; గూడగరతిత్తులు.

## వైద్యము

బసవపురాణమున సోమనాథుడు తనకాలమున ప్రజలలో ప్రబలియుండిన వ్యాధులనుగూర్చి, వానిచికిత్సా పద్ధతులను, వైద్యసిద్ధాంతములను విపులముగా సూచించియున్నాడు. క్రీ. శ. 12, 13 శతాబ్దములకాలమునాడు వ్యాప్తిలో నుండిన వైద్యపరిజ్ఞాన పదజాలమును, వైద్యుల ఔషధ ప్రయోగములను కొంత తెలిసికొనుటకు ఈగ్రంథమే మనకాధారము.

కంటిజబ్బును నిర్ణయించుట యెంతసహేతుకముగ నుండెనో వినుడు:

''సారకటాక్ష వీక్షణ జాలమైనఁ
గారుణ్య జలములు గావ యుష్ణములు
ఘర్మ జలంబుల కశ్రులమంద మేని

ఘర్మజలంబులు గన్నులఁ గలవె?
యొండు దుఃఖంబేని యూహించి చూడ
రెండు గన్నులఁ గాఱు కండునే నీరు?
తానొక్క కంటనె ధారవర్వెడిని
గానోపు నక్షి రోగంబయే మేని
చెప్పఁ జిత్రము! గోడి ఱెప్ప వెర్గినదో?
తప్పవో నొవునో? తడికంటి విధమొ?
నొవ్వియో పొరగప్పెనో? మాద తెవులో?
పువ్వు వట్రిల్ల నాపువు కంటి పోటో?
మయిల వడ్డదియొ దుర్మాంస దోషంబో?
అయిరయో వెండియు నక్షి రోగంబో?"

— బ. పు. 3వ ఆశ్వా. పుటలు 194-195.

పండితారాధ్యచరిత్రమున (చూ. మహిమ ప్రకరణము. పుట 108) సోమనాథుడు తడవిన నేత్రరోగము లీక్రిందివి,

"తప్పవోయినకన్ను; తడికన్ను; పొరయఁగప్పినకన్ను; గుడ్డుఁగన్ను; ఒడ్డుఁగన్ను; గ్రుడ్డికన్ను; బరిగన్ను: గోడ్రెప్ప గన్ను; బ్రొడ్డుకన్ను; పువ్వువోయినకన్ను; పాలగట్టినకన్ను; బ్రింగుడుకన్ను; గ్రాలుకన్ను; నీరుగాఱెడుకన్ను, బ్రొందకన్ను; బ్రుస్సుకన్ను; మ్రందకన్ను; మ్రాదలకన్ను; పోటుఁగన్ను; బ్రొంగవోయినకన్ను; దూటుగట్టినకన్ను; దూలగొన్నకన్ను; మయిల కన్ను; మసుమసుకనికన్ను; అయిరకన్ను; అదరెడుకన్ను; దోఁటువోయినకన్ను; తొలుఁగుడుఁగన్ను; దీఁటకన్ను; తిమిరంబు; రక్త దోషము; దుర్మాంస దోషము; వాయుదోషము; పటలము; దుర్దర్శి; కృష్ణకాస; అతిరక్తకాస; శ్వేతకాస.

వాయుదోషమునకు చేయు నాటువైద్యమును సోమనాథుడు నాట్యనమిత్తండికథలో (చూ. బ. పు. 3వ ఆశ్వా. పుట 176)

చక్కగా తెల్పినాడు. వాయుదోషము వచ్చిన శివునకిట్లు నాటు వైద్యచికిత్స చేయబడినట్లు వర్ణింపబడినది.

"వాయు తైలముఁ గొని వచ్చి యాక్షణము
మాయాప హరు మేన మర్దన సేసి
తవిలి యా వావిలి చివుళు లుఁమ్మెత్త
చివుళులు దక్కుడి చివుళు లామఁదము
చివుళులు పండిన జిల్లె డాకులును
నివి యాదిగా మందు లిన్నియుఁ గూర్చి
చెచ్చెర, దనువెల్ల సేకంబుసేసి
పొచ్చెంబు లేకిస్కు పొట్లాలఁ గాఁచి
పుచ్చుచు నరచేత వెచ్చఁ జూపుచును
నిచ్చ యెతిఁగి కాఁక లిచ్చుచు వలయు
పథ్యంబు లారగింపంగఁ బెట్టుచును
తథ్యంబుగా వెండి తగు క్రియల్సేయ."

ఇట్లే బెజ్జమహాదేవికథలో శిశురోగములను సోమనాథుడు తెల్పినాడు.

"నతిమియో? కోవయో? యంగిటి మల్లో!
యెఱుఁగను మందు ప్రాఁ కేమియు ననుచు."

— బ. పు. 3వ ఆశ్వా, పుట 156.

## ద్యూతపరిభాష

పండితారాధ్యచరిత్ర కుమారపాల ఘూర్జరునికథ (పురాతన ప్రకరణము. పుటలు 368–356)లో ద్యూతపరిభాషను సోమనాథుడు వాడినాడు. దాయము; ఈరైదు; దుగ; ఇత్తిగ; దచ్చౌక; పంచియ; చౌకదుగము; భద్రము; సత్తా; తీవంచ; సొవంచి- ఈపదము

ములు ద్యూతసందర్భమున వాడబడినవి. జూదమున నోడిన వారికి "తనతలచుట్టుఁ గాలువట్టిమోవఁగ నెత్తికట్టుశిక్ష" యట.

## చౌర్యము

చోరసాధన విశేషములను, చౌర్యకళను సోమనాథుడు బసవపురాణములో కన్నద బ్రహ్మయ్యకథలో నిట్లువర్ణించినాడు. దొంగలు,

"కత్తియు, బలపంబు, గావి చీరయును,
గత్తెర, యిసుము. నత్తులును, ముండ్ల
బంతియు, నీలి కప్పడములు, ద్రింపు,
మంతర కాటుక, మఱిగండ వేఁ,
సెలగోల, యొంటట్ట చెప్పులు, బీఁక,
యెలుకల బూడిదయును, వాటుతాలుఁ,
గుక్కల వాకట్టుఁ, గొంకినా రసము,
గ్రక్కునఁ గంకటి రజ్జువు, నమర
* * *
గడియ కన్నంబును, గడప కన్నంబు
గోడ కన్నంబును గుఱి నేల కన్న
మోడక త్రవ్వి."

— చూ. బ. పు. 5వ ఆశ్వా. పుట బు361-362.

ఇల్లుచొచ్చిరట. ఇచట సోమనాథుని కాలమందుండిన కన్నపు దొంగతనమునుగూర్చి తెల్పబడినది. బందిపోటు దొంగతనమును గూర్చి ద్విపద పరమయోగివిలాసము (చూ. 6వ ఆశ్వా. పుట 406. ద్వి. పం. 9609-9619) తెల్పబడినది.

## పల్నాటి వీరచరిత్ర — సాంఘిక జీవితవిశేషములు:

పాల్కురికి సోమనాథుని రచనల తర్వాత సాంఘిక జీవిత చరిత్రకు ఎక్కువ ఉపకరించు ద్విపదగ్రంథము పల్నాటి వీరచరి

త్రయే. రంగనాథరామాయణము, మడికిసింగన ద్విపదభాగవత దశమస్కంధము— ఈ రెండును పల్నాటివీరచరిత్రకు పూర్వపు రచనలయినను ఇవి సంస్కృతానువాద గ్రంథములగుటచే సమకాలిక సాంఘికజీవితమిందు వ్యక్తమగుట కవకాశములేదు. అయినను గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణమున సీతా కల్యాణసందర్భమున కొన్ని దేశీయాచారములను—లగ్నసమయము'ను నిర్ణయించుట, 'కల్యాణవేది' నమర్చుట, 'మధుపర్కసమయము' దీర్చుట, 'కోమలతెరమరుగున' వధూవరుల నిలుపుట, 'సుముహూర్తమని తెరతీయుట, తలంబ్రాలు, లాజహోమము, మునులదీవనలు,—మొదలగువానితో పెండ్లి నాలుగుదినములు జరుగుట, పిమ్మట జనకుడు కూతుళ్లకు బుద్ధులుగరిపి, భూషణాభరణములిచ్చి, అల్లుండ్లకు అరణమిచ్చిపంపుటయు వర్ణింపబడినది—మూలములో లేని ఆనాటి లౌకికాచారములను వర్ణించియున్నాడు. కొన్ని విషయములందు రంగనాథ రామాయణము ననుసరించినట్లున్న భాస్కరరామాయణమున ఈ దేశీయాచార వర్ణన విస్మరింపబడినది. రచనలలో దేశీయమగు ఆంధ్రప్రజా జీవితమును వర్ణించు విషయమున చంపూకావ్యకర్తలకు మక్కువ తక్కువనుటకిది ఒక నిదర్శన మగుచున్నది.

పల్నాటి వీరచరిత్ర క్రీ. శ. 15వ శతాబ్దమున రచితమైనను ఇందలి కథావస్తువు క్రీ. శ. 1181–82 మధ్యకాలమున జరిగిన చారిత్రక సంఘటనకు సంబంధించినది. ఆనాటి శైవవైష్ణవ మతానుయాయుల కూడలి అనదగినది పల్నాటివీరచరిత్ర. శైవ వైష్ణవ భేదము లెట్లుండినను, వారిరువురు వర్ణభేదనిర్మూలనమునకు కృషిచేసిరి. బ్రహ్మనాయుడు సంఘసంస్కర్త. ఆతడు కుల

భేదములను పాటింపక సకలవర్ణములవారిని తనతో కలుపుకొని సహపంక్తి భోజనముల తృప్తిపరచినట్లు పల్నాటి వీరచరిత్రలో పలుచోట్లగలదు. అతడు వైష్ణవమతమును పల్నాటిలోవ్యాపింప జేసినవాడు. బ్రహ్మనాయునిపక్షమున వీరశైవమతాభిమానులగు అలరాజు, కొమ్మరాజు మొదలగువారునుకలరు. పల్నాటియుద్ధమున వీరవైష్ణవులును, వీరశైవులను, మతభేదములను విడిచి బాలమలిదేవాదుల పక్షమున నిలిచి యుద్ధముచేయుట ఆకాలము నాటికి నిజముగా నొకవింతయే.

మాలయైన తెప్పలినాయనికిని పెమ్మసానికినిపుట్టిన కన్నమదాసుని బ్రహ్మనాయుడు జ్యేష్ఠపుత్రునిగా భావించినాడు.

"ఎలమి నాయుని కీవు నేమి గావలెను
వినిపింపు కన్నమ వివరంబు గాఁగ."

—చూ. బాలచంద్రుని యుద్ధము. పుట 437; పం. 2209-10.

అని బాలచంద్రుడు ప్రశ్నింపగా కన్నమదాసు ఇట్లుపల్కెను.

'నాయుడు విష్ణువు నారాయణుండు
ఆయన వరమిచ్చె నధిక మోదమున
తగ పుట్టితిని నేను తల్లి గర్భమున
పరమ దయాళుడౌ బ్రహ్మన్న కేను
పాద సేవకుడనై పరగిన వాడ
భుజముల ముద్రలు దాల్చిన వాడ
క్షుద్ర మార్గుల నెపుడు చూడని వాడ
ప్రాసాద జీవినై ప్రబలిన వాడ
జ్యేష్ఠ పుత్రుడనంగ చెలగిన వాడ."

— బాలచంద్రుని యుద్ధము. పుట 437; పంక్తులు 2212-20.

బ్రహ్మనాయునిచేతి తీర్థప్రసాదములు గైకొన్న వారందరును ఏకసంఘీయులుగా పరిగణింపబడినారు.

ఆటలు :

క్రీ. శ. 15వ శతాబ్దమునాటి బాలురు ఆడుచుండు ఆటలను శ్రీనాథుడువిపులముగావర్ణించినాడు. బొంగరాలఆట పిల్లలఆటలలో చాల ముఖ్యమైనది. బాలచంద్రుడు ఆడినఆటలివి. గుమ్మడికాయలఆట, చెఱకు పందెములఆట, పోకలాట, బంతిఆట; గుంతమాపలనము; దూకకుప్పలఆట; గచ్చకాయలాట.—(చూ. పల్నాటి వీరచరిత్ర.పుట. 358; 368). 'పొట్టేల్లు', 'సారమేయములు'; 'బంతులు'; పిట్టలు, పంజరచయము. డేగలు, పికిలిపిట్టలు. మున్నగునవి ఆటల సాధనములు. వినోదము కొరకు నిర్వహించు పశుపక్ష్యాదుల పోట్లాటలలో ఆనాడు పొట్టేండ్ల పోరితనము, కోళ్లపందెము, పికిలి పిట్టల కలహము, దున్నల యుద్ధము – ఇత్యాదులు ముఖ్యమైనవి. కోడిపందెము తెలుగుదేశమున ప్రాచీనమైన ఆటలలో ముఖ్యమైనది. పల్నాటి యుద్ధమునకు ఈ 'కోడిపోరు'కూడ ఒకముఖ్య కారణమైనది. తెలుగుదేశమున సంక్రాంతి పండుగదినములందు కోడి పందెములాడించుట నేటికినికూడకలదు. వినోద విశేషములలో 'గంగిరెద్దులాట', కూడ నొకటైయుండెడిది. మనకు తెలిసినంత దిరకు 'గంగిరెద్దులవాని' ప్రశంసగల మొదటి తెనుగుగ్రంథము పల్నాటివీరచరిత్రయే.

"గంగిరెద్దుల వాఁడు కావరమణచి
మునుదాడు పొడిచిన పోతెద్దు లట్లు."

— చూ. బాలచంద్రుని యుద్ధము. పుట 20, పం. 97-98

వేషాలంకరణ :

ఆనాటి వధువుల అలంకరణము లెట్టివో మనకీగ్రంథము వలన తెలియుచున్నది. సిరాదేవిని చెల్లులు పెండ్లికూతురును

చేయు సందర్భమున, ఆమెకు 'రాగిడి తరుగుడు పూవును, కెంపుల చంద్రవంకను, సూసకంబును నిలిపి, పల్లెరుపువ్వు, నెరితమ్మి రేకు, రావి రేకయు, అపరంజికమ్మలును, బావిలీలు, కుంపెట్లు, బవిరెలు, కుప్పె, కుతిగంట్లు, మెడనూలు, గుండ్ల పేరులును, నానుపట్టెడ, దండ. సరిగెలును, కడియాలు, వింతదండలు, గంటల మొలనూలు గజ్జెలందియలు, మట్టియలు, ముక్కుకు ముక్కర. ముత్తెపునత్తు, —అను ఆభరణములను ధరింపజేసిరి. (చూ. పల్నాటివీరచరిత్ర. పుట 66).

యుద్ధసన్నద్ధుడగు యోధునిరూపవర్ణన ఎట్లుండెనో కన్నమనేని వర్ణనమూలమున తెలియుచున్నది. కన్నమనీడు వక్షమున 'వనమాల'ను, చేతులకు 'గుజ్జరి కడియములు'ను, పిడిగంట, 'నెమలిసోగలు'ను, 'నల్లనిదట్టి'ని మొలలోకట్టుకొని, వీపున 'అర్ధనారీజల్లును, భైరవకత్తి'నిబూని, కోరమీసము మెలివెట్టి, జీరకండ్లతో, కాలికి పెండెరము ధరించి, ఘనమైన కాయముతో కదనభూమికి కదలెనట.

(చూ. ప. వీ. చ. కల్లుప్రతిష్ఠ పుట 335–344).

కొలువు కూటమునకు పోవు నలగామునియొక్క వర్ణన ఆనాటి రాజుల వేషాలంకరణకు దృష్టాంతముగనున్నది:

"నిలువు టద్దము చూచి నేరుపు మీర
తిలకంబు నుదుటను తిన్నగా తీర్చి
* * * * *
తగటు కూసంబులు ధరియించి తలను
ఒక వింత యుష్ణీష మొప్పుగా బెట్టి
హారి రత్నపు బిళ్ళ ననువొంద కట్టి
కర్ణ కుండలములు ఘనముగా మెరయ
అఖిల రత్నములతో నమరి కైనట్టి

పతక చయమ్ములు పైడి మాలికలు
మెడజుట్టి రొమ్మున మించి వెలుంగ
భుజకీర్తులను రెండు భుజముల దాల్చి
మేనికి రక్షయై మించు తాయెతులు
దండ చేతుల రెంట ధారణ చేసి
మురుగులు గొలుసులు ముంజేత నొప్ప
పదివేళ్ళ ముద్రికల్ బాగుగా పెట్టి
నవరత్న ఖచితంపు నడికట్టు తాల్చి
గండపెండేరంబు కాలికి తొడిగి
తగటు దుప్పటి గప్పి తనపాదములను
బంగారు పావాలు పన్నుగా తొడిగి."

— కల్లుప్రతిష్ఠ పుట 317-18 పం. 684-705.

మంత్రతంత్రాదులను ప్రదర్శించు 'కట్టుబోతు'లా కాలమున నుండిరి. ఈకట్టుబోతులు నాయకురాలితో తమ నైపుణ్యమును తెలియజేయు సందర్భమున,

"వాకట్టు, మరకట్టు, వణకెడుకట్టు,
పొట్ట పొంగెడుకట్టు, పొంగులకట్టు,
కూతపెట్టెడుకట్టు, కోపించుకట్టు,
ఎండిపోయెడుకట్టు, ఎగిరెడుకట్టు,
వీధిబారెడు కట్టు, బెగదెడు కట్టు,
కాళ్ళను చేతులు కదలని కట్టు,
ఎక్క సక్కియ కట్టు, నేడ్చెడు కట్టు,
కుంది కంచెడు కట్టు, గుడికొను కట్టు,
ఓకిలింతల తోడ నొరలెడు కట్టు,
ప్రాణంబు వోయెడి బలువైన కట్టు."

— కోళ్లపోరు. గోపన్నవిరుగు. పుట. 146.

—అను కట్టుమంత్రములను తెల్పిరి.

## వాయిద్యములు.

మద్దెల్లు, తాళములు, తమ్మటములు, రుంజలు, కైముళ్లు, రుద్రవీణ, నఫిరీలు, తప్పెట్లు, నాగస్వరములు, బూరలు, భేరీలు, పోటుధారలు. కాహాళములు, గాలికొమ్ములు,శంఖము, సన్నాయి, జోళ్లు, మురళి, డోలు, నగార-మున్నగు వాయిద్యములు ఆకాలమున నుండెడివి.

రాయబారమునకు 'భట్టు' లేక బ్రాహ్మణుడు పోవలెను, ఒక్కొక్కప్పుడు రాజబంధువులుకూడ రాయబారము నెరపెడివారు. 'భట్టువాడవుగాన బ్రతికితివిట్లు[2]', 'భట్టువాడవుగాన బ్రతుకనిచ్చితిని'[3] అని నాయకురాలు పల్కుటచే రాయబారి పరుషవాక్యములాడినను అవధ్యుడను ధర్మమును పాటించుచుండెడివారని తెలియుచున్నది.

యుద్ధమునకు వెళ్లెడివారు తమకోటకుతగురక్షణ ఏర్పాటు చేసికొనుచుండిరి. 'భూసుర పురోహితు'లచే 'జయముహూర్తము'ను పెట్టించి ప్రయాణభేరి వేయించి వెడలుచుండిరి. సేనల వెంట 'గొల్లెనలు' కట్టిన 'బండ్లు' 'బల్లానిపెట్టెలు', 'పట్టెమంచములు', 'పీటలు', 'తమ్మపడిగెలు', 'జాలవల్లికలు', 'చామరములు', 'బొక్కసములు', 'బోనగావళ్లు' 'జవ్వాజిపిల్లులు' 'పడివాగెతేజీలు', 'పాలకీజోళ్లు', అష్టభాగ్యములమ్ము నంగళ్లవారు' కదలిరట. (చూ. కల్లుప్రతిష్ఠ. పుట 295-296).

## లోహపుపనిముట్లు.

పట్టెళ్లు, కార్లు, కమ్మచ్చులు, నీరుకార్లు, సుత్తెలు, పడియచ్చుకత్తెరలు, శ్రవణాల్కోపులు, త్రాసులు-మున్నగు సాధ

2. చూ॥ కల్లుప్రతిష్ఠ - పుట 328; పం. 981.

3. చూ॥ కల్లుప్రతిష్ఠ - పుట 328; పం. 984.

నములను లోహపుపనివారలు బంగారు బొంగరములను చేయుట కుపయోగించిరట. (చూ. బాలచంద్రుని యుద్ధము. పుట 364).

## జాతులవారు:

ఆనాటి తెలుగుసంఘమున వెలసిన కొన్ని జాతులను గురించి పల్నాటి వీరచరిత్ర (పుటలు 209-210) వలన తెలియనగును. 'బోయవారు', రుంజలు, పిచ్చుకుంట్లవారు, ఇనుపకోలలవారు, నీలెలవారు, అరిగెలవారు, నడిదాలవారు, సురియలవారు, శూలాలవారు, చెంచులు, పడవాళ్లు—మున్నగు జాతివారు పల్నాటి వీరచరిత్రమున పేర్కొనబడిరి.

ఆనాటి ప్రజలు గోవులను కన్నబిడ్డలవలె చూచుకొనెడివారు. ఆవులకు, ఎడ్లకువారు పెట్టుకొన్న ముద్దుపేర్లు ముద్దుగొల్పుచుండును.

"అందెల బసవన్న, ఆదినాథుండ!
నందుల పిడిగంట నాగ వాసయ్య
గోవుల విటకాడ గోగు బయ్యన్న
వంటరి పులి జింక వర పెరుమాళ్ళు
కట్టని కలుకోట కరినంది రంకె
* * * *
కరనంది బసవన్న కంచివరదుండ
నెల బాల చంద్రుండ నీలవర్ణుండ
జల్లుల ధర్మజ జయకంఠనాద
వైకుంఠ వాసుడ వాసుదేవయ్య
పుట్టల భూపతి పెంజెల్లు పెద్ద
ఇంద్రుని వజ్రయ యిప్పగిరీశ
గోగు భైరవమూర్తి గోవిందరాజ
చెంచుల యోబయ్య చెన్నమల్లయ్య

కంచి యేకాంబర కాశి కానాథ
మధురాపురి ప్రియా మహానంది నాథ
కాముడ సోముడ కాయజ వరద
రామడ భీముడ రంకెల వలస.''

—కల్లు ప్రతిష్ఠ పుటలు 301-302; పం. 238-257.

## నవనాథచరిత్ర-సాంఘిక జీవిత విశేషములు:

గౌరన రచించిన నవనాథచరిత్రయు క్రీ.శ. 15వ శతాబ్దమునాటి ఆంధ్రదేశ సాంఘిక పరిస్థితులను తెలిసికొనుటకు కొంత ఉపకరించుచున్నది. కంటిరోగముల భేదములను, వానిపేర్లను తెలిసికొనుటకు ద్విపదబసవపురాణము మనకాధారమగుచున్నట్లే నవనాథ చరిత్రమూలమున పశురోగముల భేదములు వానిపేర్లు తెలియుచున్నవి. గౌరనకు పూర్వము పశురోగప్రశంస తిక్కన విరాటపర్వభాగమున కొద్దిగా కన్పించుచున్నది. గోపవేషమున సహదేవుడు విరాటరాజుతో ''ఆఁబోతు పంచితంబు మూర్కొనినను, బై గాలివీచినను, గొడ్డునకై నంజూలు నిలుచు నుంగిడి యెదురుఁ ద్రిక్కుయను వానికి నాపేరుఁ జెప్పినంజాలు'' అని చెప్పెను. (చూ. విరాటపర్వము. 1వ ఆశ్వా.ప. 286) ఈమాటలలోకన్న నవనాథచరిత్రలో పశురోగములవివరణ అధికముగా కలదు.

''పీలిపాగ, మొలలోపెట్టుకొన్న పిల్లఁగ్రోలు, మూపున గొడ్డలి, ముసుగువేసుకొన్న గొంగడి, చేతగుదియ, మెడలో గురిజపూసలపేరు, బొంగుకోల, కాసెదట్టి, బెబ్బులుల వాకట్టు బదనికలు, బిగించిచుట్టిన యుగ్రితాడు, బీరణములు నించినతిత్తి, జింకకొమ్ము, జిల్లిచిక్కము, కాపుకుక్కలు''—ఇవి ఒక గొల్లపరి

కరములు (చూ. నవనాథ చరిత్ర. పుట 27). గొంగడి, గొడ్డలి, బొంగుకోల, చిక్కము, ఉర్రిత్రాళ్లు, తిత్తి—అను వస్తువులు సామాన్యముగ ఈకాలమందునను గొల్లల దగ్గరయుండునట్టివే. పాల్కురికి సోమనాథుని బసవపురాణములోని గొల్లని వర్ణనలో వికృత రూపవర్ణన యెక్కువ. గొల్లని వేషభాషలకుసంబంధించిన వర్ణన తక్కువ. నవనాథ చరిత్రయందట్లుగాక గొల్లనికి సంబంధించిన విశేషములు యెక్కువగానున్నవి. గొల్లలు ఆవులనుకూడ కాయుచుండెడివారు. తొలికోడి కూయగానే లేచి తనతోడి గొల్లలతో చేరి ఆవుల పేర్లుపెట్టిపిలిచి, పాలుపిదికి నగరికి పంపితర్వాత మేపుట్టకైపొలములకు వానిని తోలుకొనిపోవుచుండిరి. దూడచచ్చిన ఆవులను సేపునట్లుచేయుట, కడుపులోపలనే దూడచచ్చినఆవులకు మందులిచ్చుట వారెరింగియుండిరి. ఆవులకు వచ్చురోగములను గౌరన ఇట్లుపేర్కొనెను.

"నరుదు కన్నును నీరు నాలిక చేర్లు
గురుదేవులును గంటి కురుమకట్టూర్పు
కప్ప నావురు గాలి గజ్జిపల్ తిక్క
పుప్పి పంపర యూడు బొడ్డు బొల్లూత
మొలవిడె సెల తెవులు ముతుబంతి కవటు
తలయేరు తోడకు వాతము కల్లవాపు
నలదొబ్బు తెవులును నాదిగా నెన్న
గల పసరాల రోగములకు నెల్ల
మందులు బెట్టును మంత్రింపఁ దెవులు
కందువు గని చూడఁగా నేర్తు."

—నవనాథ చరిత్ర. 1వ ఆశ్వా. పుట 30.

నవనాథ చరిత్ర మూలమున ఆనాటి పుళిందుల వేషాది విశేషములు తెలియుచున్నవి.

"ఎక్కు వెట్టిన విల్లు నేర్చిన (యమ్ము)
చిక్కు వెండ్రుక కొప్పు చెవి నున్నపీక
గోరోజనము బొట్టు గురువెంద పేరు
పారుటాకుల కాసె పచ్చని ఖారక
పీలి నెట్టెపు జుట్టు పెంచ పూదండ
లీలఁ జెన్నారుపు లిందుఁ డొక్కరుఁడు."

-- నవనాథ చరిత్ర 3వ ఆశ్వా. పుట 123.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున కాలకౌశికుడు హరిశ్చంద్రునికి 'అప్పులుగొని త్రోచునవుపులుఁకొన్ని' చెప్పినాడు. ఇవి ఆనాటి సంఘములో అప్పు లెగవేయువారు అవలంబించుపద్ధతులను సూచించును.

"తనడంబు దప్పక ధనికుల యిండ్ల
కనువునఁ జనివారి కనురాగ మొదవ
రిత్త మ్రొక్కులు మ్రొక్కి ప్రియములు వలికి
నెత్తిఁ జేతులు వెట్టి నిక్కముల్ నొడివి
తెరలఁ దియ్యని పండ్ల తోపులు మరిపి
చరణ సేవలు సేసి చనవులు మెఱసి
యిమ్ము దనపేర్మి నెంతయుఁ జెప్పి
నమ్మిక బుట్టించి నయములు సేసి
గడుసరి మనసులు గరగించి పుచ్చి
జిడికిరింతలు గట్టి చెవి యానవున్న
* * * *
లందు బోతులఁ దనలాగు పెక్కలజ
బండలఁ గొందఱఁ బాటించి తెచ్చి
టక్కరి పూట తాటలు సేసి ధనము
* * * *
విసికితి మని తార వేసారి యప్పు
లొసగిన వారెల్ల నొల్లక తొలఁగ
నెమ్మది దానుంట నేర్పది."

—హరిశ్చంద్ర. ద్వి. భాగము పుటలు 292-298. ద్విప. 611-657

## సుభద్రాకల్యాణము - సాంఘికజీవిత విశేషములు.

తాళ్ల పాక తిమ్మక్క మంజరీ ద్విపదలో రచించిన సుభద్రా కల్యాణముకూడ ఆనాటి (16వ శతాబ్ది) సాంఘిక విశేషములను కొంతవరకు తెలియ జేయుచున్నది. ముఖ్యముగా బొమ్మల పెండ్లిండ్లు ఆడవారి ఆభరణములు, అలంకరణవిధానము, ఆహారము-వీనిని ఎక్కువ ప్రత్యేకతతో వర్ణించియుండుట స్త్రీ సహజమైనదమున కొకతార్కాణ మగుచున్నదికూడ.

సుభద్ర బొమ్మలపెండ్లికై చేసిన సంరంభమిది:

"పాలుపైన రత్నాల బొమ్మరింటికిని
తెలుకైన పగడాల దార బంధములు
పచ్చల తలుపులు పన్నారు గురుగు
లచ్చంపు దంతాన నమరు బొమ్మలను
చెరగుల యంచుల చీని వ్రాతలను
చిరుత పప్పళ్లు మరి చెంద్ర కావులును
బంగారు బొమ్మలకు బాగుగా కట్టి
శృంగార మవరించె చెలియ సుభద్ర."

— సుభద్రా కల్యాణము' పుట 18,

నేటికిని పర్వదినములందు ఇట్టి బొమ్మలపెండ్లిండ్లను ఆంధ్రులందు ఆడపడుచులు చేయుచుండుట మనము గమనింపవచ్చును. పోతన భాగవతమునందు సత్యభామ, రుక్మిణుల వృత్తాంతములందు 'బొమ్మపెండ్లిండ్లు' అనుమాట కలదు. కాని అందు వివరములు కానరావు.

తిమ్మక్క తనకాలమునాటి స్త్రీలు ధరించు ఆభరణ విశేషములను 'సుభద్రాకల్యాణ ఘట్టము'న నిట్లు తెల్పినది.

"పసిడి ముత్యాలు నొప్పగ పూర్ణ చంద్రు
శవణించు చెవుల తాటంకాలు చేర్చి

మెఱగు దీగెకు చెంత ముత్తెంపు కొలికి
జిగి మణుల్ మిగులు మంజిడి తాళి జేసి
పుంజాల దండ దాపున నేవళమ్ము
రంజించు భిన్న సరంబు క్రీడించ

—సుభద్రాకల్యాణము. పుట 20.

* * *

ఒడ్డాణమును బెట్టె నూగాడు మొలను
బిల్లల మొల నూళ్ళు బిగిసి మ్రోయగను
ఘంటల మొల నూళ్ళు ఘల్లున మొరయ
కంఠ హారమ్ములు కౌస్తుభ మణులు
కాలి పెండెయు గూర్చె ఘనత తోడుతను
అందెల దిద్దెనా అతివ సుభద్ర
తళుకు మించిన సంది దండెలపైని
నెలవంక తాయితల్ నెరిపుట్ట గట్టె
శ్రీకారముల మీద చెలగాడు చెవుల
కమలాక్షి పంజుల కమ్మలే పెట్టె
సొమ్ము లన్నిటి మీద శోభిల్లునట్టి
మూడువేలుం జేయు ముక్కర పెట్టె."

—సుభద్రా కల్యాణము. పుటలు 51-52.

స్త్రీల దైనందిన కృత్యములలో భాగమైన అలంకరణ విధానమును తిమ్మక్క వర్ణించినది. "కమ్మకస్తురి నలుగిడి, గొజ్జగి నీట జలకమాడి, చెంగావి పావడచుంగు విడిచికట్టె, నెరగోర కురులనుదువ్వి, పాపటదీర్చి, జారముడిచినకొప్పులో, మల్లెలు, జాజులు, సంపంగి, పారిజాతములను పెట్టుకొని, గుమ్మిడిగింజనామమునుతీర్చి, శరీరమునకు గోవ కస్తూరిబూసి, కపుర పీడెంబుగావించి" సుభద్ర యతివేషముననున్న అర్జునుని సేవార్థమరిగినదట.

(చూ. సుభద్రాకల్యాణము, పుటలు 26-28). ఇది వైష్ణవ స్త్రీల వేషాలంకరణను తెల్పును.

## చిన్నచిన్న ద్విపద రచనలు - సాంఘిక జీవిత విశేషములు:

క్రీ. శ. 16 శతాబ్దపు సాంఘికచరిత్రను తెలిసికొనుటకు ద్విపద పరమయోగివిలాసము ముఖ్యాధారమగుచున్నది. "మన సాంఘిక చరిత్రకిది చాలా పనికివచ్చును. ఈ దృష్టితో వసు, మనుచరిత్రాది బహుప్రబంధాలకన్న నిదిచాలా మేలైనది[4]" అని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు ఈ గ్రంథమునుగూర్చి వ్రాసిరి. సిద్ధరాజు తిమ్మభూపతి పద్యపరమయోగి విలాసము, విప్రనారాయణచరిత్ర—మున్నగు చంపూకావ్యములందు వర్ణింపని అనేకములగు సాంఘిక, సాంస్కృతిక చారిత్రకాంశము లిందు వివరముగా తెల్పబడినవి. పరమయోగి విలాసమున అంతకుపూర్వము ఏ గ్రంథమునందును వర్ణింపని ఈ క్రింది వృత్తులవారి, జాతులవారి వేషభాషాది వర్ణనలు కలవు.

### రెడ్డి వేషవర్ణన:

"బసపు చుంగుల తలపాగ నెట్టంబు
కసిబిసి మెసఁగు బాగాల వీడియము
మిన్నదేరెడు దొడ్డ మొలనూలు మిగుల
వన్నియ గల మాధవళి పచ్చడంబు
దళసరి యగు దేవ దారు గంధంబు
వలకేలఁ గనుపట్టు వంకటుంగరము
డొల్లు బోఁగులును గాటుక కప్పుదేరు

4. చూ॥ ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట 305. తృతీయ ముద్రణ

పిల్లి గడ్డము వడి బెట్టు మీసలును
నలవడ నాందోళి కారూఢుఁ డగుచు
నలనాఁటి పూర్వికుఁ డగు పెద్దిరెడ్డి.''

—ప. యో. వి. 6వ అశ్వా. పుట 400.

## కాపువర్ణన:

రెడ్లుకూడ కాపులే. కాని ఇతరజాతులవారుకూడ కొందరు వ్యవసాయ వృత్తిగా కల్గినవారు 'కాపు'లని చెప్పుకొనుటకలదు. పరమయోగివిలాసములోని ఈక్రింది కాపువర్ణన వ్యవసాయకు డగు నొక శూద్రజాతివాని వర్ణనయే.

''అప్పుడా మడిసేయు, నాయూరికాఁపు
ముప్పిరి గొను పగ్గముల చుట్టతోడఁ
గ్రుచ్చిన మునికోల గొంగడి ముసుఁగు
ముచ్చల మచ్చల మట్టి కాశయును
బలువైన కేలియంబటి కుండ తనకు
నడవల నడగొండ లన నొప్పుచున్న
మీఁదైన యెద్దుల మెడ కాడిమీఁద
గోటేరు వైచి సెక్కాని రొప్పికొనుచుఁ
జనుదెంచి.''

—ద్వి. ప, యో. వి. 7వ ఆశ్వా. పుట 445.
ద్వి. పం. 10503—10510.

## కరణము వేషమిట్టిది!

''పసమించు తెలివలి పంపు బింజియలు
పొసఁగఁ జుట్టిన యట్టి బోడ కుల్లాలు

చించి కుప్పసములు చెవి దోరములును
సంపుటంబుల తోడ జంపాడు నొడలు
బిగువుగాఁ జెంప దోపిన బలపములు
తగనల వడఁగ నత్తఱిఁ గరణిపలు."

—ద్వి. ప. యో. వి. 6వ ఆశ్వా. పుట 383.
ద్వి. పం. 9057-9062;

పైని పేర్కొనిన కొన్నిపదములకు శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు ఈక్రిందివిధముగ అర్థనిర్ణయము చేసియున్నారు. (చూ. ఆం. సా. చ. పుట 261). "బోడకుల్లాలు=చిన్నటోపీలు; కుప్పసములు=అంగీలు; సంపుటము=ఒకవిధమైన బట్టపలక. ఆకాలమందునల్లని బట్టపై బలపముతో వ్రాయుచుండిరి. బట్టకు రెండుప్రక్కల కాగిదమంటించి దానిపై ఆకుపసరు బంక, బొగ్గునుసి పట్టించి పలకవలె చేసుకొని దానిపై కోపుబలపాలతో వ్రాయుచుండిరి"

## వైద్యులవేషము :

"చంక మందుల సంచి జగజంపు వలువ
పొంకమై నిజకర్ణముల నొప్పూ దూది
కనివడఁ జుట్టిన కులుమాపు పాగ
యనుకంప పంచ లోహంపు టుంగరము
నురుతలం బైనట్టి యూర్ధ్వ పుండ్రంబు
కరమొప్పూ వలకేలి కరక కాయలును
బెరయ పచ్చడముతోఁ బెనుపడ సంది
నరగను పట్టు బాహాట పుస్తకముఁ
బను సడలోఁ గుణపాఠ్యంబుఁ జదివి
కొనుచు మూలికలు దిక్కులఁ జూచికొనుచుఁ

గమలాక్షు పాదపంకజ భక్తినిరతుఁ
డమృత హస్తియనంగ నలవడు వాఁడు
నెన్న ధన్వంతరి కెనయైన వైద్యుఁ
డు.''

ద్వి.ప.యో.వి. 6వ ఆశ్వా. పుట 377. ద్వి. పం. 8907–8919.
'బాహటము' అనునది ఒక వైద్యగ్రంథము,

కాసెవారి (ఇండ్లుకట్టువారు) వర్ణన:

"............ పెనుజన్నిదములు
చంకల శిల్పశాస్త్రముల పుస్తకములు
వంక వోఁ జుట్టిన వలుదపాగలును
గొలది రేఖలు వడిఁ గోసినయట్టి
యొలమించి వలకేలి యినుప కమ్ములును.''

– ద్వి. ప. యో. వి. 7వ ఆశ్వా. పుట 452.

కాసెవారిపనులిట్టివి:

"చప్పటి సముదంబు చదర పానంబు
కప్పు చూరులు కంబ కాళ్ళు పద్మకము
నొగిమహా జగతియు నుప జగతియును
దగిన గట్టను గపోతము సంతనయును
మొదలైన తమ పని.''

– ద్వి. ప. యో. వి. 7వ ఆశ్వా. పుట 453.

మేదరవాని వేషవర్ణన:

"మలయంగ నెడ దుప్పిమై నోరగాఁగ
మొలత్రాటఁ జెక్కిన మోట కత్తియును
గొన సిగతోఁ గూడి కురు లొకయింత

గనుపట్టఁ జెరివిన గన్నెరాకమ్మఁ
గొనల వెల్వడు పుట్ట గోఁచియు నెరులు
బెనఁ గొన్న నునుదబ్బ పీఁచు డాకేల
వెడ వెడ జివ్వాడు వెదురు సలాక
యెడమ చే బొటవ్రేలి యినుప యుంగరము
............అవ్వనభూమి కేతెంచె."

—ద్వి. ప. యో. వి. 2వ ఆశ్వా. పుట 54-55.

మేదరవారినిగూర్చి మొట్టమొదట తెల్పినగ్రంథము చిన్నన్న ద్విపద పరమయోగివిలాసమే. "మేదరవారు తెలుగువారుకారు. వారు అరవలుగా కనిపింతురు. రాయలకాలమునాడే వారిభాష వేరుగానుండెను. అడవిలో ఒకబాలుని ఆక్రందనమును మేదరవారువిని,

"ఆలించి మార్జాల మని సంశయించి
పొక్క పొక్కని తమ భాష జెప్పచును."

అనుటచే వారిభాష వేరనుట స్పష్టము. తెలుగు దేశమందలి మేదరవారు తెలుగుభాషనే మాట్లాడుదురు. కాని బొంగు, ఈత బరిగెలతో బట్టలల్లు ఎరుకలవారు మాత్రము చెడిన అరవమును మాట్లాడుదురు"అని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తెల్పియున్నారు. (చూ. ఆం. సా. చ. పుట 264).

పరదేశముల 'సెట్ల' వేషము:

"పరదేశముల సెట్ల పగిది దిండుగను
బెల్లు చుట్టిన పెద పెద ముండాసులును
డొల్లు బొంగులును నీటుగఁ బొందుపఱచి
పొదిగల్లు నసిమల భుజములం బూని
వదలుగా రింటె మల్ వలె వాటువైచి."

— ద్వి. ప. యో. వి. పుట 408.

## ఓడరేవులలోని బేరము:

ఆకాలమందు దిగుమతులగు వస్తువులు ఇట్లు తెలుపబడినవి.

"అటమ మిక్కలి చేరువగు పయోరాశి
తట సమీపమున నిత్యంబు నోడలను
బచ్చ కప్పురము బట్టు బట్టలును
బచ్చి కస్తురి మేల్మి పసిఁడి యిట్టికెలు
మణులుఁ జంద్రానానా మణులుఁ బటీర
కణములు మొదలుగాఁ గల వస్తువులు
నిరవొంద నెన్నిక కెక్కు బేహారులు
హరుల దంతుల తోర హత్తుగాఁ దెచ్చి
యానించి బేహార మాడంగ నటమ
వానికై చనుదెంచు వారల వానిఁ
బూని బేహర మాడి పోవు వారలను"

—ద్వి. ప. యో. వి. 6వ-ఆశ్వా. పుట 407.

చంద్రానానా మణుల (అందగత్తెల) వ్యాపారముకూడ ఆకాలమున జరిగినదట.

## బోగమువారి వేషము:

'వలిపె చెంగావిపావట, వెలిపట్టుచీర గట్టి, జవ్వాది పూసుకొని, చంద్రకాంతపు దువ్వెనతో నెత్తిదువ్వుకొని, జారు కొప్పు వెట్టి, ఆణిముత్యాలబేర్లు కంఠమునధరించి, పచ్చనబొట్టు నరించి, గుమ్మడిగింజ (వంటి) నామముదీర్చి, తాటంకములు దాల్చి, మొదపుతీగకు (హారముఖభాగము) చెంత ముత్తైపుబలుకు వెట్టి, పుంజాలదండను, నేవళము (మణులహారము) వేసుకొని, బన్నసరములుదాల్చి, చేతులలో మురువులు కంకణములుదాల్చి ముత్యాల చౌకట్లుకట్టుకొని, సందిదండలు, నెలవంకతామెతులు, ఉంగరాలు, మణులయొడ్డాణము, బిల్లలమొలనూలు, బంగారు

సరపణి (గొలుసు), మణినూపురములు''_భోగము స్త్రీలు ధరించెడివారు. (చూ.ద్వి.ప.యో.వి. 4వ ఆశ్వా. పుటలు 227-228; ద్వి.పం. 5397-5430),

బోగము సానుల వద్దనుండు దాసి వేషము:

'నల్లపూసలపేరు, బండిగురిగింజ, తావడములు, (హారములు), పవడంబు చౌకట్లు, పిత్తడి కడెములు పికిలిపూదండలు, నల్లముదుకగాజులు, లక్కతాయెతులు, తెల్లనితగరంపుముక్కర, సీసపు ముద్దుటుంగరము, కాకిబేగడబొట్టు, కంచుమట్టియలు, శంఖుఉంగరము'_ఇవి బోగముసానుల వద్దనుండు దాసి ఆభరణములు. (చూ.ద్వి.ప.యో.వి. 4వ ఆశ్వా. పుట 268; ద్వి. పం. 6393-6404)

ద్విపదకావ్యములలోని వివాహవర్ణన:

అష్టమహిషీకల్యాణములో రుక్మిణి, సత్యభామల వివాహసందర్భమునందును, పరమయోగివిలాసములో గోదాదేవివివాహసందర్భముననను, ఉషాకల్యాణములో ఉషానిరుద్ధుల వివాహసందర్భముననను చిన్నన్న తనకాలమునాటి వివాహమునకు సంబంధించిన దేశీయాచారములను వర్ణించినాడు. ద్విపదలో వెలసిన కల్యాణ కావ్యములలో_అభిమన్యు కల్యాణము, రుక్మిణీకల్యాణము, _ఇత్యాదులందు-ఈ దేశీయాచారములు ఇతర పద్యకావ్యములందుకన్న ఎక్కువగా వర్ణింపబడియున్నవి. ద్విపద రచనలలో_సిద్ధేశ్వరచరిత్రము, వైశ్యపురాణము, పినాకినీమాహాత్మ్యము_ఇత్యాది రచనలందుకూడ శివపార్వతుల వృత్తాంతము నెపముగాపెట్టుకొని వారి వివాహమును దేశీయాచార విధేయ

ముగ విపులముగ ద్విపద కర్తలు వర్ణించియున్నారు. పెండ్లిచూపులకు పెద్దలను పంపుట, లగ్ననిర్ణయము, కల్యాణవేదినమర్చుట, వధూవరుల శృంగారించుట, బాసికములను గీలించుట, మంగళాష్టకములను పురోహితుడుగాని బ్రాహ్మణుడుగాని చదువుట, సుముహూర్తమని తెరతీయుట, వధూవరులొండొరుల శృంగారావలోకనము, తలంబ్రాలు పోసికొనుట, ముత్తైదువలు పెండ్లిపాటలు పాడుట, అరుంధతిదర్శనము, లాజహోమము—మున్నగు నంశములు సామాన్యముగ పై తెల్పిన ద్విపదరచనలలోని కల్యాణఘట్టములందు వర్ణింపబడియున్నవి. అష్టమహిషీకల్యాణములో రుక్మిణీవివాహ సందర్భమున 'గడియారము' పేర్కొనబడినది. (అ. మ. క. పుట 209) మంగళసూత్రధారణముదాదాపన్ని ద్విపదగ్రంథములలోని వివాహములందును తెల్పబడినది. మాధవదాసు వైశ్యపురాణములో, పార్వతికి తలిదండ్రులు తమ పుట్టుబొట్టును పెట్టినట్లు తెల్పబడినది. ఇందు, శివపార్వతులను పీటలపై కూర్చుండబెట్టి జిలకర, బెల్లమును వారి వలెవాటుకొనచెరగులందుగట్టి ముడివైచిరి, (చూ. వైశ్యపురాణము. 3వ ఆశ్వా. పుట 188) ఇది అష్టమహిషీ కల్యాణమునందును కలదు.

వివాహమైన తర్వాత విందుభోజనము అన్నిద్విపద గ్రంథములందును వర్ణింపబడినది. పినాకినీ మాహాత్మ్యమున ఇట్లువర్ణింపబడినది. భోజనముచేసినవారు హస్తపాదాదులు కడిగికొని పిడిదియింటిలోనికేగిరి. అప్పుడు, వేగవహుడు

"బాగైన పూగముల్ పండుటాకులును
యేలాల వంగము లిటు జాజి కాయ
మేలగు జాపత్రి మితము గాపండ
పట్టించుకొని వచ్చి."

(చూ. పినాకినీ మాహాత్మ్యము. 8వ ఆశ్వా. పుట, 136)

చుట్టాలకు మరువకుండ యిచ్చినాడు. మరుసటిదినము ఉదయము బాలుల కందరకు 'చద్దెన్నము'ను బెట్టి అందరిని పంపినట్లు ఇందు వర్ణింపబడినది.

కల్యాణమునకు ముందు శుభలేఖలు పంపుటనునది కట్టా వరదరాజరామాయణమునందును, శ్రీనివాసవిలాస సేవధియందు మాత్రమే కలదు. వరదరాజ రామాయణములో సీతాకల్యాణమునకుముందు జనకుడు దశరథునికి పంపిన శుభలేఖ.

"............శ్రీమన్ మహా మండలేశ్వ
రేందు సత్తమా హీన ప్రతాప
జనక మహారాజ చంద్రులం గారు
మనవంశ దశరథ మను జేశు నగరి
చాలు మానుసులకు సంప్రీతిఁ బంపు
మేలు వార్త నిరుద్ధ మితమున కేమ
అందఱుఁ బరిణామ మచటి మీరాజు
నందు యోగక్షేమ మప్ప టప్పటికి
వ్రాసి యంపునది. మావైదేహి పెండ్లి
చేసెద మిపుడు మీ శ్రీరామునకును
మీరాజు వారును మీ పురోహితులు
చారు వైఖరులఁ గౌసల్యాది సతులు
రావలెనని తమ రాజుతోఁ దెలుప గావలె."

—వరద. రా. బాల. కాం. పుట 203-204,

ననెడి వక్కాణమును రాయసములవారు చదివిరి.

శ్రీనివాసవిలాససేవధి (పుట 294)లో శ్రీనివాసుడు తన వివాహమునకు రావలసినదని మిత్రులకు, భక్తులకు శుభలేఖలు పంపినట్లుకలదు.

అలివేలుమంగమ్మ తనభర్తయగు శ్రీనివాసుని కల్యాణ సందర్భమున అతనికి తలయంటినవిధము సామాన్య తెలుగు ప్రజ

లలో నేడును భర్తకు భార్యతలయంటు విధమును బోలినట్టిదే. (చూ॥ శ్రీనివాసవిలాస సేవధి. 5వఆశ్వా. పుట 295-296.

పెండ్లి సన్నాహమయినతర్వాత పడకటింటి శృంగారము సుభద్రాకల్యాణములో సహజముగా వర్ణింపబడినది. ద్రౌపది సుభద్రార్జునులపెండ్లిసన్నాహముచేసి, పడుకటింటిశృంగారమును చేసినతర్వాత పడిన ఆవేదన, సమాధానము తిమ్మక్క స్వానుభవ పూర్వకముగా, వాస్తవికముగా రచించినది. తిమ్మక్క అన్నమాచార్యుని ప్రథమపత్ని. ద్రౌపదికిజరిగిన సంఘటనయే నిత్యజీవితములో తిమ్మక్కకూడ ఎదుర్కొనినది. దీనినిబట్టి తిమ్మక్క ఆత్మీయతకూడ వ్యక్తమగును.

## రఘునాథ నాయకాభ్యుదయము - సాంఘిక విశేషములు.

విజయరాఘవుని రఘునాథనాయకాభ్యుదయము కూడ సాంఘిక చరిత్రకు పనికివచ్చు ద్విపదగ్రంథమే.

### ఆభరణములు:

రఘునాథనాయకుడు ధరించిన ఆభరణ విశేషములివి. (చూ. రఘునాథనాయకాభ్యుదయము. 1వ ఆశ్వా. పుట 23)— ముద్రికాభరణము, ముత్యాల యొంట్లు, శ్రీరామ భద్రతాళి, ముత్యపురాపులు, పెద్దచౌకట్టులు, కంఠమాలికలు, కంఠసరము, పచ్చల పదకము, బవిరిచెక్కడపు ముత్తెపుఁదాళి, వజ్రముల యుత్తరిగలు, వజ్రములచే సరులు, మెఱుపుల కడియములు, బాహుపురులు, రత్నాంగుళీయములు, నవరత్నములు తీర్చిన బిరుదు పెండేరము, ఒంట్లు—ఇత్యాదులు.

స్త్రీలఆభరణములుగ తెలియవచ్చున వీక్రిందివి॥ (చూ॥ ర. నా. 3వ ఆశ్వా, పుట 69).

ముంగామురారి, ముత్యాల మురువుల బవిరలు, బుగడలు, సరిపెణలు, జాలువాగొలుసులు, పుంజాలదండలు, పచ్చతాపల కల పాదపల్లవము, జాళువా కడియము, పెంచు రతనాలకుచ్చు, కిరీటి_ఇత్యాదులు.

పట్టపు ఏనుగునకుచేయు అలంకరణవర్ణన ఇందు విశేష ముగాకలదు.

"గుంపైన పచ్చల గుజరాతి జాతి
కెంపుల బవిరిఁ జెక్కిన కొమ్ము కట్లు
వెలహెచ్చు నీలాల వేడెంపుఁ బనుల
తళుకు వజ్రమ్ముల తల మాళి గయును
మొలక వన్నెల లీను ముత్తెపు సరులుఁ
జెలువైమిటారించు చెవుల జల్లులును
ఘనమైన పుష్యరాగపు చెక్కడమునఁ
గనుపట్టు ఘోలాది గంటల బారు
మరకత వైఢూర్య మాణిక్య రుచుల
వెలుగుచున్న యురస్త్ర వాలత్రములును
హారుమంజి ముత్యాల యొరిజతో నంటి
మెఱయు వైడూర్యంపు మెడగంట గొలుసు
ప్రతిలేని కెంపుటా రావిరేకలును
రతనాల పనిమించు రవల యందియలు
సరిగ బొమ్మల కట్టు చాలఁ గన్పట్టు
మెఱుఁగుల నునుపట్టు మేలిమి జూలు
ముత్తియంపు బవంతి ముద్దులు గులుకు
క్రొత్త నూరెపు టంపు గుఱుచ గద్దిగము
మొదలైన సవరణ ముస్తీదు చేసి."

—రఘునాథ నాయకాభ్యుదయము 2వ ఆశ్వా. పుట 30.

ఆహారము:

తెలుగు జాతీయత ప్రతిబింబించు ద్విపదకావ్యములలో విందునో, భోజనమునో పురస్కరించుకొని తెలుగువారి ఆహార

పదార్థములనుగూర్చి విపులముగ వర్ణించుట సామాన్యమే. కృష్ణదేవరాయలుఆముక్తమాల్యదలో శూద్రులభోజనమును-వర్ణించినాడు. తక్కినకావ్యములలో బ్రాహ్మణుల శాకాహారభోజనము మాత్రమే వర్ణింపబడినది. రఘునాథనాయకుని భోజనాదికములను వర్ణించుచు విజయరాఘవుడు శూద్రుల మాంసాహారభోజనములను తెల్పియున్నాడు. (ర. నా. 3వ ఆశ్వా. పుట 55-58).

'శాలితండుల ప్రసాదము, బంగారుచాయ పప్పులు, సద్యోఘృతము, నీరుమజ్జిగ,—ఇది,

"సారమౌ జంబీర సారంపు రుచులు
మీఱంగ లవణంబు మితముగాఁ గూర్చి
మేలైన సొంటితో మిళితమైనట్టి
యేలకి పొడివైచి యింపు దీపింపఁ
దగు వట్టి వేళ్ళచే తావులు."

—ర. నా. 3వ ఆశ్వా. ద్వి. 242-246.

కట్టినమజ్జిగనీరు. ఇంకను కప్పురకోడి, కుంకుమకోడి, కస్తూరికోడి, పాలకోడి, కట్టుకోడి, నులువకోడి, చేపలయూర్పు, చిరంజి, చిక్కుడుకాయ రొయ్యలయూర్పు, పొడికూరవరలు, చలువయానము, ఉప్పురసము, శిఖరణి- మొదలయినవి.

ఇవిగాక పేణీలు, మండెగలు, లడ్వములు, వెన్నకజ్జాయము, మణుఁగుఁబూలు, అతిరసాలు, సారసత్తులు, పన్నీరుపాయసము, జీలకఱపాయసము, డాల్ వైచిన చలువపాయసము, సొజ్జిపాయసము, కరివడలు, దధివడలు, ఆమ్రపువడలు, తెలికుక్కరొట్టె, తెంకాయరొట్టె, సంబారురొట్టె, తెరటుబాలు, తనిబాలు, తెంకాయబాలు — మొదలగు భోజ్య పానీయాదులు పేర్కొనబడినవి.

## జంత్రవాద్యములు:

రఘునాథనాయకుడే స్వయముగా 'సంగీతసుధ' అనుగ్రంథమును రచించినాడు. ఇతడు "ఇదివరలో పూర్వులెవ్వరును కని పెట్టని క్రొత్తరకపు తాళములు - రామానందము మొదలగునవి - కనిపెట్టెను. రాగములుకూడ జయంతసేన మొదలగునవీతనిచే గనిపెట్టబడినవే. వెంకటమఖి, మధురవాణి మొదలగువారి కీయన వీణాగురువు. మరియొక విశేషమేమన వీణలలో క్రొత్తవిధానములను స్థాపించుట. అంతవరకును వీణావాదకులు రాగమునను సరించి మరలమరల దీగలను, మెట్లను మార్చుకొనవలసివచ్చెడిది. ...ఈయన 'రఘునాథమేళవీణ'యను నొకక్రొత్తవీణనునిర్మించి ప్రతిరాగమునను దీగలు, మెట్లుమార్చనవసరము లేకయే వాయించుట కనువగునట్లు నిర్మాణముచేసెను. ఈవిషయము చతుర్దండి ప్రకాశికలోను, సంగీతసుధలోను జెప్పబడినది"- (చూ. విజ్ఞాన సర్వస్వము. పుట 994 3వ సంపుటము),

పదచాళి, పేరణి, జక్కిణి, కొరవంజి, గుజరాతి, దేశి, దురుపదకేళిక, శివలీల- మొదలగు నాట్యబంధములను (చూ. ర. నా. పుట 21) అభినయించు సందర్భమున, వీణె, మురళి, రబాబు, తంబుర, కిన్నెర, ముఖవీణె, స్వరమండలము, రావణహస్తము, చెంగు, దండె, డక్కి, గట్టి వాద్యము, తాళము, - అను జంత్ర వాద్యములను వాయించుచుండిరట.

ఉత్సవవేళల వాడుచుండిన వాయిద్యవిశేషములివి(చూ. ర. నా. 2వ ఆశ్వా. పుట 31-32).

చిఱుత మద్దియలు, కాహళలు, డవిణలు, నాగసరములు, నరగజములు. ధవళశంకములు- మొదలగునవి,

రాజకీయోద్యోగులు:

గుఱిగొల్లలు, బొక్కసమువారు, సంప్రతులు, అసము వారు, వేగులవారు, వేత్రహస్తులు, మజాలశీలు, రాయసముల వారు, అవసరములవారు—మొదలయినవారు రాజకార్యములను నెరవేర్చెడివారు.

కట్టా వరదరాజు రామాయణము - సాంఘిక జీవితవిశేషములు.

వరదరాజరామాయణము యథా వాల్మీకముగా రచింప బడినను అందు మూలమునందును, రంగనాథ, భాస్కర రామాయణాదులందును లేని తనకాలమునాటి సాంఘిక జీవితవిశేషములను రాజకవియగు వరదరాజు వర్ణించినాడు.

వనమార్గమును చక్కబరచుట కుపయోగించు సాధన సామగ్రి ఈ క్రిందిది:

"పాఱలు, సుప్పర పారలు, గడ్డ
పాఱలు, చెక్కుడు పారలు, మడ్డు
గత్తులు, గొడ్డండ్లు, కణ్రెలుం, గొలిమి
తిత్తులు, దన్నీరు తిత్తులు, కరవ
కొడవండ్లు, నెడ్లును, గోనెలుఁ దాటి
గుడము, సున్నంబు, సంకులుఁ గ్రావిరాళ్ళు
పంచవర్ణ ద్రవ్య భాండముల్ నీరు
మంచముల్ నిచ్చెనల్ మ్రాకుల బండ్లు
చించపు రేకులు చింత యంబళ్ళు
పెంచులు నిటికలు బేర్పులు నూనె
అగపలు కణికలు నావులు రెట్లు
నగరి బొక్కసము గున్నాపట్ట కరక
కాయలు పంచాణికపుఁ బనిముట్లు
చాయల వస్తువుల్ జల్లులు, మేలు

కట్టులు శుక శారికా పంజరములు
పట్టె మంచంబులు పఱుపులు దివియ
గంబముల్ వెండి బంగరు కొప్పెరలును
కంబళ్లు మెరుగులు గాజుఁ గుండలును,''

—వరదరాజ రామాయణము. పుట 560. అయోధ్యాకాండము.

భరతుడు గంగాతీరమునకు రాముని చూడబోవు సందర్భమున అతని వెంట నడచిన సిబ్బందివర్ణన :

''పొగరు జీనా నూలి బొందుల యోర
సిగకొత్త మొలకము సేయుఁ గత్తులును
బరు సారు మాలు లబ్బురపు మైఁబూఁత
పరిమళంబులు దుప్పటి వల్లెవాట్లు
పట్టు చల్లడములు పైదట్ల మీద
గట్టిన వంకులుం గల వీరభటులు
కై జీత మొక కోటి.''

—రాజమార్గమునిండి వచ్చిరట. (చూ. వ.రా.రా.అయోధ్యా. కాం. పుట 566).

''మున్నుగాఁ గోమట్లు ముదుసల్లు సెట్లు,
సొన్నారముల వారు, సూపకారులును,
పౌరులు, నటులును, పాఠకు, లాట
వారును, కంచర వారును, కాశ
వారును, సొదపని వారును, సాలె
వారును, పటుసాలె వారును, ముచ్చి
వారును, కుమ్మర వారును, చాకి
వారును, చాయల వారును, పనుల
వారును, కటికిరి వారును, వడ్ల
వారును, మేదర వారును, గంధ

కారులు, జెట్లును, గణికలు, (జెప్పె
వారును, మాంత్రికుల్, వైద్యులు, సోది
చెప్పెడి వారును, శిర్నాల వారు,
చొప్పరులు, (దలార్ల జోశ్యులుం గదల."

— వరద. రా. రా. అయోధ్యా. కాం. పుట 566-67.

ఇచట పలువృత్తులవారిని, జాతులవారినివరదరాజు పేర్కొనినాడు.

వనవాసమునకు పోవునపుడు సీత గంగానదినిగాంచి ఆపదఁ బాపుమని,

"వనవాస మీడేర్చి వచ్చితి మేని
యెనయు వేడుక బలు లిత్తుము నీకు."

అని మ్రొక్కినది. రాముడయోధ్యాపురముచేరి పట్టాభిషిక్తుడయినచో,

"నీకొలి కప్పుడ నేక విప్రులకు
సాకేత నగరి భోజనము లమర్చి
శాటికా గోదాన శతములు చేసి
చాటించి పురి గంగ జాతర నడచి
మైరేయ మాంస సామగ్రితోఁ గొలిచి
పేర టాంగ్రడకు నీదు పేర పుట్టములు
కట్టించి నీదరి గాఁచు వేల్పులకుఁ
గట్టించెదము గుళ్ళు గ్రామాంతరముల."

—వరద. రా. రా. అయోధ్యా. కాం. పుట 461.

అని మ్రొక్కుకొనినది. ఆపదవేళలందు స్త్రీలు, తమఆపదలు తీర్చుమని గ్రామదేవతలను వేడుట నేటికినిగలదు.

సాంఘిక జీవితవిశేషములను తెల్పు పై అంశములన్నియు మూలరామాయణమునందు లేవు.

వరదరాజు తన కాలమందున్న తేనియలనుకూడ పేర్కొని నాడు. ఇవి మూలమునందు లేవు.

"పెర తేనియలు, కండ బుట్టు తేనియలు
కరుజ తేనియలును, కొమ్మ తేనియలు
బుట్టు తేనియలును బావల తేనియలు
జుట్టు తేంటులుఁ బీల్చుచుండి తేనియలు."

— వరద. రా. రా, సుందరకాండము. పుట 198.

ఆంధ్రుల సాంఘికజీవితచరిత్ర రచనకు చంపూకావ్యములకన్న ద్విపద రచనలే ఎక్కువగా నుపకరించుచున్నవనియు సోదాహరణముగ ఈప్రకరణమున నిరూపించితిమి. ద్విపదగ్రంథముల మూలముననే తెలిసికొనదగు తెలుగువారి ఆచారవ్యవహారములను, వేషభాషలను, జాతులను ఈ ప్రకరణమున తెలిసికొంటిమి.



# ఎనిమిదవ ప్రకరణము

## సింహావలోకనము

ద్విపద వాఙ్మయమును గూర్చిన ఈ పరిశోధనయందు పూర్వప్రకరణములలో ప్రధానముగ తెలిసికొనిన ముఖ్య విషయము లివి:

రెండవ ప్రకరణమున కవిత్వమునకు రసభావములు మాత్రమే ప్రధానములు కాక వానితో శ్రుతిరంజకత్వమునకు ఛందస్సుకూడ ఆవశ్యకమే అనిచర్చించితిమి. సంస్కృత ప్రాకృత కన్నడ తమిళ చ్ఛందస్సులందు ద్విపదగా ననుమానింపదగిన వానితో తెలుగు ద్విపదకు జన్యజనకసంబంధము లేదనియు ద్విపద తెలుగు దేశి చ్ఛందస్సనియు సిద్ధాంతీకరించితిమి. ద్విపద ప్రాచీనమైన ఛందస్సనియు, ఇతర దేశీయచ్ఛందస్సులగు ద్విపద గతి రగడ, తరువోజ, సీసము, మధ్యాక్కర, త్రిపది, షట్పది మున్నగు వానికి మూలభూతమైనదనియు నిర్ధారణ గావించితిమి. పండితామోదమును బడయక గేయ వాఙ్మయమున బహుళ ప్రచారము నొందియుండు ద్విపదను పాల్కురికి సోమనాథుడు చేపట్టి కొంత పద్యత్వమునుకల్పించి కావ్యరచనకు ప్రథమముగా నుపయోగించిన విధానమును సోదాహరణముగ చర్చించితిమి.

మూడవ ప్రకరణమున ద్విపద రచనావిర్భావమునకు వీర శైవమత మెట్లు ప్రధానకారణమైనదో తెలిసికొంటిమి. శివకవులు

ప్రవేశపెట్టిన భాషాసాహిత్యరీతులకు తర్వాతికాలమున పండిత లోకమున ప్రబలవ్యాప్తి కలుగలేదు. కాని ద్విపద ప్రక్రియను మాత్రము శైవేతరకవులును అనుసరించిరనియు, ప్రాచీన పండిత విమర్శకులు కొందరు యథాలాపముగ ద్విపదనునిరసించినను మొత్తముమీద ద్విపదరచన ప్రతిశతాబ్దమునందును కొనసాగుచునే వచ్చినదనియు నిరూపించితిమి. అవ్యవహితముగ పరిణామాభివృద్ధిని పొందిన ద్విపదవాఙ్మయమును, ద్విపదకవుల కాలమును, వారి దృక్పథమును, దేశ కాలపరిస్థితులను, రచనారీతులను ప్రధాన సూత్రములుగ పాటించి నాల్గు ముఖ్యఘట్టములుగ విభజించుకొని పరిశీలించితిమి. ఈప్రకరణముననే కవికాలాదులు తెలిసిన ద్విపదగ్రంథములను- లభ్యములు, అలభ్యములు, ముద్రితములు, అముద్రితములు - పేర్కొంటిమి.

ఇక నాల్గవ ప్రకరణమున కాలక్రమదృష్టితోగాక కథావస్తుతత్త్వమును, రచనావిధానమును, కావ్యప్రయోజనమును ప్రధానముగా పురస్కరించుకొని ద్విపదలో వెలసిన గ్రంథరాశిని —(1) పౌరాణికములు (2) వంశకీర్తనలు (3) కావ్యప్రబంధములు (4) కల్యాణాత్మకములు (5) క్షేత్ర మాహాత్మ్యములు (6) వ్రతమాహాత్మ్యములు (7)భక్తిప్రబోధకములు (8)తాత్త్వికములు (9) చారిత్రకములు (10) చిత్రాఖ్యానములు — అను పది తరగతులుగ విభజించుకొని ద్విపద ప్రక్రియా వైవిధ్యము యొక్కతత్త్వమును, వైశిష్ట్యమును సమగ్రముగ పరిశీలించితిమి. పై వర్గీకరణములో చేరని పరిశిష్ట ద్విపదరచనలను కూడ ఈ ప్రకరణముననే చేర్చితిమి. పద్యకావ్యమున ఎంతటి వైవిధ్యమున్నదో ద్విపదకావ్య వాఙ్మయమునను అంతటి వైవిధ్యమున్నదని ఈ ప్రకరణమున నిరూపించితిమి. కథావస్తు పోషణమును,

అనువాద గ్రంథములలో అమూలకాంశ వివరణములును, అతి ప్రసిద్ధముకాని ద్విపదరచనలలోని కొన్ని గుణములును ఇందు ప్రధానముగ తెల్పబడినవి.

ఐదవప్రకరణమున ప్రసిద్ధులు, ప్రౌఢులు అగు ద్విపద కవుల—పాల్కురికి సోమనాథుడు, గోనబుద్ధారెడ్డి, మడికిసింగన, గౌరన, తాళ్ళపాక చిన్నన్న, దోనూరు కోనేరునాథకవి, కట్టా వరదరాజు, తిమ్మయ, శ్రేష్టలూరి వేంకటార్యుడు—రచనలను ప్రత్యేకించి వానియందలిపాత్రపోషణ, రసపోషణ, శైలి ఇత్యాది కావ్య కళాంశములను కవితాశిల్పమును కావ్యకళావిమర్శక దృష్టితో ఉచితోదాహరణములతో వివరించి ద్విపద రచనల యొక్క ప్రత్యేకతను ప్రత్యక్షీకరించితిమి. ద్విపద కవులలో కొందరుప్రౌఢములగు పద్యకావ్యములనుగూడరచించియున్నారు. చంపూకావ్యకర్తలు, ద్విపదకావ్యకర్తలు అయిన ఇట్టి కవులనుసాహిత్య విమర్శకదృష్టితోపరిశీలించి వారిఆత్మీయత కవితా దృక్పథము వారిపైప్రసరించిన సాంఘికాదిప్రభావములు మున్నగు వానిని ఈ ప్రకరణమున తెలిసికొంటిమి. పండిత కవులెందరో ద్విపద కావ్యములను సర్వాంగ సుందరముగ భావాశ్రయము రసాశ్రయమునైన ప్రౌఢితో చంపూకావ్యములకు దీటుగరచించి ద్విపదకావ్యముల వైశిష్ట్యమును ఈమహాకవులుచాటినారనియు సోదాహరణముగ గ్రహించితిమి.

ఆరవప్రకరణమున స్వతంత్రములు, అనువాదములుకానివి అనదగిన ప్రాచీన ద్విపద రచనలుకొన్ని—చంపూరచనలకంటె ఎక్కువగ—ఇతరభాషలలోనికి భాషాంతరీకరణమునుపొందియున్న వనియు గ్రహించితిమి. బసవపురాణము, పండితారాధ్యచరిత్ర, రంగనాథ రామాయణము, హరిశ్చంద్రోపాఖ్యానము, పరమ

యోగివిలాసము, కృష్ణార్జున సంవాదము మున్నగు ప్రసిద్ధద్విపద కావ్యములు తర్వాతికాలమున చంపూరూపమునపరివర్తితములై యున్నవనియు గ్రహించితిమి. ఈ పరివర్తనములకు హేతువులను, ఆయా గ్రంథములందలి సారస్యమును, ఆయా కవుల కవితా గుణోత్కర్షలను ద్విపదరచనలకు వాని చంపూకావ్యపుత్రికలకు రచనా విషయమునగల భేదసాదృశ్యములను సోదాహరణముగ ఇందు పరిశీలించితిమి.

ఏడవ ప్రకరణమున సమకాలపుపద్యకావ్యములలో కానరానివియు, ద్విపదకావ్యముల మూలముననే తెలియదగినవియు అగు సాంఘిక జీవిత విశేషములను ప్రజల ఆచార వ్యవహారాదులను సోదాహరణముగ వివరించితిమి. ఆంధ్రుల సాంఘికజీవిత చరిత్రను ప్రతిబింబితముచేయుటలో పద్యకావ్యములకన్న ద్విపద కావ్యములదే పైచేయిఅని ఈ ప్రకరణమున గ్రహించితిమి.

ఇట్లు గావించిన పై పరిశీలనయందు ద్విపద గ్రంథముల ఛందస్సాహితీ రీతులకు సంబంధించిన సాహిత్యవిమర్శక దృష్టియే ప్రధానము. భాషావ్యాకరణములకు సంబంధించిన పరిశీలనకు ఈ పరిశోధనయందు ప్రమేయము లేదు. ద్విపదగ్రంథములు సాహిత్య పరులకేగాక తెలుగు భాషావ్యాకరణదృష్టితో పరిశీలించు వారికిని అనివార్యములును అమూల్యములును. దేశీయపద ప్రయోగములందును భాషావ్యాకరణ లక్ష్యములందును ద్విపద గ్రంథములు చంపూగ్రంథములకన్న కొంత విలక్షణముగా నుండుననునభిప్రాయము సహేతుకమనవచ్చును. కేవల చంపూకావ్యములనే గ్రహించిన ప్రాచీనాంధ్ర భాషాస్వరూపము సమగ్రముగా ప్రసన్నము కాదనిన అతిశయోక్తికాదు. ఆంధ్రభాషాచరిత్ర దృష్టితో పరిశీలించు భాషాశాస్త్రజ్ఞునికి ద్విపద కావ్యములందలి

భాషాసామగ్రియొక్క విలువ ఇంతయని చెప్పలేము. అట్టిదృష్టితో ద్విపదకావ్యములను పరిశీలించిన అది ఒక ప్రత్యేకగ్రంథమగును. ద్విపదకావ్య భాషా వ్యాకరణములకు సంబంధించిన చర్చకు సిద్ధాంతములకు ప్రస్తుతపరిశీలనయందు స్థానము లేదు; కాని తత్సంబంధముగ ద్విపద కావ్యములకెట్టి ప్రాధాన్యమున్నదో స్థూలముగ సూచించుట అప్రస్తుతముకాదు.

తెలుగున చంపూకావ్యములు రచించిన కవులందరు ప్రౌఢకవులు, మహాకవులు కాకపోయినను చంపూసాహిత్యము ద్విపద సాహిత్యముకన్న కొంత ప్రౌఢమైనదను అభిప్రాయము పండిత లోకమున మొదటినుండియు లేకపోలేదు. భాషావిషయమున చంపూకవులు కొంతవరకు సంస్కృతమువైపు మొగ్గుటయేగాక వ్యవహారమునకు సన్నిహితముకానట్టియు, పూర్వకావ్యసంప్రదాయానుగుణమైనట్టియు అగు గ్రాంథికభాషా రూపములనే చాల వరకు అభిమానించిరచించియున్నారు. భాషావిషయమున ఇంతటి పట్టింపు సామాన్యముగ ద్విపద కవులకున్నట్లుతోచదు. ద్విపద ప్రక్రియకు మూలకారకుడగు పాల్కురికి సోమనాథుడు ప్రజావ్యవహారమునకు ఉచ్చారణకు సన్నిహితముగానుండు భాషారూపములనే తన కావ్యరచనకు స్వీకరించిన స్వతంత్రుడు. భాషావిషయమున దేశకాల పాత్రోచిత దృష్టికలిగి అసహజమగు సంస్కారమును చొప్పింపని కారణముననేకాబోలు సోమనాథుని భాష సలక్షణము కాకపోయినది. వ్యవహారమున సహజముగ నేర్పడినవియు, బహుళరూఢినందినవియు అగు పదప్రయోగములను పాల్కురికి సోమనాథుని ప్రయోగముల ననుసరించియే కాబోలు తర్వాతి తిక్కనాది మహాకవులును తమ చంపూ రచనలందు క్వాచిత్కముగా కావించియున్నారు.

సాధారణముగ లాక్షణిక గ్రంథములకు విధేయములుకాని భాషాప్రయోగములు – వైరిసమాసములు, సంధివిశేషములు, కారకరీతులు, పదముల వర్ణక్రమవిధానము, క్రియారూపములు మున్నగువానికి సంబంధించినవి – చంపూ కావ్యములలోకన్న ద్విపదకావ్యములలోనే ఎక్కువగ కన్పించును. ద్విపదకవులు అట్టి ప్రయోగములను లక్షణోల్లంఘనము చేయుటకు చొప్పించి రనుటకన్న లోకవ్యవహారమునుబట్టి గ్రంథస్థముచేసిరనుట సహే తుకము. అనగా ద్విపదకావ్యములందలిభాష చంపూకావ్యముల కన్న లోకవ్యవహారమునకు సన్నిహితముగ నున్నదని తెలియు చున్నది. ద్విపదరచనలు సామాన్యప్రజల కుద్దేశింపబడియుండు టయు ఇందులకొక కారణము కావచ్చును. సంప్రదాయోల్లం ఘనమును అభిమానించిన పాల్కురికి సోమనాథుని రచనలోనే గాక గోనబుద్ధారెడ్డి, కాసెసర్వప్ప, శ్రీనాథుడు, గౌరన మున్నగు వారి ద్విపద కావ్యములందును ఆయాకాలపు వ్యవహార సన్ని హితమగు భాషాప్రయోగములు అనేకములు కానవచ్చుచున్నవి. ఉదాహరణమునకు ఈక్రిందివి చూడుడు.

వైరిసమాసములు:

సంస్కృత పదములతో తెలుగు పదములకు సమాసమును గూర్చుట 'వైరిపదము'లని పేరు. పాల్కురికిసోమనాథుడు ప్రజల వ్యవహారము నందున్న వైరిసమాసములను బసవపురాణమున స్వేచ్ఛగా ప్రయోగించియున్నాడు. ఉదా: దీప గంభములు; ముల్లోకవంద్య; ముల్లోకనాథుని; పంచవన్నియలు; భక్తనూట వలు; ఇతరవేల్పులు; అభిమానకత్తె; జీవగఱ్ఱ; బిల్వపత్తిరి; తవరాజు; నిత్యపడి మున్నగునవి. సోమనాథుడు తన రెండవ ద్విపదకావ్యమగు పండితారాధ్య చరిత్రమున,

"కావ్య వ్యర్థం బసంగతి విరసంబు
వైకల్య మత్యుక్తి వైరి పదంబు
తల విఱుప సమగ్రత శిథిల బంధము."

— పం. చ. అవతారిక.

అని వైరిపదమును గర్హించి యున్నాడు. ఇచ్చట కృత్రిమ కల్పితమగు వైరిపదములనే సోమనాథుడు గర్హించినాడనియు వ్యవహారసిద్ధములగు వైరిసమాసములను నిస్సందేహముగ స్వేచ్ఛగా గ్రహించియున్నాడనియు నర్థము చెప్పుకొనవలెను. రానురాను ఈ వైరిసమాసము మిశ్రసమాసమను పేరితో కొంతవరకు కవుల ఆదరమును బడసినది. ఇట్టిసమాసములువాడుకలో అనేకములేర్పడి ప్రచారమున నున్నట్లు తర్వాతి ద్విపదకవుల ప్రయోగములనుబట్టినిర్ణయింపవచ్చును. సిద్ధేశ్వరచరిత్రలో–వామదక్షిణ పాదులు; బత్తినాయుధావళులు మొదలగునవి. పల్నాటివీరచరిత్రలో–ప్రతిమోత; ప్రతిరోజు; ప్రతివాడు; ప్రతియేట; శుద్ధతప్పు మొదలగునవి. నవనాథచరిత్రలో–మహదేశము; మహదేవుడు; అపసడి; ప్రవిమల పోఁగులు; చౌసీతిబంధములు; మహరాష్ట్రియు మొదలగునవి. కట్టా వరదరాజ రామాయణములో–పృథుల పెన్నిఱిగింపు.

## సంధివిశేషములు:

సోమనాథుని ద్విపదగ్రంథములలో–

కారసంధిఇ. ఉదా: వెండీల్లువారు; కంచేడువాడలు; వావెఱుంగని; తెలివగువాడు; కాకఅపులు మున్నగునవి.

క్త్వార్థమైనఇకారమునకు సంధినిగూర్చుట. ఉదా: ఏతెంచారగించె; కలిగున్నదనుచు; కలిగుండువారు; వెఱచుండుము;

కూడుండు; పొంచున్న; ఎగిరెడివారు; ప్రొద్దువోయితురా మొద లగునవి.

నవనాథ చరిత్రలో—పలికటు మునిగి

వరదరాజరామాయణములో—వడఁకటునిటు (వడఁకిఅటునిటు)

అకారసంధి షష్ఠీ సమాసములో విభక్తి ప్రత్యయమగు యొక్క—ను లోపింపజేసి అకారమునకు సంధినిగూర్చుట సోమ నాథుని ద్విపద గ్రంథములలో కలదు. ఉదా: సత్యమాహేశ్వరు లిండ్ల; గతిహీనులిండ్ల; యజమానులిండ్ల; బడుగులాదరువ.

'యొద్ద'అను రూపమును అజాదిగ గ్రహించి సంధినికూర్చి యుండుట సోమనాథుని ద్విపద గ్రంథములలో కలదు. ఉదా: నాభట్టులొద్ద.

ఉకారసంధి ఉదా: జిల్లెడాకులు ('జిల్లెడునాకులు' కాదు) కూడడుకులు (కూడునడుకులు కాదు)

రంగనాథ రామాయణములోని సంధివిశేషములు. ఉదా: నంటంటి; ముంచెత్తు; ముంచీడ్చి

ద్రుతసంధి — చూడఁబుత్తనుచు

కుషష్టికిముందు నగాగమము లేమి.

ఉదా: ఆశ్రమము కేతెంచి; జాంబవంతుకనియె; ధరణీశు కనియె—మొదలగునవి.

కొనుటకు కాదేశము పుట్టుకగ్రమింగె; తోడుకపొమ్మన; తోకగాల్పించుక మొదలగునవి.

సిద్దేశ్వర చరిత్రలో విశేషసంధులు: కందువలర్చెను; సర్వప్పను వాడ; భూమందును; గోదావరుత్తరించి; బిలము దూరటుబోవ ఇత్యాదులు.

నవనాథచరిత్రలోని విశేషసంధులు: వెఱచుంటి; నిత్యతెసఁగు;

చూడామణున్న; శంకనుమాత్రము; ఎల్లందు మున్నగునవి.

చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్రలో—నుగాగమంబులేమికి

ఉదా: ఒడబాటుకు; పాముకు ఇత్యాదులు.

ఉత్వసంధిలేనందుకు — వరమిమ్ముఅదినీకు ఇత్యాదులు.

అజ్లోపసంధి: అజ్లోపమును పదాంతములందును, పదమధ్యములందును అకార ఇకార ఉకారముల మూడింటియందును ద్విపద కవులు వాడియున్నారు. ఉదా: కస్వు; ఎర్గి; చిక్కి; చెర్చి; కుర్వు; మర్గెదరు; ఇస్మ;కుడ్తురు; నెన్నడ్మ; పల్వర్స; వ్రాలుదుర్; గూర్కు; ఒల్లు మొదలగునవి.

షష్ఠీవిభక్తి: ఉదా: కరికాలచోడుకుఁ గనకవర్షంబు. (బసవపురాణము) ఇచట కుషష్టికిముందరి నుగాగమలోపము చేయబడినది. 'నీయొక్కసంగతి'— అర్థము చెప్పునప్పుడు కావ్యములో 'యొక్క'ను సోమనాథుడు మాత్రమే వాడినాడు.

కారకరీతులు:

సోమనాథుని గ్రంథములలో— ఉదా:

అరుగుము భక్తజనావళిలో వెడలి (నుండి)

ఈతప్పు సైరింపవలయు (తప్పునకు)

భూమిసర్వాంగముల్ వొందంగ మ్రొక్కి (భూమికి)

కడజాముచేచి (జామునకు)

మఠమేగి (మఠమునకు)

శ్రీ పర్వతంబేగి (శ్రీ పర్వతమునకు)

మహాలింగదేవు సమ్ముఖుఁడై (దేవునకు)

వ్యవహారమేగు (వ్యవహారమునకు)

బహువచనరూపములు:

అందలాలు; పొట్లాలు; మీసలు; దృష్టు; భ్రష్టు; దివ్వ

టీలు; బంట్లు; సెట్లు; అంగల్లు; అల్లుళ్లు; కళ్లు; కావళ్లు; చావళ్లు; ఎక్కుళ్లు; పాంతర్లు; ఊళ్లు; పేళ్లు; ఎంగిళ్లు; పుక్కిళ్లు; పెండిడ్లు; వడగళ్లు ఇత్యాది వ్యవహార రూపములను సోమనాథుడు కుప్పలు తిప్పలుగా వాడియున్నాడు.

యుస్మదస్మత్సమాహార సంప్రార్థనాద్యర్థక క్రియగా ప్రయోగింప బడినవాని కుదాహరణములు—సోమనాథుని గ్రంథములలో

చెప్పుదండు (చెప్పుదమునకు బదులు)

పోదండు (పోదము రూపాంతరము)

చూతండు (చూతమునకు రూపాంతరము)

మరియు బారెండు; జేనెండు; మూరెండు; తూమెడు మొదలగు పరిమాణార్థకములు, ఔపవిభక్తికములందు బారెంట; జేనెంట; మూరెంట మున్నగు రూపములతో సోమనాథాది ద్విపదకవులు వాడియున్నారు.

ఉద్దేసించు; అహంకారించు; శాపించు; ఇటెకించు ;రండ; పొండ; కొండ (ఇవి ప్రాచీన ప్రయోగములు. ఈనాడుకూడ తంజావూరి తెలుగుమాటలలో రండ (=రండిఅనుటకు బదులు) అనియే వ్యవహరింతురు) మున్నగు క్రియలను సోమనాథుడు ప్రయోగించి యున్నాడు. రంగనాథరామాయణములో—

సేతునని; తల్లిపనిసేతు; చేతు ఇత్యాదగనుకలవు.

గౌరన నవనాథ చరిత్రలోని వ్యవహార సిద్ధరూపములివి:

చాయ నేర్చినరీతి;కప్పింది. చాయింపవలె; ఒనరి స్తిమీాకు; బ్రాహ్మణ; రుగ్మత; పంద్రెండోయేట; తప్పించుకపోవు; బాతలించు; అచలించు (అచ్చలించు = ఉత్సహించుటకు బదులు); ఎచరించు (ఎచ్చరించు కు రూపాంతరము) మున్నగునవి.

రంగనాథ రామాయణకర్త 'వెళ్లె'నను నర్థములో 'గమ

నించె'అని, 'అడవు'లను నర్థములో 'దుర్గము'లని, 'అంతటను' అను నర్థమున 'ఎల్లందు'అని ప్రయోగించిన పదప్రయోగములు కలవు. ఇట్లే మోదించు; నాశిల్లు; ప్రాశించు; ఆపోశనించు; ద్రుష్టించు; ఆస్వదించు; కలుషించు-వంటి తత్సమ విశేష్యముల నుండి యేర్పడు ధాతురూప ప్రయోగములు రంగనాథ రామాయణమున మిక్కుటముగ కలవు.

వరదరాజ రామాయణములోని వ్యాకరణ విశేషములివి: చేతురు; కోతురు; పట్టుక; చేసుక; కోతము—ఇత్యాది ప్రయోగములు. ఈప్రయోగములను గిడుగు రామమూర్తిపంతులు 'బాలకవి శరణ్యము'న సమర్థించియున్నాడు.

అర్థరాత్రివేళ (అర్థరాత్రము అనుటకుమారు)
బిగ్గకవుంగలించు (బిగియఁగౌఁగలించు అనుటకు మారు)
కలెజూచి (కలయఁజూచి అనుటకు)
కంచలియ (కంచెలకు అనుటకు)
ఎఱుంగక (ఎఱుంగక అనుటకు)
కవుసల్య (కౌసల్య అనుటకు)
బొక్కసమిండ్లు (బొక్కసపుటిండ్లనుటకు)
కర్ముము (కర్మమునకు బదులు)
గరువించుట (గర్వించుట యొక్క రూపాంతరము)
దీవెన (దీవన రూపాంతరము)
అజారము (హజార శబ్దరూపాంతరము)
దుక్కంబు (దుఃఖమునకు బదులు)
గరివించి (గర్వించి రూపాంతరము)
డోయిట (దోయిట రూపాంతరము) మొదలగునవి.

ఇట్లు జనసామాన్యమునకందుబాటులోనుండు దేశభాషా పదజాలమునే ద్విపదకవులుతమ కావ్యములందు ఎక్కువగ ప్రయోగించియున్నారు. చంపూకావ్యములకన్న ద్విపదకావ్యములందలి భాష ప్రజలశిష్టవ్యవహారిక భాషకు చాలాసన్నిహితముగ నున్నదని పైనిపేర్కొనిన భాషావ్యాకరణ రూపములనుబట్టి తెలియుచున్నది.

భాషావిషయమున సోమనాథాది శివకవులుప్రతిపాదించిన క్రొత్తసూత్రము 'జాను తెనుఁగు'. ఇంపుపెంపు, సరసత, ప్రసన్నత—అనునవి జాను తెనుగు నందలి విశేషగుణములు. 'జాను' శబ్దమును 'చదును' శబ్దభవమని, 'జన' శబ్దభవమని, 'జాణ' శబ్దమునకు సంబంధించినదని 'అచ్చ తెనుఁగ'ని; 'తేట తెనుగ'ని; 'నిసర్గమైన తెనుఁగు'అని పలువురు పలురీతులుగ సాధింపయత్నించిరి. తెలుగుభాషలో స్వభావసిద్ధముగ వాడెడి సంస్కృతసమాసములు, జనసామాన్యమున వ్యవహరింపబడు దేశిపదములతో నొప్పి అన్వయక్లిష్టత లేక మంజులమై, సరసమై, ప్రసన్నమైన తెలుగు భాషయే 'జాను తెనుఁగు'అని చెప్పవచ్చును. పాల్కురికి సోమనాథునితర్వాత ఈ 'జాను తెనుఁగు'ను ఎవ్వరుగాని పేర్కొనలేదు.

చంపూకావ్యములకన్న ద్విపదకావ్యములందు దేశీయపద ప్రయోగములు అధికము. డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు పండితారాధ్య చరిత్ర పీఠికలో, "అచ్చ తెనుఁగు మాటలలో సోమనాథుడుపయోగించి నన్నిటిని మరియే తెనుగుకవిన్ని ఉపయోగించలేదు. ఇతడు వాడిన వందలకొద్దీ పదములు నిఘంటువులలోని కెక్కలేదు" అని తెల్పియున్నాడు. గోనబుద్ధారెడ్డి, శ్రీనాథుడు, గౌరన, కట్టావరదరాజుమున్నగు ఇతర ద్విపద రచ

యితల గ్రంథములందలి దేశీయపదము లనేకములు కోశస్థము కాలేదు. సోమనాథుడు వాడిన అపూర్వములగు తెలుగు పదము లలోకొన్ని ఈ క్రిందివి:

అంకనము; అడపతిత్తి; అతకులు; అరజలు; అరమని, అఱకటము; ఆటకూటము; ఆరతిజోళ్లు; ఆళతి; ఇక్కంటి; ఇలువ్రుట్టు; ఉఱిముఱి; ఉబ్బాట; ఉల్లిగడ్డము ఇత్యాది పదములన్నియు నిఘంటువులలోని కెక్క లేదు.

విజ్ఞానసర్వస్వములోవలె జనవ్యవహారములోనుండు వస్తువులపేర్లపట్టీలకూర్పుసోమనాథునిద్విపదగ్రంథములలోకన్పించును

పత్తిరులు. (పండితారాధ్యచరిత్ర పుట 354-355)

బిల్వపత్తిరి; నావురుంబత్తిరి; మాచిపత్తిరి; నేరేడుంబత్తిరి; జమ్మిపత్తిరి; కాంచనపత్తిరి; వచ్చపత్తిరి; మారేడుంబత్తిరి: వెలంగంబత్తిరి: వావిలిపత్తిరి; ఉమ్మెత్తపత్తిరి; గన్నేరుపత్తిరి; నెల్లిపత్తిరి; సంపెంగపత్తిరి; ముసిడిపత్తిరి; సోమిందపత్తిరి

పుష్పములు—(పండితారాధ్యచరిత్ర. పుట. 355)

గోంగుంబుష్పములు; అశోకపుష్పములు; పొగడపుష్పములు; గేదంగిపుష్పములు; మల్లెపుష్పములు; సేవంతిపుష్పములు; మొల్లపుష్పములు; కరవీరపుష్పములు; తమ్మిపుష్పములు; జిల్లేడుపుష్పములు; శేలపుష్పములు; గురివిందపుష్పములు; పొన్నపుష్పములు, విరవాదిపుష్పములు; ములకపుష్పములు; ప్రాకుడుపుష్పములు; జాదిపుష్పములు: తామరపుష్పములు; కలువపుష్పములు; కింశుకపుష్పములు; సురగిపుష్పములు; ఉమ్మెత్తపుష్పములు; గ్రోవిపుష్పములు; గుమ్మడుపుష్పములు; గలివెపుష్పములు; తంగేడుపుష్పములు; ములగుపుష్పములు; కాంచనపుష్పములు, గంటెపుష్పములు; మారేడుపుష్పములు; మంగపుష్పములు; గోరింట

పుష్పములు; గొమ్మిపుష్పములు; సెంగల్వపుష్పములు; వెలఁగ పుష్పములు.

పండ్లు (చూ. పండితారాధ్యచరిత్ర పుట 357)

రేనుపండ్లు; మామిడిపండ్లు; నీడెపండ్లు; నేరేడుపండ్లు; మొరలిపండ్లు; ఖర్జూరంబుపండ్లు; పరికెపండ్లు; హింతాలంబు; పండ్లు; జీడిపండ్లు; జిడిముడిపండ్లు; జానపండ్లు; దానిమ్మపండ్లు; మేడి పండ్లు; జిఱునెల్లిపండ్లు; మొలుగుపండ్లు; మారేడుపండ్లు; బలుసు పండ్లు; సిరివిందపండ్లు; దుమికిపండ్లు; నారంగంబుపండ్లు; అనఁటి పండ్లు; గజనిమ్మపండ్లు; గలివెపండ్లు; గుమ్మడిపండ్లు; వెలఁగపండ్లు కలుజువ్విపండ్లు; ద్రాక్షపండ్లు; మాదిఫలంబుపండ్లు; రావిపండ్లు; న్యగ్రోధంబుపండ్లు; వేఁపపండ్లు; గొడపుడుపండ్లు; బుడమపండ్లు; జంబీరంబుపండ్లు; పనసపండ్లు; వులుపుడుపండ్లు; బాలపండ్లు; జిలివిలిపండ్లు; నరిగిపండ్లు;

ఇట్లు జనవ్యవహారమందుండు తెలుఁగుపదముల పేర్లపట్టీ లనేకము బసవపురాణ పండితారాధ్య చరిత్రలందు కలవు.

రంగనాథరామాయణములోని ప్రయోగ విశేషములను గూర్చి వ్రాయుచు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు "ఈ గ్రంథము దేశితెనుఁగు పదములకొక నిధివంటిది. పాల్కురికి సోమనాథునిపండితారాధ్య చరిత్రవంటిదే" అనిరంగనాథరామా యణ పీఠిక (పుట 39)లో తెల్పియున్నాడు. ఉదాహరణమునకు,

ఇరవారు; అఱలేని; తరమిడు; ఎడపడు; తలకొను; మెయి కొను; అనువేది; పనివడు; వలగొను; ఒల్లఁబోక; మెలఁపొందు; తఱిగొను; తొడిబడు; అలవు; డక్కు; ఒత్తు; ఒఱపు; ఒడుచు; వలఁతి; తిగుచు; డొంకు; జగ; ఎమ్మె; ఓలము; త్రుంగు; లావు; ఏపు; ఔడు; గీడు; అట్టు; ఉబ్బు మొదలయిన పదము లట్టివి.

నవనాథచరిత్రలోని పదములు—వతారము; సాకసాకలు; అంతస్తము మొదలగునవి.

కట్టావరదరాజరామాయణములో వ్యవహారములోనుండు పదములు. ఉదా కిటుకులుదీరు; అద్దిరాయీ బాపనాస; గ్రామసింహములు (=కుక్కలు); నిబద్ది (=నిజము)—మున్నగునవి.

చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్రలో—పంచ; వల్లె; గునుకక; కోక; తోణుకు; నులుము; నాగసరము మొదలగునవి.

ద్విపద కావ్యములందలి దేశీయ పదప్రయోగములలో మరొకవిశేషముకూడకలదు. జాతులకు, వృత్తులకు, పనిముట్లకు, కొన్నివస్తువర్గములకు సంబంధించినపదావళులు ద్విపదకావ్యములందు సందర్భోచితముగ కొల్లలుగానివ్వబడియున్నవి. ఇట్టిపదములనేకములు ప్రబంధాది చంపూకావ్యములందుకానరావు. ప్రాచీనాంధ్రభాషకు సమగ్రమగు కోశము నిర్మింపదలచుకొనిన ద్విపదరచనలమూలమున నేలభించు తెలుగుమాటలు వేలకొలది యుండవచ్చును. భాషాలక్షణముయొక్క క్రమపరిణామమును, వ్యావహారిక భాషాస్వరూపమును తెలిసికొనుటకు ఈపదప్రయోగములు చాల నుపకరించును. ఉదాహరణమునకు—

గొల్లనివేషభాషలు: బసవపురాణములో సకలేశ్వర మాదిరాజయ్యకథలో—ములుగత్తి; యుచ్చుఁగోకలుఁ జూడుగొలుపుమొలతిత్తి; గొడ్డలు; బరిగమ్మి గూటికుండ; దుడ్డుగోల — అను గొల్లని పరికరములు తెలుపబడినవి.

నవనాథచరిత్రలో గొల్లని వర్ణనా సందర్భమున వాడబడిన పదములివి: పీలిపాగ; పిల్లగ్రోలు; గొంగడి; గుదియ; గుంజ, పూసలపేరు; బొంగుఁగోలఁ; చుట్టిన యుర్రిద్రాడు; పించవుదండ,

వాకట్టు బదనికెలు; చీరణములు నించినతిత్తి; జింకకొమ్ము; జల్లి చిక్కము. మొదలగునవి.

నవనాథచరిత్ర (పుట 30)లో పేర్కొనినపశురోగములివి:
అరుమకన్ను; నీరునాలిక చేర్లు; గురుదెవులు; కంటికురుమ; కట్టూర్పు; కప్పనావురు; గాలిగజ్జిపల్; తిక్క, పుప్పి; పంపర; ఊదుబొడ్డు; బొల్లూత; మొలవిడె; సెలతెవులు, ముకుబంతి; కవటు; తలయేరు; తొడకువాతము; కల్లవాపు; నలదొబ్బతెవులు మొదలగునవి.

బసవపురాణము కన్నదబ్రహ్మయ్యకథలో తెల్పినదొంగల వేషసాధనము లీక్రిందివి.

కత్తి; బలపము; కావిచీర; కత్తెర; ఇసుము; అక్షతలు; ముండ్లబంతి; నీలికప్పడము; ద్రిండు; మంతర; కాటుక; చండవేది; సెలగోల; మొంటట్ట చెప్పులు; పీఁకె; యెలుకులబూడిద; వాటు జాలు; కుక్కలవాకట్టు; కొంకినారసము, రజ్జువు.

కడియకన్నము; గడపకన్నము; గోడకన్నము; గుజెనేల కన్నము మొదలగు కన్నములు.

పండితారాధ్య చరిత్రలోని కుమారపాల ఘూర్జరునికథలో ద్యూతపరిభాష ఈ క్రింది విధముగ కలదు. దాయము; ఈరైఁదు; దుగ; ఇత్తిగ; దచ్చొక; పంచియ; చౌకదుగము; భద్రము; సత్రా; తీవంచ; సౌవంచి.

పరమయోగివిలాసములో — రెడ్డివేషవర్ణనలో — పసపు చుంగుల తలపాగ; నెట్టంబు; బాగాలవీడియము; దొడ్డమెడనూలు; మాధవళి; వంకుటుంగరము; డొల్లుబోగులు అను పదములును,

వ్యవసాయదారుడగు కాపువర్ణనలో—ముప్పిరిగొనుపగ్గములచుట్ట; గ్రుచ్చినమునికోల; గొంగడి ముసుఁగు; ముచ్చల

మచ్చల మట్టికాశ; అంబటికుండ; కాడి; కోటేరు అను ప్రయో గములును,

కరణము వేషవర్ణనలో—బోడకుల్లాలు; (=చిన్నటోపీలు) చింపి కుప్పసములు; చెవి దోరములు; బలపములును; వైద్యుల వేషవర్ణనలో—దూది;మందులసంచి;కరక కాయలు;మూలికలును,

మేదరవానివర్ణనలో—మొలత్రాటఁజెక్కిన మోటకత్తి; గన్నెరాకమ్ము; (=గన్నెరాకువంటి అలుగులుకలఅమ్ము) పుట్ట గోఁచి; దబ్బపీఁచు; జివ్వాడువెదురుసలాక; ఇనుపయుంగరము అనునవియు,

కాసెవారి పనులను తెల్పుచు—చప్పటికుముదంబు; చదర పానము. కప్పచూరు; కంబకాళ్ళు; పద్మకము; మహాజగతి; ఉప జగతి; గట్టు; కపోతము; సంతన మొదలయిన పనులను,

ఇంకాఅనేక వృత్తులవారిని వర్ణించుచు తాళ్లపాకచిన్నన్న ఎన్నో పదప్రయోగములను తెల్పియున్నాడు.

ఆహార పదార్థములను వర్ణించుచు రఘునాథాభ్యుదయ ద్విపదకావ్యమున విజయరాఘువుడు పేర్కొనిన తెలుగువంటకము లివి: కప్పుకోడి; కుంకుమకోడి; కస్తూరికోడి; పాలకోడి; కప్పుకోడి; నులువకోడి; చేపలయూర్పు; చిరంజి; చలువయానము; శిఖరిణి; పేణీలు; మండెగలు; లడ్వాములు; మణుఁగుఁబూలు; సారసత్తులు; కరివడలు; ఆమ్రపువడలు; తెలికుక్కరొట్టె; తెంకాయరొట్టె; సంబారురొట్టె; తెరటుబాలు మొదలయినవి.

ద్విపదకవులు తెలుగులోకోక్తులను, నానుడులను, జాతీయ ములను ఎక్కువగా వాడినారు. పాల్కురికిసోమనాథుఁడు ప్రయో గించిన తెలుగుసామెతలను, జాతీయములను 270 పైగా డా॥ చిలు

కూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్ర పీఠికయందు పేర్కొనినాడు.

సోమనాథుడు తనకాలమున వ్యవహారములోనుండు అన్యదేశ్య శబ్దములను ప్రయోగించియున్నాడు. ఉదా:_ కతారము; కడానివక్కలు; కోర; (=గిన్నె) జోహారు మొదలగునవి.

సిద్దేశ్వర చరిత్రలో—వజీర్లు; సరదార్లు; బత్తీసు; ఎల్లెము (=వేగము); మల్లెసాల; తోకొంచు మొదలగునవి.

పైన సూచించినట్లు తెలుగు భాషయొక్క దేశీయతను, జాతీయతను; నుడికారపు సొంపును అధికముగా ఆరోపించుకొనినవి ద్విపదకావ్యములు. ఆంధ్ర భాషా వాఙ్మయ పరిణామ చరిత్రయందు గుణమును బట్టియు పరిమాణమును బట్టియు ద్విపద కావ్యపు ప్రక్రియకు అధిక ప్రాధాన్యమున్నదనుటలో విప్రతిపత్తిలేదు.

# అనుబంధము

## ద్విపద గ్రంథముల జాబితా.

---

1. అగుమంచి కథ (అము) — —
2. అచ్యుతాభ్యుదయము (అల) రఘునాథనాయకుడు —
3. అనంతవ్రతి కథ (అము) పుచ్చా గోపాలకవి —
4. అనుభవదర్పణము (అము) పరమానంద తీర్థయోగి —
5. అన్నమాచార్య చరిత్రము. తాళ్ళపాక చిన్నన్న. తిరుమల తిరుపతి దేవస్థానంప్రచురణ(1949)
6. అరుంధతీదేవి చరిత్ర — మద్రాసు, జనరంజనీ గ్రంథమాల (1906)
7. అర్చిరాదిప్రబంధము (అము) వేల్పుకొండ సింగరాచార్యుడు —
8. అష్టమహిషీకల్యాణము. తాళ్ళపాక చిన్నన్న. తిరుమలతిరుపతి దేవస్థానం ప్రచురణ (1937)
9. ఆంధ్ర వేదాంతము (అల) తాళ్ళపాక పెదతిరుమలయ్య —
10. ఆంధ్రహరివంశము (అల) తాళ్ళపాక పెదతిరుమలయ్య —
11. ఆత్మానంద రసమంజరి (అము) శేషదాసు తిరువేంగళాచార్యుడు —
12. ఆత్మైకబోధ (అము) యోగానందావధూతస్వామి —
13. ఆదిలక్ష్మీవిలాసము (అము) రేటూరి భావయామాత్యుడు —
14. ఆధ్యాత్మ రామాయణము మామిడమ్మ సుభద్రమ్మ —
15. ఉత్తరగీతామంజరి (అము) లక్ష్మీనారాయణ యోగి —
16. ఉత్తర రామాయణము, కాచభూపతి; విఠలనాథుడు అముద్రితాంధ్ర గ్రంథసర్వస్వము-5 వ గ్రంథము. చిత్రాడ శ్రీరామచంద్ర ముద్రాక్షరశాల (1920)
17. ఉత్తర హరిశ్చంద్ర కథ (అము) గద్దె చంద్రశేఖర కవి —
18. ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర (అము) — —
19. ఉత్తర హరిశ్చంద్రీయము గార్లదిన్నె సుబ్బారావు ఆదోని, రావ్ జీ ప్రెస్
20. ఉషాకల్యాణము తాళ్ళపాక చిన్నన్న T·T·D· ప్రచురణ (1938)
21. కపోత వాక్యము (అము) ఓబళయ్య —
22. ,, (అము) వేంకటగిరి కవి —
23. ,, (అము) — —
24. ,, (అము) — —

25. కలియుగ మంజరి (అము) — —

26. కాటమరాజు కథ (అల) శ్రీనాథుడు —

27. ,, (అము) గంగుల పినయల్లయ మద్రాసు. ప్రా. భా.

28. ,, (అము) నందుల కాటమరాజు —

29. కాశీఖండము (అల) కంచర్ల అయ్యన్న —

30. ,, (అల) మోచర్ల నన్నయ —

31. కుచేలోపాఖ్యానము పనప్పాకము శ్రీనివాసాచార్యులు —

32. కువలవ చరిత్రము (అము) — —

33. ,, (అము) — —

34. కుశలవోపాఖ్యానము లావనూరి రామనార్యుడు. తంజావూరు సరస్వతీమహల్ ప్రచురణ. నెం. 22.

35. కృష్ణకథామృతము. తురగా పురుషోత్తమ శర్మ . —

36. కృష్ణమంజరి (అము) మంగమాంబ — —

37. ,, (అము) తరిగొండ వెంగమాంబ —

38. కృష్ణార్జున సంవాదము నాదిండ్ల గోపన హైదరాబాదు. గోలకొండ పత్రికాలయము.

39. కృష్ణార్జున సంవాదము (అము) ఓబయ కవి —

40. కొలిపాక మాహాత్మ్యము (అము) చిత్తారు గంగాధర కవి —

41. గంగా వివాహము (అము) చిత్తారు గంగాధర కవి —

42. గజాననోపాఖ్యానము (అము) నరసింహదేవర పేరిశాస్త్రి —

43. గణమాలిక (అము) — —

44. గురుబోధ (అము) సోమన .... ...

45. గురుశిష్య సంవాదము (అము) యోగానందావధూతస్వామి ....

46. గోపికాంశుకాపహారము (అము) ప్రయాగ వేంకటాద్రి . ..

47. గౌడపురాణము (అము) మల్లికార్జున సిద్ధయోగి ...

48. చక్రవాళ మంజరి తాళ్ళపాక పెదతిరుమలయ్య, తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ (1936)

49. చిదానంద మంజరి (అము) ఉమాపతి ...

50. చిరుతొండభక్తుని కథ (అము) — ....

51. చొక్కనాథచరిత్రము పచ్చకప్పూరపు తిరువేంగళకవి, మద్రాసు.
ప్రభుత్వ ప్రాచ్యలిఖిత భాండాగారమువారి ప్రచురణ నెం. 35 (1954)
52. జాంబవతీ కల్యాణము (అల) కాశాధర కవి ...
53. జీవైక్యబోధము (అము) ... ....
54. తత్త్వచంద్రోదయము (అల) ముమ్మడి మల్లనార్యుడు ...
55. తత్త్వార్థ దర్పణము (అము) అచ్చి రామానుజాచార్యులు ...
56. ,, (అము) లక్ష్మణార్య కవి ...
57. తిరుప్పల్లాండు (అము) భండారం సుదర్శనార్యారయ్య, ....
58. తిరువాయిమొళి (అల) కాండ్రవేటి రామానుజాచార్యులు ...
59. త్రిపురారాతి విజయము (అల) వల్లూరి హనుమంత కవి ....
60. త్రివర్గము. పూతలపట్టు శ్రీరాములురెడ్డి ....
61. దండకముక్తకము (అము) దర్భా బాలకృష్ణయ్య ....
62. దమయంతీ చరిత్రము (అము) — ...
63. దశావతార చరిత్ర (అము) — ....
64. దీక్షాబోధ. పిడుపర్తి బసవన పరిష్కర్త: జోస్యుల సుబ్బయ్య లింగేశ్వ
రారాధ్యులు
65. దేవాంగ పురాణము (అము) భద్రకవి లింగన ...
66. ద్రౌపదీ స్వయంవరము (అల) వీరభద్రుడు ....
67. ద్వాత్రింశత్సాలభంజికల కథలు (అము) — ...
68. ద్విపద శృంగార వర్ణనము (అము) ... ...
69. ధనాభిరామము (అము) మణింగంటి సింగరాచార్యుడు ....
70. ధర్మజ కృష్ణ సంవాదము (అము) నరసింహకవి ...
71. ధర్మాంగదచరిత్ర (అము) పురుషోత్తమ దాసు ....
72. ధర్మాంగదచరిత్ర బొమ్మకంటి నరసింహకవి, పరిష్కర్త: శ్రీవిల్లిపు
త్తూరు శఠగోపాలాచార్యులు. మాధవనివాస ముద్రాక్షరశాల (1884)
73. నలచరిత్ర. రఘునాథ నాయకుడు. శ్రీరామవిలాస ముద్రాక్షరశాల,
చిత్రాడ (1921)
74. నలచరిత్ర. చక్రపురం రాఘవాచార్యులు, మద్రాసు, వావిళ్ళ రామస్వామి
శాస్త్రులు & సన్స్ (1921)
75. నలచరిత్ర (అము) తిమ్మకవి ....

76. నలచరిత్ర (అము) వీరరాఘవకవి ...
77. ,, (అము) కాకర్లపూడి రాఘవాచార్యులు. ....
78. ,, (అము) ... ....
79. ,, (అము) ... ....
80. ,, (అము) .... ...
81. ,, (అము) ... ....
82. నవచోళచరిత్ర పోశెట్టిలింగన, మద్రాసు, ఆంధ్రపత్రికాధిపతులు (19'3) పరిష్కర్త పంచాగ్నుల అదినారాయణశాస్త్రి
83. నవనాథచరిత్ర గౌరన. మద్రాసువిశ్వవిద్యాలయము ఆంధ్రగ్రంథమాల నెం 7 మద్రాసు (1937)
84. నాగరకాండము (అము) చంద్రశేఖరకవి ....
85. నింబజామాహాత్మ్యము (అము) బడగలపాటి నరసకవి ...
86. నృసింహపురాణము (అల) ప్రోలుగంటి చెన్నశౌరి ....
87. పండరి భాగవతము పుట్టపర్తి నారాయణాచార్యులు ...
88. పండితారాధ్య చరిత్ర పాల్కురికి సోమనాథుడు, ఆంధ్ర గ్రంథమాల 30 పరిష్కర్త: డా॥ చిలుకూరి నారాయణరావు.
89. పతివ్రతాచరిత్రము ... మద్రాసు ప్రా. భా. నెం:60 పరిష్కర్త:
90. పతివ్రతా చరిత్రము కారాణ వైరాగ్యరావు ....
91. పరమయోగి విలాసము తాళ్ళపాక చిన్నన్న తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ (1938)
92. పరశు రామాయణము (అము) ఉలిచి భావజ్ఞుడు ....
93. పల్నాటివీరచరిత్ర శ్రీనాథుడు; మల్లయ; కొండయ. పరిష్కర్త: ఆచార్య పింగళిలక్ష్మీకాంతము, విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ-1961
94. పాదుకా సహస్రము (అల) విజయరాఘవ నాయకుడు ...
95. పితృపూజ వీరేశలింగము పంతులు, వీరేశలింగకృత గ్రంథములు 6వ సంపుటము.
96. పినాకినీ మాహాత్మ్యము లక్ష్మీనరసింహ గోవిందసోమయాజి, పరిష్కర్త: ముత్యాల నారసింహ యోగీంద్రుడు. మద్రాసు శ్రీ రాజరాజేశ్వర నికేతన ముద్రాక్షరశాల 1908.

97. పిళ్లనైనారు కథ (అల) పిడుపర్తి బసవన ...
93. పురూరవోపాఖ్యానము పురాణం రామశర్మ మద్రాసు. అమెరికన్ డైమండ్ ప్రెస్ (1915)
99. పుష్పహారము_కోదండరామయ్య, ....
100 పెద్దబొబ్బిలి మహారాజు కథ (అము) కాదూరి చెంగల్వరాజువీరయ్య ...
101. పెద్దిరాజు కథ (అము) ... ...
102. ప్రభులింగలీల పిడుపర్తి సోమన గజపతి ముద్రాక్షరశాల, పెద్దాపురం (1920)
103 ప్రబోధ చంద్రోదయము (అము) రాచూరి వేంకటకవి ...
104. ప్రమథస్తోత్రము (అము) సన్యాసకవి ....
105 ప్రహ్లాద చరిత్ర_వాకాటి వెంచల రెడ్డి ....
106. ప్రేమాభిరామము (అల) మతింగంటి సింగరాచార్యుడు ...
107. బలభద్ర విజయము (అము) లోకేరావు సోమన ..
108. బసవ పురాణము పాల్కురికి సోమనాథుడు మద్రాసు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్ 1952
109. బసవ విజయము (అము) నల్లనగండ్ల నాగనారాధ్యుడు ...
110. బాలభాగవతము (అము) దోనూరు కోనేరునాథకవి ....
111. బాలరామాయణము (అల) గణపవరపు వెంకటకవి ....
112. బిల్హణచరిత్ర (అము) .... ....
113. బ్రహ్మ ధర్మశిక్ష (అము) మా॥ కృష్ణారావు ...
114. బ్రహ్మోత్తర ఖండము పిడుపర్తి బసవన ....
115. బ్రహ్మైక్యబోధ శేషమాంబ, మద్రాసు శైవసిద్ధాంత ముద్రాక్షరశాల (1898)
116. భక్తస్తవము (అము) పాల్కురికి సోమనాథుడు ....
117. భగవద్గీత [అము] కర్పూరము కృష్ణమాచార్యులు —
118. ,, ,, వావిలకొలను సుబ్బారావు —
119 భల్లాణచరిత్ర చిత్తూరు గంగాధరకవి పరిష్కర్త: గంటి సూర్యనారాయణ శాస్త్రి, మద్రాసు శృంగార గ్రంథమాల_4 జి. యస్. శాస్త్రి అండ్ కో [1928]

120. భాగవత దశమస్కంధము మడికిసింగన తంజావూరు సరస్వతీ గ్రంథ మాల, నెం. 23. పరిష్కర్త: ఏ మహాదేవశాస్త్రి [1950]
121. భాగవతదశమస్కంధము పూ.భా.(అము) రత్నాకరము గోపాలకవి —
122. భాగవతము (అము) తేకుమళ్ళ రంగశాయి —
123. భాగవతార్చనము (అము) — —
124. భల్లాణచరిత్ర (అము) బసవన్న ...
125. భల్లాణచరిత్ర (అము) నింబాద్రిదాసు ...
126. భల్లాణచరిత్ర (అము) జక్కన సాంబయ్య ...
127. భల్లాణచరిత్ర (అల) మేధాతిథిబట్టు ...
128. భానుకల్యాణము (అము) చంద్రశేఖరకవి ...
129. భారతము బట్టేపాటి తిమ్మయ; బాలసరస్వతి;అతుకూరి సోమన ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ నెం. 30. 4 సంపుటములు.
130. భారతము (అల) లింగకవి ...
131. భేతాళచరిత్ర (అము) పిల్లలమఱ్ఱి బంగారు రంగప్ప ...
132. మంజరీ ద్విపద (అల) విజయరాఘవ నాయకుడు ...
133. మనుచరిత్ర [అము] పూండ్ల వేంకటరమణయ్య ...
134. మనోబోధ [అము] కొలని గణపతిదేవుడు ...
135. మతిబసవ పురాణము [అము] బచ్చు సిద్ధకవి ...
136. మలహణ చరిత్రము [అల] పోశెట్టి లింగన ...
137. మల్లమదేవి పురాణము [అల] పాల్కురికి సోమనాథుడు ...
138. మల్లారి చరిత్ర [అము] మరింగంటి వెంకటార్యుడు ...
139. మల్లారి చరిత్ర [అము] పేట్రాజకవి ...
140. మాతృపూజ వీరేశలింగము పంతులు వీరేశలింగకృత గ్రంథములు 6 వ సంపుటము.
141. మాయాచిదానంద మంజరి [అము] నాదిండ్ల ఉమాపతి ...
142. మాయానిరాలంబ మంజరి [అము] రామకృష్ణకవి ...
143. మార్కండేయ చరిత్ర క. శివకృష్ణదాసు ...

144. మార్కండేయ పురాణము ఎల్లకర నరసింహకవి ...

145. మార్కండేయ పురాణము [అము] పర్వతమంత్రి లింగన —

146. మధ్వార్థవైభవము [అము] గోవర్ధనము అనంతకవి ...

147. మేఘదూతము, పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు, గుంటూరు చంద్రికాముద్రాక్షర శాల [1913]

148. మైరావణ చరిత్ర (అము) పోలుమంచి బసవన ...

149. మైరావణ చరిత్ర కాచనకవి తంజావూరు సరస్వతీమహల్ ప్రచురణ పరిష్కర్తలు: వి. సుందరశర్మ, ఏ. మహాదేవశాస్త్రి.

150. మైరావణచరిత్ర [అము] చంద్రగిరి చిన్నయ్య ...

151. మైరావణచరిత్ర [అము] కైప లక్ష్మీనరసింహశాస్త్రి చిత్తూరు కవిరంజనీ ముద్రాక్షరశాల [1882]

152. మైరావణచరిత్ర [అము] పాతూరి తిరుపతికవి —

153. మైరావణచరిత్ర (అము] బసవప్పకవి ...

154. మైరావణచరిత్ర [అము] ... ...

155. మోహినీవిలాసము [అల] విజయరాఘవనాయకుడు ...

156. యాజ్ఞవల్క్యవిజయము [అము] చల్ల గురవయ్య —

157. యోగీశ్వరవిలాసము [అము] సిద్ధేంద్రయోగి ....

158. రంగనాథరామాయణము గోన బుద్ధారెడ్డి, రాయలు అండ్ కో, కడప ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ [1957]

159. రఘునాథనాయకాభ్యుదయము విజయరాఘవ నాయకుడు మద్రాసు ప్రాచ్యప్రచురణాలయం తంజావూరుసరస్వతీమహల్ నెం. 32. 1951

160. రత్నహారము వేంకట పార్వతీశ్వరకవులు ...

161. రాజయోగసారము తరిగొండ వెంగమాంబ, వావిళ్ళరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ మద్రాసు [1930]

162. రాధాకృష్ణచరిత్రము [అము] కూచిమంచి జగ్గకవి

163. రామకథ [అము] — ....

164. రామకుమార విజయము [అము] చిదంబరకవి ....
165. రామకృష్ణమాహాత్మ్య సారసంగ్రహము అనంతరాజు సుబ్రహ్మణ్యకవి ...
166. రామధ్యానము [అము] .... ....
167. రామాయణము (అల) తాళ్ళపాక అన్నమాచార్యుడు ....
168. ,, ,, భోసల ఏకోజీ_2 ....
169. ,, ,, చేడ రాఘవరెడ్డి ....
170, రుక్మాంగద చరిత్ర, [అల] చదలువాడ మల్లన ....
171. ,, [అము] దర్భా వేంకటగిరికవి ...
172. రుక్మిణీకల్యాణము [అము] చౌదరి రామదాసు —
173. ,, ,, చిన్నయ ....
174. ,, ,, యస్. లింగయ్య ....
175. ,, ,, .... ....
176. రుద్రాక్షమాహాత్మ్యము [అము] పర్వతమంత్రి లింగన ....
177. వరదరాజమంజరి [అము] .... ...
178. వరదోపాఖ్యానము [అము] నరసింహ భాగవతులు ....
179. వరదరాజ రామాయణము, కట్టా వరదరాజు పరిష్కర్త: నిడుదవోలు వేంకటరావు, తంజావూరు సరస్వతీమహల్ గ్రంథమాల, నెం. 12. 4 సంపుటములు (1950)
180. వల్లురాజు యుద్ధము [అము] .... ....
181. వసిష్టవాక్యములు [అము] ...... ....
182. వాసిష్టరామాయణము, తరిగొండ వెంగమాంబ, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు (1923)
183. విక్రమార్కుని కథలు [అము] కొండయకవి ....
184. విక్రమార్కుని కథలు [అము] ... ....
185. వినుకొండ రామాయణము [అము] విజయరామరాజు ....
186. విభీషణ బుద్ధి [అము] .... ....

187. విభూతి రుద్రాక్షమాహాత్మ్యము [అము] కొలకలూగ వీరన (లేక) పోచి రాజు వీరన ....

188. వివేక సింధువు [అము] వేంకటకవి ....

189. విష్ణుభక్త చరిత్రము [అము] చక్రపురి రాఘవాచార్యుడు ...

190. ,, ,, అనూరి శేషావతారకవి ....

191. విష్ణుమాయావిలాసము [అము] కంకంటి నరసింహకవి ...

192. వీరమహేశ్వరాచార సంగ్రహము [అము] పర్వతమంత్రి లింగన ....

193. వీరసంగయ్యదేవ చరిత్రము [అల] పోశెట్టి లింగన ....

194. వైష్యపురాణము [అము] భాస్కరామాత్యుడు ....

195. వైష్యపురాణము [అము] మాధవదాసు పరిష్కర్త: సుబ్బరాయసిద్ధాంతి, చింతామణి ముద్రాక్షరశాల

196. శంకరదాసయ్య చరిత్రము [అల] పోశెట్టి లింగన ...

197. శంకరసంహిత [అము] .... ....

198. శతకంఠ రామాయణము [అము] లింగన కవి ....

199. శతైక స్థలము [అము] — ....

200. శరణాగతి ద్విపద [అము] .... ....

201. శశిరేఖాపరిణయము (లేక) అభిమన్యు కల్యాణము శేషము చెన్నుభట్టారకుడు కవిరంజనీ ముద్రాక్షరశాల (1889) పరిష్కర్త: వారణాసి సుబ్బరామశాస్త్రి

202. శివజ్ఞానమంజరి [అము] పరమానంద తీర్థయోగి ....

203. శివగీత [అము] .... ..

204. శివరహస్య ఖండము [అము] వింటి పౌబళకవి ...

205. శివస్తోత్రము [అము] .... ....

206. శిష్యప్రబోధము (అల) పోశెట్టి లింగన ...

207. శృంగారమంజరి తాళ్ళపాక చిన్నన్న తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ (1938)

208. శ్రుతకీర్తిమహారాజుకథ (అము) తెన్నేరంగం పాన్నారిసూరి —

209. శైవసిద్ధాంతశిఖామణి (అము) చెన్నాప్రగడ నాగేశ్వరకవి —

210. శ్రీకృష్ణతులాభారము (అల) మరింగంటి వేంకటనరసింహాచార్యులు —

211. శ్రీనివాసవిలాస సేవధి శ్రేష్టలూరి వేంకటార్యుడు శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ప్రచురణ నెం. 47. పరిష్కర్త: కోరాడ రామకృష్ణయ్య (1954)

212. శ్రీరంగమాహాత్మ్యము (అము) ముకుందయోగి —

213. శ్రీరంగమాహాత్మ్యము (అము) — ...

214. సక్కుబాయమ్మగారి చరిత్ర వెంపల శాంతాబాయమ్మ —

215. సత్యభామా విజయము (అల) ఘట్టుప్రభువు —

216. సత్యాద్రౌపదీ సంవాదము వీరేశలింగము పంతులు వీరేశలింగకృత గ్రంథము 6 వ సంపుటము.

217. సర్వేశ్వర ద్విపద (అము) పిండిము అప్పలస్వామి —

218. సాధుజన లక్షణదీపిక (అము) బత్తుల లక్ష్మయ్య ...

219. సాధ్వీజన ధర్మము (అల) అప్పకవి —

220. సానంద చరిత్ర (అము) భద్రకవి లింగన —

221. సానంద చరిత్ర (అము) బుచ్చన్న పంతులు ...

222. సారంగధర చరిత్ర (అము) చాణాల శంభుదాసుడు ...

223. సారంగధర చరిత్ర (అము) కూచిమంచి తిమ్మకవి చిత్రాడ శ్రీరామ విలాస ముద్రాక్షరశాల (1920)

224. సారంగధర చరిత్ర (అము) పూరిపరశురాముడు ...

225. సావిత్రీ చరిత్ర (అము) ఎలమందరాజు ....

226. సావిత్రీ చరిత్ర ముప్పిరాల సుబ్బరాయకవి —

227. సిద్ధేశ్వర చరిత్ర కాసె సర్వప్ప పరిష్కర్త: ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, హైదరాబాదు. ఆంధ్ర రచయితల సంఘము (1960)

228. సిరియాళ చరిత్ర (అము) చిత్తారు గంగాధరకవి ....
229. సీతా విజయము (అల) వల్లూరి హనుమంత కవి —
230. సీమంతినీ కథ (అము) మహాదేవ కవి —
231. సుజ్ఞానోపాఖ్యానము (అము) తోటా కోటయ్య ...
232. సుభద్రా కల్యాణము తాళ్ళపాక తిమ్మక్క. శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ప్రచురణ నెం.20. పరిష్కర్త: వేటూరి ప్రభాకరశాస్త్రి (1950)
233. సురాభాండేశ్వరము (అము) పులిగడ్డ నారన ....
234. సురాభాండేశ్వరము (అము) రావులపురము గురవయ్య ...
235. సేవాంజలి ఎల్లమరాజు నారాయణభట్టు అనంతపురము సాధనముద్రాక్షరశాల (1929)
236. సోమనాథస్తవము (అము) పాల్కురికి సోమనాథుడు ...
237. సోమవార వ్రతమాహాత్మ్యము (అము) శ్రీగిరి మల్లికార్జునకవి —
238. సోమవార వ్రతమాహాత్మ్యము (అము) ... —
239. సౌగంధిక ప్రసవాపహరణము రత్నాకరము గోపాలకవి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ మద్రాసు (1949)
240. స్వరమంజరి (అల) గౌరయామాత్యుడు ...
241. స్వరశాస్త్రము (అము) గణపనారాధ్యుడు —
242. హరిశ్చంద్రకథ (అము) కనకబండి గట్టయ్య ...
243. హరిశ్చంద్రచరిత్ర (అము) వెన్నెకంటి చంద్రశేఖరకవి —
244. హరిశ్చంద్రోపాఖ్యానము గౌరన ....
245. హితవాక్య పూతలపట్టు శ్రీరాములు రెడ్డి —



# శోధిక.

12_ 6 గ్రంథము
31_ 3 ద్విపది
36_13 అనియతకర్తృకత్వము
40_10 ద్విరదగతి రగడ
42_18 బైలేచి
45_15 రడ్డి
46_13 పాదమగును
78_15 ప్రతిష్ఠాపనకు
81_13 నందు
89_16 వేయి
93_10 తమిళము
94_22 యుక్తమైనది
98_14 చేడ
99_ 5 కొలకలూరి
_ 8 స్కాంద
103_ 8 అవ్యవహితముగ
108_21 పండితారాధ్యచరిత్ర
114_ 6 రుద్రచిహ్నాలు,
118_ 6 దాసయ్య
138_21 రంగనాథ
139_18 విభీషణబుద్ధి
145_ 8 ననుసరించి
149_13 రంగనాథ
154_22 వేంకటకవి
166_17 సముద్రమథనము
_21 ,,
167_ 1 ,,
_ 2 ,,
_16 ,,
170_19 కథ
194_19 ప్రమథ
_23 శ్లోకము
198_24 కావ్యఫలము,
216_16 నిదర్శనము
217_19 నవనాథచరిత్ర
224_ 8 రంగనాథ
232_22 జగ్గకవి,
253_24 తిరుచునాపల్లి
276-14 పండితారాధ్యచరిత్ర
280_16 ఉపదేశరత్నమాల
288_11 దీని
291_ 9 ద్విపదలును
296_14 అద్వైత,
298_13 అని
299_16 ప్రబోధ చంద్రోద [యము
301_11 రామునికి
319_ 6 ముహూర్తవైభవము

351_11 బడినది.
382_19 ఆతిథ్య
_21 ,,
387_ 4 కట్టు
_ 5 సందర్భము
389_ 8 వరదరాజ
400_13 సంస్కృత
431_ 9 సముద్రమథనము
433_15 ,,
434_20 ,,
475_ 6 కథోన్మీలనము
484_23 గ్రహించి

492_ 7 గాపీనములును,
500 22 విలాసమున
503_ 8 పంజరచయము,
_ 9 పిట్టలు,
_17 తరకు (దిరకుబదులు)
516_ 6 అనునది
5.7_17 బుట్టలల్లు
532_19 రచనావిర్భావ
మునకు
536_21 ఇకారసంధి
543-12 పనసపండ్లు
,, _ ,, పాలపండ్లు

